శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

కొ[illegible] రామచంద్రరాజకవి

ప్రణీతంబైన

# మహేంద్రోదయము

( పద్యకావ్యము. )

ప్రకాశకుఁడు :

కొ[illegible] పెద్దరామరాజు

శ్రీముక్తిరామేశ్వరము P. O.

ప్రొద్దుటూరు.


ప్రొద్దుటూరు

సారధి ముద్రణాలయమున

ముద్రితము.

1959.






మూల్యము
రూ. 5-0-0

# హెచ్చరిక.

ఈ సువర్ణాంగదను ప్రబంధ సర్వస్వామ్యములు ప్రకాశకుడనగు నాకు చెందియున్నవి. నా వ్రాతమూలకమైన అనుమతిలేనిది యెవ్వరు ఈ గ్రంథమును పునర్ముద్రణ చేయరాదు. ఇందలి భాగములనుగాని, పద్యములనుగాని ప్రకటించరాదు. ఇందుకు భిన్నముగ నడుచుకొన్నవారు నే జరుపబోవు సివిలు చర్యలకు పాత్రులగుదురు.

మకాం:
శ్రీముక్తిరామేశ్వరము,
ప్రొద్దుటూరు తా॥
కడప జిల్లా.
13–4–1959.

ఇట్లు,
కొండపలూరు పెద్దరామరాజు,
ప్రకాశకుడు.

శ్రీ ర స్తు.

# వి జ్ఞా ప న ము.

క॥ తనయుఁడు జెఱువును గావ్యం
బు నిధానము గుడి వనంబు భూదేవస్థా
పనమును నను నియ్యేడును
జను శాస్త్రములందు సప్తసంతతులనఁగ॥ (అప్పకవీయము)

గుణగ్రహణపారీణులగు విద్వత్కవి వృషభులారా!

తరు తటాకాది సప్తసంతానములలో నగ్రగణ్యమని ప్రఖ్యాతి గాంచిన ప్రబంధమును భగవదనుగ్రహముచే రచియించు కుతూహలము గలవాఁడనై యైహికాముష్మిక ఫలప్రదమగు పుణ్యచరిత్రముకొఱకు నే నధికప్రయత్నముతో శోధించి యెట్టకేలకు శ్రీమహాస్కాందపురాణస్థ మగు శంకరసంహితలోని శివరహస్యఖండమునందు కార్త్తికేయజననమాది వల్లీకల్యాణమువరకు గల కథను సందర్శించి మహానందంబునొంది దానిని బద్యగద్యాత్మకముగాఁ గృతిసేయ నిశ్చయించుకొంటిని.

తత్కథాలహరిని బ్రవహింపజేయుటకుగాఁ గీర్తిశేషులైన శ్రీముదిగొండమల్లనారాధ్యపుత్రుండగు బ్రహ్మయలింగకవి వతంసుఁ డత్యంత పద ప్రౌఢిమము ఛేకము పంస్కృతసమాసభరితమును శబ్దవైచిత్ర్యంబును పొంగారునట్లు మనోహరమగు శైలితో రచియించియుండు "శివరహస్య ఖండతత్త్వప్రకాశిని" యని పేరువడసిన వచనకావ్యమును నేను మూల గ్రంథముగా బరిగ్రహించియున్నాను.

ఇయ్యది మహాసేననామ వాచ్యుఁడగు కుమారస్వామి జననకథ యగుటంబట్టి ప్రబంధమునకు "మహాసేనోదయము"నియెడి నామధేయంబు గావించి పైనుదహరింపబడిన కవిసత్తముఁడు వ్రాసిన గద్యకావ్యమునందలి (1) సంభవకాండము, (2) అసురకాండము, (3) వీరమాహేంద్ర కాండము, (4) యుద్ధకాండము, (5) దేవకాండము నను నీ యైదు కాండములతో మొదటిదియగు సంభవకాండమునందు గౌరీ మహేశ్వరుల

కల్యాణమగుదాక నడిచిన కథనువదలి తదంతికగాథనుండి ప్రారంభించి దేవకాండాంతము వరకు సంపూర్ణముగా బద్యగద్యములతో నెనిమిది యాశ్వాసముల ప్రబంధమును వ్రాసితిని.

నేనిట్లు వ్రాయుటలో నీగ్రంథమునకు మూలముగా బరిగ్రహింపఁబడిన గద్యప్రబంధముయొక్క పదరచనా ప్రావీణ్య సౌకుమార్యములు సంస్తవనీయమగునంతటి సరసముగా నుండుటవలన గద్యమును వ్రాయునప్పుడు దత్సమయగాథయందు బొందుపరుపఁబడిన మూలగ్రంథమునందలి శ్లాఘాపాత్రములైన పదములను దొలగించి యన్యపదప్రయోగమునకు సాహసించితినేని యందలి సౌకుమార్యము సడలించగలదని దృఢముగా దలంచి సంశయించక నాయాచోటుల కథాభాగములందు మార్పులు సేయక యే మూలగ్రంథగద్యము ననుసరించి వ్రాసియున్నాను.

తెలుఁగున గ్రంథములను రచించుకవులకు దమపూర్వగ్రంథములలో నున్న కథాభాగములు కల్పనలు స్వకీయప్రబంధములయందు బ్రవేశపెట్టుటయుఁ దెనుఁగుగా మార్చుకాలమున సంస్కృతగ్రంథముల గల సమాసములు మొదలగునవి కూడా నొప్పించునట్టి యలవాటున్నదనుటకు నిస్సంశయము.

ఈ విషయము విశదమగుటకై బ్రహ్మశ్రీ వఝ్ఝుల చినసీతారామస్వామి శాస్త్రిలు తమ వసుచరిత్రవిమర్శనములో తెలిపియున్న కొన్ని యనుస్మృతుల నిం దుదాహరించుచున్నాను.

సుహకవి యగు శ్రీహర్షుఁడు రచియించిన సంస్కృతభాషయందలి నైషధకావ్యమును కవిసార్వభౌమ బిరుద ప్రసిద్ధుఁడగు శ్రీనాథుఁడాంధ్రీకరించుటలో రెండవసర్గ 41 శ్లోకములోని "గమికర్మీకృతనైకనీవృతా" యను ప్రయోగమును తన శృంగార నైషధములో ద్వితీయాశ్వాసము 21 పద్యములో "గమికర్మీకృతనైకనీవృతుఁడనై" యనియునుమూడవసర్గ 65 శ్లోకములోనిదగు "ఈశాణిమైశ్వర్యవివర్తమధ్యే" యనుప్రయోగము సప్తమాశ్వాస 193 పద్యములో "త్రైయశాణిమభూతిసూత్మ్మతరమధ్యా"

యనియును రెండవసర్గ 103 శ్లోకములోని "అశ్రాంతశ్రుతిపాఠపూత రసనావిర్భూతభూరిస్తవా జిహ్వాబ్రహ్మముఖౌఘ విఘ్నితనవస్వర్గక్రియాకేళినా" యను ప్రయోగమును ద్వితీయాశ్వాసము 41 పద్యములో శా॥ వేదాభ్యాసవిశేషపూతరసనావిర్భూతభూరిస్తవా పాదబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళిచే" అనియు ననుసరించి యున్నాడు.

★ పద్యములయందేగాక గద్యములయందు సైతమనుసరించెను. ★

దృ ష్టాం త ము.

రెండవసర్గ 69 శ్లోకములోని "సయయౌధుతపక్షతిఃక్షణంక్షణముర్ద్వాయనదుర్విభావనః వితతీకృతనిశ్చలచ్ఛదఃక్షణమాలోకకదత్తకౌతుకః" యను ప్రయోగమును తృతీయాశ్వాసము 35 వచనములో "ఒక్కొకమాటు విధూతపక్షతియును, నొక్కొకసారి యూర్ధ్వాయన దుర్విభావనంబును నొక్కొకమాటువితతీకృత నిశ్చలచ్ఛదంబును నగుచుననియును, మూడవసర్గ 50 శ్లోకములోని "వేలాతిగస్త్రైణగుణాబ్ధివేణీ" యను ప్రయోగమును ద్వితీయాశ్వాసము 57 పద్యములో "వేలాతిగకాంతకాంతగుణాబ్ధివేణివగునీవు యనియు ననుస్మృతినొనర్చెను.

మఱియు మూలగ్రంథములోనివానియనుసరణమేకాక గ్రంథాంతర వాక్యములనయితమనుసరించియున్నాడు.

దృ ష్టాం త ము.

బాలరామాయణములోని "యాకుందేందుతుషారహారధవళా"యను వాక్యమును షష్ఠాశ్వాసము 13 వచనములోని "కుందేందుతుషారహారధవళంబును" నగు దివ్యరూపంబున ననియును, ఉత్తరరామచరిత్రలోని "అనిర్భిన్నగభీరత్వాదంతర్గూఢఘనవ్యథఃపుటపాకప్రతీకాశోరామస్యకరుణోరసః" యను దానిని ప్రథమాశ్వాసము 108 గద్యములో "సఖులారా! యేప్రకారంబునంబుటపాకప్రతీకాశంబయిన కరుణరసంబున కరుణరసంబున బురపురంబొక్కెదరు" యనియును, భారతోద్యోగపర్వములోని "నాదయ్యముసెత్తికోలుతుదిదాఁకుటగాదె భుజంగభంజనా" యను దానిని బంచమా

శ్వాసము 51 పద్యములో "నాదయ్యాముగనెత్తికోలుతుదిదాఁకుటగాదె దోఁబలోచనా" యని యనుసరణము జేసియున్నాడు.

మఱియు నిట్టియనుస్మృతులెన్నియో పూర్వప్రబంధములయందిము డ్పఁబడియున్నవి. వానినన్నింటినింజూపదొరకొనుటకు నీవిజ్ఞప్తి విపులంబ గునుభీతిచే విరమించితిని.

కాబట్టి యీ సాంప్రదాయ మాంధ్రప్రబంధ కర్తృసామాన్యంబని యును యదియొక కవిసమయమువంటిదిగాఁగైకొనంబడి సర్వులచేత నవలంబింపఁబడియుండుటవలన నిదియొక లోపంబుగాదని యొడితలంపుగొని నేనీప్రబంధమునందచ్చటచ్చట గద్యరచనయందు మూలగ్రంథమనుసరించి వ్రాసితినని విన్నవించుకొనుచున్నాను.

విద్వత్కవిమండలములారా! "ఆత్మవత్సర్వభూతాని" యను పురాణ వచనమున కునిక్కపట్టయి సమదృష్టిచే నీగ్రంథమును బరిశీలించి దోషములు గాన్పించెనేని నాకు దెలియచేసిన మీ నిర్హేతుకజాయమాన కరుణాపరత్వంబున కానందించి మీరేర్పరించి చూపించిన తప్పులను శిరసావహించి సవరించుకొని కృతార్థుఁడనయ్యెదనని వేవిధముల బ్రార్థించుచున్నాను.

ఇట్లు బుధజన విధేయుఁడు,

కొడవలూరి రామచంద్రరాజ కవి,

గ్రంథకర్త,

ముక్తిరామేశ్వర గ్రామము,

ప్రొద్దుటూరు తా॥ (కడప జిల్లా)





గ్రంథకర్త:

కొడవలూరు రామచంద్రరాజకవిగారు.

# పీ ఠి క.

విశ్వశ్రేయః కావ్యమ్.

మహాశయులారా!

నిఖిలమహీమండల మండనాయమానమగు భరతఖండమునందు సంస్కృతభాషయందు బ్రశస్తివహించిన శ్రీవేదవ్యాసమహర్షి ప్రణీతము లగు శ్రీ మహాభారత భాగవతాది పురాతన ప్రబంధములను శబ్దశాసన తిక్కనసోమయాజి శంభుదాస బమ్మెరపోతనామాత్యులనియెడి తొల్లింటి మహాకవులు తెనుఁగుబాసయందు రచియించి మహారాజసన్మానితులయి శాశ్వతకీర్తినిగడించి ధన్యులయిరి.

ఆధునిక కవిచంద్రులలో బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బరావు గారును కడపపురవాస్తవ్యులగు జనమంచి శేషాద్రిశర్మగారును మహా మహోపాధ్యాయ బిరుదాంకితులగు వేదము వేంకటరాయశాస్త్రిగారును మఱియు దదితరులగు కవివతంసులు నాంధ్రంబున బెక్కు యుద్గ్రంథము లను బ్రబంధశైలిలో మనోహరముగావిరచించి మిగుల ప్రఖ్యాతిసిబడసి యున్నవారు.

ఇట్టి యాధునికకవివర్యులలో నీమహాసేనోదయంబను ప్రబంధమును, బద్యకావ్యముగ నెనిమిదియాశ్వాసములను రచించిన "కొడవలూరి రామ చంద్రరాజకవి" యొకండునై యున్నవాఁడు. ఇక్కవివర్యుడు క్షత్రియు లనఁబడు భట్టురాజవంశ్యుఁడు. కడపమండలములోని ప్రొద్దుటూరునకు బశ్చిమదిశయందొక మైలుదూరమునగల శ్రీముక్తిరామేశ్వర క్షేత్రమున శ్రీ మదీశ్వరనామ సం॥ర ఆశ్వీజ శు॥ ౧౦ లు (విజయదశమి) బుధవారము నకు సరియగు 1877 సం॥రం అక్టోబరు నెల 17 తేది బుధవారము ధనిష్ఠా నక్షత్రమునందవతరించెను. ఇతని యింటిపేరు కొడవలూరివారు. యితని తండ్రి సంజీవరాజు. తల్లి అచ్చమాంబ, పితామహుఁడు రామదాసు. పెద్దతండ్రులు పెద్దరామరాజు, చిన్నరామరాజు, రామచంద్రరాజు అను వారలు ముగ్గురు. ఇతని గోత్రము భారద్వాజస గోత్రము.

—, మహాకావ్యలక్షణము. ,—

శ్లో॥ ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాపితన్ముఖం
ఇతిహాసకథోద్భూత మితరద్వాసదాశ్రయమ్
చతుర్వర్గఫలోపేతం చతురోదాత్తనాయకం
నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనైః
ఉద్యానసలిలక్రీడా మధుపానరతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః
మంత్రద్యూతప్రయాణాజి నాయకాభ్యుదయైరపి
అలంకృతమసంక్షిప్తం రసభావనిరంతరం॥

ఆరంభమందాశీర్వాద నమస్కార వస్తునిర్దేశరూపమగు మంగళాచరణములతోఁగూడినదియు ప్రాచీనపురాణేతిహాసములనుండి తీయబడినకథగానీ లేక సత్పురుష చరిత్రమును బ్రతిపాదించు కథగానీ కలదియు ధర్మార్థకామ మోక్ష ఫలములతోఁగూడినదియు, చతురుఁడు, గార్యదక్షుఁడునగు నాయకునితోఁ గూడినదియు, పట్టణము, సముద్రము, ఋతువులు, జంద్రార్కోదయాదులు, వనవిహారము, జలక్రీడ, మధుపానము, వివాహము, సంభోగశృంగారము, విప్రలంభశృంగారము, కుమారోత్పత్తి, యాలోచనము, ద్యూతము, ప్రయాణము, యుద్ధము, నాయకాభ్యుదయము మొదలగు వానివర్ణనలు గలదియై యుండవలయును.

ఈ కవిచంద్రునిచే రచింపఁబడిన యీ మహాసేనోదయముయొక్క ప్రారంభమున భగవన్నమస్కార రూపమగు మంగళమాచరింపఁబడెను. ఇందలి యితివృత్తము అష్టాదశపురాణములలోఁ జేర్కొనబడిన స్కాంద పురాణమునుండి గ్రహింపబడెను. ఇందు ధర్మార్థ కామ, మోక్ష, రూప ఫలములు బ్రతిపాదింపఁబడుచున్నవి. ధీరోధాత్తనాయకుఁడగు కుమారస్వామి దీనికినాయకుఁడు. ఇందలి ప్రథమాశ్వాసమున గుమారస్వామి జననము, నగరవర్ణనము, ద్వితీయాశ్వాసమున రాక్షసవధకై, షణ్ముఖుని ప్రయాణము, కుమార, తారకాసురుల యుద్ధము, తృతీయాశ్వాసమున సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనములు, ఇంద్రుని విరహము, సూర్యో

దయవర్ణనము, వనవర్ణనము, సంభోగశృంగారము, శూరపద్మ సింహవక్త్ర తారకాసురుల యుత్పత్తి, స్త్రీవర్ణనము, చతుర్థాశ్వాసమున జయంతభాను కోపుల కలహము, పంచమాశ్వాసమున శూరపద్ముని మంత్రాలోచనము, షష్ఠాశ్వాసమున దేవదానవుల రణము, సప్తమాశ్వాసమున శూరపద్మ కార్తికేయుల సంగ్రామము, అష్టమాశ్వాసమున దేవసేనామహాసేనుల వివాహము, శరజన్ముని విరహము, లవలీబాహులేయుల కళ్యాణము, శత్రుజయముచే నాయకాభ్యుదయమును వర్ణింపబడి యుండుటచే నీ ప్రబంధము మహాకావ్యమని చెప్పక తప్పదు.

ఇక్కవిశశాంకుఁడు గడచిన 1916 సంవత్సరమునకు సరియైన సౌమ్యనామకాబ్దమునందు ప్రొద్దుటూరునకు విజయంచేసిన పుష్పగిరిపీఠ స్వాములైయలరారు జగద్గురు శ్రీమదభినవోద్దండ విద్యాశంకర భారతీ స్వాములవారి చాతుర్మాస్యదీక్షావిధానమును బద్యగద్యములతో రచించి తత్సంస్థానరాజ విభూషణులైన విద్వత్కవిమండలముల మెప్పునువడసి శ్రీవారిచే బహుమాన రూపంబుగ సువర్ణహస్తకంకణములును గౌశేయ శాలువలును పొందెను.

మఱియును 1924 సంవత్సరమునకు సరియగు రుధిరోద్గారినామక సంవత్సరమునందు నాంధ్రదేశమందలి విద్వత్పోషక హైందవసంస్థానము లలో అనాదిసిద్ధముగాఁ బేరొందిన గద్వాల సంస్థానాధిపతులగు శ్రీశ్రీ సీతారామ భూపాలవరేణ్యుల వంశవృక్షమును గద్యపద్యాత్మకముగా నేకాశ్వాసము రచించి పఠించి తదీయాస్థానమండల విరాజితులగు పండిత కోటులొసంగిన సమస్యాప్రశ్నలను స్వాద్యముగఁ బూరించి ప్రభువు నానందింపఁజేసి వారిచే నత్యంతగౌరవయుక్తంబుగా నూటపదునారు రూప్యములు గౌశేయశాలువలును బహుమతిగైకొని యొసంగి యున్నవాఁడు.

కీర్తిశేషులైన మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణయను బిరుద ములొంది పండితశిరోభూషణమని లోకవిఖ్యాతిఁగాంచిన బ్రహ్మశ్రీ

వేదము వేంకటరాయశాస్త్రిగారును, గోపాలుపేట సంస్థానం ఆస్థాన విద్వాన్ శతావధాని బుక్కపట్టణము రామచంద్రాచార్యులుగారును, తదీయ సంస్థానమునందీకవికుంజరుని కవితాశైలినిగుఱించి శ్లాఘించి యోగ్యతాపత్రముల నిచ్చియున్నారు. వానినిందు ప్రకటించియున్నారు. తిలకించుడు.

ఈ కవితల్లజుఁడు రచియించిన నీసుహాసేనోదయ ప్రబంధమునకు మూలగ్రంథముగా కీర్తిశేషులైన శ్రీముదిగొండమల్లనారాధ్యపుత్రుండగు బ్రహ్మయలింగకవివతంసునిచే విరచింపఁబడిన 'శివరహస్యఖండతత్త్వప్రకాశిని' యను నామంబుచేనొప్పారు గద్యప్రబంధమునుగైకొని దానియందలి కథానుసరణముగా కుమారస్వామిజననమాది వల్లీకల్యాణముదాఁక నచ్చటచ్చట తనయిచ్చవచ్చినట్లు వర్ణనలు పెంచి కథనుసాగించియున్నవాఁడు.

ఈ గ్రంథములోని ఆశ్వాసాంతపద్యములఁదిలకింప నీకవివరుని యిష్టదైవము శ్రీ ఆంజనేయస్వామివారని ప్రత్యక్షముగఁదెలియుచున్నది. ఇందులకు దృష్టాంతముగా

తే॥ పంక్తిరథనందనాగ్రణి పాదకమల సేవనానందు డంజనీదేవిసుతుని
కరుణచే రామచంద్రసత్కవిసమాఖ్య గలిఁగె గాకున్ననీపేరుగలదెనాకు॥

అని తనగ్రంథములోజెప్పికొనెను. అద్దేవుని నిరతిశయకరుణాకటాక్షముచేతనే యిక్కవికి నింతటి కవిత్వప్రౌఢిమసమఁవడినదని యెఱుంగుటత్యంతవిశ్వాసార్హము

ఈకవి ద్రవ్యాపేక్షకులోనయి తనకృతిని నరాంకితమొనఁగుటయందు విముఖుఁడగుచు,

మ॥ సుతదారాది కుటుంబరక్షణకునై కోటీస్థలిన్ మానవ
స్తుతులం గావ్యములొప్పఁజెప్పి ధనరాసుల్గాంచు మోదించుచున్
వితతాహంకృతినొంది చచ్చి నరకావిద్ధాంగులై యున్కి హీ
నతయౌటన్ భగవత్సమర్పణము తెందంగా రచింపందగున్॥

అనివేశ్యాకాంక్షించి మహాకవులగు బమ్మెరపోతనామాత్య తిక్కన సోమయాజి కూచిమంచితిమ్మన నాచనసోమనాథ భైరవరాజు వేంకట నాథులయనువునఁ దనకృతిని రామభద్రునకు సమర్పించియున్నవాఁడు. ఇక్కవిసత్తమునికవిత్వము సంస్కృతపదభూయిష్ఠమై యత్యంతప్రౌఢముగా నుండును. వర్తమానకవులు కొందఱికిది సమ్మతిలేక నర్థకాఠిన్యమనుచుఁ బలికెదరు. భావకవిత్వము ఉండవలయునందురు. భావకవిత్వమనినఁ బద్యము చదువుచుండఁగనే అర్థమగునట్లు తేటతెల్లమగు మాటలతో నుండ వలయునని వారి యభిప్రాయము. భావములేని కవిత్వమెందును గానఁ బడదు. నిఘంటువులవలన ప్రయోగించిన నైఘంటికపదములందు భావము లేకుండుననుట విపరీతమైయున్నది. పాండిత్యముగల కవివరుఁడు తన పాండిత్యమును మూలఁబడవైచి పేలపిండివంటి తేలికయగు పదములు ప్రయోగించి కవనముఁ జెప్పుటకెంతమాత్రము ప్రయత్నించఁబోఁడు.

భైరవరాజు వేంకటనాథకవి కవిత్వమెట్లుండవలెననియు తనపంచ తంత్ర గ్రంథమునందు వ్రాసియున్నాఁడు. చూడుఁడు.

చ॥ ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతితేటగాక యరచాటగు నాంధ్రవధూటిచొక్కపుం
జనుగవఁబోలి గూఢమును జాటుతనంబును లేకయుండఁ జె
ప్పిన యదిపో కవిత్వమనిపించు నగింపకు గాకయుండినన్॥

(ఈ పద్యమును గమనించిన పండితులకీవిషయము తేటపడకపోదు.)

కంకంటి పాపరాజ కృతమగు నుత్తరరామాయణము ప్రౌఢమై సంస్కృత పదాడంబరమై అర్థగాంభీర్యమై నారికేళపాకమున నొప్పారు చున్నది. ఆగ్రంథమును భావకవిత్వముగాదు, కఠిన కవిత్వమని త్రోసి వేయక నాంధ్రదేశమందలి పండిత పామరులు ప్రాముఖ్యముగానెంచి చదువుచున్నారు. మఱియు వీధిబడులలో బాలురకు భారత, భాగవతముల నేర్పించక దానినే బోధించుట సర్వులకుఁ దెలిసియేయున్నది. ఆగ్రంథమున కున్నప్రచారము ప్రఖ్యాతి మఱియేగ్రంథమునకు లేదనుట నిజమైయున్నది.

మఱియు "లోకోభిన్నరుచిర్హి" యనుట యందరకు తెలిసిన విషయమై యున్నది. యొకనికి సమ్మతమైనది, మఱియొకనికసమ్మతముగా నుండును. యొకని కసమ్మతమగునది వేఱొకనికి సమ్మతమై కన్పట్టును. సర్వులకు రంజనముగా కవిత్వము జెప్పవలయునన్న బ్రహ్మయుఁజాలఁడు. ఈ విషయమునే బైచరాజు వేంకటనాథకవి తనపంచతంత్రమునందు

సీ॥ ఒకఁడలంకారంబునకు వేడుకపహించునొకఁడు వార్తాసమృద్ధికిఁ జెలంగు
నొకఁడుశబ్దస్ఫూర్తులకు మాయురేయను నొకఁడర్థసృష్టికి నుత్సహించు
నొకఁడురసాభోగతకు మస్తముగదల్చు నొకఁడుపమానచర్చకకు నలరు
నొకఁడుపదప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు నొకఁడుజాతిశ్లాఘకుబ్బుచుండు
తే॥ కామిచందానఁ దలవరికరణి బధిరు వలె దరిద్రునిగతి వాదిపగిది కనక
కారుచాడ్పునఁబంగువై ఖరిఁగుజాతి జాడనిందరిముదలింపఁజాలు శెట్లు॥

(అని వ్రాశియున్నాఁడు. తిలకింపఁదగును.)

రేఫద్వయమైత్రి యతిప్రాసములకుఁగూర్చుట వర్తమానకవులందుఁ గొందఱికివాడుకయైయున్నది. కవిత్రయము వారలీపద్ధతి నిషేధించిరి. ఆధునికులగు సర్వకవులకు ప్రామాణిక గ్రంథమగు భాగతము రచించిన వీరినియమము నుల్లంఘింపక దానినే యవలంబించి రేఫశకటరేఫములను యతిప్రాసములకుగూర్చక తన గ్రంథమునంతయు నీతఁడు బూరించెను. ఈ యుత్తమ కవికి ప్రామాణిక గ్రంథకారులయందుఁగల భక్తివాత్సల్యతఁ బొగడఁదగియున్నది.

మఱియు మహాలాక్షణికులైన కాకునూరి అప్పకవి మొదలగు వారలు కవిలోకోపకారముగా నేర్పరచిన బంధ, గర్భ, చిత్ర కవిత్వమును వదలుట సమంజసముగాదని యివి యన్నియు నీగ్రంథమునందు రచించెను.

లక్షణవిరుద్ధంబులైన పదములిందు పొరపాటునఁ బడియుండినను నుండవచ్చును. యవి కొందఱి యదృష్టంబువలన సాధువులుగను కొందఱి దౌర్భాగ్యంబువలన నసాధువులుగను సాధింపఁబడుచున్నవి.

తే॥ నన్నయాదిక సుకవిజనంబులకును గలపుతప్పులనంగ నన్యులకులేవె

(అని అప్పకవి చెప్పియున్నాఁడు.)

ఎట్టివాని కృతిలోనైనను తప్పులుండక యుండవు. అట్లుండిన మాత్రంబుననే యతని కృతికిగానీ ఆకవికిగానీ కళంకమాపాదించుటుచిత ముగాదు. గుణపరిగ్రహణముసేయుట పండితమండలి స్వాభావికముగదా!

ఇక్కవికుంజరుఁడు తనగ్రంథములో జొప్పించిన శబ్దాలంకారములు, అర్థాలంకారములు, గర్భకవిత్వము, బంధకవనము, చిత్రకవనము మొదలగు నవి శైలితెలియుటకై కొన్నింటినిఁజూపుచున్నాను.

ముక్తపదగ్రస్తము. ప్ర. ఆ. ప. 75.

సీ॥ గౌరీమనఃపద్మఖద్యోతనీకాశ కాశనాభరణవికాసకాయ
కాయజదుర్మదగ్రావోగ్రశతధార ధారాధరద్వారసాలవాల
వాలఖిల్యాదితాపసరాడ్వినుతపాద పాదమాల్యబ్జసప్తార్చినేత్ర
నేత్రీకృతద్విపనిశిచరవరకృత్తి కృత్తసద్భక్తదుష్కృతసమస్త
తే॥ మస్తకస్థలవల్గదమర్త్యలహరి హరిణశాబకవిలసితహస్తసార
సారసాశనఘనసారతారహీర హీరసమవర్ణబహునమస్కృతులుమీకు॥

శ్లేష. ప్ర. అ. ప. 193.

సీ॥ వరసుమనశ్చక్రవాళకభరితంబు మహనీయతరసుధర్మాన్వితంబు
నసమానఘనవైజయంతప్రకాశంబు విద్యాధరోత్కరవిలసితంబు
వసులాభసంప్రాప్తవర్ణితవిభవంబు నతులితవజ్రప్రభావృతంబు
సంతతగురువాక్యజాలాభిరామంబు గంధర్వసందోహబంధురంబు
తే॥ ప్రబలపుణ్యజనౌఘప్రాప్యస్థలంబు వితతదోషాత్మకాళిదవీయతలము
ప్రాంచితాఖండసౌఖ్యరత్నాకరంబుత్రివిష్టపమననొప్పుస్కందపురము॥

వృత్త్యనుప్రాసము. ష. ఆ. ప. 46.

ఉ॥ త్ర్యక్షవిపక్షశిక్షబలదక్షబుభుక్షుసురక్షితాద్రిజా
ధ్యక్షనతేంద్రదక్షకమలాక్షనుతోక్షహయాదిభిక్షహ
ర్యక్షసదృక్షశౌర్యయుతయక్షపక్షవశక్షదేహమాం
రక్షయటంచుఁబల్కుచుదురంబుననిల్చెనిరాయుధుండునై॥

అంత్యప్రాసము. చ. ఆ. ప. 5.

మ॥ కనియోగీమార్గమునన్ మహానియమయోగాభ్యాసు నత్యంత పా
పనిరాసున్ భసితానులేపనతనూభాసున్ సదారణ్యదే
శనివాసున్ భగవత్పదాబ్జ భజనాంచన్మానసోల్లాసు శ్రీ
ఘనహాసున్ హరిణాజినప్రకట శుంభద్వాసు దూర్వాసునిన్॥

యమకము. తృ. ఆ. ప. 207.

సీ॥ రజతాద్రిగృహమహారజతాద్రికోదండ పీనవాహనకాండ తేనమోస్తు
ఫాలలోచనద్విడ్విఫాలలోచనకర్త దివ్యపాలంక్రియా తేనమోస్తు
శంకరపంకనాశంకరపంకజా సీనకోటిభృత్తేన మోస్తు
కాలకంధరకాలకాలకంధరవాహ దివిజపూజితపాద తేనమోస్తు
తే॥ మీనకేతనమదభంగ తేనమోస్తు ద్విరదచర్మమయాంబర తేనమోస్తు
మౌనిమానససంచార తేనమోస్తు దేవదేవమహాదేవ తేనమోస్తు

స్వభావోక్తి. తృ. ఆ. ప. 52.

ఉ॥ కైరవముల్లసింపవిహగంబులుగూండ్లుద్యజింపపద్మముల్
కోరికలఁజవహింపనుడుకోటి నశింపరథాంగదంపతుల్
సారెకుసంతసింపఁబో నిజక్కెరవిల్దొరతూపులుంచెది
గ్వారము కాంతిఁ బెంచెఁ బసిపాటలుగేస్తులడారెనంతటన్॥

క్రమాలంకారము. తృ. ఆ. ప. 123.

మ॥ స్ఫురన్మారుల్ వళులుం బిలుకుంపులున్ సంఖంబుల్ జంఘులుం బాదముల్
వరయవాసంబుప్రసాదముల్ గెలువనుర౦భాపిచిపూతారకో
త్కరశాల్యంబుజకుంభికచ్ఛపములం దర్కించియా రౌరయా
వరుణీలోకవతంసముం బొగడసాధ్యంబౌనెవాగ్జానికిన్॥

విరోధభాసము. ప్ర. ఆ. ప. 211.

వ॥ పల్లవసంగంబు సాధుతరులందకాని సాధుతరులందులేక వెలవెలం
బోవుట ఘనులందకాని ఘనులందులేక సుడివడుట సరసులందకాని
సరసులందులేక వక్రత్వంబు వాహినులందకాని వాహినులందులేక

యాచించుట సర్వజ్ఞునందకాని సర్వజ్ఞులందులేక ప్రాణిహింసనంబు ధర్మునందకాని ధర్ములందులేక రూపుమాయుట పురుషోత్తమునందకాని పురుషోత్తములందులేక కళంకతరాజునందకాని రాజులందులేకయనంత సంపదలంబొంపిరిబోవుచు సౌఖ్యంబునకు ముఖ్యంబయి॥

ఓజము. తృ. ఆ. ప. 39.

సీ॥ దరశీతగిరిధాతహారిశ్వేతశరజాత సురనేతకరిసూతహారివరములఁ
గాశజన్యాళనాహీశకైలాసవాణీశతారేశ్వరాకాశనదులఁ
గుందకందుకశరత్కుందచందనసుధా మందారహిమబిందుబృందములను
తారకాసౌరగోక్షీరకర్పూరడిండీరముక్తాహారకైరవములఁ
తే॥ దురఁగపరివృఢదితిసుతగురుప్రలంబ హరణులనుగేరిజారచోరాళిహృదయ
సాధ్వసప్రదముఖ్యబీజమయిచెలఁగి పండువెన్నెలజగమెల్లనిండుకొనియె॥

పరిసంఖ్య. ప్ర. ఆ. ప. 211.

వ॥ దారిద్ర్యంబు సీమంతినీమధ్యంబులయంద కుటిలత్వంబు నారీచికురంబులయంద క్రౌర్యంబువనితానఖంబులయంద చాపల్యంబు హరిణాక్షీదృగంచలంబులయంద మాద్యంబునితంబినీయానంబులయంద బంధవిశేషంబు రామాసురతంబులయంద కాఠిన్యంబు సుందరీస్తనంబులయంద కలహంబు బింబాధరీప్రణయంబులయంద విస్తరించి॥

—• గర్భకవిత్వము. •—

ద్విపదమత్తకోకిల దుష్కరప్రాసపదనియమ కందగర్భితసీసము ద్వి. ఆ. ప.79.

సీ॥ దానకామితదాయిదానవదండివా సుకిభూషణావరమస్త్రదేహ
వాసరాధిపతేజవాక్పతివంద్యవా సకృతాచలాభవశార్జ్గిరోప
కాసరాశ్వమదోరగద్విజకాంతభా సురవైభవాపరసూదనోగ్ర
దోషసంఘవిదూరతోయధితూణశే సరివిక్రమాగిరిచాపభృతవి
తే॥ రతివిధుతనుతిలోలనరరుదితఘన చండపవనరాజత్కీర్తిశైలజేశ
శంబరారాతిదోర్గర్వసాగరౌర్వ భవనరక్షణసర్వేశభూతనాథ॥

—• చిత్రకవిత్వము. •—

చతుర్విధకంధము. ద్వి. అ. ప. 251.

క॥ నీలాభ్రదేహసజ్జన పాలాథవహారణమృదులభాషణనివహా
శైలధరశత్రునిచయవి ఫాలానవకమలనేత్రపాలితసవనా॥

వర్గ పంచకరహితకందము స. ఆ. ప. 387.

క॥ సరసీరుహాశరహారవర శరాసవిలయానసహాయ శౌర్యవహాహారీ
శ్వరహారిహాయహాయసింహా స్వరుసురలహారీసురర్షి శశిశర్వయశా॥

—• బంధకవిత్వము. •—

పుష్పమాలికాబంధము. ష. ఆ. ప. 324.

చ॥ జనకనరేనజాస్యజలజన్మజగద్ద్విశకాశభేశచం
దనవనఫేనకీర్తినగనన్దనసేవ్యపదాపదాపహా
వినయనదీనతుల్యవిలువిద్యవిభాసితపాతకాంతకా
జ్జనయనదానశౌండపరిపన్థిపలాశనకాననానలా॥

నాగబంధము. అ. ఆ. ప. 254.

చ॥ నతవరదావనీతనయనాయకపద్మదళాభలోచనా
శతముఖపాలశీతపరసారరుచిస్సవనావనాపయో
మృతభుభవేభశీతశిఖరీఖసరిద్బలసౌరసైచికీ
కుతలవహోదజాతయశకౌశవచక్షుభదుఃఖదారితా॥

ఇట్టివెన్నియో! యీ గ్రంథమునఁ జూపుటకు వ్యవధికలదు. కానీ పీఠిక విపులమగునను సందేహముతో విరమణముగావించితిని.

వైదిక సంస్థానరత్నమగు పుష్పగిరి పీఠాధిపత్య జగద్గురు శ్రీమదభినవోద్దండ విద్యాశంకర భారతీస్వాములవారి సంస్థానమునందును, లౌకిక సంస్థాన రాజమైన గద్వాల సీతారామ భూపాల ప్రభుని యాస్థానము నందును, తదీయాస్థాన భూషణులై చెలువారెడు సత్కవి శతావధాని రాజశేఖరులుల్లంబుల సంతసము వెల్లివిరిసి తలలూచిపొగడ నత్యంత గౌరవ యుక్తముగా సువర్ణహస్తకంకణ కౌశేయశాలువలును, సూటపడునార్లు

రూప్యములును, బహుమతినొందిన కొడవలూరి రామచంద్రరాజ సుకవి ప్రణీతమగు నీ "మహాసేనోదయ" ప్రబంధమునందలి కవితాధార, యనర్గళమై, సుకుమారమై, రసవంతమై, మృదుమధురమై. హృదయంగమమై, ఓజస్సౌకుమార్య శ్లేషాది, కావ్యగుణయుక్తమై, తడబాటులేని సొంపైన నడకగలదియై, నిరర్థకపదదూరమై, అపురూప విశ్రాంతులు కలదియై, అర్థాలంకార, శబ్దాలంకార, సమ్మేళనమై, నారికేళ, కదళీ, ద్రాక్షాది, పాకశోభితమై, శ్లాఘనీయమైన చతుర్విధ కవనరంజితమై, సలక్షణమై, పండిత శ్రవణానందకరమై, మహాకావ్యలక్షణముల నొప్పారుచున్నదనుట యతిశయోక్తి కాదు.

ఇక్కవితిలకుఁడు రచియించిన యీ గ్రంథములోని పద్యములఁ బఠించి యసూయకెడమీయక సమదృష్టితో పండితులు తిలకించిరేని ముమ్మాటికి సత్యముగ మహాకవులగు పూర్వగ్రంథ రచయితల కవిత్వమనుచుఁ దోపక మానదని నాముఖ్యాభిప్రాయము.

ఇతఁడు మదీయ జ్యేష్ఠమాతృ పుత్రుండును, నాకు సోదరుండునై యున్నవాఁడు.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

కవి కళానిధి,

కురుమల గ్రామం,
కదిరి తా॥
1-1-1935.

రామాయణము వేంకటస్వామిరాజు.



శ్రీ

# హ ను మ త్ప్ర సా ద ము.

పంక్తిరథ నందనాగ్రణి పాదకమల
సేవనానందుఁ డంజనీదేవి సుతుని
కరుణచే "రామచంద్ర సత్కవి" సమాఖ్య
గలిగెఁ గాకున్న నీపేరు గలదె నాకు॥



# అంకితము.

అపరాధ మొనరించి, హా! కృపానిధీ, కావు
    మనినఁ, గాకాసురు, మనిపె నెవఁడు
బతుముద్దెగి, నేలఁబడు, జటాయున, కగ్ని
    సంస్కృతుల్, శ్రుతియుక్తి, సలిపె నెవఁడు
గాంధిశీకుండైన, ఖరకరసూతికై,
    ఘనవాహనందనుఁ, దునిమె నెవఁడు
బగతుతమ్ముండంచు, భావింప కెంతయుఁ,
    గడఁక, విభీషణుఁ, గాచె, నెవఁడు

నట్టి, దీనజనోద్ధారుఁడైన, రామ
భద్రునకు. మత్కృతివధూటి, భక్తినిచ్చి,
సరగఁ, దత్కృప, నిహపరసాధనముల,
నందఁదలఁచితిఁ, గేవలానందమతిని॥

ధరలోన, ముక్తిగాంచే
శ్వరమం, దమరుచు సుతింప, సైకతలింగం,
బురునిష్ఠ, నిలిపి వెలసిన,
స్థిరతర శుభనామునకును, శ్రీరామునకుఁ॥

ఏతద్గ్రంథకర్త, కవనమును, గ్రంథమును, గురించి కవివతంసులొసంగిన

## బహుమాన యోగ్యతా పత్రములు.

నైజాము, గద్వాల. **15-4-1924** సంవత్సరము.

ఈ నడుమ నేను దేశాటనాభిలాషినై ఆంధ్రదేశమందలి విద్వత్పోషక, హైందవ సంస్థానములలో అనాది సిద్ధముగా పేరెన్నికగన్న గద్వాల సంస్థానమును తదీయ సింహాసనాధిష్ఠాతలయిన శ్రీ శ్రీ సీతారామభూపాల ప్రభుని యాస్థానమునుండగా నందలి కవి విద్వన్మండలిలో శ్రీ శ్రీ గౌలినవారిపై పెక్కు పద్యరత్నములను పఠించిన కొడవలూరి రామచంద్రరాజుగారిని గాంచి వక్ష్యమాణ కారణములచే స్నేహపాత్రులనుగా నెంచితిని.

వీరి కవనము మృదుమధురము, హృదయంగమము, రసవంతము, వసుచరిత్రకారుని, మార్గములోనిది. ఈ నాల్గు విశేషణములచే నిందలి కడమ గుణగణమును పండితులూహింపవచ్చును.

వీరి పద్యములు వినుచు కరము ఆనందించుచుంటిని.

వేదము వేంకటరాయశాస్త్రి.

(పై వారు స్వహస్తముతో వ్రాసియిచ్చిన యోగ్యతా పత్రమును ప్రక్కన ముద్రించితిమి.)

**1924 వ సంవత్సరమునకు సరియగు రక్తాక్షి సంవత్సర చైత్ర శుద్ధ సప్తమి, గద్వాల సభలోన,**

తే॥ పూర్వకవులనుబోలె సంపూర్ణ రస వి
లాస భాసురమై తగు లక్షణమున
గవిజనానందకరమునై కరమునెగడె
నవనిలో "రామచంద్ర రాజాఖ్య కవిత"॥

తే॥ పరగ గద్వాలరాజ సద్వంశమెల్ల
బద్యరూపకముగ వ్రాసి పండితాళి
కమితసంతోష మొసరించె నర్హమైన
కవివరుండనతడె నిక్కంబు ధరణి॥

ఇట్లు,

**రామచంద్రాచార్యకవి శతావధాని,**

గోపాలుపేట సంస్థానం, ఆస్థాన విద్వాన్,

గోపాలుపేట సంస్థానం,

నాగరు కర్నూలు తాలూకా, మహబూబునగరం జిల్లా.

(పై వారు స్వహస్తముతో వ్రాసియిచ్చిన యోగ్యతా పత్రమును ప్రక్కన ముద్రించితిమి.)

# మ న వి.

**మహాశయులారా!**

**ఈ మహాసేనోదయంబను మహాప్రబంధంబునకు కర్త "కొడవలూరి రామచంద్రరాజకవిగారు." ఈయన మాతండ్రిగారు.**

ఈ కవీంద్రుఁడీప్రబంధరచనకుఁగడంగి మధ్యమధ్య విఘ్నములెన్ని యేని తటస్థించినను, కలతఁజెందక పట్టుదలవిడువక తన కర్తవ్యమును సాగించుచు తుదకెట్లో సర్వేశ్వరుననుగ్రహంబున 1932 సంవత్సర ప్రారంభ మునకు, ప్రబంధమునంతయు సంపూర్ణముగా పూర్తిచేయఁ గలిగినందులకు ధన్యుఁడు.

పూర్తియైనదాది తద్గ్రంథమును ముద్రణఁ జేయించుకొనుటకై తానమిత ప్రయత్నము లొనరించి యున్నాఁడు. కాని తనతలంచిన కార్యము నెరవేరలేదు. తత్కారణముగా హృదయ శాంతిలేదు.

ఇవ్విధమంతయుఁ జూచుచున్న మేము మజ్జనకుని హృదయ శాంతి కొరకై ఆప్రబంధముద్రణ కెన్నివిధములనో ప్రయత్నించితిమి. దురదృష్ట వంతులముగనుక మాయత్నములును ఫలించలేదు.

ఇట్లు మనశ్శాంతిలేకయే మాతండ్రిగారు శ్రీ తారణ సం॥ర పుష్య బహుళ సప్తమి శుక్రవారమునకు సరియగు 1945 సం॥రం జనవరి నెల 5 తేది స్వర్గపురమలంకరించిరి.

తండ్రి బ్రతికియుండగా తన ప్రబంధమగు మహాసేనోదయమును అచ్చువేయించి ఆయన కనులకుఁజూపి తన్మనశ్శాంతిని గలిగించలేని నిర్భాగ్య జీవులము. మేమిరువురము పుత్రులము. బ్రతికియేయున్నారము.

మాతండ్రి ప్రబంధమును పూర్తిచేసినది 1932 సంవత్సరమున. తాస్వర్గస్థుఁడైనది 1945 సంవత్సరమున. అనగా గ్రంథము పూర్తియైన దాది పదుమూడు సంవత్సరములు జీవించియుండి ముద్రణకై సర్వయత్న ములు చేయుచున్నను వృథాయయ్యెను. తన ప్రయత్నమునకుతోడు మేమును సహకరించి ప్రచారము చేసితిమి. కాని మా అందరి ప్రయత్న

ములును ఫలించలేదు. "శ్లో॥ సర్వం నిష్ఫలితం యద్దైవవిధినా దైవేబలే దుర్బలే" దైవబలము చాలనియెడల సర్వము నిష్ఫలమగునని విజ్ఞులు చెప్పియున్నారుగదా!

అమ్మహనీయుని భౌతిక శరీరమును శ్రీముక్తిరామేశ్వర క్షేత్రమునకు దక్షిణ దిశయందు 1½ మైలు దూరమున పవిత్రమగు పినాకినీ నదీ తీరమున రామేశ్వరపు పొలిమేరకు లోపులగల శ్రీ రామదేశికులవారి ఆశ్రమమున (రామయ్య మఠము) సమాధినిఁ జేసియున్నాము.

మంటప ప్రాకార గోపుర దివ్యాలయ ప్రశస్తమై వినిర్మల మధుర జలపూరిత కూప ప్రసిద్ధమై బహుళతరు లతా కుంజ సంశోభితమై హృదయానందకర కుసుమ సౌరభ విలసితమై సాధుజనబృంద నివాసస్థానమై నిరంతర గురుధ్యాన తత్పరుండగు శ్రీ కోనేటి చెన్నారెడ్డి కొమారుడు పెద్దఓబుళరెడ్డిగారి యాజమాన్యమున నీయాశ్రమ మలరారు చున్నది.

ఇందు శ్రీరామదేశికులవారు సమాధిస్థులై యున్నారు. తత్సమాధి స్థలంబునం దహర్నిశ లఖండజ్యోతి వెలుగు చుండునట్లు భక్తాదు లేర్పాటు చేసియున్నారు. ప్రతి సంవత్సరమునందును వైశాఖ శుద్ధ దశమియందారాధనయును, మాఘ బహుళ త్రయోదశియందు మహాశివరాత్రి జాగరణంబును మహావైభవంబున నీపుణ్యాశ్రమమున జరుగుచుండును. జనులు వేలాదిగా వచ్చుచుందురు. ఇతర సమయములందు నైతము భక్తాదులిచటికి విశేషముగా స్వామివారి దర్శనమునకై వచ్చుచుందురు.

ఇట్టి మహనీయ స్థలంబున మాతండ్రిగారి సమాధిని నెలకొల్పియున్నారము.

సీ॥ నుతపదునెనిమిదినూరులిరువదియాఱు అను శాలివాహనశకమునందు
నైదునొక్కటినల్వదైదవ తేదీన భోగామృతామృతయోగమందు
శారణనామవత్సర పుష్యమాసాన బహుళ పక్షమున సప్తమి తిథియగు
శుక్రవారంబున సురచిరమగువాద్య కోలాహలంబు దిక్కులఁబ్రదువంగ

తే॥ నవని శ్రీరామపరదేశియాశ్రమమగు
మఠమునందునపూర్ణసమాధివైతి
వవ్యయంబగుసురలోకమరుగఁగోరి
రమ్యగుణసాంద్ర "కొడవలూర్ రామచంద్ర"॥

మా తండ్రి స్వర్గస్థుఁడైనపిమ్మట కాలము 10 పదిసంవత్సరములు గడచినవి. పిదప 1956 సంవత్సర ప్రారంభమునుండి ముద్రణకగు ద్రవ్యమునకై బంధువులను, మిత్రులను, శిష్యులను, విజ్ఞులను, సాహిత్యాభిమానులను, పండితులను, దాతలను, ఉదారులను ఆశ్రయించితిమి. మఱియు మా తెలిసిన ప్రదేశములకెల్ల సరిగె ఆయాచోటులగల వదాన్యులనెల్ల నాశ్రయించి కొంత ద్రవ్యమును సేకరింపఁగలిగితిమి. కానీ ఆద్రవ్యముతో కార్యమున కుపక్రమింపగల ధైర్యములేక కాలయాపనం బొనర్చుచుంటిమి. ఈ విధముగా 1958 సం॥ర మేనెలాంత్యమువరకు గడచినది.

ఇంతలో అనగా 1–6–58 తేది దైవబలంబుకలిమి మాకొక యూహ స్ఫురించినది. అది యేమనగా! ప్రొద్దుటూరు తాలూకా కొత్తపేటగ్రామ వాస్తవ్యులు శ్రీ రామిరెడ్డి ఓబుళరెడ్డిగారి పుత్రుఁడు చంద్రఓబుళరెడ్డి (యం. యల్. ఏ.) గారితో మా పుస్తక విషయము తెలుపుకోవలయునని తలంపు గలిగినది.

కారణమేమనగా! ఆయన వర్ణనీయ సాహిత్యవిద్యా ప్రియుండును, దీనజనాదరణుండును, సుగుణగణావలంబనుండును, నిరాడంబరుండును, సంతతోదారహృదయుండును, కార్యదీక్షాపరుండును, ప్రశస్తకీర్తివిస్తారుండగుటవలన తక్షణమ పోయి వారిని దర్శించి, మా 'మహాసేనోదయము' విషయ మామూలాగ్రముగా మనవిచేసుకొని అందలి కొన్నిఘట్టములను చదివి వినిపించి ప్రచురణకుగా సహాయము చేయవలయునని విన్నవించుకొంటిమి.

ఆ రెడ్డిగారు సాదరపూర్వకముగా మమ్ము గౌరవించి అయ్యా! ఈ ప్రబంధమును విన్నప్పటినుండి నాకును సహాయము చేయ

వలయుననని తలంపుగలిగినది. గనుక ప్రొద్దుటూరులో సారథిప్రెస్‌లో యీ ప్రబంధమును ముద్రణకివ్వడు. సారథి ప్రెస్ ప్రొప్రయిటరు శ్రీ సి. రంగప్పగారు నాకు కేవలము ముఖ్యులు. గాన వారితోచెప్పి కొలది ద్రవ్యముతోనే సులభముగా అచ్చుచేయునట్లు చేయుమనని మాకు ధైర్యముచెప్పి అదేమాటప్రకారము శ్రీ సి. రంగప్పగారికిచెప్పి మాప్రబంధమును అచ్చుచేయించి యిచ్చినందులకు వారికి మాఅభినందనములు.

సారథిప్రెస్ ప్రొప్రయిటరు శ్రీ సి. రంగప్పగారును, శ్రీ ఆర్. చంద్రఓబుళరెడ్డిగారు చెప్పిన మాటలకు సమ్మతించి శిథిలావస్థలోనున్న గ్రంథము నుద్ధరించుట సుకృతమని నిశ్చయించి దృఢసంకల్పులై మా యథాశక్తికొలది యిచ్చు ద్రవ్యమును సంతోషముతో నందుకొని శీఘ్రకాలములో శుద్ధముగా మిక్కిలి రమణీయముగా, సొంపుగా, చదువరుల కాకర్షణీయముగా నుండునట్లు ముద్రించి యిచ్చినందులకు వారికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఈ గ్రంథ ముద్రణ ద్రవ్యమునకై మదీయ బంధువులను, మిత్రులను, శిష్యులను, దాతలను, ఔదార్యులను, సాహిత్యాభిమానులను, ఆశ్రయించి ప్రీతితో వారిచ్చు ధనమునందుకొని తన్మూలమున నీగ్రంథమును ముద్రణ జేయించితిమి. ఇందులకు ప్రతిఫలముగా వారిపేర్లు నివాసస్థానములు యిచ్చిన మొత్తముతో పూర్తిగా యిందు ప్రకటింపజేసి మా కృతజ్ఞతను తెలియజేసికొని యున్నాము.

సజ్జన స్తవనీయ చారిత్రుండును, సరస సాహిత్యవిద్యా వికాసిత హృదయుండును, సుగుణ సంపన్నుండును, యత్నీకృత కార్యసాధనా తత్పరుండును, మద్బంధు శిరోమణియునగు కడప తాలూకా యెగువపల్లె కొత్తపల్లె గ్రామ వాస్తవ్యులు శ్రీ వెల్లసిరి పెద్దచెన్నమరాజుగారి కొమారుడు పెద్దతులసిరాజుగారు యిమ్మహాప్రబంధ ముద్రణ ధనమునకై తానేకాకియై తెలిసిన ప్రదేశములకెల్ల తిరిగి అందలి విబుధుల నాశ్రయించి రూ. 200—0—0 లు. వసూలుచేసి మాకిచ్చియున్నాడు. ఈ మాత్రపు

సహాయము చేసినవారు మాబంధువులలో ఒక్కరుకూడా లేరు. పరమేశ్వరుడు వీరికుటుంబమునకు సర్వదా శుభములిడి కాపాడుగాక.

వర్ణనీయ గుణగణాలంకారుండును, ప్రశస్తకీర్తివిస్తారుండును, సంతతానందప్రద సంగీతవిద్యా కౌశలుండును, నగు ప్రొద్దుటూరు తాలూకా బొల్లవరం గ్రామ వాస్తవ్యులు శ్రీ అప్పలాయగారి పెద్దవీరయ్యాచారిగారి కొమారుడు సుబ్బరాయాచారిగారు యీగ్రంథ ముద్రణకై తనకు తెలిసిన విజ్ఞులకడనుండి రు ౬౨—0—0 లు వసూలుచేసి మాకిచ్చి యున్నారు. దైవము వీరిని నిత్యము సంరక్షించుగాక.

ఈ ప్రబంధము నందలి బంధములను వాని నైజస్వరూపములతో ముద్రించుటకు తద్బంధములనెల్ల బ్లాకులు తీయించవలసి యుండును. బ్లాకులు తీయించుటకు ముందు చిత్రరూపములతో వ్రాయించవలసి యుండును. గనుక ప్రసిద్ధ చిత్రకారుండును, నిర్మలచిత్తుండును, సత్ప్రవర్తనుండును, మన్మిత్రుండునగు సాహినేని అశ్వత్థము కొమారుడు యస్. లక్ష్మయ్యగారిని మేము కోరగా సంతోషపూర్వకముగా నన్నిబంధములను చిత్రరూపములతో ఉచితముగా వ్రాసియిచ్చి యున్నారు. వారికి మేమెంతయు కృతజ్ఞులము. దైవము వీరికి శుభములిడుగాక.

మా తండ్రిగారి ప్రబంధమును తనచేతులారా రెండు ప్రతులను మాత్రము వ్రాసియుండిరి. అందొక ప్రతిని 1938 సంవత్సరమున మా తండ్రిగారినడిగియే యొక మహనీయుడు గైకొని కొంతకాలము గడచిన పిమ్మట మాతండ్రితోనే అయ్యా! తమ 'మహాసేనోదయము' కాన్పించుటలేదు. వెతకివెతకి నిరాశజెందితిమి. మాఅజాగ్రత్తవలన యెటులో పోయినదని సెలవిచ్చిరి.

అందులకు మాతండ్రి అయ్యా! గడచినదానికి మీరేమి చేయుదురు. సంతాపింపకుడు. నాదగ్గఱ మఱియొక వ్రాత ప్రతియున్నదని చెప్పి యున్నారు. మా తండ్రిగారు చెప్పిన రెండవప్రతినే మేము భద్రముగా యింతవరకు దాచియుంచితిమి. దైవమనుకూలించుటవలన నేటికా

గ్రంథము ముద్రణకువచ్చినది. అయినను ముద్రణకు మాత్రము మాతండ్రి గారు వ్రాశిన ప్రతినివ్వక దానినంతయు మేము చూచివ్రాసి ముద్రణకిచ్చి ముద్రింపఁజేసి యున్నాము. మావ్రాశిన వ్రాతయందు లోపములుండ వచ్చును. పునర్ముద్రణయందు సవరించుకొందుము. విద్వజ్జనంబులు మన్నిం తురుగాక. మాతండ్రి వ్రాశిన వ్రాతప్రతినిమాత్ర మిప్పటికిని భద్రపరచియే యున్నాము.

1936 సంవత్సరం జూన్ నెల 1 తేది మాతండ్రిగారి ఫోటో తీయించి దాచియుంటిమి. దానినిప్పుడు బ్లాకు తీయించి యీ గ్రంథమునందు ముద్రింపఁజేసి యున్నాము.

1924 సంవత్సరమునకు సరియగు శ్రీ రక్తాక్షినామ సంవత్సరము నందు మా తండ్రిగారు శ్రీ గద్వాల సంస్థానమునందున్నప్పుడు అందున్న మహామహోపాధ్యాయ బిరుదాంకితులగు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారిచేతను, గోపాలుపేట సంస్థానం ఆస్థాన విద్వాన్ రామచంద్రా చార్యకవి శతావధానిగారిచేతను, యోగ్యతాపత్రముల బడసియున్నారు. వానిని బ్లాకులు తీయించి యిందు ముద్రింపించి యున్నాము, వారిచ్చిన యోగ్యతాపత్రముల నింకను జాగ్రత్తగా నుంచియే యున్నాము.

మాతండ్రిగారు రచించిన గ్రంథముల నిందుఁ దెలియజేయు చున్నాము.

—• అచ్చు అయిన గ్రంథములు. •—

1. మహాసేనోదయము ప్రబంధము (8 ఆశ్వాసముల పద్య కావ్యము) 2. చాతుర్మాస్యదీక్షా ప్రబంధము (పద్యకావ్యము) 3. ఆంధ్రపంచీకరణ, పద్యకావ్యము (అను సాంఖ్యసూత్రము) 4. శ్రీముక్తిరామేశ్వర క్షేత్ర మాహాత్మ్యము (ద్విపదకావ్యము) 5. ధీనిధిశతకము తాత్పర్యసహితము (ఉత్పలమాలలు, చంపకమాలలు, ఇందు భాస్కరశతకమునందువలె ప్రతి పద్యమునందును పురాణోక్త కథలుగలవు. 6. మనఃప్రబోధశతకము. (కందశతకము.) 7. రామచంద్రప్రభుశతకము. (శార్దూల మత్తేభములు)

8. హనుమచ్ఛతికళ (శార్దూల మత్తేభములు) 9. శ్రీముక్తిరామేశ్వర రుక్మాంగదనాటకము, (వీధినాటకము) 10. రామదేశికులవారి చరిత్ర, (పద్యములు)

—• అచ్చుకాని గ్రంధములు •—

1. శ్రీమద్గద్వాల సంస్థానాధీశ్వర వంశవృత్తవర్ణనా ప్రబంధము, (పద్యకావ్యము యేకాశ్వాసము) 2. శ్రీమత్పాండురంగ క్షేత్ర మహాత్మ్యము, (పద్యకావ్యము రెండు ఆశ్వాసములు) 3. శ్రీమద్భవానీ సీసపద్యతారావళి, 4. మానసపూజ, (పద్యములు) 5. సమాసగీతావళి, (పద్యములు) 6. శ్రీరామధ్యానశ్లోక స్తబకము. (50 శ్లోకములు) 7. శ్రీ వెల్లాల ఆంజనేయశతకము, (యీశతకమంతయు లకారప్రాస ఉత్పలమాలలు) 8. దశావతారవర్ణనా పద్యములు, 9. మదాలస నాటకము డ్రామా, (ఇందు గద్వాలసంస్థానమునందలి కవీంద్రుల యోగ్యతాపత్రము లనేకముగలవు) 10. శ్రీ ముక్తిరామేశ్వర నల నాటకము, (8 రాత్రులకథ) 11. లక్ష్మణమూర్ఛ (బొమ్మలాట) 12. ప్రసంగరామాయణము లేక సుందరాకాండ (బొమ్మలాట) 13. శమంతకమణి (హరికథ) 14. అంబరీష (హరికథ) 15. శ్రీకృష్ణ రాయబారము (హరికథ) 16. మార్కండేయచరిత్ర (హరికథ) 17. శ్రీమదుత్తర రామాయణములోని షష్ఠ్యంతములకు సాకేతపుర వర్ణన మునకు పూర్వరామాయణ కథా సంగ్రహమునకు ఆశ్వాసాంత పద్యము లకు గ్రంథమునం దచ్చటచ్చటనున్న కఠిన పద్యములకు సంపూర్ణముగా టీకా తాత్పర్యములను వ్రాశియున్నారు. 18. బైచరాజు వేంకటనాధ కవికృత పంచతంత్రము నందలి కొన్ని కఠినపద్యములకు టీకా తాత్పర్య ములు వ్రాశియున్నారు. 19. కైవార గద్యకు టీకా తాత్పర్యము వ్రాశియున్నారు. 20. శ్రీరామ భజనకీర్తనలు, 21. శ్రీశివధ్యాన కీర్తనలు. 22. ముక్తిరామేశ్వర రామలింగేశ్వరాభివర్ణనా చూర్ణిక. 23. పసపుల మాధవాంకిత చంపకమాలా వృత్తము. 24. శ్రీముక్తి

రామేశ్వర మునిగురు మహోత్సవాభివర్ణనా సంకీర్తన. 25. అమ్మవారి దండకము, 26. శ్రీ వెల్లాల సంజీవరాయ దేవాంకిత స్రగ్ధరావృత్త పంచరత్నములు, 27. శ్రీకాళహస్తి నీలకంధరాంకిత వారణమాల. 28. సభావర్ణనా పద్యములు, 29. శ్రీ చంద్రమౌళీశ్వరాంకిత నవరత్నములు. 30. శ్రీ భావనాఋషి స్తోత్ర పద్యములు. 31. పంచాయత సోమసుంద రాంకిత పంచరత్నములు. 32. పోట్లదుర్తి శ్రీచెన్నకేశవాంకిత సుగంధి వృత్తములు. 33. శ్రీరాముధ్యాన కందార్థములు. 34. సమస్యలు వాని పూరణములు. 35. వెల్లాల అంజనేయస్తుత పంచరత్నములు. 36. రంగ శాయిపుర రామాంకిత పంచరత్నములు. 37. ప్రొద్దుటూరు వానవీస్తుత పంచరత్నములు. 38. రావూరు రామాంకిత రకారప్రాస పంచరత్న ములు. 39. కొన్ని జ్యోతిష శ్లోకముల కాంధ్రపద్యములు. 40. పెద్ద కానాల ఆంజనేయస్తుతి పద్యములు. 41. సూత్రగణిత పద్యములు. 42. మహార్నవమి పద్యములు. 43. శ్రీరామాంకితపు మేలుకొలుపులు 44. స్త్రీలపాటలు. 45. శ్రీనుత్పాండురంగ స్తోత్ర పద్యములు. 46. దమయంతీ వివాహము. (హరికథ) 47. శ్రీమద్దుంపుసోమిరెడ్డి. అభినవరామదాసుగారి చరిత్రము (పద్యకావ్యము) 48. శ్రీ విరాట్ పోతులూరు వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠాధిపత్య శ్రీ విలాసితులగు శ్రీ వెంకటేశమయ్యగారి వర్ణనాస్తోత్ర (పద్యములు) 49. 1916 సంవత్సర మునకు సరియగు శ్రీ రాక్షససం॥ర నవరాత్రములలో ప్రొద్దుటూరు శ్రీ అగస్త్యేశ్వరస్వామి దేవాలయమునొద్ద నుండెడు బృందావనమునందు జరిగిన కవిసన్మానమను నొక వేడుకకుగాను రచించిన (పద్యములు) 50. తెలుగు నందు గుజ్జుపునడకలు. (పద్యములు) 51. షడ్వింశతిచ్ఛందములు. (పద్యము)

ఇవిగాక యింకను, భారత భాగవత రామాయణ, రసికజనమనోభి రామ, విల్హణీయాదిక గ్రంథలముయందలి కొన్ని కఠినపద్యములకును, చాటుపద్యంబులలో కొన్ని కఠినపద్యంబులకును టీకా తాత్పర్యములను వ్రాసియున్నారు.

ఋుంకను అనేకవిషయములనుగురించి అచ్చుటచ్చుట వర్ణనాపూర్వ
'ముగా గద్యపద్యములను రచియించియున్నారు.

ఇట్లు విన్నవించు తమవిధేయులు,

శ్రీముక్తరామేశ్వరము గ్రామం,
ప్రొద్దుటూరు తాలూకా,
కడప జిల్లా, ఆంధ్రప్రదేశ్.
9—2—1959

కొడవలూరి పెద్దరామరాజు,
కొడవలూరి చిన్నరామరాజు.
గ్రంథకర్త పుత్రులు.



# కృతజ్ఞత.

మహాజనులారా!

శ్రీయుత మా తండ్రిగారు "కోడవలూరు రామచంద్రరాజకవి" గారి సాన్నిధ్యమునందు విద్యనభ్యసించుటకై తన పదునైదవయేడగు 1915 సంవత్సరమునుండి ప్రారంభించి నిరంతరము గురుసన్నిధి నెడబాయక నిర్మలభక్తిపరాయణుండై శుశ్రూషలొనర్చుచు గురునాజ్ఞాబద్ధుడై, నిర్ణీత కార్యాచరణ తత్పరుడై మెలంగుకతన లఘుకాలంబుననే గురువరున కత్యంత సంతోషప్రదుండైన ఫలితమున సద్విద్యాకౌశలుండై గురురచితంబగు నీమహాశివోదయంబను ప్రబంధముయొక్క ప్రాశస్త్యమును విజ్ఞులకడనుడువుచు గురువర్యునకానంద మొనగూర్చుచు మదగ్రజుండుగా చరించుచుండె.

ఇట్లుండగా దైవఘటన 5–1–45 తేది మాతండ్రిగారు స్వర్గపుర మలంకరించుటచే నత్యంత దుఃఖాక్రాంతుడై సంతత గురుధ్యాన సంకల్పుడగుటవలన మానిశ్చయించిన మత్పితృ సమాధి నిర్మాణ కార్యక్రమము నాచట్టినంబున సర్వప్రయత్నంబుల తానగ్రచరుడై సకలవిధ మంగళ వాద్యములు మ్రోయుచుండ పినగురుండగు మజ్జనకుని భౌతిక శరీరమును స్వహస్తంబులదాల్చి మాకుతోడ్పడి మాకన్నయై తనజన్మ సార్థకమైనదని తన్మయుండై ఆనందించుచు సమాధి నిర్మాణ స్థలంబువరకు మాతోకలిసివచ్చి సశేషులతో మాతండ్రి మృతదేహమును మేమామోద మొందునట్లు సమాధినిం జేసి, గురు ఋణమునుండి విముక్తినిగాంచిన పోట్లదుర్తి మజరా వేంకటాపుర వాస్తవ్యులు సుగుణాగ్రేసరుడగు శ్రీ కె. ఓబులేసుగారి కొమారుడు **ఓ బు లే సు (దేవాంగులు) గారికి** మా అభివాదనములు.

ఈ గ్రంథముద్రణ కార్యమునందాయన మా కెంతయో సహాయము చేసియున్నారు. దేవుడు సర్వదా వీరి కుటుంబమును

5–1–45 తేది స్వర్గీయులైన మాతండ్రిగారి కానాడు మేము జరిపించెడు వేడుకలయందు పాల్గొని అమ్మవారియందుగల దృఢ భక్తిచే సమాధి ప్రదేశంబువరకు మా జనకుని మృతశరీరమును కరంబుల దాల్చి మమ్మనుసరించివచ్చి సమాధి నిర్మాణమునందత్యంత శ్రద్ధవహించి నాటి దినంబుననే తత్సమాధిని సంపూర్తిని జేసి చిరకీర్తి నార్జించిన పోట్లపూర్తి మజరా వేంకటాపుర వాస్తవ్యులు శ్రీ బి. కొండయ్యగారి కొమారుడు **కొండయ్య (దేవాంగులు) గారికిని,** శ్రీ ముక్తి రామేశ్వర వాస్తవ్యులు శ్రీ వరికుంట నాగమునిరాజుగారి కొమారుడు **పెద్ద వెంకటసుబ్బరాజు (మా బావమరది) గారికిని,** శ్రీ పాతకోట బాలిరెడ్డిగారి కొమారుడు **రామిరెడ్డి (మా తండ్రి గారి ముఖ్య శిష్యుడు) గారికిని,** తాడిపత్రి తాలూకా రాయల చెరువు వాస్తవ్యులు శ్రీ వీరా సుబ్బరాజుగారి కొమారుడు **పెద్దశేషమరాజు (మా అన్నగారు) గారికిని,** మేమెంతయు కృతజ్ఞులము.

ఈ గ్రంథ ప్రచురణమునకు వీరందరు సంతోష పూర్వకముగా వీలైనంత సహాయము చేసియున్నారు. సర్వేశ్వరుడు వీరికుటుంబములను సదారక్షించుగాక.

ఇట్లు బుధజనవిధేయులు,

**కొడవలూరి పెద్దరామరాజు,**

**కొడవలూరి చిన్నరామరాజు,**

గ్రంథకర్త పుత్రులు.

శ్రీరస్తు.

# విషయసూచిక.

## — ప్రథమాశ్వాసము. —

| విషయము. | పుటసంఖ్య. |
|---|---|


## ద్వితీయాశ్వాసము.

## ——• తృతీయాశ్వాసము. •——

—• చతుర్థాశ్వాసము. •—

## పంచమాశ్వాసము.

— షష్ఠాశ్వాసము. —

విషయము. | పుటసంఖ్య.



## — సప్తమాశ్వాసము. —

విషయము. పుటసంఖ్య.



## —• అష్టమాశ్వాసము. •—

| విషయము. | పుటసంఖ్య. |
| --- | --- |




శ్రీ రస్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః



# మ హా సే నో ద య ము.

పద్యకావ్యము.

ప్రథమాశ్వాసము.

## ఇ ష్ట దే వ తా భి వం ద న ము.



### —♦ ఇష్టదేవ ప్రార్థనము. ♦—

వరవర్ణినీవిమల చిత్తపయోరుహ భాస్కరాయ రా
జీవభవాద్యశేషసుర సేవితపాదయుగాయ మందర
గ్రావధరాయ గూఢపద రాట్శయనాయ గజావనాయ దా
సావనకల్పకాయ భుజగారిహయాయ నమోనమోనమో॥ 1

### —♦ లక్ష్మీదేవి స్తుతి. ♦—

శుద్ధాంధ్రసీసము.

సీ॥ పచిలుకలకొల్కి యెచ్చుకయుళ్ళొప్పు మున్నీరుగన్నట్టి ముద్దుబిడ్డ
యేముద్దుగుమ్మను మోములదేవర తలయందుదాల్చిన యలరుచెల్లె
లేకల్కిక్రొవ్విన దాకాసిమూకల సలతిగానుగ్గాడు బలయురాణి
యేవెలందుకమిన్న పూవిల్తుసింగాణి చౌవంచములుకుల జాణతల్లి

తే॥ యట్టి మేలిమిగొనముల పుట్టినిల్లు
బత్తులవళంబు లేమిని బాపుగరిత
మగనియెదనెన్డు వెరసిన మగువలచ్చి
యనయమును గల్మి నిడియమ్మ యనుచుగాత॥ 2

### — ♦ బ్రహ్మస్తోత్రము. ♦ —

### అంత్యప్రాసము.

ఉ॥ ధాతను భక్తకామ్యఫల దాతను గల్మషజేతనున్ ముని
వ్రాతమనోనికేతను జరాచర భూతశరీరిసంఘ ని
ర్మాతను దుర్జనాశగిరి రాట్పురనేతను గీర్ముఖాబ్జ ప్ర
ద్యోతను వేఁడెదన్ గరుణతోడఁ జిరాయువొసంగి ప్రోవఁగాన్॥ 3

### — ♦ సరస్వతీస్తవము. ♦ —

శా॥ మందారామృత కాశదివ్యముని సింహాటీరసీహార రు
జ్మందాకిన్యురగేంద్ర శీతనగహంసశ్వేతపానీయ రు
ట్కుందవద్విష చందనాబ్ధికఫ నక్షత్రాబ్జచంద్రానఖి
త్కుందాభాంగి సరస్వతీ కృతిని జేకూర్పంగదే మ్రొక్కెదన్॥ 4

### — ♦ ఈశ్వరధ్యానము. ♦ —

సీ॥ ఏదేవుమూర్ధంబు హిమధామ సురలోక వాహినుల్ నిల్వ నివాసమయ్యె
నేమహామహు కంఠసీమ త్రైలోక్యభీకర విషంబునకు నికాయ్యమయ్యె
నేమహితాకారు వామాంగము చలాధి సేతతనూజకు నిలయమయ్యె
నేవేల్పు వక్షమాశీవిషస్వామికి దామాకృతిని నిల్వ ధామమయ్యె
తే॥ నట్టిపావనచారిత్రుఁ డజినవస్త్రుఁ
డర్థనాయకసన్మిత్రుఁ డహితజైత్రుఁ
డలికనేత్రుండు మత్కృతి నరయుగాత
నవ్యమృదుశబ్దరస గుంఫనములమర్చి॥

### — ♦ పార్వత్యభివందనము. ♦ —

ఉ॥ ఆశ్రితకోటిఁ బ్రోచునపుడంబిక గర్వితదైత్యమర్దనం
బశ్రమలీల జేయు సమయంబునఁ జండిక శైలభిన్నిలిం
పశ్రుతికిష్టధర్మములఁ బల్కెడివేళలనార్యనా జగ
ద్విశ్రుతనామధేయములవెల్గు నగాత్మజ మమ్ముఁ గావుతన్॥

— ♦ వినాయక ప్రస్తుతి. ♦ —

చ॥ హరివరయజ్ఞసూత్రము గజాస్యముదూర్వయు షణ్ముఖాంబికా
గిరిశతురంగరత్నములొగిం బరికించితినంగజూడ నే
నరయవినాయకుండ శరభాకృతికగ్రభవుండఁ బాశముం
గరమునఁగ్గలువాఁడనని గర్వమడంచుగణేశుగొల్చెదన్॥ 7

— ♦ ఆంజనేయ స్తుతి. ♦ —

ముక్తపదగ్రస్తము.

సీ॥ ఏమిత్రతేజు శ్రీరాముండుగనుఁగొని కనుఁగొనిరా సీతననుచుఁబనిచె
నేమేటిసంద్రంబు నెగిరివేయకలంక లంకఁబ్రవేశించె లావుమెఱసి
యేశౌర్యుఁడసురులనెల్ల రోసంబూని పూనికగుదెదాల్పు ప్రోలికనిచె
నేధన్యుఁడవనిజ శోధించితద్వార్త వార్తకెక్కు తదీయవరునివినిచె
తే॥ నట్టిసురగేయు నరిజేయునశనికాయు
సంతతాజాయు మృదులభాషణనికాయు
కలహరంగానహాయు వేగజితవాయు
నభినుతింతు మనోవీధి నాంజనేయు॥ 8

— ♦ గురుస్తుతి. ♦ —

క॥ అసదృశభక్తినుతించెద శ్వసనాశనరాడ్వచోవిసరు సద్విద్యా
బిసకుసుమోదరుమద్గురు బసవలచిన్నయసుధీంద్రు వరగుణసాంద్రున్॥ 9

— ♦ పూర్వసంస్కృత కవిస్తుతి. ♦ —

సీ॥ వరకవిత్వశ్లోకి వాల్మీకి సువివేకి భారతరచనా విభాసు వ్యాసుఁ
బ్రవిమలోత్కటలసద్భవభూతి భవభూతి ఘనవచస్సువిలాసుఁ గాళిదాసుఁ
బ్రబలతరారణ్య భారవి భారవి వితతార్థరస వాక్ప్రవీణు బాణు
నవ్యనవోధుత నయభావు జయదేవుఁ బరమకావ్యోత్కృష్టు భట్టిహర్షుఁ
తే॥ జండకాకవి ప్రత్యూషదండివండి శ్లాఘనీయోక్తిజాలకా మోఘుమాఘుఁ
జారుతరశబ్దకంధివిహారుఁ జోరుఁదలతుసంస్కృతకవుల సంతతముమదిని 10

తే॥ అట్టిశిష్టరాట్కులములో నలరెరూప కుసుమధన్వి భరద్వాజగోత్రపద్మ
కోకసుహృదసంధాయి కోడవలూరి బుచ్చిరాజు వచోజితభోగిరాజు॥ 16

సీ॥ విజ్ఞానమునకిమ్ము వినయంబునకు గీము దాక్షిణ్యమునకిక్క దయకు నెలవు
నిక్కంబునకు టెంకి నీతికి నిలయంబు ధైర్యంబునకు గని తాల్మికిరవు
సంతోషమునకిల్లు శౌర్యంబునకు పట్టు పరహితమతికునికిపట్టు ధర్మ
మునకుఁ దావాచారమున కాలవాలంబు ఘనగౌరవమునకు మనికిచోటు
తే॥ నీయశోఘనుఁడనిజనుల్ వేయుఁగతుల నభినుతింపఁగ జెలొందె నతులకీర్తి
నిరసనామరశైవలినీ పయోబ్ధి భూతపతిశీతగిరిరాజు బుచ్చిరాజు॥ 17

క॥ ఆవిమలుఁడు జాపాంబను దేవేరిగ నేలి తత్సతీగర్భమునన్
శ్రీవెలయు రామదాసును బావనుఁడగు కృష్ణరాజు బడసెం బ్రీతిన్॥ 18

చ॥ హరిపదభక్తిశీలుఁడు దయాకలితుండు సదాసుధీజనా
దరణుఁడు బాంధవప్రకరదైవతమై చికి జాతరూప భూ
ధరధృతిశాలి శాంతమతి తథ్యవచఃకలనాభిరాముఁడై
ధరణిని రామదాసు కుముదప్రియకాంతి వెలింగె ముఖ్యుఁడై॥ 19

చ॥ అతులితవాగ్విశారదుఁడు హార్యధరాంఘ్రిసరోజపూజనా
రతుఁడతినిర్మలాశయుఁడు రాజితపుష్పశిలీముఖోపమా
కృతియు సమస్తసద్గుణధురీణుఁడు నిస్తులభోగజిచ్ఛత
క్రతుఁడగు కృష్ణరాజు భువిరాజిలె భూరియశఃప్రకాశుఁడై॥ 20

ఉ॥ వారలలోనఁ బూర్వజుఁడు వార్ధిగభీరుఁడు రామదాసు గో
త్రారిబులోమజన్ బరిణయంబగు లాగున సర్వలక్షణా
కారఁ బతివ్రతామణి వికస్వరమానసపద్మఁ జిన్నమాం
బారమణిన్ బుధుల్ పొగడఁ బత్నిగ నేలెఁ గులాభివృద్ధికై॥ 21

ఆ॥ అట్టిమిథునమునకు నవతరించిరి పెద్దరామరాజుఁ జిన్నరామరాజు
రామచంద్రరాజు రమణతో సంజీవరాజుఁ దొలిటి దాశరథులఁ బోలి॥ 22

చ॥ సలలితసమ్యగుక్తులను సజ్జనమేళనమందు భ్రాతృవ
త్సలతను బాంధవప్రియత ధర్మమతిన్ బితృవాక్యపాలనన్

ఖలజననిగ్రహంబున నఖండతితీక్షను రాముఁబోలు నీ
కలుషవిదూరుఁడంచు నుతిగాంచెఁదగఁ బెదరామరాజిలన్॥ 23

క॥ లసమాన బ్రహ్మవిద్యాభ్యసనుఁడు విజితారివర్గుఁడమలమనీషుం
డసదృశయోగి మహాగుణవిసరుఁడు జినరామరాజు వెలసెన్ఘనుడై॥ 24

తే॥ అఖిల శాస్త్రార్థకోవిదుండంగజాత
రూపవిభవుఁడు ఘనయశోవ్యాపకుండు
భగవదంఘ్రిసరోరుహ భక్తిరతుఁడు
సరసుండై మించెభువి రామచంద్రరాజు॥ 25

మ॥ వరతత్వార్థ విశారదుండు విమల వ్యాపారుఁడంభోజను
ట్తరుణీ కుందశతారతారహరిమందారేందుసంకాశ కీ
ర్తిరమాగౌరవుఁడార్యసేవనుఁడు బుద్ధిస్వర్గరాణ్మంత్రి భా
స్వరదోషజ్ఞుఁ బొగడ్తవార్తగనియెన్ సంజీవరాజుర్వరన్॥ 26

తే॥ క్రమతఁజెన్నమ్మ బుచ్చ్యశృంగమ్మ యచ్చ
మాంబ యనెడి పురంధ్రుల నధికవిభవ
మలర దేవేరులుగఁ జెండ్లియయ్యెకముగను
సిరతిశయమోదమాత్మలఁ బరిఢవిల్ల॥ 27

ఆ॥ అందు బుచ్యశృంగమాంబ గర్భంబున జిన్నరామరాజు శ్రీలువెలుఁగ
సుతునిగాఁగబడసె సూరివిధేయుని నమలగుణసమాజు నప్పరాజు॥ 28

వ॥ అన్నలుగుకిలోఁ గనిష్ఠుండగు సంజీవరాజనామకశ్రేష్ఠుండు॥ 29

సీ॥ పసపలాన్వయ సరిత్పరిపూర్ణ సోముఁడౌ నరసరామయకనంతమ్మనామ
ధేయంబుదనరు సాధ్వీరత్నసద్గర్భ శుక్తిమౌక్తికమన సుప్రశిద్ధి
గాంచి జన్మించిన కాంతాశిరోమణి గులశీలదాక్షిణ్య గుణగణాఢ్య
శాంతిసంపత్తి విశ్వంభరాప్రతిభింబ యమలవాఙ్నికురుంబ యచ్చమాంబ

తే॥ యుభయవంశయశోబుధవిధు వశను
పసనిశ్చలాత్మక బంధుసురభి

గుతుక మొప్పవరించి తత్కృతియందు
నంచితోత్కంఠఁ దనయుఁగాఁగాంచెనన్ను॥ 30

తే॥ పంక్తిరథనందనాగ్రణి పాదకమల సేవనానందుఁడంజనీ దేవిసుతుని
కరుణచే రామచంద్రసత్కవిసమాఖ్య గలిగెఁగాకున్న నీపేరుగలదె నాకు 31

— ♦ గ్రంథరచనా వివేచనము. ♦ —

వ॥ ఇట్టి యేనెద్దియేని యొక్క సత్ప్రబంధంబు గద్య పద్యాత్మకంబుగా రచియింపంగోరి దృఢాలోచనము జేసి యెట్టకేలకు శ్రీస్కాంద పురాణాంతర్గత శంకరసంహితయందలి మహాసేనోదయకథను సందర్శించి యతికుతూహలినయి కృతిసేయ నిశ్చయించితి॥ 32

ఉ॥ నన్నయతిక్కనాది కవినాథులుఁ బంచమవేదమంచుఁ బే
రెన్నికఁగన్న భారతము నిప్పరచించి కృతార్థులైరి నా
పున్నెముచేత షణ్ముఖుని పుట్టుకగాథను గద్యపద్యముల్
పన్ని రచింపరైరి యొకపట్టున దానిని నేరచించెదన్॥ 33

మ॥ సుతదారాదికుటుంబ రక్షణకునై క్షోణీస్థలిన్ మానవ
స్తుతులం గావ్యములొప్పజెప్పి ధనరాసుల్గొంచు మోదించుచున్
వితతాహంకృతినొంది చచ్చి నరకావిద్ధాంగులై యున్కి హీ
నతయౌటన్ భగవత్సమర్పణముగా నొందంగా రచింపందగున్। 34

క॥ అనుకోర్కె నాహృదంతరమునబుట్టి మదీయకావ్యమునకున్ విభుగా
నొనగుపఁదగు వేల్పెవడోయని యోచనచేసిచేసి యరసితినొకనిన్॥ 35

వ॥ అమ్మహానుభావుఁడెవ్వఁడంటేని॥ 36

సీ॥ అపరాధమొనరించి హాకృపానిధె కావుమనినఁ గాకాసురుమనిపెనెవఁడు
బడుముల్ దెగినేలఁబడుజటాయునకగ్నిసంస్కృతుల్ శ్రుతియుక్తిసలిపెనెవడు
గాందిశీకుండైన ఖరకరసూతికై ఘనవాహనందను దునిమెనెవఁడు
బగతుతమ్ముండంచు భావింపకెంతయుఁ గడకవిభీషణుఁ గాచెనెవడు
తే॥ నట్టిదీనజనోద్ధారుఁడైన రామభద్రునకు మత్కృతివధూటి భక్తినిచ్చి
సరగఁ[illegible]పనిహపరసాధనముల నందఁదలఁచితిఁ గేనంగానంగమతిని॥ 37

—♦ షష్ఠ్యంతములు. ♦—

క॥ ఖరకరవంశనదీనా ఖరకరునకుఁ గృత్తలోక కలుగాశరశే
ఖరకరునకు ఖరమదభిత్ ఖరకరునకు ద్యుతినిరస్తక ఖరకరునకున్॥ 38

క॥ ద్యుద్వీపవతీశ్వ్రత్రోప్రద్వద్విస్ఫుట మార్గణాసదళనోచ్ఛ్రిత బా
హుబల్వనసారునకిలజా హృద్వాబ్జనిసూనునకుఁ గుణప్రస్తునకున్॥ 39

క॥ అంఘ్రిస్పృత్సంశ్రావిత సంఘత్తమునకును మౌనిసంస్తుటన జయా
రంభోల్బణదంభాశర కుంభీనసిసూనునకును గుణ్యహానునకున్॥ 40

క॥ ఉడ్డీనద్వినమద్భుజఙ్గశ్రేగ రాడాక్ష్యసహాస్త్రయుక్తరదప్రరసనస
ప్రూఢ్ఢీయమున్నీయద్దీమ పద్మాక్ష్రగుదుస్సపృద్భ్రోశ ప్రాద్ధునకున్॥ 41

క॥ అగ్రస్ప్రశస్తుంగతరంగభ్రాజిత సరిదఫీనగర్వాపనయా
దగ్రోపాయునకునుగనదభ్రకపత్రాయునకు మదికిరేజయునకున్॥ 42

క॥ ధరలోన ముక్తిరామేశ్వరమందమరులునుతింప సైకతలింగం
బురునిష్ఠనిలిపి వెలసిన స్థిరతరకుహనాధునకును శ్రీరామునకున్॥ 43

వ॥ అంకితంబుగా నాయొనర్పంబూనిన మహాసేనోదయంబను మహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన॥ 44

—♦ కథాప్రారంభము. ♦—

చ॥ వివిధకథావిశేష రసవిజ్ఞుని సూతుని శౌనకాదిమౌ
నివరులుఁ బ్రేమగగ్గొని వినిర్మలమానస కార్తికేయసం
భవము దదీయశౌర్యమహిమల్ విన వేడుకయయ్యెఁ దెల్పవే
చెవులకు నింపుగా ననివచింప మనార్భటి నాతఁడిట్లనెన్॥ 45

సీ॥ తాపసవరులార దక్షయాగంబున దాక్షాయనిదేవి దగ్ధయగుచు
మిహికాద్రివిభునకు మేనకాబింబోష్ఠి కనురాగ మెసఁగంగఁ దనయయగుచు
శుభలక్షణములెల్ల స్తోమమై యిమ్మూర్తిఁ దాల్పె గౌరియనఁగ నుత్పత్తిఁ బొంది
గౌరీసమాఖ్యచేఁ గూరిమిఁ దలిదండ్రు లొటఁ బెంచెడు దానిఁ బాటఁ బెంప॥

తే॥ నధిక లావణ్యరాశియై యలర గాఢ
మోహమున నీలకంఠుఁడు దాహమగుచు

నిప్పువచ్చినపోటుల నిడుదెప్పు
కేళిసల్పుచు హర్షాబ్ధిఁదేలుచుండె॥ 46

— మేరువునందు హరిబ్రహ్మేంద్రాది దేవతల సంభాషణము. —

ఉ॥ అంత ననంతవక్రికమలాసనముఖ్యసురాళులెల్లఁ గా
మాంతకువీడుకోల్పడసి యాలయముల్వడి శృంగచుంబితా
నంతము మేరుభూధరమునన్ వసియించిరనూనచింతన
భ్రాంతము శూరపద్మముఖ రాక్షసభీతిఁజలించిదీనులై॥ 47

ఆ॥ అందుదినమునందు సురగతల్పకుఁడుండు కాంచనావనీధ్ర గహ్వరమున
నలినపీఠుఁడాది నాకులురాకొనిరందు నముచిశత్రుఁడనియె హరికి॥ 48

క॥ మును గిరిధన్వి కుమారునిజనియింపఁగచేసి దైత్యసందోహంబున్
దునుమాడెదనని మనతోననఁడే నేఁడదిదలంపడణుమాత్రంబున్॥ 49

క॥ తుదకిప్పని యెటుగానున్నదియో పరికింప భూతనాథుఁడు గరుణా
స్పదుఁడైన లోకకృతదుర్మదషణ్ముఖగార్యములు రూపుమాపఁగబోనే॥ 50

చ॥ కటకట మందభాగ్యులకుఁ గల్గెడుమేలును గల్గఁబోదుహా
నిటలతటాక్షుపై మనసునిల్పి దృఢవ్రతుతాట రక్కసుల్
పటుబలవంతులై మనలబాధయొనర్చుచునుందురచ్యుతా
యెటులసహింపవచ్చుననన నెల్లరు నట్లనెపల్కిరార్తులై॥ 51

శా॥ ఆమాటల్ విని పద్మగర్భుడను నాహా జాలిచాలింపుడీ
కామరాతి జనిస్మయుండగుట శేఖక్రవ్యభుక్శ్రేణియం
దామోదక్రుధలానఁబోక సముఁడౌ నట్లైననేమందరున్
స్తోమంబై చని యమ్మహాత్మువినుతిన్ జొక్కించియామీఁదటన్॥ 52

ఆ॥ అశ్రుకణములతని యడుఁగుజంటకుఁ బాద్య
మిచ్చి యభయహస్త మిమ్మటంచు
దవిలివేఁడివేఁడి తత్కృపవడసిన
బ్రతుకఁగలము దొసఁగు బాఱవోలి॥ 53

ఉ॥ ఈరజనీచరావళుల హింసయొనర్ప నతండుదక్కఁగా
శూరుఁడువేఱొకండరుదుసూ యిపుడాఘనుఁడంబికాయుతుం
డై రహిమీర నంతిపురియందుఁగలండట కేఁగి శూలిహ్వా
ద్వారిజవర్తనంబెట్టిఁగి వచ్చెదునేర్పరి బుచ్చఁగాఁదగుꣳ॥ 54

క॥ మనచేఁ బంపుడువడిపోయిన దూతలిరానవచ్చి యెరిఁగించిన యో
చనజేసి కలతెఱంగును వినిపించుటమేలటన్న విష్ణుసురేంద్రుల్॥ 55

క॥ సమ్మతిపడఁగాఁ బజద్వోర నెమ్మది సంతసపుగడలినిꣳ మునిగియు వే
గమ్మునఁ దనసంగడికిని దెమ్మెరరావించి పొగడి తెలియవినుమనెꣳ॥ 56

—♦ బ్రహ్మాదులు వాయుదేవుని కైలాసమునకు బోవునట్లు బోధించుట. ♦—

సీ॥ లలితాత్మమనలోకములు బదార్థంబులక్కట శూరకరతలగతములయ్యెఁ
గాయావశేషులమై యున్నవారలమీనీచదశ మానుకెట్టులోక్కొ
యన్నిశాచరుఁబోరనడఁగించుబలశాలిమనయందుగలుఁగఁ డేమనగవచ్చు
సత్యంబుగాఁ బంచకృత్యపరుండగు చంద్రజూటున కుమాసాధ్వియందు

తే॥ జననమొందుకుమారుండు సదమదంబు
సేయు నన్యులచేవాఁ డజేయుఁడగుట
తెల్లమేకద నీకింక నెల్లసురల
యిడుములనుబాపఁ గార్యంబునడుపవలయు॥ 57

వ॥ అదియెద్దియన నంతిపురంబున వలిమలముద్దుకూఁతు రెద్దురౌతునుయొద్దిక
నున్నవారదెసకుగ్రద్దననేఁగి వారిసుద్దులెటింగిపెద్దయుంబ్రొద్దుతడయక
రావలయు నీవశేషప్రాణులకు బ్రాణంబవేణాంకధరునూర్త్యష్టకంబునఁ
బ్రథమ మూర్తివనుచుందురిట్టి నీకార్య కౌశలంబందరుఁగనుంగొంను
రమందగతింబొమ్మనిన గంధవహుండు డెందంబున భయంబొంది
సంక్రందనాది బృందారక సందోహంబువిన శతానందునకిట్లనియె॥ 58

శా॥ దేవా! మీరనుపꣳమరుండరిగి భూతేశుండు నిర్ణిద్రరౌ
ద్రావేశంబునజూడఁగా బ్రదికితారాజాలెనే యయ్యయో

యేవారైనను బ్రాణకాంతుగలవారేనాఁటికింబోదురే
యావిశ్వేశ్వరుఁజేర సత్యమిది సత్యంబేనుబోనోడుదుఁ॥ 59

ఉ॥ నావుడుఁదమ్మిచూలి వదనంబునదైన్యముతోపఁ గ్రమ్మఱ
దైవతకార్యభారము సదాగతితోనను నాఁడుమౌనియై
గ్రావనికేతసుండు సనకప్రముఖర్షులకాత్మతత్త్వముఁ
దా! విశదీకరించుతరి దర్పకుఁడేఁగెసతీపమేతుఁడై॥ 60

క॥ సరిగాని కాలమంచుం బరికింపక నీశుయోగభావముజెఱుపఁ
బరఁగించిసుమశరంబుల మరుఁడమ్మహనీయు కంటిమంటంగ్రాఁగెఁ॥ 61

క॥ అటుగావు నేఁడు నీవానిటలాక్షునిమూర్తివగుట నిన్నిసుమనః
పటలంబు శరణువేడెడి ఘటియింపుమహాత్మ దేవకార్యముగరుణఁ॥ 62

తే॥ అనుచుదుగినడుగొండాడ నవలవేల్పులందఱునుగూడి ప్రార్థించిరట్లకాగ
నెట్టకేలకుఁ జలినట్టు గట్టువిల్తు జెంతకేఁగెడుఁబనిఁబూని సంతసమున॥63

—♦ వాయుదేవుఁడు కైలాసమునకుఁబోవుట. ♦—

వ॥ ప్రాక్ప్రశ్చిమోత్తరదక్షిణాశాంతదాళ నిబిడిత నిజశరీరుండయు జవేతర యానంబున రజతకుధరంబునకేగి కపాలిపురంబుసొచ్చియందు॥ 64

తే॥ శాతకుంభ మణివ్రజద్యోతమానమరుణసాహప్రదీప్తంబు నగ్రచుంబి
తాభ్రపద్యంబునైనట్టి శుభ్రవర్ణభవనభాజంబుగాంచెఁ బ్రభంజనుండు॥65

తే॥ కాంచి కక్ష్యాధికారుతాగణపవరులు దన్నుగన్గొనకుండశుద్ధాంతమునకు
జేరఁగాఁదద్గృహద్వారసీమనున్న నందికేశ్వరుఁడనుశోణనయముఁడగుచు॥66

శా॥ పరా యోరిసమీర గర్వమతి నేనిందుండ లెక్కింపకే
చోరప్రక్రియ నిర్భయాత్మకుఁడవై శుద్ధాంతముంజేరఁగా
రారాదంచు మనంబునందలఁచకఁ రానేమికార్యంబురా
క్రూరా తెల్పుమటన్న జెగ్గిలి వడంకుందాల్చి గాడ్పిట్లనుఁ॥ 67

శా॥ అయ్యా నేనపరాధిగానుజుడి బ్రహ్మేంద్రాదితేయవ్రజం
బియ్యార్యాపతిజేరి మాయిడుమలెంతేఁదెల్పి శూరాసురుం

గయ్యంబందు వధించునట్లొడఁబడంగాఁజేసిరమ్మన్న చో
నియ్యానంబలు తెంచితన్యమెలుఁగఁ నిక్కంబుమమ్మాటికిఁ॥ 68

తే॥ అనుడుశైలాది చనుటకు ననువుదొరక
దుడుగుముడుగవయేని ముఁ వెడవిలుతుడు
బడినపాటుఁలువడియెదు తడయకుమన
జడిసి వెడలెను హేమాద్రికడకుగాఢ్వ॥ 69

ఉ॥ చండకరోదయంబునకుఁజక్రములట్లు నిలింపచక్రమా
తండరుదే యెదుర్కొని సదాగతి మాకుసదాగతీవకా
తాండవమోదివర్తనవిధంబెటులన్న శిలాదనందనుం
డండకుజేరనీఁడునను నంకలిజేసిదయావిహీనుఁడై॥ 70

క॥ ఒండాడఁగవెఱవడి యందుండక పఱతెంచితభవుఁ డుమయేక్రియతో
నుండిరొ యెరుంగనన నాఖండలధాత్రాదులపుడు కడుదుఃఖితులై। 71

చ॥ అగధరుఁగూడికొంచు హృదయంబుదపింపఁగ హాటకాద్రిశ్
ృఘగతినిబాసి వెండిమలఁగంతుహరాలయద్వార్థ్సలస్థితిం
దగిలి నిశాచరేంద్రకృతదండిదుతాట గిరీశదర్శనం
బుగలుఁగగోరి కొన్నిదినముల్ గ్రమియించిరి ముక్తతోషులై॥ 72

ఆ॥ అవలదైవవశత నవశంబుగానంది ప్రమథకోటిగొల్వ వచ్చుటయును
నఖిలసురలు వినుతినలరించిమందార పుష్పపూజచేసి భూరిభక్తి॥ 73

వ॥ వినమ్రులై సుప్రసన్నుంగాజేసి యంజలీబద్ధులగుచు నందికేశ్వరా! భవద్దివ్యపాదారవిందములకు సంఖ్యాతీతవందనంబులొనర్చెదముపెన్నిధిం గాంచిన పేదవిధంబున మిమ్ముంగనుంగొని ధన్యతములమయితిమి మహాత్మా! శూరాదిరక్షోవీరకృత దారుణకష్టంబులే మోరువంజాలము జగద్రక్షకుండగు విరూపాక్షునకు మాక్షోభంబెఱింగించి రక్షింపజేయుమని కరితుభుజులతిదైన్యంబునఁబలికిన నందిసంతోషించి లోపలికరిగి కంతుహంతుస్వాంతంబెఱింగి తావకీనసందర్శనాపేక్షులయి గీర్వాణులు

ద్వారంబుగాచియున్నారనివిన్నవింప ముక్కన్నుదొరమన్నించి క్రన్నన
రావింపుమనఁడమ్మహితుండునెమ్మితో దామోదరాద్యాదిత్యులఁదోడు
కొనిరా! రత్నమయసింహపీఠిఁగొలువున్న పార్వతీపరమేశ్వరులంగని
మహా నందపులకాంకురితతనులై యనిమిషులందఱుంబ్రణమిల్లి
ముకుళిత కరాంబుజులగుచు లలితంబుగానిట్లనిస్తుతించిరి॥ 74

విష్ణుబ్రహ్మేంద్రాదులు శూరపద్మభారంబుగుమాఱినిమ్మని యీశ్వరుని ప్రార్థించుట.

ముక్తపదగ్రస్తము.

సీ॥ గౌరిమనఃపద్మ ఖద్యోతనీకాశ కాశనాభరణవికాసకాయ
కాయజదుర్మద గ్రావోగ్రశతధార ధారాధరద్వారసారవాల
వాలఖిల్యాది తాపసరాడ్వినుతపాద పాదమాల్యాబ్జసప్తార్చినేత్ర
నేత్రీకృతద్విపనిశిచరవరకృత్తి కృత్తసద్భక్తదుష్కృతసమస్త

తే॥ మస్తకస్థలవల్గదమర్త్యలహరి హరిణశాబకవిలసిత హస్తసార
సారసాశనఘనసార తారహీర హీరసమవర్ణ బహునమస్కృతులునీకు॥ 75

చక్రబంధము.

శా॥ దక్షారాజితరాజశేఖర మరుత్సంగప్రియద్రవ్యదా
రక్షోమర్దనమన్యుసంహరణభర్గా దేవలోకస్తుతా
ఋక్షేచంద్రనిలింపధుగ్వరయశశ్శ్రీవత్సధీవిన్మదా
దాక్షిణ్యోదధి గౌరదేహ ఋషిబృందారాధితాహ్యాంగదా॥ 76

వ॥ దేవా! నీవుప్రణవస్వరూపుండవు ప్రణతార్తిహరుండవు దారుణవిషాద
నుండవు శుభకారణుఁడవు జంద్రసూర్యాగ్నిలోచనుండవు గాలాంత
కుఁడవు సుఖప్రదుండవఖిలజ్ఞుండవు శంకరుండవు నగునీకు వందనంబులు
బునఃపునర్వందనంబులొనర్చెదమవధరించుము శూరపద్మ సింహవక్త్ర
తారకులనియెడి పలలాశమలొందించుబాధలనివారితంబులై మేరమీరు
చున్నవి కారుణ్యంబునఁగుమారుంగలిగించి మమ్ముఁబోషింపుమని గాద్గ
ద్యంబడరఁబ్రార్థించుసుధాంధులంగరుణించి నీలకంధరుండా సమ
యంబున॥ 77

సీ॥ వదనషట్కంబుతో వ్యక్తమౌగాత్రంబుదాల్చి సవ్యంబున నిల్చియున్న
మలకూతు షణ్ముఖములఁజూడఁదత్క్షణ తల్లలాటాక్ష త్రిద్వయమునుండి
శతలక్షవిలయాగ్నిసంకాశమును గోటిహంసప్రభంబైనయట్టి శుక్ల
మూర్ధ్వరేతుండౌటనురువడివెలువడి దశదిక్కులనుబర్వ దానవారు
తే॥ లధికవిస్మయమైన నయ్యక్షహానను తేజమునకోర్వఁగాలేక దిశలయందు
బెదరిపరుగిడి దరిఁగానకదరిమరల మృడునిశరణంబువేఁడుచునుడివిరిట్లు78
తే॥ అఖిలసాధనకరుఁడవు నఖిలవేది వఖిలకారుణ్యపరుఁడవు నఖిలకర్త
వఖిలసుగుణగరిష్ఠుండవయిననీదు శుక్లమనివార్యమైతేజి చూడరాదు॥ 79
క॥ తదుపద్రవభీతాత్ముల ముదధీషుధి నీవెకాని యొరులెవ్వరును
త్ర్పదులుదలపోయమాకిఁక సదయతమమురక్షసేయు సర్వాతీతా॥ 80
మ॥ అనిప్రార్థించివినమ్రయౌ సురసమూహంబుఁ భవానీవరుం
డనుకంపామతిఁజూచి వేగనిజవీర్యంబుఁదలంపంగ నం
తనెశాంతించి యణుక్రియఁ దనదుచెంతఁషడ్విధిఁనిల్వ శు
క్రనభస్వంతులఁబంచె దానినిడ గంగాకాశదేశస్థలిఁ॥ 81

—♦ కుమారస్వామి జననప్రకారము. ♦—

చ॥ అనవుడు శౌనకాదిమునులమ్మహనీయచరిత్రు సూతునిం
గనుఁగొని భూరితేజుఁడగుగాలమదాపహునూర్ధ్వరేతమా
యనువున ఫాలనేత్రములయందునవెల్వడి యెట్లు స్కందతం
గనియె షడాస్యుసచ్చరిత గాథముదంబునఁదెల్పవేయనఁ॥ 82
క॥ వినిసూతుఁడనియె దీనినిఘనభక్తినివినిన నైహికాముష్మికముల్
తనరారుఁగానవ్యాసుఁడుమును నాకెఱిఁగించువిధముముదమునవినుడీ83
క॥ ఇచ్చెలువున శివుఁడనుమతిఁయిచ్చుటయు మరుత్కృశానులేతద్భారం
బచ్చోటికి మోయఁజాలమి చెచ్చెర జోహారులిడి వచించిరికడఁకఁ॥ 84
మ॥ రజతాహార్యవిహార మీప్రబలవీర్యంబేడ మేమేడ దీ
ని జగన్మోదతకై భరింపవశమౌనే మాకటన్నఁ వృష

ధ్వజుఁడవ్వాయుహుతాశులఁ నగవుతోదర్శించి నాపంపుచే
నజితంబై నబలంబుగల్గెడుఁ జనుండాదిత్యహర్షంబుగన్॥ 85

ఆ॥ అనుచునంధకారి యంతర్హితుండైన
నవలనాలుతెలుఁగులై యవార్య
మై వెలుంగుచున్న యవ్వీర్యమనలుండు
దనశిరంబునందుఁ దాల్చికొనుచు॥ 86

క॥ కడుదవ్వరిగియు మిక్కిలిబడలికతో జవముదూల బరికించి సమీ
రుఁడుదానినిజశిరంబుననిడి మోయుచుమార్చిమార్చి యిరువురుజవతన్ 87

క॥ పోవుచు శాంతమనుజ్జ్వలమౌ వీర్యము మోచికొనుచు నలయుచుఁద్రిజగ
త్పావని నిమగ్నజనవారావృత భవపూతఘనత రంగన్ గంగన్॥ 88

క॥ ఆస్థం జేరియుఁ దత్తీరస్థలిశరవనిని దామరసషండమునన్
సుస్థితిన తేజంబిడి స్వస్థానముబొందిరనిలవైశ్వానరులున్॥ 89

క॥ అత్తరి దుస్సహతరమగు తత్తేజమువలన దేవతటినీవీచుల్
విత్తవిహీనుని గోర్కులమొత్తముక్రియ నింకబాఱె మోదముదరుగన్॥90

సీ॥ అంతటఁ గోటిసహస్రాంశుభా భాసితంబౌ మదావళదైత్యభేది
వీర్యంబుషడ్వక్త్రవిలసితంబు ద్విషట్కబాహుశోభితమును శాదయుగళ
సంగతంబు త్రిలోకమంగళప్రదమును మంజుకోమలమౌ కుమారరూపుఁ
దాలిచి ముంగల దర్శనంబిచ్చినఁ గృతకృత్యులై సురప్రతతులెల్ల

తే॥ సంతసమునొందిరప్సరఃకాంతలాడి రఖిలదిక్కులుదెలివొందె నిఖిలదేవ
వాద్యములుమించెఁబువ్వులవానగురిసెవిష్టపానందకరమయ్యె విస్తరించి॥91

వ॥ మఱియు నుగ్రాసురాపహృతస్వకీయసంపత్తి నెప్పటియట్లనుభవింపఁ
గలము చరితార్థులమైతిమని బృందారకబృందంబులానందించి రింద్రాది
త్రిగమణులాశాష్టకంబు సేవించినిలిచిరట్టియెడ గట్టుతాల్పు షట్కృత్తి
కలరాఁజేసి వినుజుట్టుతేజంబునంబుట్టు యిప్పటికి నారతంబుమీరార్వురు
వక్షోరుహాక్షీరంబు గారుణ్యంబుననొసంగినఁ గుమారప్రసూత్యసంసిద్ధి

మీకగుసన నాకృత్తికలు జిత్తజగురూక్తి రిత్తసేయకత్తెలంగునకియ్యకొని క్రన్ననఁజన్ను బాలివ్వరా నచ్చిన్నపాపడు వారిపయిననుగ్రహించి యాఱురూపంబులఁగానుపింప వారుత్ఫల్లరాజీవళయ్యాంతరస్థితసుతుల నాఱ్వురంజూచి వేఱ్వేరఁదమతమయూరువులందుంచికొని చుంచు దువ్వుచు ముద్దిడుకొనుచు స్తన్యంబిచ్చిపోషించుచుండ నక్కార్తికేయ యషట్కంబు శైశవక్రీడలతివేలంబుగాఁజేయుచుండె వెండియు॥ 92

—♦ కుమారస్వామి శైశవక్రీడలు. ♦—

సీ॥ ఒకఁడునిద్దురజెందు నొకఁడుసారెకునవ్వు నొకఁడువాపోవు వేరొకడుదోసి
లొగ్గుఁ బదాంగుష్ఠమొకఁడు గేలునబట్టి వాయిలోనిడుకొని వదల కేడ్చు
నొకఁడునిద్రించుచు పకపకనవ్వును గరపాదములచేనొకండునడుచు
నొకఁడునిద్రారతినుడుగకయఱచును నొక్కఁడు దల్లిచేయూఁతగొనుచు
తే॥ నడుచు వేఱొక్కరుఁడుదప్పటడుగులిడును
యక్కుచేదోఁగియాడు వేఱొక్కరుండు
బరముఁడీరీతి శైశవభంగి షడ్వి
ధములఁగ్రీడింపఁ దల్లులుధన్యలైరి॥ 93

ఉ॥ సర్వసుపర్వులయ్యరిదిచర్యలఁచూచి కుమారునొక్కనిం
బర్వినప్రేమనిమ్మనుచు బ్రార్థనసేయఁగ నిచ్చెనాఱ్వురన్
శర్వుఁడుదీనబాంధవుఁడు సత్యముసుమ్మిఁక దైత్యకోటి వీ
రుర్వరగూల్తురంచు మదినుబ్బిరివేడ్క దరస్మితాస్యులై॥ 94

చ॥ మును శివుఫాలనేత్రములబుట్టిన దుస్సహతేజమోర్వలే
కనిమిషకోటిపర్వులిడ నద్రిజయున్ బ్రియునంకపీఠజ
య్యనడిగి ప్రస్ఖలచ్చరణహంసకరత్నములుర్విరాలఁగా
జనె నవరోధసీమకతిసాధ్వససంచలితాంతరంగయై॥ 95

క॥ త్రిణయనుకృప న త్తేజంబణువగుట వియచ్చరులుభయముమానుట వా
రణరిపువాహని విని తనతనుజాతునిఁగాఁగుమారుఁ దప్పించుటకున్॥ 96

క॥ ఘనరోషమూని నాకులననపత్యులుగాశపించి హైమవతి మఱిం
జనుదెంచి మందహాసాననయై నివసించె గోధినయనాంకమునన్॥ 97

—♦ నవరత్నపుత్రికలు గర్భంబుదాల్చుట. ♦—

వ॥ అంతకుమున్న భయభ్రాంతయై యుమాకాంతపరువిడుతఱిఁ దచ్చరణ మంజీరఘటిత నవమణులభవుసింహాసనోపకంఠంబున డుల్లుటఁజేసి తన్మ ణులఁబ్రతిబింబించిన యంబికారూపనవకముంగాంచి శితికంఠుఁడారత్న ప్రతిఫలితలగుసతులంబిలువ నాప్రతిమలమ్మహాదేవుననుజ్ఞచేఁ దత్తత్కాంతి తత్తన్నామములుధరించి యాయారత్నంబులవెలువడి కుఱంగటమెలంగి గంగాధరువక్త్రింబభంగానురక్తింగనుంగొనుచుండ॥ 98

క॥ కరుణాకటాక్షవీక్షల ధరగృహుఁడారత్నజనిత తరుణులఁజూడన్
బరగఁదదీక్షణభాస్కరకరములఁ జిత్రముగఁగనిరిగర్భమువారల్॥ 99

క॥ అత్తఱి సతి వారలుదనచిత్తేశునిగనెడిభావసిద్ధినిగని మీ
రిత్తెఱఁగున జిరకాలం బుత్తలపడగర్భభారమొందుఁడటంచున్॥ 100

ఆ॥ కరుణవిడిశపింప గాఢభయంబున వడఁకు రత్నసతులయొడళులందు
గలుఁగుఘర్మవారివలన దత్తత్కాంతియుతులు ఖడ్గవరసహితులునైన॥101

తే॥ పారిషదులొక్కలక్ష యుత్పత్తినొంది మ్రోలనిల్చిన వారల శూలపాణి
గాంచిహర్షించిసతతంబు గార్తికేయుసేవజేయుచువర్తింపగావిధించె॥102

చ॥ పదపడిరత్నపుత్రికల భర్గుఁడుగాంచి నవీనపల్లవా
స్పదపదలార మీరలతిభక్తి నహార్యసుతాంఘ్రిపూజనన్
వదలకచేయఁ దత్కరుణవల్ల శమించునుగర్భభారముల్
కొదుకకుడంచుఁబల్క విని కొల్చిరితద్విధివారుపార్వతిన్॥ 103

తే॥ రత్నపుత్రికనవక గర్భస్థులైన తనయులద్వయు నవ్యయు ననఘు నలఘు
నాదిమధ్యాంతవిరహితు నప్రమేయు నభవుజింతించిచిసుస్థితినందిరంత॥104

క॥ మఱిఁగొంతకాలమునకా తెఱవలు దనుఁగొల్చుచున్న తెఱఁగునుమదిలో
నెఱ్ఱిఁగికృపఁబూనుసతిగనిచిఱునవ్వొలయంగనిందుశేఖరుఁడనియెన్॥105

మ॥ అబలా వీరలునిన్ననారతము గాఢాసక్తిసేవించుటన్
ప్రబలంబై తగు గర్భభారములఁబాపం గర్తవివేకదా
విబుధుల్ మెచ్చఁగఁ బ్రేమజూడుమనుడున్ విశ్వాసముందోప ని
య్యబలల్ సౌఖ్యప్రసూతిఁగాంతురని యార్యాదేవిపల్కెన్దయన్॥ 106

—♦ రత్నపుత్రికలకు వీరబాహ్వాదులు జనించుట. ♦—

వ॥ తత్క్షణంబ॥ 107

ఆ॥ మహితపద్మరాగమణిజాతయగు రత్నవల్లియుదరమందు వైరినిచయ
గంధసింధురౌఘకంఠీరవంబగు వీరబాహుఁడుద్భవించెనంత॥ 108

క॥ అనుపమ ముక్తామణియందునబుట్టిన తరళవల్లితుందమునందున్
జనియించె వీరకేసరి వినుతభుజాటోప సమరవీరాగ్రణియై॥ 109

ఆ॥ సారపుష్యరాగసంజాతయగు పౌషవల్లికడుపునందు తుల్లకాహి
వికిరవల్లభుండువీరమాహేంద్రుండు జననమందెనజితశౌర్యుఁడగుచు॥ 110

క॥ గోమేధికసంభవయగు గోమేధికలతిక విమలకుక్షిని నసదృక్
ధీమహితుఁడుదయమొందె నుమామహిళాకృపనువీరమహేశ్వరుఁడున్ 111

క॥ వైదూర్యరత్నభవయగు వైదూర్యలతాపిచండ వార్నిధియందున్
మేదిని వీరపురందరుఁడాదిత్యసహస్రతేజుఁడై యుదయించెన్॥ 112

తే॥ వజ్రమణిభవమైనట్టి వజ్రలతిక
గర్భమందున వీరరాక్షసుఁడుగలిగె
బహువిధాయోధనాక్షీణ బాహుశౌర్య
మండితారాతిమండల మథనుఁడగుచు॥ 113

క॥ మరకతరత్నోద్భవయగు మరకతవల్లికిని వీరమార్తాండుఁడు రు
జ్నిరసితమార్తాండుఁడు నిర్జరులకునానందమెసఁగ జననమునొందెన్॥ 114

క॥ భువిలోఁ బ్రవాళమణిసంభవమైనప్రవాళవల్లి భాసురగర్భో
ద్భవుఁడగుచువార్తకెక్కను భవుదయవీరాంతకుండుబలశౌర్యములన్ 115

తే॥ శైలరిపునీలపుత్రిక నీలవల్లి గర్భమున వీరవీరుండుగలిగెనిట్లు
నవమణీసుతలకుఁబుత్రనవకముద్భవించి శంభునకునమస్కరించియనిరి 116

ఖడ్గబంధము.

ప్ర. ఆ. నెం. 119.




చిత్రకారుడు: యస్. లక్ష్మణ.

—♦ రత్నపుత్రికాపుత్రులగు వీరనవకము శివుని బ్రార్థించుట. ♦—

క॥ అబ్జారి లసదుపాసంగ బ్రాహ్మీనాథమౌనిగణచిత్తనికా
య్యబ్రహ్మపురుష సకలకకుబ్రిమణస్తుత్యపాద కుజనవిభేదా॥ 117

శా॥ అభ్రద్వారతరంగిణీధర హిమాహార్యాత్మజేశ గ్రహే
ట్శుభ్రాంశుజ్వలనేక్షణ త్రిపురరక్షోబృందగర్వాపహా
దభ్రశ్లోక మునీంద్రవందిత ధనేంద్రస్నేహ తారోర్విభృ
ద్విభ్రాజద్గృహ భక్తకామితఫలావత్యద్రు మృత్యుంజయా॥ 118

—♦ ఖడ్గబంధము. ♦—

క॥ పురహరసురనుతపాదా
కరిదైతేయాసుహర్త కంధినిషంగా
గిరిజాతహృదయరంజన
సరసీరుహనాభమిత్ర సన్మునిసంగా॥ 119

మ॥ అనిప్రార్థించుచుఁ దల్లిదండ్రులగు నార్యాళంభుసామీప్య మం
దునఁ బార్శ్వద్వయినిల్చి భక్తిపరతంత్రుల్ రత్నపుత్రీసుతుల్
వినయోత్పన్నతనున్న వారలదయన్వీక్షించి భర్గుండనున్
ఘనగంభీరవచోనిగుంభనలు మేఘధ్వానమున్ దెల్పఁగన్॥ 120

చ॥ తెలియువినుండు మీకుమును తేజితశక్తిధరుండు శుక్రశి
ష్యులఁగడతేర్చువాఁడు ఘనశూరుఁడు సర్వనియామకుండు దు
ష్కలుషవిభేదుఁడవ్యయుఁడఖండబలుండు గుహుండు భర్తగాఁ
గలఁడనిచెప్పి పుత్రుఁగనుకాంతు మృడానికిఁదెల్పిపొల్పుగన్॥ 121

సీ॥ ప్రావృడంభోధరభ్రష్ట బాడబసము ద్భవనినాదమును నిందనముసేయఁ
బ్రాంగాదికాష్టదిగ్దన్తిగళబ్దగహ వివరాంతరములందుఁ జెవుడుదొరయ
గురుతరోన్నత సప్తకులశైలగంభీర బిలములు బదులుగాబెట్టుమ్రోయఁ
గల్పాంతకాల భీకరభంగకల్లోల జలధిఘోషంబుతోఁ జెలిమి సేయఁ

తే॥ దారకస్తోమమిలరాల ధాత్రిప్రీల

భూతజాలముపాపోవ భోగివిభుని
తలలునుడుగకచలియింప దర్వికారి
మించిప్రస్థానభేరి వేయించెనపుడు॥ 122

—♦ పార్వతీపరమేశ్వరులు కుమారుంజూడ గంగానదికి వచ్చుట. ♦—

తే॥ శంఖకాహాళపటహ నిస్సాణములును
దురగహేషారవంబులు గరులబృంహి
తములు సద్భటహుంకృతిధ్వనులుగలిసి
శబ్దమయమయ్యెఁ బంకేజజాండమెల్ల॥ 123

క॥ నడయాడుగొండలనఁగా
గడుమెఱసెడినేనుఁగులును గంధవహునిగే
రడమాడు హరులు దేరుల
దడములు నరివీరులగుబదాతిప్రముఖుల్॥ 124

ఉ॥ తోడనరాఁ గృపాణఘన తోమరముద్గరభిండివాల ప్ర
క్ష్వేడన చాపకుంతసదజిహ్మగముల్ ధరియించి పార్షదుల్
వాఁడిమగల్ పరాకు సురవందితపాద మహాప్రభో దయన్
వీడకుమంచు శంకరుని వెంబడినేఁగిరనేకులొక్కటన్॥ 125

చ॥ శయనయనాంఘ్రిభ్రూయుగళ సంచలనంబు భయానకోగ్ర వి
స్మయ కరుణాహాసోజ్జ్వల రసంబులయందు నటింప రాగసం
చయలయయుక్తిచే భరతశాస్త్రగతిన్ నటనంబు సేయుచున్
రయమున రుద్రకన్యలు బురశ్చరతన్ జనిరాదృతాత్మలై॥ 126

తే॥ భూరిబలులు బదాతులౌ భూతవితతు
లిరుగెలంకుల నడువంగ నినశశాంకు
లుభయ పార్శ్వంబులందుండి యొనర ధవళ
ఛత్రములుబట్టి వెంటరాఁజంద్రమౌళి॥ 127

వ॥ ఉమాసమేతుండయి వృషభారోహణంబుసేసి ప్రబలోత్సాహమునన్
జనిచని॥ 128

—♦ అంత్యప్రాసము. ♦—

క॥ అసమానకృపాపాంగన్ రసితబకక్రౌంచహంస రాజత్భృంగన్
లసదమలమంగళాంగన్ రసధిమనోవికసనాంతరంగన్ గంగన్॥ 129

క॥ కాంచి తదీయతటంబున కంచితముగఁజేరునెడ మహాసేనుని ని
శ్చంచలతఁగొలిచియున్న విరించనముఖులెదురుకొనిరిద్బృఢతరభక్తిన్ 130

ఆ॥ కనులుమూఁడు నాకుఁగలవిశేషము నేఁడుఫలముజెందెననుచుఁగలిసివారి
జలదవీధినిలిచిపలికె గౌరీవక్త్రపద్మమున దృగాళిపంక్తిఁజేర్చి॥ 131

మ॥ చెలియా సారసషండమధ్యమున నాసీనుండునై కాంతినిన్
జలజారాతిద్భృణీకరించుచు జగత్సంతాపసంహార్యుఁడై
చెలువుంగాంచు భవత్కుమారుగనుమీసిద్ధంబు నీబాలుచేఁ
గలుఁగున్నీకిఁక వీరమాతయనుప్రఖ్యాతిప్రశిద్ధంబుగన్॥ 132

వ॥ అనిరుద్రుండానతిచ్చిన॥ 133

—♦ పార్వతీపరమేశ్వరులు కుమారుని లాలించుట. ♦—

సీ॥ హిమశైలనందన వృషభరాజముడిగ్గి వనరుహవనమధ్యమునకునేఁగి
తత్సుతషట్కంబు దత్క్షణకౌఁగిట నెనరుప్పతిల్లఁగాఁజనులనడుమ
నదుముకొన్నంతలోనాఱ్వురొక్కండయి రెండుపాదములుబంద్రెండుచేతు
లష్టాదశాక్షులు నాఱుమొగంబులుగలిగి చెల్వొందుటగాంచి తనదు

తే॥ తొడలనిడుకొని శిరములుదువ్వి ముద్దు
లాడువేళల వక్షోరుహములనుండి
బయలికుప్పొంగుపాలను బసిడిగిన్నె
లందునిండించి క్రోలుమీయని యొసంగె॥ 134

వ॥ అంతనాలీలాబాలకుండుఃఫుల్లసారససమానంబులగు షడాననంబుల జన
యిత్రినీక్షించుచుఁ దదీయాంకమునఁగూరుచుండి నిరతిశయహర్షభరిత
హృదంతరుండై పవిత్రంబును సారస్వతంబును జ్ఞానమయంబునునగు
నాదుగ్ధంబాఱుమొగంబులఁద్రావుసమయంబున॥ 135

సీ॥ ఆదుగ్ధబిందువులన్నదీజలముల గళితమౌట దదీయకణములాని
మునుపరాశరుశాపమునవిసారంబులై చరియించుమునిసుతుల్ శాపముక్తి
గాంచిరవ్వేల మేనకాసుత సేనానియుతముగాఁ గ్రమ్మరనుతుమెక్కి
ప్రమథోత్కరముగొల్వఁ బటహభేరీకాంస్యపణవాదివాద్యముల్ బలసిమ్రోయ
తే॥ సురలుసుమవర్ష మెడనెడఁగురియ మౌని
మండలముదండములుద్రిప్పి తాండవింప
నధికవిభవంబుతోఁ బ్రియునండవిడక
ప్రమదమున వెండిమలకేఁగుసమయమునను॥ 136

తే॥ గరళకంఠుఁడు షట్కృత్తికలనుబిలిచి
వీఁడు మీచనుబాలచేవృద్ధినొందె
గాన ముల్లోకములలోన ఖ్యాతిగాంచుఁ
గార్తికేయాభిధానంబుగలిగి లలిని॥ 137

క॥ ఇప్పుడమిసెవ్వరేనియుఁ దప్పక యీకృత్తికావ్రతంబొనరింపన్
మెప్పువడి కార్తికేయున కప్పతిగాంభీర్యసుతులనందుదురెలమిన్॥ 138

క॥ శ్రీకరగుహాసంభవమగు నీకథభక్తిఁ బఠించువేరికిమదిలో
నేకోరికగోరిన నదిజేకురునవిరమొసంగె శితిగళుఁడపుడున్॥ 139

ఆ॥ ఇటులవరమొసంగికృత్తికలమబంచి తనయుగౌఁగలించుకొని యుమాస
మేతుఁడగుచు దేవజాతంబుసేవింప వెండికొండజేరె విన్నుజుట్టు॥ 140

క॥ తదనంతరమబ్బాలుఁడు సదమలులగు తల్లిదండ్రిసమ్ముఖంబందున్
హృదయంబుల కానందంబొదవంగా బాల్యచేష్టలుడుగక చేయున్॥ 141

వ॥ మఱియు నక్కుమారుండు పాదారవింద సుందరరత్న నూపురశింజితంబులు మణికింకిణీవిసరసమంచిత కార్తస్వర కాంచీగుణక్వణనంబులు వక్షస్థల ప్రాలంబనిరుపమస్థూలమౌక్తికాదామనిచయరణితంబు నఖిల జగజ్జన శ్రోత్రరసాయనంబులయితనర కర్ణయుగ్మలసమానహాటకమణి కుండల దీధితిస్తోమంబులు గండమండలంబులన్నృత్తంబుసేయ శిరస్థల

ఘటితమణిప్రకరపరిష్కృతమకుటపట్కంబు గాంచనావనీధరశృంగంబుల
సొంపుసంపాదింప నవాఙ్మానసగోచరంబగుపరబ్రహ్మంబు నిరతిశయశై శ
వంబున నీశుసన్నిధినీరీతిఁగ్రీడసల్పుచుండెనంత॥ 142

— కుమారుండద్భుతచర్యలొనరించుట. —

క॥ జననీజనకులకతిభక్తిని మ్రొక్కి తదాజ్ఞవడసి త్రిజగంబులుమే
లనఁగ గణాఢ్యులతోఁ జనియెనచటనచట విహృతిసల్పమనీషన్॥ 143

తే॥ విక్రమోత్సాహదీప్తుఁడై వృషభరాజ
కంఠ కండూతివాయంగ ఖరనఖాళి
గీఱుచును మూఁపుపై నెక్కి క్రీడసలుపు
బాల్యలీలావినోదంబుబరిఢవిల్ల॥ 144

— తరలవృత్తము. —

వికృతరూపగణేశులన్ భుజవీర్యధుర్యతచే భట
ప్రకరయుక్తముడాసి వారలఁబట్టిమిన్నక గండముల్
స్వకరద్వాదశకంబుచేతను సారెకున్బయికెత్తుచున్
బకపకానగివెక్కిరించుచు బాలుదవ్వులకెంతయున్॥ 145

చ॥ సహచరకోటి వెంటబడిచయ్యనరాగఁదొలంగివారలన్
గృహవరమొండుజేరి యొకగీమున మాటలనాడుచున్ మహా
మహిమనదృశ్యుఁడై త్రిదశమందిరమున్గని కల్పకావనీ.
రుహములనెక్కి పండులలరుల్ తలిరుల్ హరియించులీలతోన్॥ 146

— మహాస్రగ్ధర. —

తటినీశక్షీరమెంతేతహతప్పపడ హస్తప్రఘాతన్ఘటించున్
జటులగ్రాహాది నానాజలచరతతిరోషంబునన్ బట్టికొట్టున్
బటుభూభృచ్ఛృంగముల్ దోర్బలమునమణిగర్భంబడన్గోటమీటున్
ద్రుటి భూదారేభభిత్పంక్తులఁ బిడికిలిచేఁద్రుంచుఁబో లెక్కలేకన్॥ 147

తే॥ ఈక్రియ నిజానుచరులతో నింపుమీరి
ధర్మగిరికూటములయందు బార్వతేయు

దఖిలజగదద్భుతావహంబగు శిశుత్వ
చర్యలొనరించుచుండె నవార్యమహిమ॥ 148

శా॥ ఆయాశ్చర్యములా మహామహిమలయ్యాదిత్యులీక్షించి త
న్మాయామోహితులై బలారికలవృత్తాంతంబువిన్పింపఁగా
నాయత్తంబయిపోయి కాంచిరఖిలాహార్యోఘపక్షచ్ఛిదా
శ్రేయాజిహ్మగభృత్కరుఁ విమలకీర్తివ్యాప్తకాష్ఠాంతరుఁ॥ 149

క॥ కాంచి యచంచలభక్తినుతించి వచించిరి సురేంద్ర దెలిపెదమిపుడా
లించుమొకచిన్నికుఱ్ఱఁడు మించియొనర్చెడుబనుల్ పమిత్పటుశౌర్యా।150

సీ॥ ప్రళయాగ్నివైఖరి బ్రబలిసప్తపయోధులొక్కటిగాఁజేయు నొక్కవేళ
నేడు దీవులతోడ నేడుకులాద్రుల వ్రక్కలుగాఁ జేయునొక్కవేళ
నినరథాశ్వముసెక్కి యిచ్ఛానుసరణిగాఁ బెక్కుచోటులకేఁగునొక్కవేళ
నలినగర్భుని మస్తములఁబట్టియూకించి పక్కుననగుచుండు నొక్కవేళ

తే॥ రిక్కరాయనితేరెక్కునొక్కవేళ
శేషుగరుడునిదనరెండు చేతులందు
నిల్పిడీకొల్పియవిపోరు సల్పుచున్నఁ
జక్కగనుఁగొనివిడుచుతా నొక్కవేళ॥ 151

క॥ మేమెన్నఁడు మున్నెఱుఁగం బీమూఁడుజగంబులందు నిదిచిత్రంబో
స్వామీయాతండెవఁడోయేమందుములోకములకునిడుములుగలిగెఁ।152

క॥ ఇందుకుఁబ్రతిక్రృతి మీరల మందగతింజేయకున్న మ్రందెదరఖిలుల్
బృందారకేశయన సంక్రందనుఁడాలించి వెఱపుగైకొని యంతఁ॥ 153

ఆ॥ కొంతవడికి ధృతినిగొని తదీయంబైనమాయమునిఁగి చింతమట్టుపరచి
పలికె వారితోడ దెలియదుపీఁడెవ్వఁడో యెఱుంగ నేనువేయుగతుల॥154

—♦ ఇంద్రుఁడు మాయా మోహితుఁడై కుమారునితోఁబోరుట. ♦—

ఉ॥ బాహుబలాతివిక్రమజవత్వములఁ మనచేతఁబోవునే
యూహలిఁకేల నాతనిసముజ్జ్వలనిర్భరఖేలి లోకసం

దోహము నేలఁగూలుననితోఁచెడిఁగాన మనుష్యవాహన
స్నేహునకియ్యదంతమును జెప్పఁ బ్రతిక్రియ జేయునాతఁడున్॥ 155

॥ తడయుటపాఁడిగాదనుచు దైవతసంఘముదన్నుఁ గొల్చివెం
బడిబడిరాఁ బులోమసుతమానసకంజవికస్వరోగ్రతే
జుఁడు సితదంతినెక్కి మ్రుడుజూడ సువర్ణకుభృద్బిలంబు వె
ల్వడి ఘనరాజసత్వము జెలంగ లఘుక్రియఁబోవుచున్నెడన్॥ 156

॥ విశాఖుండు లీలాఖేలనలోలుండయి కనకగిరిశిఖరంబులురుబలంబునఁ బెరికి తెరువునకడ్డంబుగా దవ్వులనిల్చివైచుచున్న బలశాలియగునశ్వాలుంగని మహేంద్రుండమరులంగూడి దురాగ్రహంబువహించి॥ 157

వ॥ సునిశితబాణజాలములు శూలితనూభవు దేహమంతటం
జొనుప హాసన్ముఖుండగుచు స్రుక్కుటలేక వియచ్చరాళిపైఁ
గినుకనుదాల్చుకున్నఁ బరికించి సురల్ బహునారసంబులా
తనిమెయిఁగప్పఁ బువ్వులవిధంబునఁ బొల్చెఁ దదీయశస్త్రముల్॥ 158

ఉ॥ అందులకాబిడౌజుఁడధి కాగ్రహుఁడై తెలిగౌరునెక్కి నా
ముందటనిల్చిపోర దృఢముగ్ గలదేయని వజ్రమెత్తి యా
స్కందునివైవ వజ్రమయ కాయుఁడతండగుటన్ నిమేషమా
త్రందగ ఖిన్నమైచనె శతారము దత్తనుఘట్టనోద్ధతిన్॥ 159

మ॥ కుటిలభ్రూకుటుఁడై షడాస్యుడు గనత్కోదండశస్త్రంబులు
ద్భటరోషంబునఁ బూని యుగ్రశరముల్ పాకారిపైఁ గప్పి యం
తటఁ జౌదంతి శిరంబునందొక దృఢాస్త్రంబేయుడున్ గుంభముల్
త్రుటిభగ్నంబయికూలె వజ్రనిహతోత్తుంగాద్రిపొల్కిన్ ధరన్॥ 160

క॥ ఆసేతకతఁడు రోసంబీసునుమదిఁ బెనఁగొనంగ నిషుసంతతులన్
వేసెఁ గుమారునిజలధారాసమితిన్ ఘనముభూధరముఁ గప్పుక్రియన్। 161

చ॥ గుహుఁడదిచూచియార్చి యొకకోలనె తద్విశిఖోగ్రవృష్టివ
గ్రహగతిమాన్చి క్రూరమగు కాండమొకండునవిల్లుద్రుంప వృ

త్రవహుఁడదలించి దిక్కులవహుతాశనకీలలుబర్వ శక్తినా
గ్రహమునవై వ రిత్తచనె గ్రక్కుననాతనిమేనుసోఁకుటన్॥ 162

మ॥ కనిసుత్రాముఁడు దత్తజించి మగుడన్ గాండాసనంబొందుగై
కొనునంతన్ శివసూతియొక్కములికిన్ గోటీరమున్దుల్చి మా
ర్గణసంధానముసేయునప్పుడొక నారాచంబుచే డెక్కెమున్
దునియల్ చేసి యొకమ్ముచేఁగవచమున్ దున్మాడెఁజిత్రంబుగన్॥ 163

తే॥ మఱియుఁ బ్రాణాంతకంబగు మార్గణంబొ
కండు రంబునఁజొరనేయఁగా ధరిత్రి
నవశుఁడై పడి దేహేంద్రియములమఱచి
నాకనాథుండు గృశియించినట్టులుండె॥ 164

శా॥ గీర్వాణుల్ దమవల్లభున్గని మహోఖిన్నాత్ములై యుగ్రతన్
దోర్వీర్యంబున బాహులేయుపయి బల్తూపుల్ నిరాతంకులై
పర్వంజేయ నతండు శౌర్యమెతనూత్వంబందెనానొప్పుచున్
దుర్వారాశుగవహ్ని వారిమదముల్ దూలించె జెప్పార్పకన్॥ 165

సీ॥ సాయకత్రయిఁగిలి శమనునై దమ్ముల జతురంబకంబుల సలిలవిభునిఁ
గంధవాహునిరెండు కఠినబాణంబుల నొక్కశరంబున రిక్కఱేని
విశిఖముల్ మూఁడిట వేఁడివేలుపు సొమ్మసిలఁజేసి శేషించుబలమునెల్లఁ
గలకుటమ్ముల నేలనొలుగునట్లొనరింప వెఱపున దెఱగంట్లుబఱచిరంత

తే॥ వాల్గుదిక్కుల కత్తఱినారదుండు
శరవణోద్భవునద్భుత సాహసంబు
దెలియఁబరికించి నెమ్మేనుబులకరింప
ననిమిషాచార్యుఁబొడగనియనియెనపుడు॥ 166

—• మందాక్రాంతవృత్తము. •—

పాకప్రత్యర్థిముఖదివిజుల్ బాహుగర్వంబుచేతన్
లోకాతీతుండయిన గుహునిన్ లోఁగకందాఁకి శౌర్యో

ద్రేకంబొప్పంగఁ బెనఁగి ధరిత్రీస్థలింగూలిరయ్యా
యాకార్యంబుఁ మదిదలఁచి నీవేఁగి రక్షించువారిఁ॥ 167

క॥ అనుచు సురమౌనితెల్పిన వినిగురుఁడులికిపడి యోగవీక్షనమర్త్యుల్
చని గుహునితో నకారణమనిఁజేసి నశించుటెల్లనాలోకించెఁ॥ 168

తే॥ అతిబలుండైన యబ్బాలు నసితకంఠ
నందనునిగానెఱింది తూర్ణంబె మేరు
కుధరబిలమెడబాసి తత్కుధరకూట
వీధిఁగొల్వున్న ఘనుఁజూచివిబుధగురుఁడు॥ 169

వ॥ కాంచి కించిన్నిమీలితలోచనుండగుచు వాచస్పతి జగత్పంచయత్రాస నిర్భేదంబులగు దత్పాదంబులకు సారెసారె సాష్టాంగములొనర్చుచు రణంబుననిహతులై పడియున్న వాసవాదిదైవతవారంబు జీవించుకొరకు గేవలభక్తిఁ బ్రార్థించుచునిట్లనియె॥ 170

—♦ బృహస్పతి ప్రార్థనంబునఁగుమారుండింద్రాదులఁ బ్రతికించుట. ♦—

సీ॥ ప్రణవరూపుఁడవు సర్వజ్ఞానవార్థివి సాక్షాచ్ఛివుండవు షణ్ముఖుండ
వేకముఖుండవు నేకదంతానుజుఁడవు సుందరాకారుఁడవు గుహుఁడవు
స్కందుఁడవాశ్రిత కామితప్రదుఁడవ నంతతేజుండవ నంతమూర్తి
వగణిత త్రాససంహరుఁడవు ద్వాదశభుజుడవు మేకుల భూరికృపకు

తే॥ బరమపాత్రుండవగునీదు పాదములకు
నిశ్చలంబగుభక్తి వనేకవంద
నంబులొనరింతుఁ బోషించునాధుఁడెవ్వఁ
డరసిచూచిన నీవెకాకనఘచరిత॥ 171

ఆ॥ నిర్జరోత్కరంబు నీమాయచే నిన్నునీబలంబు దెలియనేరదట్టి
సర్వగుఁడవుమహితచరితుండవగునీకు వదలకెపుడు సేతువందనములు॥ 172

ఆ॥ అనఘనీదుమాయ నజ్ఞానులై నిన్ను గర్హణంబుసేసి క్రతుభుగాళి
భవదపారకృపకు బాత్రులుగాకీల్గుచుందురట్టినీకు వందనములు॥ 173

చ॥ ఇటులననేకభంగి నుతియించికరంబులుమోడ్చు జీవున
క్కటికముతోడఁజూచి శితికంఠసుతుండు వరంబువేఁడుమొ
క్కటివెసనిత్తునన్నఁ గుతుకంబువహించి మహాత్మ యీమరు
త్పటలి సజీవమౌవిధము దప్పకచేయుము సత్కృపామతిన్॥ 174

క॥ తావకమాయామోహితులై వీరలు సేయుతప్పులాత్మఁదలఁపకన్
నావిన్నపంబుజెవినిడి జీవంబులొసంగుమనుచు జీవుడువేఁడన్॥ 175

తే॥ బాహులేయుఁడు గరుణించి బలజితాది
వేల్పుఁగూటువ మరలజీవింపఁజేయ
నిదురమేల్కొను క్రియలేచి నిశ్చలంపు
భక్తి హస్తంబులుమొగిడ్చి ప్రణతులిడిరి॥ 176

తే॥ అంత వారలఁగ్రమ్మినయట్టిమాయదొలగజేసి యతండుమిక్కిలి స్వకీయ
పాదభక్తిని దయచేసిపలికె మంద హాసచంద్రికలఖిలదిగాళినొరయ॥ 177

క॥ బాలుండని నన్నెంచక నాలీలలు నాస్వరూపు నామాహాత్మ్యం
బాలోకనంబు సేయుండిలోనని దివ్యదృష్టి యిచ్చెన్కృపతోన్॥ 178

— విశ్వరూప సందర్శనము. —

తే॥ దేవసందోహమాయోగ దృష్టిఁగొనుచుఁ
బరమసంతోషరసవార్ధి బయలికుఱుక
సచ్చిదానంద రూపుఁడౌ శంభుసుతుని
యంచితాకృతిఁగనఁగోరు నవసరమున॥ 179

సీ॥ అతలాద్యధోలోక తతులుబదంబులు సప్తాంతరీపముల్ జంఘలూరు
లంభోధిసప్తకంబంబరంబులుదిశల్ బాహువుల్ నక్షత్రపథమునాభి
స్వర్గంబుమూర్ధంబుజలదముల్ చికురంబు లుడులుప్రసూనములుగ్రుఁడాత్మ
శేముషిరుద్రాణి వామపార్శ్వముశార్ఙి దక్షిణపార్శ్వంబు దమ్మిచూలి
తే॥ భారతిశ్రుతివాక్కు మానారిశోభ
ప్రాణదశకంబు బవనుండు భానుచంద్ర

జాతవేదులు నేత్రముల్ జఠరకీలి
మృత్యుకాలాగ్ని రుద్రులై మెఱసి మఱియు॥ 180

వ॥ అనంతాది ఫణాధరాధీశులంఘ్రిభూషణంబులుగా నశేషౌషధులు రోమంబులుగా వేదోండంబులు యూకాండంబులుగా ననేకకోటి మార్తాండ వైశ్వానరకజ్వలన సంకాశతేజోవిరాజమానంబగు విశ్వరూపంబప్పరమేశ్వరపుత్రుండగు సుబ్రహ్మణ్యేశ్వరునందుఁగాన్పింప బోడగాంచి తత్తేజోమహత్వంబున మిఱుమిట్లుగొని దివిషన్నేత్రంబులు నిద్రానిమేషరహితంబులయ్యును విషయపరాఙ్ముఖంబులయియంధత్వంబు నొందె మహత్తునకుమహత్తును జారమైశ్వర్యంబునగు తైజసరూపంబునందుఁ బంచేంద్రియమేళనంబుగా మనంబులులీనంబులయి కొంతవడి మిన్నకుండి కనకగర్భశునాసీరప్రముఖబర్హిర్ముఖనికరంబులు దెలివొంది నమస్కరించి యిట్లనిరి॥ 181

శా॥ దేవా సాధుమనోనికేతన మహాదివ్యప్రభావోదయా
దేవేశుండవు గోటిభాస్కరసదృక్తేజుండవీశాంబికా
దేవీసూతివి లోకకర్తవగునీదేహంబుదర్శింపఁగా
నీవీక్షాబలమోర్వదింక ధృఢమౌదృష్టిఁబ్రసాదింపవే॥ 182

చ॥ అనుడుదరస్మితుండయి షడాననుఁడిట్లనుమత్స్వరాద్వపుఁ
గనుఁగొనమాంసచక్షువులఁగాదటుగావునఁ జూడుఁడంచు ద
ర్శనపటుదృష్టినిచ్చినఁ దిరంబుగఁగన్గొనలేక దేవతా
గణముసహస్రభాగమునుగాంచి భయంపడి విస్మయంబునన్॥ 183

క॥ హస్తములుమోడ్చి కనులఁబ్రశస్తముగాఁజూడవెఱచి చలితాళయులై
మస్తకవికంపనంబునఁ బ్రస్తుతులొనరించిరపుడు భక్తిచెలంగన్॥ 184

వ॥ దేవా యేమహాపురుషునివలన సమస్తజగంబులుత్పాదిల్లు నెవ్వనివలన రక్షింపబడు నెవ్వనియందు లీనంబులగు నట్టిసాక్షాత్పరబ్రహ్మంబవు సుబ్రహ్మణ్యుండవగునీకువందనంబు యేమహాత్తునిమాయచేవిభ్రాంతులై

జనులు పరాత్పరంబును సచ్చిదానందంబునగు నిజస్వరూపంబు దెలియ జాలకగర్తృత్వభోక్తృత్వజడాజ్ఞత్వంబులుదమయందారోపించిపలికెదరట్టి నీకునమస్కారంబు ద్రయీమయుండవు సువర్ణశ్మశ్రుండవు నాపాదమస్తక హిరణ్మయుండవు లోకాధీశుండవు సౌరమండలమధ్యస్థుండవు గుహుండ వగ్రియుండవు నగునిన్నునన్యరక్షకులమగుమేమాశ్రయించెదము బ్రహ్మా నందాద్యానందంబులెవ్వనియానందంబులని చెప్పంబడె నట్టి సంపూర్ణ పరిమోదాబ్ధివి పార్వతీసూనుండవసమానుండవగు నిన్ను సేవించెద మవస్థాత్రయరహితుండవవస్థాత్రయసాక్షివి బరాత్పరుండవు ప్రేరకుండవు మోచకుండవునగు నిన్నుఁగొనియాడెదము సంసారార్ణవతరణుండవగు నిన్నుఁగొనియాడువారికి జన్మభయంబు లేదట్టినీవగతియనియనన్యగతికుల మగుమేము బరంజ్యోతి స్వరూపుండవు బరబ్రహ్మవు సాక్షాచ్ఛివుండవు సాక్షాచ్ఛక్తిస్వరూపుండవు బరంధాముఁడవగునీకుఁబునఃపునర్వందనంబు లొనరించెదమతిప్రకాశంబగు భవదీయ తేజంబుదివాంధంబులు దివాక రుంబవె వీక్షింప వెఱతుము గాన శాంతంబును షణ్ముఖంబును ద్వాదశ భుజంబును శుభాస్పదంబునునగు పూర్వరూపంబు గటాక్షించినఁగృత కృత్యులమయ్యెదమని ప్రార్థించు పితామహాదులకుఁ గోటిసూర్యసంకా శంబగుమూర్తింధరించి కార్తికేయుండిట్లనియె॥ 185

—♦ వేల్పులకు వరమిచ్చి కుమారుఁడు కైలాసమున కేఁగుట. ♦—

ఉ॥ మీరొనరించునీ స్తవము మేదిని నేజనులాలకించినం
గోరిపఠింపవారలకు గోరికలెల్లనొసంగుదుఁ మఱిఁ
గూరిమినిచ్చెదఁ వరముగోరుఁడటంచువచింపఁ బొంగిగో
త్రారిచతుర్ముఖప్రముఖులప్పుడువల్కిరి యొక్కవైఖరిఁ॥ 186

.... పం చ పా ది. ....

తే॥ దివ్యమంగళవిగ్రహ దేవదేవ యేమువరముఁలకర్హుల మేనిమాకు
నీవు సేనానివై భర్తవై విరోధులయిన శూరాదిదితిజుల హతము జేసి
మమ్ముదరిజేర్చి రక్షించుమానఁచరిత॥ 187

క॥ పరమాత్మ కూరుచే సురతరుణులు జెరసాలలోనఁదవిలిరలజడిఁ
జిరకాలమయ్యె వారలదరిఁజేర్పుము భక్తరక్షుదయబెంపారన్॥ 188

చ॥ అనపుడు నట్లచేతుననియందఱతోవచియించి మాతనున్
జనకునిఁజూడఁగా రజతశైలముజేరఁగఁ గంజజాదులా
ఘనుని నిలింపసైన్యవిభుఁగా నొనరింపఁగ రాజతాద్రికిం
జని సురశిల్పినింబిలిచి చారుసుధోక్తులఁబల్కె రాతనిన్॥ 189

క॥ నీశిల్పకౌశలంబున నీశైలమునందుఁజూడ నెంతయుసొబగై
పేశలముగ నొకనగరంబోశిల్పివరేణ్య సేయుముత్సాహముతోన్॥ 190

క॥ నాపుండప్పనికొడఁబడి వేవేగమెవిశ్వకర్మ విబుధులుమెచ్చన్
గావించెను స్కందాఖ్యం బ్రావీణ్యంబుప్పతిల్ల బట్టణమపుడున్॥ 191

వ॥ తత్పట్టణంబెట్టిదనిన॥ 192

—♦ స్కందపురాభివర్ణనము. ♦—

సీ॥ వరసుమనశ్చక్రవాళకభరితంబు మహనీయతర సుధర్మాన్వితంబు
నసమాన ఘనవైజయంతప్రకాశంబు విద్యాధరోత్కరవిలసితంబు
వసులాభసంప్రాప్త వర్ణితవిభవంబు నతులిత వజ్రప్రభావృతంబు
సంతతగురువాక్యజాలాభిరామంబు గంధర్వసందోహబంధురంబు

తే॥ ప్రబలపుణ్యజనౌఘ ప్రాప్యస్థలంబు
వితతదోషాత్మకాళి దవీయతలము
బ్రాంచితాఖండ సౌఖ్యరత్నాకరంబు
ద్యాత్రివిష్టపమననొప్పు స్కందపురము॥ 193

—♦ ఖేయావర్ణనము. ♦—

మ॥ పురరత్నంబవనీత్రివిష్టపమనంబొల్పొందుటాలించి ని
ర్భరమోదంబున స్వర్ణదింగలిసి యత్రాంతంబు గందర్పసం
గరకేళిందనివారఁదేలమదిలోఁ గాంక్షించి యేతెంచు సా
గరమొక్కోయనఁగా నగద్దదసరున్గాంభీర్యమేపారఁగన్॥ 194

—♦ కో ట వ ర్ణ న ము. ♦—

మ॥ అరయందొల్లి వలాహకాంబురుహమిత్రౌత్తానపాదిక్షపా
కరసన్మండలభారమొంచుటను నాకంబుర్వరంగూలునం
చర రాజీవభవుండుదద్భరము మోయన్ నిర్మితిం జేసెనాఁ
గరమొప్పారునుగోట యున్నతశిరోగ్రస్ఫూర్జత్సురాధ్వంబునై॥ 195

—♦ ప్రా కా ర సం ధి వ ర్ణ న ము. ♦—

తే॥ తమ్మిచుట్టంబురధనిరోధంబుగాఁగఁ
గాంచి గరుడాగ్రజుండట్టిగాథజవత
హరులదోలుడు శిఖరములొరయుకతన
సాలమునసందులొప్పె విస్తారముగను॥ 196

—♦ గో పు ర వ ర్ణ న ము. ♦—

క॥ స్ఫురదసమానోన్నత గోపురము నిజాంభోజరాగభూరిప్రభలన్
ఖరకరునకనఖిళస్తిని స్థిరమతినుత్సర్జనంబు సేయుచునుండున్॥ 197

—♦ సౌ ధ వ ర్ణ న ము. ♦—

ఉ॥ అందలిమేడలంగలుగు నంగనలిందునిఁగందుకంబుగా
డెందమునందలంచియుఁ గడిందిముదంబునఁబట్టియాడఁగా
జిందెసుధోరుబిందువులు జేతులరాపిడిచే సుధాంశులోఁ
గందుజనించె మేడలకుఁగల్గెఁదదాదిగ సౌధనామముల్॥ 198

—♦ బ్రా హ్మ ణ వ ర్ణ న ము. ♦—

తే॥ పరగనాగమశాఖాను సరణిద్విజులు
భూరిసన్మార్గవర్తన భూమిసురలు
నచ్యుతస్వధర్మచారమందరయ విప్ర
వరులనఁగఁ బొల్తురచ్చటిబ్రాహ్మణులును॥ 199

—♦ క్ష త్రి య వ ర్ణ న ము. ♦—

తే॥ ఘనులకొగిజీవనములిచ్చిమనిపి పేర
దొలఁగకాశ్రితభూమిభృత్కులముఁబ్రోచి

బహుళతర వాహినీపతిత్వమునఁ బ్రబలి
నృపులువొల్తురు పురిని వార్నిధులకరణి॥ 200

—♦ వైశ్యవర్ణనము. ♦—

తే॥ నిధులముమ్మాటినిగడించి నేలరొక్క
మేలికయటంచుఁ బేరొంది బేలయగుచు
నేస్తి తిరిపెంబు మానుపనేరనట్టి
యతుమదిమెచ్చుదచ్చటియర్యకోటి॥ 201

—♦ శూద్రవర్ణనము. ♦—

... ద్విప్రాసము. ...

క॥ రుద్రులుజన్యంబున బలభద్రులుదోర్బలమునందు బలువితరణలే
ఖ ద్రులుసుగుణసముద్రులునద్రములుఁబృథుధైర్యమహిమనచ్చటిశూద్రుల్ 202

—♦ గజవర్ణనము. ♦—

శా॥ నానాశైలములెల్లకాలమొకతానంబందునిల్వంగ నో
హో నిక్కంబుగనూనమంచు మదిలోనూహించిబల్వాన్కి నా
స్థానీయాంతరమందు దంతులగుచుఁ జన్మించెఁ గాకున్నచో
దానాఖ్యఁ సెలయేఱులుప్పతిలునే ధారాభిరూపక్రియన్॥ 203

—♦ అశ్వవర్ణనము. ♦—

చ॥ అసిలుఁదిరస్కరించు హృదయంబును గెలిచెయొనర్చుఁ బన్నగా
శనునిఁదృణీకరించు జలజప్రియుమావులనవ్వుచుండు మా
ర్గణమును గేరడంబిడును గాఢజవంబునమాకుసాటిరమే
యనుచుఁ బురంబునంగలహయప్రకరంబు మదంబుపెంపునన్॥ 204

—♦ రథవర్ణనము. ♦—

... చతుఃప్రాసము. ...

క॥ అరదంబులు రిపుసేనాదరదంబులు గేతుపవనదారితకుంభ
చ్ఛరదంబులుదగ్రగతమందరదంబులు మెఱయు నచటఁదతమణిదీప్తిన్॥205

—♦ వీరభటవర్ణనము. ♦—

సీ॥ కంధరాంతర వినిర్గళిత బాడబశిఖాచయము నెదుర్పను శక్తిగలిగి
క్ష్మాభరంబూనినచక్రిరాట్ఫణములు బిగబట్టివిషమును బిడువఁజాలి
కులభూధరంబులఁగొనగోళ్లచే గోలుగుండ్లకై వడి నాడుకొనఁగఁజాలి
యాఁకొనియెలిచికై యాగ్రహోదగ్రమౌ సింగంబునై నను జెనకఁజాలి
తే॥ ప్రళయమందున సకలజీవములఁబట్టి
తివిచికొనిపోవ్రజమునై నదవిలి పాశ
బద్ధులగువారి విడిపించుబాహుబలము
గలిగి యాప్రోల సుభటసంఘంబు వెలయు॥ 206

—♦ ఆరామవర్ణనము ♦—

సీ॥ నవ్యాంకురములు బునర్భవంబులుగాఁగ కిసలయంబులునును గేలుగాఁగ
గలకంఠనినదంబుఁగంఠనాదముగాఁగఁ గొదనుతుమ్మెదగుంపుగొప్పుగాఁగ
వల్లరీసంతతి వక్షోజములుఁగాఁగఁ దరుణకుందములు దంతములుగాఁగ
రంభలూరులుగాఁగ బింబమోష్టముగాఁగ హరిలతల్ విగ్రహంబుగాఁగ
తే॥ బుష్పదేనియనుడిగాఁగఁబొల్చు యుపవ
నంబు దివ్యవధూటిచందమున మెఱయు
నవనివనలక్ష్మియను నామమమరఁబోలుఁ
గానిచో నిట్టిప్రఖ్యాతికలుగఁబోనె॥ 207

—♦ మలయమారుతవర్ణనము. ♦—

చ॥ పొలయలుకల్ వహించి ననబోఁడులు నాథులఁగూడువేళ మే
నలసిచెమర్పఁగా సురటియుల్లసఁబట్టి పయింటజాపి క
న్నులరమొగిడ్చిపీవఁగఁ జనుంగవఋాయుసుగంధపూర్తిచే
మలయములబ్బెరెండనుచు మందతనొందెసమీరుఁడప్పురిన్॥ 208

—♦ పురపురుషవర్ణనము. ♦—

క॥ నలుని నవవిల్తు నైంద్రిని గలువలచెలినోడమెఱేనిగాదిలిపట్టిం
గెలువఁగఁజాలినచెలువముగలపురుషులు గటకమందుఁగలరెల్లెడలన్॥ 209

## —♦ పురకాంతావర్ణనము. ♦—

చ॥ మదనునివాహముక్తులును మామమొగంబులు విల్లుమోవులుం
బ్రదరముహస్తముల్ గుణమువాలములుం ధ్వజమీక్షణంబులై
యొదవ విరించియప్పురిని యుగ్మలులం సృజియించియుండ న
మ్ముదితలదైనచక్కదనముం మఱివేఱగణింపనేటికిం॥ 210

వ॥ మఱియు నప్పుటభేదనశ్రేష్ఠంబనేక యోజనాయామవిస్తారంబై రాజిల్లి యనంతమణిరాజకవి గురుబుధాలంకృతంబయి గ్రహమండలంబును శరణాగతకు భృద్వాహినీనిలయంబై పయోనిధినియహీనభోగాస్పదంబై రసాతలంబును రామాభిరామంబై సాకేతంబును లక్ష్మీమనోహరంబై వైకుంఠంబును నాగమనర్దనంబై సత్యలోకంబును శుచిప్రధానంబై తేజోవతిని ధర్మవ్యవహారంబై సంయమని కర్బురాలంకారంబయి కర్బురసదనంబును భువనశోభితంబై వరుణగృహంబును నానాసుగంధబంధురంబై మరున్మందిరంబును బుణ్యజనాలయంబై యలకాపురంబును విజయప్రతాపమండనంబై భారతంబును మహాబలకుమారవిక్రమంబై రామాయణంబును నిర్దోషశ్లోకంబై సుప్రబంధంబును నరిదరప్రశస్తంబయి విష్ణుహస్తంబును బోలిమెఱసి దారిద్ర్యంబు సీమంతినీమధ్యంబులయంద కుటిలత్వంబు నారీచికురంబులయంద క్రౌర్యంబువనితానఖంబులయంద చాపల్యంబు హరిణాక్షీదృగంచలంబులయంద మాంద్యంబునితంబినీయానంబులయంద బంధవిశేషంబురామాసురతంబులయంద కాఠిన్యంబు సుందరీస్తనంబులయంద కలహంబు బింబాధరీప్రణయంబులయంద వర్ణసంకరంబు యోషిద్గండచిత్రితపత్రంబులయంద విస్తరించి పల్లవసంగంబుసాధుతరులంద కాని సాధుతరులందులేక వెలవెలంబోవుట ఘనులంద కానిఘనులందులేక సుడివడుట సరసులంద కానిసరసులందులేక వక్రత్వంబువాహినులంద కాని వాహినులందులేక యాచించుట సర్వజ్ఞునంద కానిసర్వజ్ఞులందులేక ప్రాణిహింసనంబు ధర్మునంద కాని ధర్మ

లందులేక రూపుమాటుటపురుషోత్తమునందకాని పురుషోత్తములందు లేక కళంకతరాజునందకానిరాజులందులేక యనంతసంపదలబొంపిరి వోవుచు సౌఖ్యంబునకు ముఖ్యంబై విలసిల్లుచుండ నిర్మించి తన్మధ్య భాగంబునందు॥ 211

—• సుబ్రహ్మణ్యుండు దేవసేనాపతియగుట. •—

సీ॥ జలమనువిభ్రాంతి గలిగించుభూమియు నేలనాఁగనుపట్టు నీటినెలవు
గుడ్యసందియమాత్మఁగొలిపెడుద్వారముల్ ద్వారసందేహంబువగులుభిత్తు
లంబరభ్రమహేతుకంబులౌ స్తంభముల్ స్తంభశంకనొసంగుశబ్దగుణము
గలిగిరంజిల రత్నఖచితమందిరమునునిర్మించిచనె విశ్వకర్మయంత
తే॥ దివిజులర్కాయుతప్రభాదీప్తమైన తద్గృహంబునమణిగణస్థగితదివ్య
సింహపీఠిని గుహునివసింపఁజేసి చకురానందముగఁజూచిసంతసిలిరి॥ 212
క॥ ధర్మోదరాండమునఁగల నిర్మలతీర్థములుదెచ్చి సిధిరాణ్ముఖ బ
ర్హిర్ముఖులు మునులువైదికధర్మంబున గుహునినతిముదంబుదలిర్పన్॥ 213
చ॥ నిఖిలనిలింపవాద్యములునిండఁగ బూవులవానమించ స
మ్ముఖమున నారదాదిమునిముఖ్యులు గానముసేయుచుండఁగా
శిఖరిగరుద్విదారి నిజసేనకువల్లభుగా మరుద్ధునీ
శిఖుదుభవానిజూడ నభిషేకముజేసెమహోత్సవంబునన్॥ 214
చ॥ అమరులు దేవసైన్యపతియైన కుమారుని షోడశోపచా
రములభజించి కానుకలుదిరంబుగనివ్వ గ్రహించివారలన్
సముచితభంగినాదరణసల్పి ప్రియోక్తులనూరడించుచున్
దమతమయిండ్లకన్పి ప్రమదంబునఁదానటనుండెనాడుచున్॥ 215
క॥ అనియిట్లు రోమహర్షణి
వినిపింపఁగ నాలకించివిస్మితచేతో
వనజులయి శౌనకాదులు
ననఘా యెటిఁగింపుమవలననియడుగుటయున్॥ 216

—♦ ఆశ్వాసాంతము. ♦—

ముక్తపదగ్రస్తము.

చ॥ అనుపమసత్యవైభవ భవాంబుధితారక తారకాధిరా
డినయనద్వయాద్వయమునీంద్రమనోంబుజవాస వాసవా
వన వనజాసనాద్యమరవంద్యపదాపదజిద్ఘనాఘనా
ఘనసమవిగ్రహాగ్రహనికాయ వరాభిజనాభివర్ధనా॥ 217

ఉత్సాహ.

భార్గవాభిమానకంధి బాడబానలా మునే
డ్వర్గమానసానుతాప వారణాభయప్రదా
స్వర్గరాట్తనూజహరణ సాహసాదిసద్గుణా
నర్గళాజివరకుమార నగచరాళిసేవితా॥ 218

పాదగోపనము.

చ॥ వనజసమాననేత్రిక కృపాజలధీశసురస్తవక్షమా
హననదురాసదార్థిప్రణతా సమరోన్నత సాదరాశయా
మునిమహనీయలాలసవిభూత్యభిసేవన ధూర్తభంజనా
జనకజశస్తమానసప్రసన్న దయామయ సత్యవర్తనా॥ 219

గుర్తు॥ పై పద్యములో మొదటనుండి మూడవగీటు అంతమువరకు ప్రతిమూడవఅక్షరమును కలిపిచదువుకొనిన నాల్గవపాదమేర్పడుచున్నది.

మాలిని.

అరుణతనయమిత్రా యాశ్రితారామచైత్రా
పరమశుభచరిత్రా పాపవల్లీలవిత్రా
సరసిజదళనేత్రా సాధుసంస్తోత్రపాత్రా
శరధరసమగాత్రా సర్వలోకాళిసూత్రా॥ 220

## గ ద్య ము.

ఇది శ్రీరఘునందనచరణారవింద వందనమరున్నందన నిరతిశయకరుణా కటాక్ష వీక్షాసంభావిత చతుర్విధానూనకవితాప్రహర్షితవసుంధరారమణ సభాప్రకాశితవిద్వన్నికాయ రుక్మాంగదనలచరిత్రాభినయక్షుగానద్వయ మనఃప్రబోధ రామచంద్రప్రభు ధీనిధీనామక శతగ్రంథత్రయ మహాలక్ష్మాభిధానైకనాటక పుష్పగిరిపీఠాధిపత్య జగద్గురు శ్రీమదభినవోద్దండ విద్యాశంకరభారతీస్వామి చాతుర్మాస్యదీక్షా గద్వాలసంస్థానాధీశ్వర వంశవృత్తవర్ణన ప్రబంధనిర్మాణచాతురీవిరాజిత భారద్వాజసగోత్ర పవిత్ర భట్టరాడ్వంశక్షీరసాగర రాకానిశాకళత్ర రామదాసపౌత్ర సంజీవరాజ సత్పుత్ర కోడవలూరి రామచంద్రరాజనామధేయకవివర్య ప్రణీతంబైన స్కాందపురాణాంతర్గత శంకరసంహితాభినివేశ మహాసేనోదయంబను మహాప్రబంధమునందు ప్రథమాశ్వాసము॥ 221



శ్రీ ర స్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

# మ హా సే నో ద య ము.

(పద్యకావ్యము.)

## —• ద్వి తీ యా శ్వా స ము. •—

కంధిమేఖలాజా
ప్రాకటచేతఃప్రఫుల్ల పద్మమిళిందా
స్తోకశుభచరిత కుధరసు
తాకాంతధనుర్విరామ దశరథరామా॥

తే॥ అవధరింపుము శుకశౌనకాదితాపసులకు సర్వకథారధ సూతుఁడైన
సూతుఁడనియెనుమందాకినీతరంగ ప్రబలఘోషానుకారివాక్పటిమతోడ॥ 2

### —• నారదుఁడను విప్రుని యజ్ఞపశువునందుగ్రమేషముద్భవించుట. •—

క॥ నారదుఁడనునొకవిప్రకుమారుండతిదక్షిణలను మఖమొనరింపన్
గోరి యురభ్రముఁదెచ్చి యుదారతఁదత్క్రియలనెల్లఁ దప్పకజరుపన్॥ 3

వ॥ పదంపడిబుత్త్విజులు దత్పశువిశసనంబొనర్పనుద్యమింపఁ దన్మేషగాత్రంబు
నందుండి॥ 4

సీ॥ అరుణనేత్రములుచ్చ్రితశృంగయుగ్మంబు నాయతశ్మశ్రువక్త్రాధరములు
నంబరచుంబివాలాగ్రంబు గళకుచమధితధారాధర మండలంబు
శితఖురాగ్రచ్ఛిన్నకుతలంబు లంబితస్థూలముష్కంబులు దుందిలాతి
దీర్ఘసంహననంబధిక బలయుతమును గ్వణితమణివ్రాత కలితహాంస

తే॥ కంబు గటుమదగంధంబు గరుడవారిదారివిక్రమనిర్జితంబైన ఛాగ
ముద్భవించిమనోవేగమొప్పి దిక్కులద్రువఁగా సర్వభువనంబులందుదిరిగె॥5

తే॥ అంతనిలువక నామేషమతిజవంబుమెఱయ సింగపుగమిమీదనుఱికిపిడుగు
వడినరీతినిఁ దలలపైనడవఁ దెల్లడాలుమెకములుఁ దలప్రీలివేలఁగూలె॥ 6

సీ॥ అభ్రమాతంగంబు విభ్రమంబువహించెఁ బుండరీకము జలంబులమునింగె
వామనంబుధరించెవామనాకారంబు గుముదమంతకుమున్నకుముదమయ్యె
సార్వభౌమమశేష జగతిసంచారించె నంజనంబంజన మయ్యెఁగమలి
పుష్పదంతముతెల్లుపువుమాడ్కిఁదెలుపొందె నప్రతికృతియయ్యెసుప్రతీక
తే॥ మిట్లుదిక్కరులన్నియు నిమ్ముదప్పి
పాఱ నామేషమహివిష్టపమునకరిగి
దండశూకోత్కరంబుల ద్రుందఁజేసి
దిట్టతనమునఁ బుడమికేతెంచెమఱియు॥ 7

క॥ ఉరువడి దీవులనేడిఁటఁజరియించి విహంగమృగవిసరపశునరులం
బొరిగొని సప్తాంభోధులఁగరకరిగాఁజేయు మకరకర్కటయుతిగాఁ॥ 8

క॥ చండానిలువలె నీరదమండలినడగించి రవిహిమద్యుతిరథముల్
ఖండించి నాకమునకుద్దండతఁజని దేవతతిని దళనము సేసెఁ॥ 9

ఉ॥ అత్తఱినారదుండు హృదయంబునఁజింతిలి మౌనికోటితోఁ
జిత్తజవైరికయ్యజము సేసినవిక్రమమధ్వరచ్ఛిదం
బొత్తిలిచెప్ప రౌప్యగిరికొయ్యనఁజేరె సురాళిమున్విషో
త్పత్తిభయాకులంబగుచుఁ దద్వ్యథఁజెప్పఁగనేఁగుకై వడిఁ॥ 10

క॥ ఆలో నాయనసరసను లీలాలోలుఁడయి బాహులేయుండసుహృ
త్కాలుఁడగు వీరబాహుని కేలూనిచరించుచుండెఁ గిలకిలనగుచుఁ॥ 11

క॥ అమ్మహనీయునిఁగన్గొని నెమ్మినమస్కృతులొనర్చి నిలిచి మునీంద్రుల్
సమ్ముఖమునఁగల నారదునిమ్ములఁగాన్పించి పలికి రెంతయుఁ కరుణఁ॥12

ఉ॥ నారదతుల్యుఁడీద్విజుఁడు నారదనాముఁడితండు మృత్యుసం
హారికిఁ బ్రీతిగా నొకమహాధ్వరమిప్పుడుఁ జేయ యాజకుల్
ధారణచేతఁ దత్పశువధంబునకూనఁగ దానిమేనునఁ
దారుణమేషముద్భవిలెఁ దత్కృతశౌర్యమునెన్నఁజిత్రమౌ॥ 13

చ॥ జగములగాసిసేయునల ఛాగముమాన్పి ముదంబుఁబూర్వరీ
తిగసమకూర్చి ।పోవఁగలధీరుఁడవీవక దాకుమార యం

చగణితభక్తివేఁడుకొనుఁ డప్పలుకుల్వినివీరబాహునా
ఛగలకమిందుఁదెమ్మనుచుఁ జయ్యనఁబంచెసదావనస్పృహా॥ 14

—♦ కుమారుఁడుగ్రమేషమును దూర్చినారదునిఁ బ్రోచుట. ♦—

చ॥ ద్రుతగతివీరబాహుఁడుఁ జతుర్దశలోకమునందు మేషముఁ
వెతకి నిరర్థకంబగుట విష్ణుజగంబునకేఁగియందు న
ప్రతిహతవిక్రమంబుదనరం జరియించుచునున్నదాని ను
ద్ధతుఁడయిపట్టినెట్టుచును దక్కకతెచ్చెఁగుమారుపాలికిఁ॥ 15

చ॥ కని శరజన్ముఁడయ్యజము గ్రక్కునయెక్కి కశాభిఘాతలం
దనువుసెడంగఁగొట్టుచును దర్పముమాన్చి హయంబుకైవడిం
దనవశవర్తిఁజేసికొని ధారలనేనిఁటఁ గంజజాండమె
ల్లను గలయింగఁద్రిప్పె బహుళక్షుధచేఁ దృషచేఁ దపింపఁగఁ॥ 16

చ॥ కడుఁదడబాటునొందుచు జగద్గురుఁడైన కుమారుభారమె
క్కుడయి భరింపలేక మదిఁగుందిశ్రమంపడి నోటఫేనముఁ
విడుచుచు ఘర్మతోయము భువింబడగర్వముదక్కి మిక్కిలిఁ
బడలికనొందిస్రుక్కి నడవన్వడిలేక పొఁశేలునిల్చినఁ॥ 17

క॥ కళనడచినడప నడవకఁ గృశతనిలువఁబడియెఁ గార్తికేయుఁడుదనపై
భృశరతినెక్కుట దోషప్రశమనమైమేషమొప్పెఁ బావనమగుచుఁ॥ 18

మ॥ ఘనజ్ఞానమునఁ మనంబున నమస్కారంబుగావించుచుఁ
వినుతుల్సేయుచునున్న వృష్ణినిఁగృపఁవీక్షించి సేనాని వా
హనముఁగాగఁ బరిగ్రహించెముదితుండై యందుచే విఘ్నరా
డనుజుండగ్నినిబోలి మేషతురగుండై మించె లోకంబునఁ॥ 19

తే॥ క్రతువిభగ్నంబునకు దుఃఖకలితుఁడగుచు
వివిధమునిసంయుతంబుగాఁ దవిలిమ్రొక్కి
మ్రోలనిల్చిన నారదు మోముజూచి
పలికెగుహుఁడు సుధామయభాషణముల॥ 20

క॥ నీయజ్ఞపశుసముద్భవమీయజమిది వాహనముగ నిపుడేగొనుటన్
నీయాగమొందెనఫలత వేయేటికినీకు సుకృతవిభవము గలిగెన్॥ 21

వ॥ చింతింపకుమిమ్మఖంబు నీచేతసంపూర్తిగాఁగలదు లోకంబునందెవ్వరేని భక్తితత్పరులయి యణుమాత్రంబెద్దియేని నాకర్పింప నదిమేరువై గోభూహిరణ్యాదిదానంబులకంటె ఫలంబాధిక్యంబగు గాన నాకు వాహనదానంబిచ్చుటంజేసి శతాధ్వరఫలసంసిద్ధిపడసితివింక నీవేఁగి యవభృథాంతంబుగా సవనంబీడేర్చి ప్రీతచేతస్కుండవు గమ్ము పొమ్మని వీడుకొల్పి పార్వతేయుండు యక్షేశ్వరంబోవ నారదుండవతని వచనాను రూపంబుగాఁజేసి యాగసిద్ధినెనసి సుఖప్రాప్తుండయ్యె నంతనొక్క నాఁడు॥ 22

—♦ బ్రహ్మదేవుఁడు కైలాసమునకు బోవుట. ♦—

సీ॥ నలినసూతి శివార్చనంబుసేయఁదలంచి విబుధులుఁదాపసుల్ వెంటనడువఁ
గైలాసమునకేఁగి ఘనరాజవీధులు గడచిపోనెడమీక దడముకొనిన
బహుపుణ్యమూర్తులౌ ప్రమథులఁగాంచుచుఁ దత్సన్నిధినిమిత్రతతినిగూడి
శిశువృత్తిసినాడెడు సేనానిబొడగని యవ్వియుండనిమది నరయలేక

తే॥ బాలుఁడనియెంచి శశిమౌళిభవనమునకుఁ
జేరి సద్భక్తిఁబూజించి చిరముదంబు
గాంచి తదనుజ్ఞ మగుడిపోనెంచువేళ
నయినఁ దనుగాంచమికి గుహుండలుకఁబూని॥ 23

తే॥ అజునిగర్వమడంచగా నాత్మఁదలఁచి
వడిగఁబిల్వఁగబంచి యెవ్వఁడవునీవు
సేమిపనిఁబూని వచ్చితివిటకుననినఁ
గార్తికేయునకిట్లనుఁ గమలజుండు॥ 24

శా॥ ఏలోకేశుఁడ శంభుసేవకొఱకై యీసిద్ధసాధ్యాళితోఁ
కైలాసంబునుజేరి నిశ్చలమతిన్ గాత్యాయనీభర్గులన్

జాలంబూజలఁదన్ని వారనుప నై జస్థానముంజేరఁగా
నీలోఁబోవుచునుండి మీపిలుపుచే నిచ్చోటికిన్వచ్చితిన్॥ 25

క॥ తడవయ్యెఁ బోఁదలించితిఁ గడువేగననుజ్ఞనిమ్ము గౌరీసుత యం
చుడుగకనమస్కరించెడుఁ గడుపుంబంగారువేల్పుఁగనియతఁడనియెన్॥26

క॥ నీసెలవు నీదుకార్యము నేనేర్చినవిద్యలెల్ల నెఱివినవలతున్
మానుగదెలుపుము నెనరున నేనడుగుట కలుగవలదు నీరజగర్భా॥ 27

తే॥ అనుడు సృష్టికర్తృత్వంబు దనరఁదాల్చి
కమలజాండంబుసృజియించి ఘనతఁగాంతుఁ
బదియునెనిమిదివిద్యలేర్పడ మదాశ్ర
యములుఁగావున లేరుమత్సములు నిజము॥ 28

వ॥ మన్నివాసంబుసత్యలోకంబనంబరగు॥ 29

ఉ॥ నావిని జన్నిగట్టువచనంబులకీసునుబూని షణ్ముఖుం
డీవెసమస్తవిద్యలకు నిక్కపు నిక్కము ముజ్జగంబులం
గావున నిందులో సమధికంబగువిద్యయదెద్ది దానిచేఁ
జావనవేమ్యఁడై నెగడు వాఁడెవఁడో వివరించిచెప్పుమా॥ 30

తే॥ అనఘ మముబోటిబాలుర నధికప్రేమ
మిమ్మువంటి ప్రబుద్ధులు మేలిమైన
భాషణంబుల సంతోషపరతురట్లు
గాన నెఱిఁగింపుము సమర్మకంబుగాఁగ॥ 31

వ॥ అనిగాంగేయుండువలికిన నలువ ఋగ్వేదంబుఁ దుదిమొదలుగాఁ బఠింప
నెంచి బిందునాదాత్మకంబును శ్రుత్యాదిస్వరంబును నగు ప్రణవంబుచ్చ
రింప జెల్లుచూలోహో నిలుపునిలుపుమని తలయూఁచి కేలెత్తి యీ
ప్రణవార్థంబు నాచిత్తసంశయంబువీడునట్లు నిక్కువంబుగాఁ దేటపరుపు
మనినఁ జతుర్ముఖుండిట్లనియె॥ 32

—♦ కుమారస్వామి బ్రహ్మదేవుని చెఱఁబెట్టుట. ♦—

దని విపరీతార్థమప్పుడుఁజెప్పినఁ జెంపఫెళ్లునఁగొట్టి ఛీయటంచు
నొకమొట్టు మొట్టితక్కకవీనిఁగొంపోయి కారాగృహంబున గట్టుమనుచు
వీరబాహునకప్డు విన్పింపఁగా నాతఁడమ్మహాత్మునానుజ్ఞ నట్లచేసె
ఆ॥ నవలస్సృష్టికార్య మావంతతక్కువ సేయఁబోక తానచేయుచుండె
హరతనూజుచరిత లత్యద్భుతంబులు వశమె తెలుప నెట్టివారికైన 33
ఉ॥ అంతట సిద్ధసాధ్యవిబుధాళిసమేతముగా మునీశ్వరుల్
గంతుహరుంగుఱించి చిరకాలముఘోరతపంబుసేయఁగా
సంతసమంది దర్శనమొసంగిన ధూర్జటితోడఁ బూర్వవృ
త్తాంతముఁదెల్పివేఁడిరి పితామహుబంధవిముక్తుఁజేయఁగన్॥ 34
క॥ అందులకుఁగరుణఁదాలిచి యిందుకళాధరుఁడు నందికేశ్వరుతోడన్
స్కందునకజునిన్విడువఁగఁ బొందుగనాయాజ్ఞదెలుపు పొమ్మనిపనిచెన్॥
క॥ హృష్టమతినతఁడుబనివిని విష్టపసృష్టినిఘటింప విషగళుఁడిపుడున్॥
స్రష్టనువిడిపుచ్చుమనెన్ శిష్టప్రియ తండ్రిమాట చేయుముభక్తిన్॥ 36
చ॥ అనుచుశిలాదపుత్రుఁడన నాగ్రహమూని శివాకుమారుఁడి
ట్లను జనుమింక నీపలుకులాడినసైప విధాతృఁడున్నచో
టనెనినుఁజేర్తునంచన వడంకిభయంబుననీశుచెంతకుం
జని సుతువాక్యముల్దెలుప శర్వుఁడు విస్మయమందినప్పుడున్॥ 37
క॥ తలయూఁచి గిరిజకిస్థితిఁదెలుపక సుతుఁజూడఁగా విధిన్విడిపింపన్
దలపోసి స్కందాద్రికి సలలితముగవచ్చె నట్టి సమయంబందున్॥ 38
తే॥ ఈడుజోడగుబాలుర తోడఁగూడి
క్రీడసల్పెడుసుతుఁ దనమూఁడుకనులఁ
బండువుగఁజూచి ముద్దాడి నిండుప్రేమఁ
దొడలనిడుకొని లాలించి మృదుఁడువలికె॥ 39
ఆ॥ నాయనావిరించి నాయాజ్ఞ సత్యలో
కమునసుండి సృష్టికార్యమెపుడు

పరగఁజేయు నాదు పంచకృత్యములలో
మొదలిదిదియకాన వదలుమితని॥ 40

క॥ నామాటలుద్రోయకవిను మీమూర్ఖంబేలయనిన నేవిడననుటన్
భీమంబగురౌద్రంబున భీముండిట్లనియెఁ గుటిల వికుటిభ్రుకుటిన్॥ 41

—♦ శివుఁడు బ్రహ్మను చెఱనుండి విడిపించుట. ♦—

ఉ॥ ఈపనికై శిలాదసుతునిచ్చటికంపిన వానిమాటలం
ద్రోపుడుచేసిపుచ్చితివి తొల్తను నేనిపుడేఁగుదెంచితిన్
నాపలుకైనఁజేకొనవు నన్నుగణింపవు మందెమేలమా
పాపఁడ పద్మజున్విడువ బాగుసుమీయని తండ్రివల్కినన్॥ 42

ఆ॥ సమ్మతంబులేక సర్వజ్ఞుఁడగుటచే శివునిమోముజూచి శీఘ్రగతిని
జలరుహప్రభూతు బిలిపించి తత్సన్నిధానమందునిలిపి దండమిడియె॥ 43

క॥ కుతుకంబున గంగాధరుఁడతనింగౌఁగిటనమర్చి యనురాగముతో
శతధృతినెందుకు చెఱనుంచితితనయా తెల్పుమనుడు శిఖివాహనుఁడున్॥

ఉ॥ ప్రాంజలియై నమస్కృతులుభక్తినొనర్చి మహావిధేయుఁడై
కంజభవుండుమున్ననిన గర్వపుమాటలుదెల్పి యిందుకై
కుంజరదైత్యనిర్దళన గొబ్బుననీతనిఁబట్టియుంచినా
డం జెరనన్న నీశుఁడు దటాలుననందను జెక్కునొక్కుచున్॥ 45

మ॥ తనయా తత్ప్రణవంబునందుగలయర్థంబేమొ నీవోటనే
వినఁగాంక్షించితిఁదెల్పుమన్న గుహుఁడావిశ్వేశు జోహారులన్
దనియంజేసి రహస్యమీపరమమంత్రంబర్థమట్లౌట నీ
జనమధ్యంబున సాహసించితమపజ్జందెల్పఁగాభా వ్యమే॥ 46

తే॥ పరమగురుమంత్రసమితికిఁ బ్రకటనాప్ర
కటనములు సుప్రసిద్ధములగా తదీయ
వైపరీత్యముచేతఁ బాపముఘటించు
ననెడుభవదాజ్ఞ చే సందియముమవహింతు॥ 47

చ॥ అనుచుఁగుమారుఁడాడ దర హాసమెసంగఁగ నేతదర్థమి
య్యనిమిషపంక్తిలో నతిరహస్యముగావచియింపుమంచు ఫా
లనయనుఁడాజ్ఞ సేయఁగఁ గళంకముమాని తదర్థమొప్పిదం
బునుగనఁజెప్పుచున్నవిని పుత్రునివాక్కులసొక్కితాననె॥ 48

వ॥ కార్తికేయా నీచెప్పినయిప్పరమమంత్రార్థంబున మెప్పందితివియ్యర్థంబు తథ్యంబు సంవిద్బోధ్యంబగు నీమంత్రార్థంబీవు నేను నుఁగాఁదెలుసుకొను విజ్ఞానులు మత్సమానులీప్రపంచమున సదాశివతత్వంబు నిన్నునన్నును గాఁదెలియు వేదాంతులకిదియె నిర్వాణసాధనంబని నుడివి ముదీపదం కురితగాత్రుండయి కపాలిమఱియు॥ 49

తే॥ ధ్యానయోగంబుచే దోషతతినడంచు
వారికైనను దెలియంగవశముగాదు
తలఁప నధికారదుర్మద కలితుడైన
స్రష్టకీయర్థమెఱుఁగంగ సాధ్యమగునె॥ 50

క॥ ననుసమ్మి కొలుచువారికిఁ గనికరమున నేను దెలుపఁగాఁ దెలిసి మహా
ఘనులగుదు రేనునీవగు టను దెలిసితివీవు సోమ్యుడానీపుత్రా 51

క॥ ఈయర్థార్థుండారయ శ్రేయఃకాములగు యోగశేఖరులందున్
ధీయుతుఁ డగస్త్యుఁడొక్కం డాయనకిదితెలుపు గురుఁడవై నీవుదగన్ 52

క॥ అతడీవిద్యనుగొని యప్రతిమన్ శిష్యప్రశిష్య పాళికిఁబూన్కిన్
హితమతిఁదెలిపిన జగమున వితతంబగునంచు నాజ్ఞవెట్టె గుహునకున్॥53

శా॥ దేవజ్యేష్ఠునిపీడుకొల్పి తనయున్దీవించి జాంబూనద
గ్రావేష్వాసి నిజావరోధమునుజేరంబోయి కాత్యాయనీ
దేవింగౌఁగిటజేర్చి సత్యభువనాధీశార్తియున్ శక్తిభృ
త్ప్రావీణ్యంబునుదెల్పి తన్మనము మోదంబొందఁజేసెందమిన్॥ 54

వ॥ ఇట్లు భవానీదేవి తనకొడుకుచరితంబాలకించి పులకాంకురితశరీరిణియై మధురవచనంబుల వామదేవుంజూచి లోకేశ్వరా! భవత్పుత్రుచరితంబు

భువనాతీతంబు నిఖిలజనవైచిత్ర్యంబు గావున బాల్యంబునందెట్లు జగం
బులఁగల్పించెఁ దత్స్వరూపబలవిక్రమమహిమాతిశయంబులు వినవలతుఁ
గరుణించితెలుపుఁడన నతిరహస్యంబగు గుమారుచర్యనాలింపుమని విరూ
పాక్షుండిట్లనియె॥ 55

—♦ శివుఁడు పార్వతికిఁ గుమారస్వామి మహిమఁ జెప్పుట. ♦—

సీ॥ వనజాక్షి నేశివుండను బరిపూర్ణుండ నిష్కళంకుండను నీవునాదు
పరమశక్తివి యనపాయినివై వేఱుఁ దలపక నాయందనిలుతుగాన
నీవెసూప్రకృతివి నేఁబ్రత్యయంబును లోకంబవీవు నేలోకపతిని
నీవుశబ్దంబవు నేనర్థమును నేనెపంచకృత్యపరుండఁ బంచముఖుఁడ
ఆ॥ నేసదాశివుండ నీవేకవక్త్రవ
నేకరీతివైన యీశ్వరివి యు
మాభవత్సుతుండు మన్మయుండును ద్వన్మ
యుండుగాన షణ్ముఖుండునయ్యె 56

క॥ సకలప్రపంచమునకును బ్రకటింపఁగఁ బంచకృత్య పరుఁడయ్యెను గృ
త్తికలస్తన్యము గ్రోలుట నకలంకతఁ గార్తికేయుఁడననొప్పు సతీ॥ 57

తే॥ పర్వతోద్భవవగునీవు పార్వతివి భ
వత్సుతుండగుటచేఁగాంచెఁ బార్వతేయ
నామ నుతిశౌర్యమున భువనంబులాక్ర
మింపఁగా స్కందుఁడననొప్పె మించుబోఁడి॥ 58

తే॥ శ్రితజనులనగ్రపదవికిఁ జేర్చుకతన
నగ్నియననొప్పు మత్సుతుం డౌట నాదు
ఫాలదృగ్జనిగతేంద్రియోద్భవుఁడగుటను
నగ్నిభరియించుటఁజెలంగె నగ్నిభువన॥ 59

క॥ సురలహరీకూలంబున శరకాననమందు వికచసారసషండాం
తరమున జననంబొందుట శరజన్ముండనఁగనెగడె శైలతనూజా॥ 60

క॥ గుహాయనఁజర్చింపంగా దహరాంబరమగుట నగణితప్రాణి మనో
గుహానధివసియించుటచే గుహుఁడనునామంబుగలిగెఁ గువలయనేత్రీ॥61

వ॥ బ్రాహ్మణులకేఁబలినగుట నితండుమత్యానుండుగావున సుబ్రహ్మణ్యుం
డయ్యె నాత్మసందోహంబు మహాసేనయనంబడునది తన్నుఁబ్రార్థించుచు
స్వాయత్తంబగుటవలన మహాసేనాభిధానంబునవాసికెక్కె సర్వగీర్వాణ
సేనల శోకవ్యాకులంబులు రూపుమాపి సుఖంబిచ్చుటచే సేనానియన
భాసిల్లె గంగయందు జనించుట గాంగేయుఁడనంబరగె నిదియును
గాక॥ 62

సీ॥ అపహతపాపుండు నజరుండు మృత్యుసం
హారణుండు సంశయవిరహితుండు
సత్యసంకల్పుండు సత్యకాముఁడు సత్య
మును పిపాసాశూన్యుఁడును ఋతంబు
విశ్వాధికుండును విశ్వంబుబురుషుండు
నగు నీసుతునిపేరు లన్ని తెలుప
వశమౌనె యిపుడపవర్గప్రదంబగు
కొన్ని నామముల జేర్కొన్నవాఁడ

తే॥ నిలనునెవ్వరైన నీనామములుబఠింప
లలిఁ జతుర్విధపురుషార్థములు లభించు
నట్టివారల బ్రహ్మహత్యాది పాత
కంబులంటఁగవెఱచునో కంబుకంఠి॥ 63

సీ॥ తరలాయతాక్షినీ తనయునిమహిమ సంక్షేపంబుగాఁ గొంతజెప్పితిపుడు
కలరూపువివరింపఁ గల్పకోట్లయినను జాలవు తొల్లి ప్రసంగవశత
నీతనిచరితంబు నేఁదెల్పవింటివి మఱచితికాఁబోలు మరలనన్ను
నడిగితి లోకహితార్థంబుగా నీవు మంచికార్యంబని మదనమథనుఁ

ఆ॥ డార్యఁగౌఁగలించి యంతిపురంబున కరిగె నవల వేల్పుగరితలెల్ల
మధురగీతములను మందిరారామంబు లందుఁబాడుచుండి రతనికథలు॥ 64

—♦ సౌందర్యామృతవల్లులు కుమారుంగురించి తపము సేయుట ♦—

వ॥ అంత నారాయణనయనసంభూతలగు సౌందర్యవల్లి యమృతవల్లియను
కన్యకలిద్దఱు షాణ్మాతురుమాహాత్మ్యంబాలించి యతనివరించందలంచి॥65

మ॥ అతిమోహంబున మన్మథాస్త్రపరిపీడావిద్ధచేతస్కలై
శితికంఠాత్మజు ఘోరమౌ తపముచే సేవించిమెప్పింప స
మ్మతుఁడై మమ్మువరించునంచుమదిఁదీర్మానించి రేయుంబగల్
ధృతినాహారసుషుప్తులఁవిడిచి భక్తిశ్రద్ధలేపారఁగఁ॥ 66

మ॥ కరివక్త్రానుజ సంభవస్థల తటాకప్రాంతతీరంబునఁ
సరగఁజేరి దుకూలముల్ మణిపరిష్కారంబులఁవీడి సు
స్థిరలై కోమలవల్కచేల శరమౌంజీభస్మరుద్రాక్షలం
బరగందాల్చి షడక్షరీజపముచే భవ్యాత్మలై యంతటఁ॥ 67

తే॥ దహరపంకేరుహంబున గుహునినిలిపి
యమితహోయనములు నిరాహారలగుచు
దపముఁగావింపఁ బరిపూర్ణ దయదలిర్పఁ
గార్తికేయుండు వారికిఁగానుపించె॥ 68

క॥ ఆనందంబున నాసతులానగకోదండతనయు నతిశయలజ్జా
మానసలయి ధవళాబ్జసమానాక్షులు విచ్చికనిరి మఱిమఱిశౌరిఁ॥ 69

తే॥ హర్షపులకితగాత్రలై హస్తములను
మోడ్చి సద్భక్తివందనంబులనొసర్చి
యిరుగెలంకులనిలుచు నాయిగురుబోండ్ల
గాంచి షాణ్మాతురుండిట్లటంచుఁబలికె॥ 70

ఉ॥ కామినులార మీహృదయకాంక్షితమేమొకొ తెల్పుఁడిచ్చెదఁ
బ్రేముడితోడనాపుడల బిత్తరులాత్మలసిగ్గుదోపఁగా
మోమరవాంచిగద్గదిక మున్నుగఁదోప మహాత్మ మమ్మునీ
భామలుగాగ్రహింపుము కృపామతినిన్నుభజింతుమెప్పుడుఁ॥ 71

ఉ॥ ఈనెనము స్తలోకముల కీశుఁడవౌట మదాశయంబులం
దీవెవిభుండవంచు భజియింతుము కూర్మివరింపుమమ్ములం
బోవిడకంచుబల్కువిని పూర్ణకటాక్షముచే గుహుండహో
యీవరమియ్యఁగా సమయమిప్పుడుకాదు వినుండుతెల్పెదన్॥ 72

వ॥ సౌందర్యవల్లివై ననీవు శైవమునీంద్రుఁడెచ్చోటనుండునచ్చోట మదాజ్ఞ జన్మింపు మమృతవల్లివై ననీవు బురందరుమందిరంబున వృద్ధినొందు మిట్లున్నమీయిరువురను గొంతకాలంబునకు మీకోరినరీతి వరియింతునని వరంబొసంగి మహాసేనుండవ్వోటుగదలి తల్లిదండ్రులఁజూచువేడ్కఁ గల ధాతళిలోచ్చయంబునకుంబోయెఁ బదంపడి యక్కన్యకామణులిద్దఱు మనంబులసంతసించి కుమారునాజ్ఞానుసరణంబుగా నవతరించఁబూని తొలంగిచనిరంత॥ 73

—♦ దేవతలు కైలాసమునకుఁబోయి శివునిఁబొగడుట. ♦—

ఉ॥ పన్నగవైరివాహ బలభంజనముఖ్యసురాళి రాక్షసుల్
వన్నినబాధలన్ విసివి వందురి రూప్యధరంబుఁజేరియుం
గ్రొన్నెలతాల్పువాకిటను గొల్చివసించిన నందికేశ్వరున్
మన్ననఁగాంచి పూజలిడి మర్మముడాపక తెల్పెనంతయున్॥ 74

శా॥ దుష్టారాతులంద్రుంచి మమ్ముమనుపన్ దుర్గేశుఁడేకాక ను
త్కృష్టుండన్యుఁడులేమివచ్చితిమి భీతింజెందిమేమెల్ల మా
కష్టంబుల్ వినిపింపనంచుఁ బలుకంగా నందియీవేళ నీ
యిష్టంబొప్పదునిల్పుఁడన్న దివిషద్బృందంబునిల్చెన్గిరిన్॥ 75

ఆ॥ ఇటులఁగొంతకాలమేగించి నందీశు మరలవేఁడుకొనుఁడు మనసుగరఁగి
శివునిసమ్ముఖమునఁజేరి సాష్టాంగదండములొనర్చిపలికె నయముతోడ॥ 76

శా॥ స్వారాడచ్యుతముఖ్యదేవతలు యుష్మద్దర్శనేచ్ఛన్ బహి
ర్ద్వారంబందునఁగాచినారు కరుణార్ద్రస్వాంతతంజూడవే
వారిన్ శంకరయంచువేఁడ హరుఁడవ్వాక్యానుసారంబుగాఁ
జేరన్ రమ్మనవేగి తోడుకొనివచ్చెన్ వారి నందీశుఁడున్॥ 77

క॥ ఉభయాంకంబుల శరజన్మభవానులనుంచి మోదమతినున్నహరుఁ
బుభుమౌనివితతిగనుఁగొని యభినుతులొనరించెనతిశయాసక్తిమెయిఁ 78

—♦ ద్విపదము త్తకోకిల దుష్కరప్రాసపదనియమ కందగర్భితసీసము. ♦—

సీ॥ దాసకామితదాయి దానవదండి వాసుకిభూషణా వరశుభ్రదేహ
వాసరాధిపతేజ వాక్పతివంద్య వాసకృతాచలాభవ శార్ఙ్గిరోప
కాసరాశ్వ మదోరగద్విజకాంత భాసురవైభవా పరసూదనోగ్ర
దోససంఘవిదూర తోయధితూణ కేసరివిక్రమా గిరిచాపభృత వి
తే॥ రతివిధుత నుతిలోల నరరుదిత ఘనచండపవన రాజత్కీర్తి శైలజేశ
శంబరారాతిదోర్గర్వ సాగరౌర్వ భువనరక్షణసర్వేశ భూతనాథ॥ 79

—♦ ఇందలి గర్భపద్యములు. ♦—

ద్వి ప ద.

దాసకామితదాయి దానవదండి వాసుకిభూషణా వరశుభ్రదేహ
వాసరాధిపతేప వాక్పతివంద్య వాసకృతాచలా భవశార్ఙ్గిరోప
కాసరాశ్వ మదోరగ ద్విజకాంత భాసురవైభవా పరసూదనోగ్ర
దోససంఘవిదూర తోయధితూణ కేసరివిక్రమా గిరిచాపభృతవి॥ 1

మ త్త కో కి ల.

దాసకామితదాయి దానవదండి వాసుకిభూషణా
వాసరాధిపతేజ వాక్పతి వంద్యవాసకృతాచలా
కాసరాశ్వ మదోరగద్విజకాంత భాసురవైభవా
దోససంఘవిదూర తోయధితూణ కేసరివిక్రమా॥ 2

దుష్కరప్రాసపదనియమకందము.

క॥ వరశుభ్రదేహ భవ శార్ఙ్గిరోప పరసూదనోగ్ర గిరిచాపభృతా
విరతివిధుత నుతిలోల నరరుదిత ఘనచండపవన రాజత్కీర్తి॥ 3

సర్వతఃప్రాసనీసము.

సీ॥ శ్రీనందిపుత్రాయ మానాథమిత్రాయ కీనాశశత్రాయ తేనమోస్తు
మీనాంకహరణాయ మౌనిహృచ్చరణాయ దానవార్దరణాయ తేనమోస్తు
యానందవేషాయ దీనాళిపోషాయ దానవశోషాయ తేనమోస్తు
సూనృతభాషాయ యేనోంధపూషాయ గానసంతోషాయ తేనమోస్తు
తే॥ భానుశశికీలినేత్రాయ తేనమోస్తు మానితశిలాదపుత్రాయ తేనమోస్తు
ఫేనసమశుభ్రగాత్రాయ తేనమోస్తు జ్ఞానినంద్యచరిత్రాయ తేనమోస్తు॥ 80

-♦ విష్ణ్వాదిదివ్యులు శూరాదిరాక్షసవధార్థము కుమారసంభవమని శివుని వేఁడుకొనుట. ♦-

చ॥ ఇటుసుమనశ్చయంబు నుతియించెడువేళ శిలాదసూతి ధూ
ర్జటిగనుగొంచు దేవ వనజాక్ష. పితామహ, భూధరాసుహృ
జ్జటిలులు శూరపద్మదనుజప్రభు కృత్యవిపత్తులోర్వలే
కటమటనొంది మేనుగుహాయందువసించిరి ముక్తగేహులై॥ 81

క॥ మీపదకంజములే తమప్రాపనివిచ్చేసిరిపుడు బలుకారుణ్యాం
బేపారవారిఁబ్రోచుట నీపాలంబడియెఁజూడ నిజముమహాత్మా

చ॥ అనునెడ దివ్యులీశ్వరముఖాబ్జమునం దమచూడ్కినిల్పి పా
వనచరితా. జగద్భయదవర్తనులైన నిశాటకోటులం
దునిమి తదీయబాధలను ద్రోచిమముంగడతేర్చ షణ్ముఖుం
బనుపుమటంచువేఁడిరి కపాలిమనంబుగరంగినీరుగాఁ॥ 83

తే॥ వారిదీనోక్తులాలించి వారిజారిధారి కూరిమిగౌరికి గోరితెల్పి
హారిభుపనోపకారి జితారిగుహుని శిరముమూర్కొని కౌఁగిటఁజేర్చిపలికె॥ 84

—♦ శివుఁడు రాక్షసవధార్థముకుమారునిబంపుట. ♦—

అం త్య ప్రా స ము.

ఉ॥ శూరుని భీకరారిజితశూరుని నాగమయుక్తయజ్ఞసం
హారుని శైలధీరుని సమస్తనిలింపకృతాపకారునిఁ
వీరుని నిమ్నగాధిపగభీరుని దారుణనీలపర్వతా
కారుని సోదరాస్త్రభటకాండసుతాది బలంబుగూల్పుమా॥ 85

వ॥ కుమారా! మదీయశాసనంబున శూరపద్మ, తారక, సింహవక్త్రాది
రాత్రించరగోత్రంబు బరిమార్చుటం జేసి బ్రహ్మాండములందుగాఢబలంబున
నిన్నెదిరించువీరుండొక్కండుగల్గంబోవఁడు సుమనఃకార్యంబవశ్యకర్త
వ్యంబని దృఢంబుగాఁబూనితివేనిఁ బరాభవంబుదూరంబై సమిజ్జయంబు
బ్రాపించుఁ గాన ధరిత్రి నరాదరహితంబు జేసి సురాలికిముదంబొసంగు
మని మహానటుండు మహాసేనునకనుప్లవంబుగా రుద్రకోటులనిచ్చి
యేకాదశరుద్రులశస్త్రంబుల జేసి దురాసదంబగునొక్కశక్తిఁజిత్తంబునఁ
గల్పించి ద్వాదశాదిత్యప్రతిమాన తద్ద్వాదశ ప్రహరణంబులఁ గొమరు
సామి యీరాజుచేతులఁ గీల్కొలిపి సప్రేమంబుగా భీకరసర్వలాకేతన
వజ్ర నిస్త్రింశసాయకపద్మసృణి ఘంటాకుంతకార్ముకపరశ్వధ శూలాది
సాధనంబులును దశశతార్కప్రతీకాశ నిశ్శేషశస్త్రాస్త్రాఢ్య శతశతార్వ
సంగతస్యందనంబును జిత్రమణిప్రకాశాభేద్య స్వర్ణమయతనుత్రాణంబును
నక్షయశరనిషంగద్వయంబును నొసంగి సారెసారెవీక్షించుచుఁ బూర్వా
దిత్యులఁ బంచత్వంబునొందించి చిరాయుఃకలితుండవుగమ్మంచు నాశీర్వ
దించిపొమ్మన లోకమాతయగుశీతగిరిజాత యాతతచేతఃప్రీతి శాతాస్త్ర
శస్త్ర తేజఃప్రభూతుఁడగు తనుజాతునిఁ గౌఁగిటనిడి సుతాదితిసుతతతిని
హతమొనరించి క్రతుభుక్కుల నతిదయ నవితంబుసేయుమని మంగళా
శీర్వచనంబులచే వీడుకొల్ప సుబ్రహ్మణ్యుండు మహోత్సాహంబునఁ
బొదలి॥ 86

ఆ॥ తల్లిదండ్రులకుఁ బ్రదక్షిణత్రయపూర్వ
కముగ సాఁగిమ్రొక్కి కరములపుడు
మోడ్చి యెదుటనిలుచు మూషకవాహనా
నుజునిఁబూచె శిష్టుఁడనూన కాంతు॥ 87

వ॥ మఱియు నియుతసంఖ్య గణాధ్యక్షులజతకూర్చి వైరిమారకులగు వీర
బాహ్వాదిశూరుల నూటయెనమండ్రగు సేనాధిపతులనిచ్చి నిశాతశర

ఘాతలకు ఖీతిల్లనివీతులఁ బంౘెఁదు వేలనొసంగి యిందుశేఖరుండిందిరా
నాథాది బృందారకులకిట్లనియె॥ 88

చ॥ ఇతఁడసురోత్కరంబుల నహీనబలంబునఁ ద్రుంచి లోకముల్
కుతుకమునందఁజేయు సురకోటినిగూడి భయంబువీడి మీ
రతులిత తేజుఁడౌ గుహు మహామహిమంబును శౌర్యముకులన్
హితమతిఁజూడుడంచు వచియించిచనెన్ హరుఁడార్యతోడుతన్॥ 89

క॥ అవలవనమాలి శతధృతి పవిపాణిప్రముఖ దేవపటలి కుమారున్
వివిధనుతుల నలరించుచుఁ దవిలిచనియెఁ గొంతదవ్వు దర్పముమీఱన్॥ 90

—♦ శరజన్ముఁడు దేవసేనలతో హేమకూటాద్రిజేరుట. ♦—

సీ॥ అవ్ఫోటనిర్జరు లతిబలుప్రార్థించి మానసవేగంబుబూను తద్ర
థతురంగములకుఁ జోదకుగానొసర్చి నాకులదుందుభులుమ్రోసెగుసుమలాజ
వర్షంబుగురిసె మహర్షులు జడలాత్మతనువులకొగిఁజుట్టి తాండవించి
రురగగంధర్వ కింపురుషకిన్నరయక్ష గరుడబింబోష్ఠు లుత్కంఠతోడ

తే॥ శోభనంబులుపాడిరి సురుచిరముగ
నారదాదులు విజయంబుగోరి సారె
స్వస్తివచియించిరి మునీంద్రసతులు లోక
మాతలెడనెడబాడిరి మంగళములు॥ 91

వ॥ తదనంతర మధోక్షజద్రుహిణ విశ్వకర్మలు వీరబాహ్వాది వీరాగ్రేసరులకు
నానారూప పరిష్కృతంబులగు రథతురంగ, శర, సామజ, కంకట రక్షా
బంధామలొసంగిన వారందఱు సేనానియాజ్ఞ నాయాశతాంగములధి
రోహించి బహువిధాయుధపాణులయి నడుచుసమయంబున॥ 92

క॥ చతురంగబలము మున్నుగ
వితతంబుగ బలసికొలువ వివిధానీకో
చిత వాద్యఘోషములు బ
ర్వతబిలములు బదులుమ్రోయ బరువడిమ్రోసెన్॥ 93

తే॥ ప్రధిత రధచక్రహయగజ పద్గపద సముద్ధతరజంబు దిమిరాహితేద్ధ కిరణ
పటలిమాయించి నక్షత్రపథముగప్పె దితిజులిటుచెడఁగలరని తెల్పుకరణి॥94

క॥ హర్షాంతరంగులయి దే
వర్షులు బ్రహ్మర్షు లురగవరతల్పక లే
ఖర్షభ సురమునిసతులును
బార్షదయుతుఁడగు కుమారుబడిఁజనిరపుడున్॥ 95

అ ం త్యా ని య మ ము.

చ॥ కతిపయవాసరంబులకుఁ గాంచిరిపోయి మునీంద్రకూటమున్
గతకళమీమధూక సహకారవటామ్లిక వృక్షవాటముం
జతురపరాక్రమాఢ్య హరిశల్యకిటిద్విపి ఖడ్గఘోటమం
చిత మణిసంక్తిదీప్తి గతశృంగసుఖేటము హేమకూటమున్॥ 96

మ॥ కనియక్కొండవసింప నచ్చటిమునుల్ క్రౌంచాద్రియుం దారకా
ఖ్య నరాదప్రభురక్షితంబయిన మాయాపట్నముంగాంచి భీ
తిని గాంగేయునిఁజుట్టినిల్చినతఱిన్ దేవర్షియౌ నారదుం
డనియెం గ్రౌంచనిశాటువార్తగుహుతో నాలింపవాచంయముల్॥ 97

క॥ అలికాక్షుభవ దురాగ్రహకలితుండై క్రౌంచపలలఖాదనుఁడరయం
గలశోద్భవుశాపంబున మలయద్యెన్ వీనిరూపుమాపుముతొలుతన్॥98

—♦ నారదుడు విశాఖునకుఁదారకాసురుని వృత్తాంతముఁజెప్పుట. ♦—

సీ॥ కరిముఖుండగు తారకాసురుండతిమాత్రకాయుండు దేవతాకంటకుండు
దుష్టసంత్రాణుండు శిష్టపీడనకారి నిరత దుశ్చేష్టావి నిందితుండు
నై క్రౌంచభూమీధరాసన్న శాంబరీపుటభేదనంబున భూరిగంధ
సింధురస్యందన సైంధవపాదాతికధ్వజినీ జాలకంబుగొలువ

తే॥ వివిధశస్త్రాస్త్రములుదాల్చి విబుధవిప్ర
పాళి వేధించుఁగావున భండనమున
వీనిఁబరిమార్చుమనుడు నవ్వీరబాహు
మోముగనుఁగొనిపలికెను సోమసుతుఁడు॥ 99

ఉ॥ వింటివె యీరణాశనునివిస్మయవాక్కులు లోకమందునం
గంటకుఁడెవ్వఁడేని యపకారమునాకొనరింపనోర్చెదన్
గెంటనిభక్తినన్ గొలుచు కిల్బిషదూరలబాధసేయ నె
న్నంటికినోర్వనోప యమునాసహజాతుని వీడుఁజేర్చకన్॥ 100

చ॥ తడయకనీవుముందుజని తారకుప్రోలును గ్రౌంచశైలముం
గడుబలశౌర్యధైర్యములు గన్పడ నుద్ధతినాక్రమింపు మేఁ
గడలిబరుండువాఁడు సురకాండము నీవెనువెంటఁ దిన్నఁగా
నడుతుమటంచుఁబల్కి కరుణామతి నాతనిఁజూచి వెండియున్॥ 101

వ॥ బాహులేయుం డాత్మీయచతురంగవరూధినులం దర్ధసేనలవిభాగించి యష్టోత్తరనియుత గణపసత్తములఁ జతురధికపంచాశద్వాహినీపతుల నతనికిజతకూర్చి పోయిరమ్మనియాజ్ఞసేయ మహాబాహుఁడగు వీర బాహుఁడాతఁణంబ సకలసైన్యంబులుఁదన్నుసేవింప మున్నుగాఁజన వెన్నంటి యనుగతమన్నికరుండయి ద్వాదశకరుండుబయలుదేర వీర భటులు సంగరోచిత పౌరుషంబులాడుటలాలించి సర్వగీర్వాణులుఁ బూర్వాదిత్యత్రాసనిరాసులై నితాంతానందంబునఁబోవుచుండిరంత 102

—♦ మాయాపట్టణమందు దుశ్శకునములు గాన్పించుట. ♦—

క॥ సురరిపుపురి నభ్రంబులు శిరభాకృతినొంది నెత్తుజడివర్షించెన్
వరగోపురశిఖరంబులు ధరణిఁబడెన్ విజిగి దితిసుతవ్రజమదరన్॥ 103

తే॥ రాజితానంతఫణి ఫణారంగసీమ హర్షమతి నాట్యమాడెనో యన ధరిత్రి
వడఁకెనశనిద్రుషత్పాంసువర్ష మభ్రవితతివర్షించె ఘనమరుత్ప్రేరణమున 104

క॥ జలరాసులనీరము ఫేనిలమైఘూర్ణిల్లెఁ గలశ నీరదపదవిం
గలిగెన్ధూమధ్వజమెంద్రులమేతరు లఱవఁదొడఁగెఁబ్రొద్దునకెదురై 105

సీ॥ సరటముల్ దానవశిరములఁబడియెను భవనపంక్తులఁ గచ్ఛపములుఁబుట్టె
దలలేనిమేను లధ్ధమునసోఁకులకొప్పె హయములకనులందు నశ్రులొలికె
గవిశిష్యసిడములఁ గంకగృధ్రములుండె నింద్రచాపము నీటియందుఁదోచె
నాకస్మికంబుగా నరదంబులిల నధోముఖములై పడియె మున్మున్నతునిసి

తే॥ యిట్టి చెడుసూచకంబులనెల్లఁ గాంచి
భూలసుఁదిండికోలంబింకఁ బొలియగలదు
కానియెడ దుర్నిమిత్తముల్ గలుఁగుటెట్టు
లనుచు భీతిల్లుచుండిర య్యసురవరులు॥ 106

—♦ వీరబాహుండు మాయాపట్టణంబాక్రమించుట. ♦—

అ॥ అట్టిసమయమంబు నప్పురినరికట్టి వీరబాహుఁడాజి విజయమబ్బ
భవ్యసూచకములుఁ బ్రభవింపఁబొడగని యుల్లమందుసంతసిల్లుచుండె 107

వ॥ అత్తఱినత్తారకుండు మిత్తిమిత్తిబుడుకనిమొత్తంబు తనతల్లిపేరంజేసిన
వీడుముట్టడింపఁ జెల్లార్చునల్లద్రావుడుల హల్లకల్లోలంబువిని యుల్లంబు
నందలుకవొడమి విద్రపేరితుండయి యయ్యెడ॥ 108

ఉ॥ దారుణసాయకోత్కర యుతంబు హయప్రకరాంచితంబు వీ
రారిభయప్రదంబు మణిహాటకనిర్మితమౌ శతాంగమం
దీరసమూరనెక్కి సురహింసయొనర్పఁగఁబోవు కైవడిం
జారుముఖారవిందుఁడయి సత్వరనేఁగె సమున్నతోద్ధతిన్॥ 109

మ॥ రణభేరీరవ హూయమానపృతనా వ్రాతాతిరావంబునిం
డనభంబెల్లఁ బదాతివాజికరిబృందస్యందనాస్త్రాదిసా
ధనయుక్తిన్ ధ్వజినీపతుల్ పురబహిర్ద్వారంబునంజేరి రు
ల్బణ శస్త్రాంచితమైనసేన పృథులీలన్ వెంటనేతేరఁగన్॥ 110

శా॥ శైలాధీశ్వరపౌత్రుసేనఁగని రక్షస్సైనికుల్ క్రొవ్వులై
కీలింజొచ్చుపతంగపంక్తిక్రియ ద్రాఘిష్ఠప్రతాపంబుచే
నాలంబందునవీకమార్కొనుఁడు నయ్యాదఃపతిన్నిమ్నగా
పాలుల్ సొచ్చినభంగిఁ దోచె బిరుదుల్ పాటించిరంతన్సురల్॥ 111

—♦ దేవదానవులసంకులయుద్ధము. ♦—

మ॥ బలగర్వంబులుమీఱి రక్కసులు కుంభచ్ఛాపమౌర్వీ రవా
కులదిక్కుంజరులై నిశాతశరపంక్తుల్ మేననాటంగ నా

కులనేయం జలియింపకబ్బలుమగల్ గోపించి తద్వైఖరిం
బోలదిండ్లఁ బడరించిరిట్లుభయులుఁ బోరాడిరాకాంకులై॥ 112

ఉ॥ సాదిపదాతిహస్తిపక సద్రధికధ్వజినీశ సూతులుఁ
సాదిపదాతిహస్తిపక సద్రధికధ్వజనీశ సూతులుఁ
రోదసినిండనార్చుచును రోషముమీఱఁగ దాఁకిరష్టు మాం
సాదసురాళులందున మహోబ్ధిమహోబ్ధిఁబెనంగుకై పడిఁ॥ 113

క॥ వీరులగు దివిజపలభుగ్వారంబులు వీరబాహు కరిముఖదైత్య
ప్రేరితులై యనిఁజేసిరుదారత నన్యోన్యవిజయ తర్షమనీషఁ॥ 114

చ॥ పరిఘు కుఠార తోమర కృపాణ శిలీముఖ భిండివాల ము
ద్గర ముసలాశనిప్రముఖ కర్కశతేజిత శస్త్రకోటు లొం
డొరుల నొడళ్లఁగ్రచ్చుచు సముద్ధతి నాయుధపూరితాంగులై
పరులవధించుచుం బరులవల్లనడంగుచు నుండిరాజిలోఁ॥ 115

పంచపాది.

తే॥ అట్టిసందడికయ్యామం దమరవరులుఁ
బసులఁబోలియించు పసిదిండ్లపగిది రాత్రి
చరులఁజంప మరుత్తతిఁజంపిరట్లు
దనుజు లిటుపోరిరుభయులు దారుణముగ
జయము నపజయమునులేక సమతనపుడు॥ 116

తే॥ వీతిరింశా రథప్రధిదాతసాంద్ర ధూళి హస్తిఘటాకర్ణ ధూతమగుచుఁ
గటికచీఁకటి దిక్కులఁగాలుకొల్పి నలినసంతోష కారిమండలముఁగప్పె 117

వ॥ తత్సమయంబున విక్రమోత్సాహ హేతుకంబులగు ధనుష్టంకార
సంగ్రామ భేరీజయ కంబుధ్వానంబు లన్యోన్యనరాధినులందు సాంద్రంబై
తనరఁ దీక్ష్ణవిశిఖాది నానావిధసాధన ప్రభిన్నపరస్పరాపఘన నిర్గతక్షతజ
ధారాప్రవాహంబు సమిద్భూతలావృత పాంసుజాలంబు రూపుమాపఁ
బెనంగుచున్న ననిమిషసైన్యాధిపులు విజృంభించి సంవర్తకీలికీలాభంబు

లగు నాయుధముల దోషాచరులవేధింప సంక్షోభించి రక్షకులులేక రాక్షససేన సంగరక్షితినిలువఁజాలక నలుగడలవిచ్చి నగరమార్గంబునఁ బఱచెనయ్యెడ॥ 118

క॥ తారకుఁడు యామినీచరవీరులు సంగ్రామభూమివిడిచి విముఖులై
ధీరంబుమాని తొలఁగుట లారసి కన్నారఁగాంచి యతిక్రుద్ధుండై॥ 119

వ॥ భీమాకారంబున రయంబుమెఱయఁ దేరుడిగ్గి వ్యాసకాలాయసభార రచితంబు మహోత్తుంగంబు సందానితకనకపట్టసంగతంబు సూనదామ ప్రకాశితంబునగుగదాదండంబు దోర్దండమునధరించి యంగుళ్యగ్రంబుల ఘుళిపించుచు ముహుర్ముహుస్సంఘర్షణ దళనుండయి లయాంబుదగర్జా తిరస్కృత సింహనాదుండగుచుఁ బెదవులుఁగొఱుకుచు బొమముడి పాటుతో సేనాసహస్రంబుల భూతగణనాధులందాకియంత॥ 120

సీ॥ ఘనగదాతాడనంబునఁ బిల్కుమార్చుచు మదదంతిగతిఁ గాళ్లమర్దనంబు
సేయుచుఁ గరముల్రవేయుచు విహారింపనియుతగణేశులు నిల్చియొక్క
పెట్టునఁ దారకుఁజుట్టి విచ్చినఁ దమబలములఁబురికొల్పి విలయకాల
జలధరంబులరేఖసర్పసామ్యప్రపత్క గణమునర్షింపుచుఁగదియుటయును

ఆ॥ తారకుండుఁ దనగదాదండమున వానిఁజదియమోఁది రోషమధికమగుడు
కన్నులెఱ్ఱఁజేసి గదనుర్విఁనడచిన వసుమతీతలంబు వ్రయ్యలయ్యె॥ 121

శా॥ అంతన్ ముజ్జగముల్ సెవుడ్పడఁగ సింహారావముం జేసి దు
ర్దాంతుండై యెదిరింపఁగాఁ గులమహీధ్రంబున్ లయక్షీరము
క్సంతానంబులుఁగప్పి వేకురియునోజన్ బాణవర్షంబు న
త్యంతక్రోధముచే సురల్గురియఁజేయం దారకుండార్చుచున్॥ 122

శా॥ బాహాస్ఫాలనమాచరించి గదనబ్రాణంబులంద్రుంచుచున్
వాహశ్రేణిగలంచుచున్ రథములన్వైశంబనుగ్గాడుచున్
సాహంకారపదాతులన్ మహిఁబడంజక్కాడుచుం గుంజరా
శీ హస్తంబులఁబట్టిత్రిప్పి లఘుకేళిన్వైచె వారాశిలోన్॥ 123

— ♦ వీరకేసరి తారకాసురునితోఁ బోరుట. ♦ —

క॥ ఆసమయంబున రిపుగజకేసరియననొప్పు వీరకేసరి నిలుమో
హాసురకంటకయని పెల్లీసునఁదారకునిఁదాఁకె నెల్లరుఁబొగడన్॥ 124

ఉ॥ తాఁకి వలాహకంబుదకధారల శైలముముంచుకై వడిన్
భీకరశస్త్రవర్షమునఁ బెల్లుమునుంగఁగఁజేయఁ దారకుం
డాకృతినొందుకోపమనునట్లుఁ జెలంగి రథస్థుఁడై బలో
ద్రేకములోడ నేసెఁ బటుతీవ్రశరంబుల వీరకేసరిన్॥ 125

తే॥ ఇట్టులవ్వీరులిరువురు మట్టుమీఱి
దిట్టతనమున శౌర్యంబులుట్టిపడ
యట్టునిశితాంబకంబులఁ గొట్టికొనుచు
దురమొనర్చిరి మదనశంబరులకరణి॥ 126

తే॥ అట్టియెడవీరకేసరి యసురుఁగినిసి
వాఁడిములుకుల నుచ్చిపోవైవ నతఁడు
నారిమ్రోయించి పదునైన నారసములఁ
బఱపి పగతురతూపుల నుఱుము సేసె॥ 127

క॥ మగుడఁ గనకపుంఖంబులు నగజాధిపదత్తములు మహాహిసమములై
తగియెడుశిలీముఖంబులు నగణితముగ నేసియార్చె నంబరమదువన్॥ 128

ఉ॥ ఆరవమాలకించి విలయాంతకుమాడ్కి విజృంభ మొప్పఁగా
వీరమృగేంద్రుఁ డత్యధిక విస్ఫురితాంబకపాళిఁబూని త
ద్ఘోరశరాళిఁద్రుంచి పదికోలల దైత్యుఁగిరీటముర్విఁ దో
స్సారమునంబడంగెడపి జన్యధరాస్థలివిక్రమించినన్॥ 129

వ॥ అట్టియెడ దేవదుందుభులుమ్రోసె నిలింపులు భూయిష్ఠపరిభ్రమద్భృంగ
ఝుంకారసంకులంబులగుచు దిక్కులుకలగుండువడ సురభిప్రసూనవృష్టి
గురిసిరత్తఱిఁ దారకుండు పీకించి ఘూర్ణితారుణనేత్రుడై గదఁగొని
కదిసిపరిపంథులుక్కుదక్కి నలుదిక్కులంబాఱ విసరి వీరకేసరియురమ్ము
వియ్యవేసి యట్టహాసంబుఁ జేసె నంత నబ్బలుమగండు సొమ్మసిల్లినంగని

—◆ వీరబాహుండుఁదారకునిఁదాఁకుట. ◆—

వీరబాహుఁడు మాత్సర్యంబున వీరగణవేష్టితుఁడయి తేరెక్కి కాలుపోలికఁ దారకునకెదురేఁగి ప్రౌఢి యిట్లనియె॥ 130

క॥ దనుజాధమ వాకెదురై యనినిల్వుభయంబువీడి యమునిఁగనఁగ ని
న్ననిఁ బెదనిఁక జీవించెద ననుకోరికమానుమనుచు నతనిం డాసెన్॥ 131

ఉ॥ దైత్యుఁడవక్రవిక్రమముఁ దాల్చి శతాంగమునెక్కి చాపమం
దత్యరనారిఁగూర్చి హరిదష్టకముంజలియింప వజ్రిపై
ధృత్యచలంబు మార్కొనుగతిం జనితాఁకి పెనంగిరిర్వురున్
దైత్యకులాంతకుండు మధుదైత్యుఁడుఁ బోరొనరించులాగునన్॥ 132

క॥ సురసిద్ధసాధ్య విద్యాధరులచ్చరలాకసమున దర్శించుచు ని
ల్చిరి పరమప్రీతిని వారిరువురకలహంబుఁ గనులకింపుజనింపన్॥ 133

తే॥ అంతనసురుఁడుఁ గవిబుధు లంతికమున
నిలుచుతఱిఁ బ్రావృడబ్దంబు చెలువుఁగాగఁ
బ్రధుశరాసారమును గురియింపదివినిఁ
దదిషుతతిచేతఁ దిమిరంబు దళముకొనియె॥ 134

వ॥ తదనంతరమవ్వీరబాహుండు నప్పుచు రత్నాకరతూణిరత్నసానువుం బోలి కార్ముకంబుఁబాణిం ధరియించి శింజినిమ్రోయించుచుఁ దద్దిక్ప్రాప త్యేషుకృత దుర్దినంబుఁ బదునాలుగుకోలలఁ దొలఁగించె నప్పుడత్తార కుండు రుద్రైకృతతారకుండై యతిభీమంబునుఁ గుసుమాపచితంబును ఘంటాచామరసంయుతంబును నగుశూలంబుఁ గీలాభీలముగాఁ గాలా గ్నిరుద్రుపై ఖరింద్రిప్పి వైవ నివారింపఁజాలక వీరబాహుండు మూర్ఛా న్వితుఁడై ధరనొఱగెనంత॥ 135

ఉ॥ అతనితమ్ములేడ్వురును నాతతసాయకవృష్టి నిర్జరా
రాతినిముంపఁ దచ్ఛరపరంపరలాతఁడు నైజహస్తసం
ఘాతనడంచి పేర్చి గదఁ గైకొని వారలమోఁదిన న్మహా
భీతినిఁ జెంది నల్గడలవిచ్చిరి శౌర్యమువీటిఁబోవఁగన్॥ 136

మ॥ మణిపుత్రాగ్రణి మూర్ఛదేఱియపుడ మ్మర్త్యాదునిఁ మత్తవా
రణముఁసింహ్మముగొప్పరీతిని బలే రాత్రించరా నిల్వుమీ
రణరంగంబున నాదుబారిఁబడి సప్రాణుండవై పోదువే
ఫణిభూపాంఘ్రులయానయంచుబిరుదుల్ పల్కెఁమహోత్సాహియై॥ 137

క॥ అమ్మాటలతఁడువిని కోపమ్మినుమడిగాఁగ వీరబాహూ నీచి
త్తమ్మున నాపటుదోర్వీర్యమ్మెఱుఁగక ప్రల్లదములనాడెదువినుమా॥ 138

—♦ తారకుఁడు వీరబాహుఁని దిరస్కరించి ప్రగల్భములు వలుకుట. ♦—

సీ॥ మునురణంబునఁ గోటియినతేజమైన లక్ష్మీపతిచక్రంబు మ్రింగినాఁడఁ
బాకారివజ్రంబుఁ బావకుశక్తి కృతాంతునిదండంబు దనుజఖడ్గ
మప్పతిపాశంబు ననిలుధ్వజం బర్థవల్లభుగద యుమావరునిశూల
మంబుజసంభవాస్త్రంబును మద్బాహువిక్రమంబుననోర్చి వేగ భంగ

తే॥ పరచితదిగాక నిప్పుడు వడిన నీసహోదరులఁ జూచినాఁడవుగాదె నీవ
నంగనెంతటివాఁడవు సంగరమున నిన్నుసీదొరఁబరిమార్తు నిమిషమునను॥

తే॥ నిలువుమెటఁబోవఁగలవని నింగివగుల
నార్చి గదఁగొని తనదుకుండాగ్ర మఖల
దిశల నిబిరీసముగనుండు తెఱఁగుఁజేసి
కాలచక్రంబుగతిమించెఁ గ్రతుభుగారి॥ 140

చ॥ అదిగనివీరబాహుఁడు మహోక్రుధ సింహరవంబుసేయుచుఁ
మదిని నశేయుఁడీబిరుదు మానిసిఁదిండి యటంచెఱింగియుఁ
సదమల హేమపుంఖములు పర్వుదహేతి కరాళ విస్ఫుర
త్ప్రదరములొక్కటంబరపె బాహుబలంబున బంధురంబుగఁ॥ 141

క॥ అసురుండా తీక్ష్ణాంబక విసరంబులఁ గ్రూరభల్ల వితతినడంపఁ
హసితుఁడయి వీరబాహుండసమకలంబముల మగుడ నతనిఁవ్రేసెఁ॥ 142

క॥ దితిజుఁడు సానలఁదీరిన శితశరముల వానినెల్లఁ జిద్రుపలుగా ను
ద్ధతినేసి మఱియుమణిజాతుతనువుదూఱంగ వాఁడితూపులఁబరపెఁ॥ 143

తే॥ అంతనిలువక దశసహస్రాంబకముల
నతిరయంబుననేయ గుహానుజుండు
నన్నిశరములఁబరగించి యడఁప వీర
బాహుకరలాఘవము మెచ్చెఁ బలలభోజి॥ 144

—♦ తారక వీర బాహుల యుద్ధము. ♦—

శా॥ గీర్వాణారి మహోగ్రకోపమున నాగ్నేయాశుగంబేయఁగా
నుర్వివ్యోమములన్ శిఖాచ్ఛటలు బాహుళ్యంబుగానిండుచున్
గుర్వామర్త్యులు విహ్వలాత్ములయికాంచన్ జిట్చిటారావముల్
పర్వన్ ధూమముదిగ్వితానములఁగప్పన్ మించియేతేరఁగన్॥ 145

క॥ కని యుష్ణముష్ణమణచెడు ననువునఁ బావకశిలీముఖాహతి దానిం
దునుమాడె వీరబాహుఁడుఁ గనుఁగవరోషాగ్నులొలుకగా నవలీలన్॥ 146

క॥ సక్రోధుఁడగుచు గజవక్త్రక్రవ్యాదుండు వరుణకాండంబుఁ గకు
ప్చక్రంబుఁ గలఁగనార్చి యవక్రబలంబమర నతని వైచెంబూన్కిన్॥ 147

శా॥ దానం బ్రాక్ప్రవమానముప్పతిలి గోత్రాచక్రమల్లాడ మే
ఘానీకంబులు జెట్టుగర్జిలుచు వర్షానేహముం దెల్పఁగా
సేనానిప్రియసోదరుండలుకచేఁ జెండాడెఁ దన్మేఘముల్
జ్యానాదంబడరించి కర్కశమరుచ్ఛస్త్రంబుచే వ్రేల్మిడిన్॥ 148

ఆ॥ తారకుండుమఱియు సౌరాస్త్రమేయంగ
వారుణాశుగమున వీరుఁడడఁచె
సోమశరము రక్కసుండుఁబ్రయోగింపఁ
దోనఁదునిమె రత్నతనయుఁడదరి॥ 149

తే॥ అసురుఁడైంద్రశరమ్ము యామ్యాంబకంబుఁ
గోణపశిలీముఖంబోజఁ గొనుచునేయ
నతఁడుఁ దత్తచ్ఛరంబుల ధృతినిఁబరపి
హతముఁగావించెవాని నత్యద్భుతముగ॥ 150

మ॥ దితిజుండీర్ష్య విరించిశస్త్రముసముద్రేకంబుతోవైవ న
ప్రతిముండై మణిసూతి తచ్ఛరముచే భంజించె నాగాస్యుఁడు
న్నతరోషంబున దంతఘర్షణముతో నారాయణాస్త్రంబు శీ
ఘ్రతసవ్వీరునివైవఁ దాననతఁడుఁ గావించెశాంతంబుగాఁ॥ 151

చ॥ మఱియుఁ దమీచరుండధికమాయలఁ బెక్కుగురూపులందుచుం
గొఱకొఱ వీరబాహుపయిఁ గోలలనేయ నతండుఁబిండిగా
నఱికిన నంతఁబోవక ఘనంబగు మాయలనెల్లఁబన్నుచుఁ
నెఱయిరులొందఁజేసి యతనిం బటుసాయకపాళిఁగప్పినఁ॥ 152

తే॥ గండుమిగిలి యవ్వీరబాహుండుఁ గడఁక
వీరభద్రాస్త్రమప్పుడు వింటఁగూర్ప
నమ్మహాశరమీక్షించు నంతమాత్ర
పోయెఁ దనమాయలెల్లను మాయమగుచు॥ 153

—♦ తారకుఁడుమూషకంబై క్రౌంచగిరిగుహలోఁ బ్రవేశించుట. ♦—

వ॥ అంతనత్తారకుండు ధైర్యంబుఁజెడి మూషకంబయి క్రౌంచపర్వతబిలం బతిరయంబునఁజొర ఖండనోద్దండుఁడగు వీరబాహుండుఁ బలాయితుం డయిన వాలదిండిని ఖండింపఁగర్జంబని యవ్వీరభద్రాస్త్రముపసంహారముఁ జేసి తారకుండేగినదారినిఁజని క్రౌంచగిరి గహ్వరగర్భంబుసొచ్చిన వీరబాహుంగాంచి తచ్ఛిఖరి తారకదురాలోచనఁమించి వృథగ్విధ స్వకీయమాయల మోహపెట్టినఁ దద్గుహ మహాంధకారబంధురంబై కుహనాయనంబొందుఁగాన్పింప నమ్మార్గమునఁబోవునెడ ననేకములగు త్రోవలుఁగన్పట్టుచు నడంగుచుండ మానకఁ గొంతదూరంబువోయి దారిచిక్కక నక్తంచరుఁడదృశ్యుఁడౌటఁ బరిభ్రమణంబుఁజేసి తదద్రి మాయలఁజింతించి యౌరా శాంబరీరీతి యేరికినోరువనగుఁ గలయో విభ్రమమో యసి వేమారుఁ గళవళ పడుచు నీవలావలికిఁబోవఁ జేవలేక విచారపడుచు నచ్చోట నొచ్చియుండెనప్పుడు॥ 154

క॥ దీనులఋరతనితమ్ములు భానుప్రతిమానులయిన పంచాశత్సే
నానేతలు భూతధ్వజినీనియుతము వీరబాహునిం దొలగుటకున్॥ 155

ఆ॥ దీర్ఘకాలమతఁడు దిరిగిరామికిఁ జింతనొంది ప్రాణకాంతుయూడఁజేసి
యతనితోడిగతియయుందఅకనియెంచి చొచ్చిరబ్బిలంబుసొరిదివారు॥ 156

ఆ॥ చొచ్చితెరవుఁగాన కెచ్చటివారాడ నిలిచిమోహమున మునింగియుండి
రెంచనలవియగునెక్రౌంచుమాయాబలం బపుడుతారకుండహంకరించి॥ 157

—♦ తారకుఁడు గుహునెదటికివచ్చి దేవసేనలనుఋమూడుట. ♦—

క॥ జయశాలినై తిసేనని రయసమునగిరినిర్గమించి రథికుఁడయి మరు
చ్చయముసునిధనంబుసేయఁగఁ గయువింటిగుణంబుఁదీడికవిసెంబెలుచన్ 158

తే॥ సురరిపుఁడు వీరబాహ్వానుచర సమేత
ముగఁ గుమారునిబలముపై ముద్గరాసి
బహువిధాయుధనికరంబుఁ బరపితఋమఁ
దద్బలంబులుఁ బతిరహితంబులగుచు॥ 159

క॥ చేవచెడక ధైర్యాన్వితులై వేలుపుఁబగతుపై దృఢాశ్మ మహీజ
గ్రావములనేసి మఱి నా నావిధశరపాళిఁ బరపినం దారకుఁడున్॥ 160

క॥ ఏకాకియయ్యు శాత్రవభీకరుఁడై పెక్కుగతులఁ బృధుతర బాణా
నీకంబువరపి యన్నిఁటి వీఁకంజూర్ణంబుఁజేసె విక్రమమొప్పన్॥ 161

క॥ సరసీరహ మండితమగు సరసిన్ మదదంతివోలి శరజన్మబలో
త్కరమునలిరేఁగికలఁచెనుఁ బరమాద్భుతముల్ తదీయబలశౌర్యంబుల్ 162

ఉ॥ అంతటభూతసైనికులు నాహవభూమినినిల్వలేక భీ
స్వాంతముతో యథాయథలునై పరువెత్తినఁ బోవనీక దే
వాంతకుఁ డుగ్రసాయక చయంబుల నందఱనేయుచుండ శ్రీ
కాంత విరించిముఖ్య సురకాండముఁ జింతమునింగియున్నెడన్॥ 163

—: నా ర దా గ మ న ము :—

సీ॥ అరుణచ్ఛవిఁదనర్చి యలరుజటాలి బంధురగైరికాది ధాతువులుగాఁగఁ
గరశాఖకంపిత ఘనమహతీరుతుల్ పరమానహిత వంశరవముగాఁగ

మందస్మితాంకుర సుందరసితరోచు లజర సరిత్ప్రవాహములుగాఁగఁ
గటిబద్ధ మృగచర్మకాంతులు భూయిష్ఠ వర్ణకాంతార సంపదలుగాఁగ
తే॥ క్షితిఁదిరుగవచ్చె నీహారశిఖరియనఁగ స్వీయదేహప్రభాజిత శేషకుంద
చందనేందుశరత్కాందశారదుండు నారదుండేఁగుతెంచె సేనానిఁజేర॥ 164

తే॥ వచ్చిసద్భక్తి సాష్టాంగవందనముల నాచరించి మహావినయంబుఁదోప
నంజలీబద్ధుఁడగుచు దేవాళిబాధలెడదఁదలపోసి పేర్మితోనుడివెనిట్లు॥ 165

వ॥ మహాత్మా క్రౌంచగిరిగుహఁబ్రవేశించి తదీయశాంబరీప్రభావంబుచే వీర
బాహ్వాదులెల్లను మరలిరారైరి సప్రాణులై యున్నవారలో లేదో
తెలియనేరము భూతసైన్యంబెల్ల నలుదిక్కులకుఁబాఱె జేజేలకు
రేద్రిమ్మరులవెఱపురెట్టించె భయాకులిత చేతస్కులమగు మమ్ముఁ
దూర్ణంబ కటాక్షించి రాక్షసవ్యథలఁ బాపుమనివేఁడ శిఖావలతురంగుఁడు
గలహాభోజిపలుకులాలకించి రోషారుణితాక్షుండయి కాలాగ్నిగతి
మండుచు నిట్లనియె॥ 166

చ॥ దితిజులసంహరించెద మదీయవ్యథమానిచరింపు డస్మదా
శ్రితులగువారి నాపదలుఁ జేరవునిక్కువ మట్టివారికే
గతిని గదంబువెయ్యేవి జిఘాంసువులెవ్వరు క్షితియేడనో
సతతముమన్ని యోజ్యరిపుసంఘము లస్మదరుల్ నిజంబుగన్॥ 167

వ॥ అదియునుంగాక నాథక్షు లస్మదీయప్రాణంబులకన్న నెక్కుడగుటఁ
దద్వైరుల నాక్షణంబత్రుంచెద మఱియును గ్రౌంచునిభేదించి వీర
బాహ్వాదులరప్పించెద నవ్వల శూరపద్మసింహవక్త్రాది దైత్యసంతతుల
నంతకనికాయ్యంబున కతిథులఁజేయుట కిత్తారకునిఁ బ్రథమంబున వధి
యింతుననిపలికి సారథియగు నభస్వంతుఁగాంచి తేరాయితంబుఁజేసి
యత్యంతరయంబునఁ దోలుము నీసారథ్యచాతుర్యంబుఁ గాంచెదననిన
శ్వసముండయుతజవనాశ్వయుతంబుఁ జిత్రమణిచ్ఛవిప్రకాశంబు నగురథం
బతిశీఘ్రగమనంబునం బరపెనప్పుడు॥ 168

—♦ కుమారుఁడుఁదారకునిపై యుద్ధమునకు వెడలుట. ♦—

సీ॥ వివిధభేరీధ్వనుల్ విజయకంబుమృదంగ నిస్సాణడిండిమ నిస్వనములు
జటిలబృందారక జయజయశబ్దముల్ మాగధవంది సంరావములునుఁ
జాదాతకరతాళ పాదసంఘట్టన క్ష్వేడారవంబులు వీతినిచయ
హేషానినాదంబు లిభబృంహితంబులు రథనేమినినదముల్ రత్ననిలయ
ఆ॥ నిస్వనమడపంగ నీలకంఠాత్మజు సైన్యనికర మసురసైన్యములను
నాక్రమించిపోర నబ్బలంబులు రెండుఁ బోలిచెఁబూర్వచరమజలధులట్లు 169

వ॥ ఇవ్విధంబునఁ దలపడి యయ్యిరువాఁగును దుములంబు ఘోరంబుఁగా
జేయుచున్నఁదారకుండుఁ దనచెంతనున్న మతిమంతుఁడగుదూతనీక్షించి
నిజకరంబుచే నతనికరంబుఁజఱచి కుమారుదెసంజూపి యిట్లనియె॥ 170

మ॥ కులధాత్రీధర సన్నిభంబయి చమూకూపార మధ్యస్థితో
త్పలవైరిక్రియఁ బొల్చుఁదేరిపయిఁ గల్పస్వర్ణరేతాభుఁడుఁ
బలభిన్ముఖ్య సురౌఘవేష్టితుఁడు కుంభత్రేజుఁడైనట్టి యీ
లలితాకారుఁడెవండొ తెల్పుమనిపల్కెఁ భక్తివాఁడిట్లనుఁ॥ 171

ఆ॥ భువనరక్షకుండు దివిజపోషణకారి యధికశౌర్యమున ననన్యసముఁడు
హరతనూజుఁడు శరణాగతవత్సలుఁడగు కుమారుఁడీతఁ డసురచంద్ర॥172

సీ॥ సకలలోకేశుండు సర్వజ్ఞుఁడగు శూలికన్నను బలమున నతిశయుండు
గాంభీర్యధృతిశౌర్యకార్ముకాకర్షణ చాతుర్యములయందుసమరహితుడు
దక్షాధ్వర త్రిపుర క్ష్వేళహారుఁడగు హరుడైనఁ గలన నీపురుషునెదురఁ
జాలండనగ నమ్యుఁడేలీలమారొ్కను సౌందర్యమునఁ గాముఁగ్రిందుపరచు
తే॥ దీపసంభూతమయిన ప్రదీపముగలి
విష్టపారాధ్యుఁడగు వహ్నిపీర్యుఁ డిట్టి
తనయు ముదమూరఁగని ధన్యతముఁడనంగఁ
బరగెనని దూతవిన్నవింపఁ బలికెనసుర॥ 173

చ॥ అగణిత కోటిసూర్యనిభమైన రథంబదెతోఁచె దానిపై
జగదధినాయకుండు గిరిజాపతినందనుఁడైన నీలకం

తగమనుఁడున్న వాఁ డతనిడగ్గరి యేనొకకొన్ని మాటలా
డఁగ నెడదందలంచితిఁ గదంగుము తేరటుఁదోలశీఘ్రగతన్॥ 174

క॥ అనుఁడు మనోజుగ జవమునఁ
దనరారు రథాశ్వములనుఁ దఱిమికొనుచుఁ దో
డ్కొనిసారథిఁజనఁ దారకుఁ
డనురాగముతోడనేఁగి యతనిం డాసెన్॥ 175

—♦ తారకుఁడుఁ గుహునితో సామోక్తులుఁ బలుకుట. ♦—

తే॥ కాంచి లావణ్యజిత రతీకాంతుఁడైన
గుహునిచెల్వంబునకు మోహసహితుఁడగుచుఁ
గొంతసేపూరకుండి సుస్వాంతయుక్తి
సామవాక్యాలఁబలికెను సరసగతిని॥ 176

మ॥ అనఘా మీకొకమాట విన్నపము సేయన్ వచ్చితిం జిత్తగిం
చినవెన్కం దమచిత్తమెట్లొ యటులే చేయుండ దెట్లన్నచో
దనుజాస్వప్నకదంబకంబులకు సత్రాజంబువిద్వేష మీ
యని నన్యోన్యహితాత్ములై చసిన లేదాక్షేపణం బేమియున్॥ 177

క॥ ధనవల్లభహితుదయ యేయనుప్రనవర్తించు నట్టులగు నాత్మాజై
యను వేదవచనపద్ధతి ననయముఁబూజ్యుండవీవు హరుక్రియమాకున్ 178

ఆ॥ అట్టినీవు నేఁడు యన్యాయమున నిట్టులనికి నేలవచ్చి తచ్యుతాది
పరులు మమ్ము మేము వారలఁజంపినఁ జంపదగుదుమకట చన్నెనీకు॥ 179

వ॥ సాక్షాత్పరబ్రహ్మాత్మకుఁడవు శంకరతనూజుండవైన నీకిక్కార్యంబు
ధర్మమా స్వామీ! యనిపలుక స్కందుండు మందస్మితుఁడగుచు
నిట్లనియె॥ 180

క॥ దనుజావరూధినీ మధ్యను రథినై ఖేదనోక్తులాడుచు ఖేదం
బొనరింప వచ్చితి వెవరసుడుం దారకుఁడువలికె నాస్కందునితోన్॥ 181

క॥ తారకుఁడనువాఁడ మహాశూరుండగు శూరపద్మ సోదరుఁడ మరు
ద్వారములకైపెనంగుట యారయమనకుచితమనినహరసుతుడనియెన్ 182

క॥ స్వీయాశ్రితులగు సురధౌరేయాద్యమరాళిచేతఁ ద్రిభువనరతుం
జేయింపుచుసర్వమునకు నాయకుఁడైకాచుచుండు నగకార్ముకుఁడున్ 183

ఉ॥ అందులకై కపర్ది శ్రుతులందున నీశ్వరనామమొందె నా
సింధునిషంగి వేదమను సేతువు లోకములెల్లసౌఖ్యముం
జెంద సృజించియున్ విధినిషేధము లందులవేర్పరించెఁగా
నం దదనుజ్ఞ పూర్వసురనాకులకైన నలంఘ్యమెన్నఁగాన్॥ 184

తే॥ హరుననుజ్ఞమీఱక విధినిరతులగుచు
నడుచుతజ్జులు శిష్టులనంగభువినిఁ
బరగి తదనుగ్రహామునకుఁ బాత్రులై స
దా సుఖంబులఁగాంతురు తథ్యముగను॥ 185

వ॥ తదీయ శాసనంబతిక్రమించు దుశ్చారిత్రులు నిగ్రహార్హులగుదు రట్లగుట మీరలుదుష్కృత్యాసక్తులై సమస్తప్రాణిహింస యొనర్చుచు నిష్టాపూర్తంబులుఁ జెఱుచుచుందురు భూతభవిష్యద్వర్తమానంబగు నీ ప్రపంచంబునకు శివుండుఁగర్తయు నధికుండునని నిగమములఁజెప్పఁబడియె నట్టిశర్వునకీలోకంబు గాత్రం బాకపాలి సర్వభూతములకు దేహిగాన జగంబునం దొక్కనికయిన నపకృతియొనర్చిన కల్మషుండుఁ దచ్ఛంకరాపరాధియై నశించుఁ గేశవప్రముఖసురలెల్లరు మదీయ జనకానుమతి మెలంగుచు ననురక్తినుండుట వారినిరక్షించి మిమ్ము శిక్షించుటకై సైన్యసమేతంబుగా నన్నిచ్చటికిఁబుచ్చ వచ్చితి బాలుండని నన్ను దాసింపక నీదోర్గర్వంబుఁగాన్పింపుము నీసోదరులఁ ద్వరితంబునఁ బిలువనంపించుము నీకులంబు నిర్మూలంబు సేయకమాననని పలికిన వారణాననుండగు తారకుండు॥ 186

—♦ తారకుఁడుఁ బ్రగల్భములు పలుకుట. ♦—

శా॥ దర్పంబొప్ప రదాంశుకంబు రదసంతానంబుచేనొత్తి ని
ట్టార్పుల్ వేడిగనించి లోచనయుగం బుల్కాభమైమించఁ గం

దర్పాతిశనూజుతో ననియె మాత్సర్యంబుతో మాపయిఁ
నేర్పుంగన్పడఁబోరి భీతిలకనిఁనిల్వంగ శక్తుండవే॥ 187

ఉ॥ బాలుఁడవీవు నేటిరుదుబంటను నైకసమికసంగతుల్
చాలనెఱుంగుదుఁ రణరసంజలియింపక నిల్చియుండఁగా
జాలుదుమేము మాకుసహజద్విషులీసురలెల్ల వారికై
యేలచెడంగఁజూచెదవు నీచలమేల తొలంగుమర్భకా॥ 188

ఆ॥ అదియటుండనిమ్ము విధినిషేధంబులు వేదహితములంట విదనుజులు ని
షిద్ధకృత్యములనుఁజేయుటఁదలపోయఁ గాలకాలునాజ్ఞఁగాదెచెపుము 189

తే॥ వరికైనను నిజధర్మమే యుచితము శ్రేష్ఠమౌపరధర్మంబు సేయుకంటెఁ
గాన నసురులు సురపథఁ బూనిచేతు రవ్విచారముమాని నీవాలకింపు 190

సీ॥ దేవేంద్రువజ్రంబు ధిక్కరించితి బాణతతి సువర్వులనాజి దటిమినాఁడ
దిక్పాలకుల నాల్గుదెసలకుఁదోలితి బ్రహ్మాస్త్రమేమ్రింగ బ్రహ్మవెఱచె
నిదియంతపెద్దగా దీశ్వరదత్తంబు శత్రుభీకరమునుఁ జండకిరణ
శతసహస్రాభమౌ చక్రిచక్రంబు నాయక్కునఁదగులుట మొక్కవోయెఁ

తే॥ గంఠమందునదాని నిష్కంబుకరణిఁ
జేర్చితిని నాదుతొండంబుచేత దిగిభ
శీర్షములఁద్రుంచి తివుడు మచ్ఛితశరాళిఁ
గూలు సైన్యముఁగానవే శూలితనయ॥ 191

క॥ అదిగాక వీరబాహువు మొదలగు నీసోదరులను మూలబలములఁ
మదమెసఁగిక్రౌంచగుహలో నుదరిపడనడంచివేసియుండనెమున్నఁ 192

వ॥ ఇప్పటిశౌర్యంబుఁదలంచినైన గృహంబునకుఁబొమ్ము పోవేని మద్బలం
బున భవత్సేనాసముదయంబుఁ జెడుటసిద్ధంబు బదియారేడులకుఁదక్కువ
దైన యీడుఁగలవాడవగుటఁ దారతమ్యజ్ఞానకూన్యుఁడవై మత్సరించెద
వనినఁ దారకునిగర్వోక్తులుసహింపక యవ్వుడుఁగలచుచు గాంగేయుండు
గంభీరంబుగానిట్లనియె॥ 189

క॥ దితిజావికర్తనంబులు
నతిశయముగఁబల్కితిపుడు యవినిల్చురణ
క్షితి నిలుతునొ పఱచెదనో
ధృతిఁబెనఁగెడుఁదఱినిఁ దెలియదేమనదృఢముగా॥ 194

వ॥ కమలాక్షుని సుదర్శనంబురంబున మండనంబుగాఁదాల్చితినం చతి మాత్రింబునఁబలికితివి మున్నిచక్రంబు శౌరి దక్షయాగంబునం దరిభీకరుఁడగు వీరభద్రుసిపైఁబ్రయోగింపఁ దత్కర్పరమాలికలో నొక్కపును కందాఁకిన వీఁకంబట్టి గ్రసింపనశింపదే వెండియుమున్నొక్క గజాధిపుని మీఁదవైవ మ్రింగఁడే మఱియొక్కతఱిఁ దెలుగంటులందుబు సభ యొనర్చి పరీక్షార్థంబు జనార్దనుఁబ్రార్థింప యక్షశ్రేష్ఠుండొక్క యవ సంబచ్ఛోటనుంచిన దాని శరవ్యంబుఁజేసి రథాంగంబడరింప మొక్క వోవదే యింకొక్కపరి దధీచిపయింబరపిన నస్థిసంఘట్టనంబునఁ జూర్ణమై త్రుంగదే యిట్టిచక్రంబునకోర్చితిఁ జాలపోటరినని గండుమీఱి పలికెద వదిచాలింపుమీబవరంబునఁ దొలంగకనిలిచితివేని నెలతాల్పుయడుగులాన నాశక్తియనుసాధనముఁబరపి నిన్ను దండధరునండనుండఁజేయుదుననిన దారకుండత్యంత రోషాకులచిత్తుఁడై॥ 165

—♦ సుబ్రహ్మణ్యతారకులయుద్ధము. ♦—

చ॥ అమరులకళ్కుమించ ధనువంది రయంబున భూవభోంతరా
శములు నెవుడ్పర్గ బలుచలంబున మౌర్వీరవంబుఁజేయుచుం
గమలదమద్రిపైఁ గురియుకై వడి సాయకవృష్టి గట్టురా
కొమరితపట్టిముంచినఁ గకుప్తతిఁగప్పెఁ దదీయవర్షముగా॥ 196

ఉ॥ అప్పుడుఁదారకల్పడిరొ నబ్బులుఘూర్ణిలె సంగరావనిఁ
నిప్పులురాలె వేవడఁకె నేల పలాశనుఁడిట్లుమించినం
దెప్పునవల్లియందివిచి దిక్కులుఁబిక్కటిలంగ షణ్ముఖుం
డప్పిశితాశిపైఁబరపె నమ్ములనేకమునొక్క పెట్టునగా॥ 197

క॥ గజవక్త్రుఁడు గాలజ్ఞధ్వజుపై ధృతిచే శతాయుత ప్రదరంబుల్
త్రిజగములుదలకనేయుఁడు విజితములొనరించెనతఁడు వేలమ్ములచేఁ 198

శా॥ అవ్వేళన్ గుహుపై నిశాచరుఁడమర్షాటోపుఁడై తూఁపులన్
రువ్వంగాఁ బరికించి యమ్ములుకులన్ రూపాటిపోఁజేసి మై
నొవ్వన్ శక్తిధరుండుఁ దారకునిపై నూత్నాస్త్రముల్ వైవఁగా
గ్రొవ్వంగన్పడ సూతుఁగాంచి గజవక్త్రుండాడెసంరంభియై॥ 199

తే॥ అంబికేయునిడాసి మహాహవంబు సలుపఁదలచితి రథమతి సత్వరమున
గడపుసవ్యాపసవ్యమార్గముల నీదుసూతనై పుణ్యమేర్పడఁజూతుననిన 200

వ॥ రథచోదకుండు భండనంబున బలవత్తరంబయి నిజకౌశలము మెఱయ
దోషాచరోత్కరంబులు వొగడగుఱ్ఱముల సవ్యాపసవ్యభ్రమణంబులఁదోల
నుబ్రహ్మణ్యుండు వాతూలునిఁగని నాతేరివారువంబుల మండల
భ్రమణంబుగాఁబోవనిమ్మనిన రథికుమనంబెఱింగి సమీరుండు
మనోవాయుజవంబుఁగల హయంబులనట్లునడిపించుచు నరిస్యందనము
సవ్యంబయిన నపసవ్యభంగిని రిపురథంబపసవ్యమయినసవ్యరీతిని గుహు
శతాంగంబున్ గడపుచున్నఁ బరస్పరరథభ్రమణంబుల మన్యుస్ఫురణఁదనర
రణంబున శరజన్మతారకులొండొరులమీఁద నిషుతతినేయుచుఁ దమయ
రదంబులు మండలభ్రమణ సవ్యాపసవ్యమార్గంబుల నాహవంబునఁ
దిరుగు నెడనన్యోన్యజయాపేక్షుల ఘోరారావంబుల ధనుర్జ్యాఘోషంబుల
ఖలదిక్కులునిండ హస్తలాఘవప్రశస్తంబుగా నొకరినొకరునొప్పించుచు
బరస్పరశిలీముఖంబులఁదప్పించుకొనుచు జయాపజయములుగానమి పటు
రయంబున శరంబులుఁబరగించుచున్ బరగించిశరముల నఱుకుచుఁ
జండాంశుమండలాచ్ఛాదనముగా నఖండకాండంబులవైచుచునీడంబోక
నరిపోరుచున్న సమయంబున గరుడగంధర్వ సాధ్యసిద్ధచారణ విద్యా
ధరాప్సరస్సమూహంబులుఁ బ్రమోదంబునఁ దోయిళ్లకొలఁది ననలుఁ

దాల్చి విశాఖునందు విజయంబుఁగాన్పింపమిం జేసి కురియింపక సంగ
రంబుఁ గమంగొనుచుండిరప్పుడు॥ 201

మ॥ గజవక్త్రారిమరవైరి రుట్ప్రతిభయాకారుండునై సాయక
వ్రజముల్ భూమినభంబునిండునటు లార్యాసూతిపై వేయఁగాఁ
ద్రిజగంబుల్ వెఱగంద నాఘనుఁడుఁ దత్తీక్ష్ణాస్త్రముల్ ధాత్రిపై
రజమైరాలఁగ నేసెఁ దేజితశరవ్రాతంబుచే నొక్కటన్॥ 202

తే॥ మగుడనొకమార్గణమ్మున మాంసభోజి
ధనువుఖండింప నర్థిప్రత్యర్థి భూతి
కరమునై మేలిదాతృత్వగరిమ నెఱపు
తద్ధనుఃఖండమిలవైచి తారకుండు॥ 203

క॥ ఒండొకకోదండముఁగొని కాండంబులుఁ బెక్కుఁదొడిగి కందునివైవం
జెండాడెవానినన్నిఁటి వెండియునఱకెన్ సురారివిలు వేయింటన్॥ 204

సీ॥ అంతఁబోవక నొడలవియ శాతాయుధ మండలినేయుచు మర్మములను
నొవ్వనేసియు రెండుక్రొవ్వాఁడితూపులఁ దొండంబుఁగొమ్ములుఁద్రుంచివైచి
పింగదృష్టి కిశోరముంగాఁ బ్రకాశించు కార్తికేయునిఁగని కాలదహను
కరణిఁ గిలలుఁ గ్రాలఁగాలాహిసమములౌ బాణంబులఁగుమారుపడగనరుక

తే॥ నానిశాచరు విక్రమ మధికవిస్మ
యంబొనర్చెను వీక్షించునట్టివారి
కాంబికేయుఁడుఁ నాసేతకలిగి యవుడు
గఱచి మొగముల తేగురు కాంతిఁదోప॥ 205

క॥ ఎనిమిదితూపుల దద్ధనువుముద్రుంచి సహస్రశరము లొకపరిచాపం
బునఁబూన్చివైచి సూతునిఁదునుమాడెవితిం పవితతి తోషంబందన్॥ 206

ఉ॥ తారకదైత్యుడంతటను దానెహయంబులఁదోలుకొంచు దో
స్సారముమించి మేటియగుచాపముదాల్చి కుమారుసూతుడో
మారుతువిగ్రహంబవియ మర్మములుచ్చిచనన్ రయంబునన్
ఘోరపహస్రబాణముల గొట్టి మహీస్థలిఁ బ్రీలనార్చినన్॥ 207

చ॥ హరసుతుఁడొక్క పెట్టున మహాశనికల్పశిలీముఖంబుల
క్కరిముఖుదైత్యునెన్నుదురు గాఁడఁగనేయ నతండుమూర్ఛచే
నొరగె నియంత తద్రథముయుద్ధమహిందొలఁగించె నంతటన్
సురరిపులెందఱేని తనుఁజుట్టిపెనంగ వధించెనందఱన్॥ 208

తే॥ కొంతసేపున కత్తారకుండు మూర్ఛ
దెలిసి శూరోత్తముఁడుగానఁ గలనుఁబాపు
రీతి కెదఁజింతసేయుచు సూతుఁబదరి
దర్పముప్పొంగ గుహుసేన దాఁకిచదిపె॥ 209

శా॥ యుద్ధంబందునఁగూలియున్న నిజసైన్యౌఘంబునీక్షించిబల్
క్రుద్ధుండై విలుదీడి తామరసభూరోపంబుసంధించి వే
శ్రద్ధన్వైవ నమోఘమయ్యును నమస్కారంబులర్పించుచున్
శుద్ధుండౌగుహుచెంతనద్దినిలిచెం జోద్యంబుగావ్యర్థమై॥ 210

వ॥ ఇట్లుబ్రహ్మాస్త్రంబు సుబ్రహ్మణ్యుచెంత నెయ్యంబుననిల్చుటకుఁగనలి తారకుండైంద్రబాణంబు వారుణాస్త్రంబు యామ్యకాండముసౌరశరం బాసురసాయకంబు నాగ్నేయవిశిఖంబు సమ్మోహనశిలీముఖము యక్షశస్త్రంబు గంధర్వాశుగమ్ములను బ్రయోగింప నద్దివ్యశరంబులెల్లఁబోయి శిష్టార్చితుఁడగు నవ్వేల్పుగమికాని కెఱగి పొగడుచున్నంజూచి జేజే మార్తురరోసంబురెట్టింపఁ

—♦ తారకుడుఁగుమారునిపైఁ బాశుపతాస్త్రమేయుట. ♦—

బాశుపతాస్త్రముఁగైకొని మనంబునందధికభక్తిఁబూజించి కోదండంబునసంధించివైచె నప్పుడు॥ 211

తే॥ ప్రళయశిఖమాడ్కిఁబొలిచి ప్రపంచసారణ
మర్థినొనరించుకరణి బ్రహ్మాండమెల్ల
మండఁజేయుచురా షణ్ముఖుండుసూడిసి
పట్టెఁ గరలాఘవంబునవసట్టిదాని॥ 212

తే॥ ఇట్లుమహానీయశస్త్రంబు లెన్ని యేని
వమ్మగుచుఁబోవఁ గ్రమ్మఱ వాసవారి
విక్రమంబాకృతివహించు విధముఁదోప
సారథినిఁజూచిపలికె రోసంబుకలిమి॥ 213

శా॥ ఈతండొక్కొకదానవుఁడె బలిమియైహింసించెదర్పింపుమా
యాతం డేపగవాఁడుఁగాక పెఱవాఁడేరీతివాశత్రుఁడౌ
నీతం డేనుఁజెనంగ నీప్రణిభచే నేగెల్వనొందఁదవలెఁ
జూతుందోలుము తేరుచిత్రగతులఁ శూరోత్కరాగ్రేసరా॥ 214

మ॥ అనవుండాతఁడు మందహాసకలితుండై మందయానంబునం
జనగాఁ దేరపసవ్యసవ్యగతులఁ జన్యస్థలిందోల నం
తనెదైత్యుండుఁ గుమారుపై నిశితకాండవ్రాత మేసెం బోదిం
గొనుటల్గ్రొడుటలేయుటల్ తెలియఁగన్గో విన్నువువ్వుంబలెఁ॥ 215

చ॥ అప్పుడుగుహుండుఁ గేలధనువంది లయాంబుదలీల దిక్కులఁ
విపులకలంబవృష్టిఁ గురిపించుచునున్న సమీరణుండు భూ
తపతితనూజు తేరు రణధాత్రిని జిత్రముగాఁగఁద్రిప్పఁగా
నపరిమితంబు గేహముల నగ్నిదహించినరేవ రాజిలెఁ॥ 216

క॥ దితిజ విషాణకరంబులఁ హతమొనరించుటయు మగుడ నంకురమొందఁ
ధృతిబెరసి నఱికెమఱిమఱి శితికంఠతనూజుఁ డధికచిత్రస్ఫురణఁ॥ 217

—♦ క్రౌంచతారకులు షణ్ముఖునితో మాయాయుద్ధము సేయుట ♦—

శా॥ అవ్వేళఁ రజనీచరుండధికమాయల్వాన్ని నేనీతనిం
జివ్వఁ గెల్తునటంచుఁ గ్రౌంచగిరిలోఁ జేరఁ వడింబోయి తాఁ
గువ్వాడంబులఁ గ్రౌంచునింగలిసి సోఁకుల్ మెచ్చియగ్గింపఁగా
నవ్వేల్పుఁగమి కానిఁడాఁకెఁ దనమాయల్ వ్యర్థమైపోవఁగఁ॥ 218

సీ॥ అంతఁగ్రౌంచుండు మాయాత్రిపురంబులై
తనర విద్యున్మాల తార కాఖ్య

కమలాతురూపముల్ గైకొనితారకుం
డార్చుచుఁగదియ షడాననుండు
నతివేగఁ దత్పురహార రూపమవలీలఁ
దాల్చి నేత్రాగ్నినిఁ గాల్చివైచె
వెండియుఁగ్రౌంచుండు విలయాభ్రమైయొప్పఁ
దారకుండశనిఘాతంబులగుచు
తే॥ దోపఁగఁ గుమారుఁడమ్మాయఁ దునిమె ఘోర
వాయువై మఱిఁగ్రౌంచుండు వనధియగుచు
నసురశాడబమైడాయి హరసుతుండుఁ
గుంభజుండయి యాపోశనంబుఁగొనియె॥ 219
ఆ॥ మరలఁజక్రవాళ గిరిభంగిఁ గ్రౌంచుండుఁ
గన్పడఁగ మహాంధకారమగుచుఁ
గుటిలదనుజుఁడెదురఁ గోట్యర్క తేజుడై
యడఁచెఁ గార్తికేయుఁడత్తిమిరము॥ 220
సీ॥ తరువాత పారియాత్రక గంధమాదన
హిమవన్నిషధవింధ్య హేమకూట
మాల్యవదాఖ్యల మహితమౌ సప్తకు
లాద్రులక్రియఁ గ్రౌంచుఁడపుడుఁదోప
దనుజఁ డంజన పుష్పదంత వామన సుప్ర
తీకాభ్రగజ పుండరీక కుముద
సార్వభౌమములను సంజ్ఞలఁదగు దిగ్గ
జాష్టకమైతాఁకి యద్రిగజము
తే॥ లతిశయ ప్రతిభయముగా నాహవమున
వెగడుపరచుచునున్న దర్వీకరాళి
హయుఁడు బటుశౌర్యమునఁ గులిశాయుధంబుఁ
గడఁకఁబరగించి యడఁగించె గడియలోన॥ 221

క॥ క్రమ్మఱఁ దారకక్రౌంచులుఁ దెమ్మెరముట్టంగరాని దేవరరూపుల్
క్రమ్మనఁగన ఫణివరుణా స్త్రమ్ములనో నేసిమాన్పెఁ దద్భయమెల్లన్॥ 222

వ॥ తదనంతరంబా క్రౌంచుండు సక్రోధుండై సంవర్తసమయ బృహద్భాను కోటిసదృశుండయి తోపఁ దారకుండుఁ గల్పాంతకాలార్కకోటినీకాశుఁడై ఖరమయూఖనిచయంబులు ననంతజ్వాలామాలికలును రోదోంతరాళంబులనిండఁ బ్రచండవేగంబున దహించిన నోర్వలేక భూతలంబుఁ గంపంబునొంద గరుడగంధర్వ సురమునితతిభీతిఁజెందె భూతప్రమధగణనాధులు వెఱచి దిక్కులఁబరువులిడిరంతట మహాసేనుండు మహాక్రోధుండై మూర్తీభవించిన నిజశక్తియోయనఁబరగి నిఖిలవైరిధ్వంసినియు స్వప్రకాశంబునగు శక్త్యాయుధంబునుఁగరంబునధరించి సకలప్రాణ సంయుతముగా.

—♦ కుమారుఁడు శక్తిఁబరగించి తారకక్రౌంచుల సంహరించుట. ♦—

నుద్గాఢముష్టినలవరించి ప్రయోగింప నద్దివ్యసాధనము దశదిశాభాగంబుల స్వీయప్రజ్వలజ్వాలాజాలంబులునిండ మండుచుఁ గల్పాగ్నికరణి ముల్లోకములునాక్రమించి విరాజిల్లుచు విలయాంబుద జనితాశనీ ఊతిపతితస్వనంబువైఖరి గర్జిల్లుచు నరాతిభీమంబుగా వేతెంచి తారకాసురువక్షుంబు భేదించి మహోగ్రముగాఁ గ్రౌంచాహార్యమునుఛేదించి తనివిసనక బలాధికత మాయాపురముఁగాల్చి హతశేష దోషాచరచమూసంహారం బొనరించి మరలెనంత॥ 223

క॥ తారకువక్షస్థలమున దారుణముగనాటిశక్తి దాఁటిచనిన న
త్తారకుమెయి సప్తాద్రిగ ధీరస్వనజైత్రరవముఁ జెల్లుగఁబుట్టెన్॥ 224

క॥ ఆశబ్దమువిని తారకునాశక్తిహరించుటయును హరియింపమియున్
లేశంబైనను నొక త్రిదివేశునకుందెలియదయ్యె విస్మయమగుచున్॥ 225

ఉ॥ అయ్యెడనన్ని శాటుఁడు మహాధ్వనిసేయుచు మిట్టిపాటుతోఁ
జయ్యనఁజాణముల్ విడువ సర్వసుపర్వులుమౌనికోటులున్

నెయ్యమున మీఱంగాఁ గనులనిండుగఁ గన్గొని పూలవాన ము
ద్దెయ్యవయింగ దుంగురిసి తాండవమాడిరి భీనిరాసులై॥ 226

ఆ॥ మున్నుఁ గాంచుమాయ మునిఁగి మోహంబునఁ
బడిన వారి వీరబాహుముఖుల
గిరిజసుతుఁడు వోయి గిరిమాయ లెడలించి
వెడలఁ జేసె దివిజవితతివొగడ॥ 227

చ॥ సుఖముగ నిద్రలేచుగతిఁ జూడ్కులు మెల్లన విచ్చి వారు ష
ణ్ముఖునకలంకు నవ్యయుని మోఘచరిత్రునిఁ గాంచి వారికు
ట్సుఖములునైన తచ్చరణ సౌరభమాను మహాతమిఁ శిరీ
ముఖములు వ్రాలెనోయనఁగ మ్రొక్కిరి కన్నులదుంగు సోకఁగన్॥ 228

క॥ రిపునాశమయ్యెనేఁడని యపరిమితానందులై జయధ్వను లెంతే
విపులముగఁ జేసి షణ్ముఖునుపకంఠమునఁ బవసించి యుల్లంబలరన్॥ 229

వ॥ అత్తఱి వీరబాహ్వాదిమణిపుత్రనవకంబుతో నశేషసేనాసముదయంబు లాంబికేయుం గని కృతాంజలులయినఁ జూచి దుష్టాత్ముండగు సురారి మాయలఁ గష్టంబునొంది శివానుగ్రహంబునఁ గడతేరితిరింక సుఖంచెదరన వారందఱేకవాక్యులయి జగత్పతివగు నీవు మాకు బ్రాపుగానుండ నాపదలేపాట్లు రానోవు మీపాదసేవాపరులకు వెలపుఁగలుఁగునే యనినఁ గరుణాపరుండయి యంత॥ 230

సీ॥ తారకుం డేయ మున్ను హస్తమునఁ బట్టి
నట్టి పాశుపతాస్త్రంబునపుడు వీర
బాహునింబిల్చియిచ్చినఁ బ్రవహించి
రెల్లసురమునిశేఖరు లుల్లములను॥ 231

క॥ కడుబలుఁడిభముఖదనుజుఁడుఁ
బడియె నికన్ శూరపద్మపంచాస్యముఖుల్
తడయకఁ బ్రోంగిన వారం
చెడదం దలపోసిరమరులెల్ల దృఢముగన్॥ 232

తే॥ దేవవాహినులెల్లను భావమలరఁ దన్ను సేవింపఁగా రత్నతనయుఁనవక
మర్త్తినడతేరఁ శార్దూలండనడువ మృడసుతుండంత రణభూమివిడిచికదలె॥

సీ॥ సర్వసర్వంసహాస్థలి వదాన్యులకీర్తి
కెనఁబోల్చు వాసి యేఘనుఁడుఁగాంచె
జగములతల్లియై తగు భవానికిఁదండ్రి
యనెడుసత్కీర్తి యేయనఘుఁడొందె
లోకేశుఁడగు నీలలోహితునకు మామ
యనెడుఁ బ్రఖ్యాతి యేయలఘుఁబొందె
గురుతరోర్వీధరకోటికి నాయకుం
డనియెడునామమే యధికుఁడూనెఁ

తే॥ గాశికాపురిజాహ్నవిఁ గాండపూర్ణఁ
జేయునట్టి ప్రశిద్ధి యేశ్రేష్ఠునెనసె
నట్టితుహినాచలంబునకరిగె నిందు
పయనముల భూరిసంతోషభరితుఁడగుచు॥ 234

తే॥ పరగనటనొప్పు యోషధీప్రస్థపురిని
మమతమూతామహుండగు మంచుకొండ
యధికరీతులమన్నించి యర్చలివ్వ
సురలుఁ దానునుఁ గొన్నివాసరములుండె॥ 235

క॥ అచ్చోటుఁగదలి మిక్కిలి హెచ్చినతమి విజయరవము లెడబడకుండన్
గ్రచ్చఱఁగనేఁగి చొచ్చెనుఁబచ్చపులుఁగురౌతునూడుబలుసింగాణిన్॥ 236

— ♦ కుమారుఁడు మేరువునందుఁ గొలువైయుండుట. ♦ —

వ॥ అట్టిసమయంబున॥ 237

చ॥ సమరవిచక్షణుండధిక సత్వసమన్వితుఁడైన నీతఁడున్
హిమగిరిపౌత్రుఁడౌకతన నెక్కుడుసూడునమచ్చరించి నే
హిమపరిపంథి నోటఁ దపియింపఁగఁజేయునొయంచు భీతిచే
ద్యుమణివెలుంగకన్ జరమతోయధిలోనమునింగె నత్తఱిన్॥ 238

తే॥ బలములనుఁగూడి యయ్యాద్రినిలిచి తేరు
డిగ్గి తత్కాలకృత్యముల్ దీవిఁదీర్చి
యలఘుభక్తిని నతిథిపూజలనొనర్చి
స్కందుఁడారాత్రిగడపె నానందమునను॥ 239

క॥ తత్సమయంబున వేల్పులు వాత్సల్యముతోడఁ మ్రొక్కి వరదదయాళో
యుత్సవమునమాపూజను హ్యాత్సరసిజమలర నందుమిప్పుడటన్న॥240

శా॥ లీలందారకవైరి ప్రేమ ననుకూలింపఁగ ముకుందాత్మజా
నైలింపాద్యులమర్త్యశిల్పిఁగని నీనై పుణ్యమేపార నీ
శైలంబందలకాపురీసదృశమై పడ్వక్త్రవాసార్హమై
సాలంకారమునైన నొక్కపురమూశ్చర్యంబుగాఁజేయుమా॥ 241

వ॥ అనినియమింప నవ్విశ్వకర్మ తత్క్షణంబున॥ 242

సీ॥ మారుతాశిజగద్భీరాంబుపరిఘంబు సురలోకమండన వరణతలము
సితభానుమండల స్పృగ్రత్నసౌధంబుఁబంకజోదర సన్నిభద్విజంబు
భార్గవదోర్గర్వ భంగావనీపంబుభూరివిత్త సమన్వితోరుజంబు
నిఖిలధర్మారంభ నిష్ణాతవృషలంబుఁ జక్రవాళాచల సమూహయంబు

తే॥ హరిపదోత్తుంగ దానధారాఢ్యగజము
ధ్రువపదేకపదిస్యందనవితతంబుఁ
గాఁగరచియించిచనె విశ్వకర్మ దివిజ
కులముచేఁ బారితోషికములనుఁగొనుచు॥ 243

ఉ॥ అన్నగరంబునం దనిమిషావళి పర్గళశంఖదుందుభుల్
కిన్నరవేణురావములుఁ గేవలముల్లసిలఁగ గణాధిపుల్
పన్నగవీరబాహుముఖ బంధులు సంభ్రమలీలఁగొల్వఁగాఁ
గ్రొన్నెలతాల్పుపాపని నకుంఠితభక్తినినిల్పిరాదృతిఁ॥ 244

శా॥ మాండవ్యుండుమరీచికౌశికులుఁ గామందాత్రివాల్మీకులుఁ
శాండిల్యుండువశిష్ఠుఁడుంగపిలుఁడుఁ జాబాలిమౌద్గల్యులుం

గౌండిన్యుండుభృగుండునుబలవహుఁడుఁ గార్గ్యుండుఁగౌత్సుండు జ
హ్నుండుంగశ్యపుఁడుఁరణాశనుఁడుఁ గణ్వుండాదియౌతాపసుల్॥

వ॥ పూర్ణకలశధరులై మఱికొందఱు వేదాంతవిదులు స్వస్తివాచకులయి
వెంటరా ముక్కంటిచూలి వీరబాహుళయానీత రత్నమయ సువర్ణ
పాదుకలంఘ్రులందొడిగి మణినిర్మితగేహంబుసొచ్చి మాణిక్యహిరణ్మయ
కలితసలలిత సింహాసనంబున దరహాస సురుచిర ముఖసరసిజుండై నివసిం
చెనప్పుడు॥ 246

క॥ దివ్యసమూహముఁ బూజాద్రవ్యములొనకూర్చి భర్గతనుజాతు జగ
త్సేవ్యసకలజ్ఞు నిరుపము నవ్యయునర్చించిరెలమి నతిశయభక్తిన్॥ 247

తే॥ వీరబాహ్వాదవీరుల వినయమతిని
దగువిధంబులఁబూజించి ధర్మ్యతముల
మైలిముని హర్షకలిత సుస్వాంతులగుచు
నిలిచియుండిరి సేనానిఁగొలిచిసురలు॥ 248

తే॥ తాపసులువేల్పులిటు దన్నుఁదవిలికొలువ
మేరువున సౌఖ్యముగనుఁ గుమారుఁడుండె
ననుచుసూతునిఁగని శౌనకాదులపుడు
యవలికథయెట్టులయ్యెనం చడుగుటయును॥ 249

— ఆ శ్వా సాం త ము. —

చ॥ ప్రకటయశోనిరస్త గిరిరాడహిరాడుడురాడ్వియద్ధునీ
మకరపతాకవైరి బలమర్దననాగ శతారతారతా
రకశరదంబుముక్శర మరాళసురాగిమ నారదాబ్జచం
ద్రికహిమవాలుకాబ్జసతీ సితపంకజకుందచందనా॥ 250

— చ తు ర్వి ధ కం ద ము. —

క॥ నీలాభ్రదేహా సజ్జనపాలా భవహరణ మధురభాషణనివహా
శైలధరశత్రు నిచయవిఫాలా నవకమలనేత్ర పాలితసవనా॥ 251

పై పద్యములోని పద్యములు.

క॥ భవహరణ మధురభాషణనివహా శైలధరశత్రు నిచయవిఘాలా
నవకమలనేత్ర పాలితసవనా నీలాభ్రదేహ సజ్జనపాలా॥ 1

క॥ శైలధరశత్రు నిచయవిఘాలా నవకమలనేత్ర పాలితసవనా
నీలాభ్రదేహ సజ్జనపాలా భవహరణ మధురభాషణనివహా॥ 2

క॥ నవకమలనేత్ర పాలితసవనా నీలాభ్రదేహ సజ్జనపాలా
భవహరణ మధురభాషణనివహా శైలధరశత్రు నిచయవిఘాలా॥ 3

అ చ ల జి హ్వా ఖ ద్వా ష్ట్య ము.

క॥ భావభవోపమవామా భావిభవాబభవభావ పాపావిపవి
భూవిభుబోమావాపాభావామవిభోపభవప భిభవప్రభువా॥ 352

గో మూ త్రి కా బ ం ధ ము.

క॥ సురనరవరపరిపాలా శరనిధిగర్వాపవిజిత శౌర్యవిధానా
మరపరహర భరితైలాహర విధిశర్వాణివినుత యార్యనిధానా॥ 253

గ ద్య ము.

ఇది శ్రీరఘునందన చరణారవిందవందన మరున్నందన నిరతిశయకరుణా కటాక్ష వీక్షాసంభావిత చతుర్విధానూన కవితాప్రహర్షితవసుంధరారమణ సభాప్రకాశిత విద్వన్నికాయ రుక్మాంగద నలచంద్రాభిధ యక్షగానద్వయ మనఃప్రబోధ రామచంద్రప్రభు దీనిధీనామక శతగ్రంధత్రయ మదాలసాభిధానైకనాటక పుష్పగిరిపీఠాధిపత్య జగద్గురు శ్రీమదభినవోద్దండ విద్యాశంకరభారతీస్వామి చాతుర్మాస్యదీక్షా గద్వాలసంస్థానాధీశ్వర వంశవృత్తవర్ణన ప్రబంధ నిర్మాణచాతురీ విరాజిత భారద్వాజసగోత్రపవిత్ర భట్టరాజవంశ క్షీరసాగరరాకానిశాకరశత్ర రామదాసపౌత్ర సంజీవరాజసత్పుత్ర కొడవలూరిరామచంద్రరాజ నామధేయకవివర్యప్రణీతంబయిన శ్రీస్కాంద పురాణాంతర్గత శంకరసంహితాభినివేశ మహాసేనోదయంబను మహాప్రబంధమునందు ద్వితీయాశ్వాసము॥ 254

గోమూత్రికాబంధము

ద్వి. ఆ. నెం. 258.




Art by: S. L. N.

శ్రీరస్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

# మహాసేనోదయము.

(పద్యకావ్యము.)

## —• తృతీయాశ్వాసము. •—

శ్రీమత్తరణికులాంబుధి
సోమ మహీభృల్లలామ శుభనామ ఘన
శ్యామ నిశాచరగిరిసు
త్రామ తనూవిజితకామ దశరథరామా॥

తే॥ అవధరింపుము శుకశౌనకాది తాప
సులకు సర్వకథారథసూతుఁడైన
సూతుఁడనియెను మందాకినీతరంగ
ప్రబలఘోషానుకారి వాక్పటిమతోడ॥ 2

తే॥ ఇటులగుహుచేతఁ దారకుఁడీల్గువిధము
నాలకించి మహర్షి చేనడలునొంది
తత్కులాంగన రూపసౌందర్యవిజిత
దానవారాతిసుతునారి యైనగౌరి॥ 3

క॥ మఱియు ననేకులుఁ దారకు
తెఱవలుఁ బల్మరునొడళ్లుఁ దెలియకభ్రమచే
నొఱగుచుఁ దెలియుచు నేడ్చుచుఁ
బఱతెంచి రణోర్వియందుఁ బడియున్నపతిన్॥ 4

—• గౌరి మొదలగు తారకుని భార్యలు విలపించుట. •—

క॥ తిలకించి యశ్రుకణములు జలజలప్రవహించి గుబ్బచనుమిట్టలపై
నొలుకఁగ నతనిపయింబడి విలపించిరి కంఠమెత్తి వేవేగతులన్॥ 5

ఉ॥ హా జగదేకవీర కనకాచలధీర దయాపరా యయో
నీజవరాంగ్రమైనమము నెక్కటిడించిచనంగ ధర్మమే
తేజమెసంగునీయెుడలు దీనతమైమహిబ్రాలియుండ నే
యోజసహింపవచ్చు దనుజోత్తమ వత్తుమునీదు వెంబడిన్॥ 6

సీ॥ నినుఁబాసిగడియ మాతనువులఁబ్రాణంబు
నిలనసియుండఁగనోప వని తెలియుము
నేరమేమియెుకర్ఱి నారము మమ్మిట్లు
దుఃఖాంబునిధిఁ బడఁద్రోసిచని
యనురాగమొప్ప నీకనువిచ్చిచూడుము
పద్మాక్షుచక్రంబు బ్రహ్మశీర్ష
మనిమిషేశశతారమును నాటఁజాలని
భవదీయ కర్కశత్వంపువక్ష

ఆ॥ మిక్కుమారుశక్తి యేడ్తైజిదూఁజిపో నేమటంచు నెంతు మింద్రుఁడాది
సురలుముదమువడిరి శూరసింహోనను లింకఁజప్పిరనుచు నెన్నవలయు 7

వ॥ అనిబహుప్రకారంబులఁ బ్రలాపించుచున్న సమయమునఁ దారకుని తనూజుం డరేంద్రుఁడనువాఁడు శైశవంబాది సింహాసక్తినిచే నుప లాలితుండగుటఁ దన్మందిరంబుననుండి తండ్రనిగనుంగొనఁ జతురంగ బలములుగొల్వ నేతెంచుచుండి తెరువునందు వేగరులముఖంబున సబంధుండయితనతండ్రి వైరులచే హతుండగుటవాలించి రోషభీష ణుండై వచ్చి॥ 8

తే॥ నిశితదంభోళిధారచే నిర్జరేంద్రుఁ డలుకఁ బడుంబులు దెమల్ప నవనిబడిన
యంజనాచలమేమెుకో యనగనున్నఁ దారకునిఁగాంచికన్నులనీరు నించి॥ 9

ఆ॥ క్రూరపరశుధారిని గుంభిస్త్రవాలిన విపులభూరుహంబు విధినివ్రాలి
కొంతవడికిఁదెలిసి గోడుగోడున నేడ్చి తాపమూపలేక తద్దకలఁగి॥ 10

క॥ అమరులమనములఁగల దుఃఖము నేఁటికిబాసెఁగద యఖండబలుల్ సిం
హాముఖుండుశూరపద్ముఁడుఁ గనుమునజము జేర నెరిగద యయ్యో॥ 11

మ॥ అనిచింతించుచు నంతవంతవిడి యయ్యాదిత్యవిద్వేషి క
న్గొనలఁరక్తిమమించ హాయమ్మనుచు సక్రోధాత్ముఁడై క్రమ్మఱన్
ఘనశాంతంబున మాతృయుక్తిఁ బరలోకప్రక్రియల్ దండ్రికిం
బొనరం జేసి వరూధినుల్ గొలువఁగా నుత్సాహసంత్యక్తుఁడై॥ 12

—♦ తారకునిపుత్రుఁడు సురేంద్రుడు శూరపద్మునకు తనతండ్రివధమును జెప్పుట. ♦—

తే॥ వీరమాహేంద్రపురమను పేరఁబరగు
శూరపద్మునినగరంబు జేరవచ్చి
తనదు పెత్తండ్రియైన యాతని యడుంగు
లందుఁ బడియేడ్చె నసురేంద్రుఁడశ్రులొలుక॥ 13

క॥ అదిగాంచి శూరపద్ముండెదవడి సోదరతనూజు నెత్తి కవుఁగిటం
బొదివి విలపించు హేతువు విదితంబుగ వానివలనవిని విస్మితుఁడై॥ 14

శా॥ పట్టీ స్వప్నముగంటివో మఱియు విభ్రాంతిఁమదింగూరితో
చుట్టుంగైదువుజోదు సర్వసురలుఁ సుత్రాముఁడుఁవచ్చియుఁ
గట్టల్కఁరణమందు నీజనకునిఁ ఖండింపఁగాఁజాలరా
దిట్టండన్యులచేతఁబ్రమగ్గెనన సందేహంబుగాకుండునే॥ 15

క॥ తలఁకకయచ్చటివార్తలు
గలతెఱఁగునఁదెల్పు మనఁగఁ గడుదుఃఖముతోఁ
బలవించుచు నసురేంద్రుఁడుఁ
బలుకులగద్గదికతోప బలికెనతనితోఁ॥ 16

క॥ కలఁగాంచఁ భ్రమియించం దలిదండ్రులకపరలోక తంత్రములిపుడే
సలిపి శివసుతునిభయమునఁ దొఱఁగియిటకువచ్చినాఁడ దుర్భరతేజా॥ 17

ఉ॥ నీచరణంబులాన యిదినిక్కము సంశయమంద నేటికీ
యేఁచినయాపదల్ మనకునింతటఁబాయవు చావుసిద్ధమౌ
ధీచతురుండు శక్తిధరు దివ్యశరంబులచేతనన్న దో
షాచరశేఖరుండు మదిజల్లనఁ దల్లడమందిదీనతఁ॥ 18

ఉ॥ విక్రమధామ నీవుబరవీరులచేహతమౌట దేనతా
చక్రముసంతసించె మునిసంఘముమోదిలె నిన్నుబాసి మే
మేక్రియఁ బ్రాణపంచకము నీయొడలందునఁ దాల్చియుందుమో
శక్రవిరోధి మేమును నిజంబుగఁ దీఱినవారమేసుమీ॥ 19

— అమోఘుఁడనుమంత్రికోపిష్ఠుఁడైనశూరపద్మునకునీతినిబోధించుట. —

వ॥ అనియివ్విధంబున శూరపద్ముండు సింహవక్త్రుంగెలిపికొని తారకునకై యపారంబుగాదుఃఖించి కొంతవడికి స్వస్థమనస్కుండయి కొలువునందుఁ గూరుచుండిరోషరసావేశంబున దంతంబులుగీటుచు బొమముడిపాటుతో నగజాకుమారునిఁ బరివారసయుతంబుగా ఖండనంబునఖండింతు గానితో నతనిచేఁజత్తునని నిశ్చయించి భయంకరాకారంబున నిజరథసారథింజీరి మదీయ స్యందనాస్త్రశస్త్ర వర్మాక్షయనిషంగములంగొని రమ్మనుటయు సకలనీతిశాస్త్రకోవిదుండగు నమోఘుండనుమంత్రి సవినయంబుగా నిట్లనియె॥ 20

తే॥ అలఘువిక్రమ సప్తాంగములును షడ్గు
ణములు శక్తిత్రయంబును గ్రమతఁదెలిసి
యొనరధరనేలు మీరెఱుంగనిదికలదె
యయినవినిపింతునొకకొంత యవధరింపు॥ 21

క॥ అబాలుఁడు ధీశాలి మహాబలుఁడఖిలాభియాతిహారణోగ్రుఁడు వా
నాబర్హిర్ముఖనుతుఁడు మహాబిలకేశాత్మజాతుఁ డగుటఁగామనకుఁగా॥ 22

క॥ పూజార్హుఁడు గాఁడన్యుఁడుఁ దేజంబెసఁగంగ సకలదిక్కులస్వేచ్ఛం
దాఁజరియింపఁగఁ దారకుఁడాజియొనర్చెనొ సహింపకమరవిరోధీ॥ 23

చ॥ అదియునుగాక నేయమరులైన హరుఁశరణంబువేఁడఁగా
సదయుఁడు భక్తపోషణప్రశస్తుఁడునౌటఁ గుమారునంచినఁ
గదనముసేయవచ్చెనని గర్వితుఁడై కడుఁబ్రేలికూలెనో
మదిఁదెలియంగఁజాలక కుమారునిపైఁజనమేలువచ్చునే॥ 24

తే॥ అను యమోఘునమోఘవాక్యములు నాల
కించి శూరుండు జలమువర్జించి యతని
పలుకులెతలంచుచు సువర్ణభద్రపీఠి
నోలగంబుండెఁ జింతనాందోళుఁడగుచు॥ 25

వ॥ అంతనాశూరుండు మాయావంతులగు మయూర చక్రవాక శ్యేన శుక బకాదులగువారిఁ గొందఱరావించి యన్నపానవస్త్రాదులదనియించి యేకాంతంబునవారలతోనిట్లనియె॥ 26

చ॥ మనకహితుండు శంకరకుమారు వయోమతి శౌర్యచర్యలా
యనకుఁగలట్టిసైన్యపతు లచ్చటిసేనలు యుద్ధవీరులుఁ
ఘనరధసంఖ్యయుందెలిసి గ్రక్కునరాఁదగు నింకమీరలుం
జనుఁడనిపంచి తాను ననుజన్మయుతంబుగనుండె వీడునన్॥ 27

ఉ॥ అచ్చట హాటకాచలమునందు షడాననుఁడానిశీధినిం
బుచ్చి ప్రభాతమైన సురపుంగవ తాపససైన్యసంఘముల్
వచ్చికఁగూడిరాఁ గగనమార్గము వెంట నవాచిదిక్కునం
దచ్చపుశైవలింగముల నాదటఁజూడఁజనెన్ రయంబునన్॥ 28

వ॥ ఇట్లుచని కేదారకాశీశ్రీశైలవిరూపాక్ష కాలహస్తివేంకటాచల కాంచీ కుమారగోష్ఠారుణాచల వేణుమయూరవృద్ధాచల చిదంబరకుంభ కోణంబులఁదర్శించి యాయాపుణ్యస్థలంబులఁగల శివలింగమూర్తుల నతిశయాసక్తి షోడశోపచారములఁబూజించి యవ్వలఁ గావేరీనద్యుత్తరాశఁబ్రకాశించు మణిముక్తానదీ తీరంబునకుఁజనియెనంత॥ 29

—♦ సూర్యాస్తమయవర్ణనము. ♦—

తే॥ జలధినాయకకామినీ స్తనతటప్రకాశితంబగు పద్మరాగంపుఁ బతక
దీప్తులుర్విని నెల్లెడఁదిరముకొనియె ననఁగఁజూపట్టెబర తారుణాతపములు 30

సీ॥ గగనమధ్యమునందు ఖగములుబంక్తులై పరచెను ఖరకరప్రస్తరాశి
మందోష్ణమయ్యె నందంద మరీచికాంభోధులిమికె నుడుపుష్పశోణ

మై తనరారె ఖద్యోతమండలము దిగ్వారంబుఁగాంతికి దూరమయ్యె
గమలషండంబు లుత్కలికా విధుతములై పరువడి ముకుళత్వభంగిఁజెందెఁ
తే॥ జండకరుఁడ స్తగిరిఁజేర జరుగుచున్న
వాఁడు శీఘ్రమరమ్మని వనజరిపునిఁ
బిలువఁజను రాత్రిసతి దూతికలన నీడ
లరిగె నొయ్యొయ్యఁ బ్రాచికాయతములగుచు॥ 31
చ॥ కువలయబంధు దూర్పుదెసకుందగఁ బట్టముఁగట్టువేళకుం
బ్రవిమలమైనవారినిధి వారినిగైకొనిరాఁదలంచి యు
జ్జవమునఁ బశ్చిమాశయను జవ్వనిముంచు మణిఘటంబునా
భువనసగోత్రమండలము బోరనవ్రాలెఁ బ్రతీచిఁగోయధిఁ॥ 32
క॥ రవిరథతురగక్రమమున దివినంటినపశ్చిమాబ్ధి తీరపిరాజ
చ్ఛవిగలమంకెనరజమనఁ గవిసెందొలిసంజకెంపు కనువిందగుచుఁ॥ 33

— ♦ అంధకారవర్ణనము. ♦ —

సీ॥ క్షీరాబ్ధిమథనజ క్ష్వేళభృచ్ఛశిమౌళి కంఠస్థలస్థిత కాంతియనఁగఁ
బౌలోమికుభగళ భ్రాజిష్ణు కుధరభిద్రత్నహారప్రభా రాజియనఁగ
సోమసంయోగేచ్ఛ వ్యోమకాంతవిలాస కృత్కచగ్రంధి మరీచియనఁగ
వాతాయు మదనిషద్వరలిప్త పుండరీకాయుతేక్షణు తనుచ్ఛాయయనఁగ
తే॥ నెలసె మఱియును గాదంబినీ మిళిందఖంజసేభఘటాప్రోణ కాకపరభృ
త ప్రతీకాశదృఢకాంతితమసరాశి పంకజాతపిచండాండ భాండమునను॥ 34

— ♦ నక్షత్రవర్ణనము. ♦ —

ఉ॥ ఎన్నగసంజయాటఁ బరమేశుఁడు హృష్టతఁ దాండవంబుసే
యన్నుతికెక్కఁ బై కెగసినట్టి తదీయ శిరఃప్రదేశమం
దున్న సురాపగాలహరి యొప్పగు శీకరపంక్తులోయనం
జెన్నలరారెఁ జుక్కగమి చిల్వలయేలికపాన్పుడుంగునఁ॥ 35
తే॥ అపుడుసమయాంగనారత్న మబ్జవైరి
రాఁగలండిటకని యనురాగమునను

బోదుపుమల మున్నె వెలిపట్టుపుట్టమొప్పఁ
బరచెనోయనఁ బాండిమబాగుమీఱ॥ 36

— చంద్రోదయ వర్ణనము. —

సీ॥ సీమంతమునఁ బ్రాగ్దిశా మానినిధరించు సలలితకేతకీ దళమనంగఁ
బాకారికామినీ పాణిసంఘటితోల్లసిత హీరరచిత పాచికయనంగ
సమయప్రభునిచెంత సంతసంబునవీచు సొంపైన మల్లెపూ సురటియనఁగ
నుదయాంబురాశి సముత్తుంగభంగాగ్ర సంస్థితార్జున కుశేశయమనంగ
తే॥ రేకయై యర్ధమై యంచులేక గుండ్ర
మనఁగఁదగి పూర్ణవర్తులతను రహించి
పూర్వజగతీధరంబునఁ బొసఁగసిలిచెఁ
జల్లదనములగమిసీను చందమామ॥ 37

— చంద్రకళంక వర్ణనము. —

మ॥ ముదమొప్పం జనుదెంచుచున్న శశభృన్మూర్తిం ద్రియామావధూ
టి దృఢాలింగనమాచరింపఁ దనకాటిన్యంపుఁజందోయిపైఁ
బదిలంబౌ మృగనాభికర్దమమురోభాగంబునం దంటియు
న్నదిపోలెన్ గనన య్యెా నంకమరవిందద్వేషిబింబంబునన్॥ 38

— చంద్రికావర్ణనము. —

సీ॥ దరశీత గిరిధాత హరిశ్వేత శరజాత సురనేత కరిసూత హరివరములఁ
గాశ జన్యాశనా హీశ కైలాస వాణీ శతారేశ్వరా కాశనదులఁ
గుందకందుకశరత్కంద చందనసుధా మందారహిమబిందు బృందములను
తారకాసారగో క్షీరకర్పూర డిండీర ముక్తాహార కైరవములఁ
తే॥ దురగపరివృఢదితిసుతగురు ప్రలంబహరణులనుగేరి జారచోరాళిహృదయ
సాధ్వసప్రదముఖ్యబీజమయి చెలఁగిపండువెన్నెలజగమెల్లనిండుకొనియె 39

— ఇంద్రుని విగ్రహము. —

ఉ॥ అత్తటిదేవశిల్పి తనయంచిత శిల్పకళాప్రవీణతం
బత్తనమొందు షడ్ద్వితయబాహుని పేర స్పజించి యింపుద

శ్రో కృత్తఁ దదీయమధ్యమునఁ గుంజరభంజనపీఠిఁ జేయఁగాఁ
జిత్తజవై రిపుత్రుఁడు వసించెనునందుల దేవసేవ్యుఁడై॥ 40

క॥ పదఁపడిదివ్యులఁ దమతమ సదనంబులనుండుఁడనుచు శాసనమొసఁగఁగా
ముదమందియట్లచేసిరి కొదుకకనందఱును నందుఁగుధరాహితుఁడుఁగా॥41

తే॥ మణిఖచితమైన యొకదివ్యమందిరమున
వేడ్కశయనించియున్నట్టివేళఁ దొల్లి
భూషణములొక్కఘటమునఁ బొందుపరచి
తానునచ్చోట మరుఁగుఁగా దాచుకతన॥ 42

శా॥ ఆకుంభంబపుడుఁగా వసేంద్రిరతదీయాసన్న ముం జేర్పఁగా
నాకాధీశుఁడు దానియందుఁగల నానాభూషలంజూచుచో
సౌకర్యంబు శచీప్రియంబునగు భూషంబొందుగాన్పింపఁగా
నాకంజాతునిఁజూచినట్లగుడు మోహావేశుఁడై యున్నెడఁగా॥ 43

శా॥ కందర్పుండదిపందుగా విజయశంఖంబొత్తి విల్లంది నా
రిందీవ్రంబుగ్రమోసి కీరహాయుఁడై క్రేళ్లుబ్బి పుష్పాస్త్రపుఁగా
సందోహంబులుగ్రుచ్చివక్షమునఁ జాంచల్యంబునొందంగఁజే
సెం దచ్ఛర్వరిసర్వదిక్పతులు గాసింజెందరద్దంటచేఁగా॥ 44

వ॥ అంతఁబురందరుండమ్మాఁడనకలశంబు బరిచారికలకొసంరక్షితెంచి తాఁకు
లాంగనందలంచి కలంగినడెందంబున విరహానలంబునంగాఁగుచు
సరస్త్రీరారామంబులవిహరించుచు భృత్యజనోపచారములుగలిగియు నిద్ర
కెడసి ధవళకిరణ మలయానిల దర్పకాదులనుద్దేశించి॥ 45

సీ॥ పంతమా సద్యశోవంతమా కోపమత్యంతమా తారకాకాంత నీకు
వైరమా యభిజనాచారమా జీవనాధారమా మలయసమీర నీకు
నీతియా బంధురఖ్యాతియా లేకసంప్రీతియా శంబరారాతి నీకు
శౌర్యమా నిర్భరౌదార్యమా పుణ్యంపుఁగార్యమా షట్పదవర్య నీకు

తే॥ నేరమా [illegible]రమా శారిహారిమా [illegible]
యమారమా [illegible]మా కడుబీరమా వ

నప్రియములార నన్నిటునవయఁజేయ
ననుచు నిందించి పాకశాసనుఁడుమగుడ॥ 46

వ॥ అవ్విభావరి యొక్క కల్పంబుగా వివిధోపాయములఁ గ్రమించి మనంబున జనించిన మోహంబభిమానంబుచే మాటుసేయుచుఁ దనువునఁ గర్పూర కాశ్మీరచందనాదులలంది బాహులేయు సేవించు కుతుకముననసిమిషులఁ గలిసి తత్పన్నిధికిఁజనియె నంతఁ బ్రభాతసమయంబగుటయు॥ 47

— సూర్యోదయ వర్ణనము. —

చ॥ జనదభినంద్యుఁడైన పురశాత్రవపుత్రకుచేత శూరప
ద్మ గజవిరోధవక్త్రముఖ దానవపల్లభులాజికేళిలోఁ
దెగుటనిజంబు తప్పదని దీప్పదు తద్ఘనరాజ్యలక్ష్మి నె
మ్మొగమున మాసిన్రవాలెశశి పూషరుచిన్ స్వకళంక మెచ్చఁగన్॥ 48

క॥ కడువడి సేనకుమృంగల నడిచెడుజండాంశు కేతనముపైఁ గాంతి
ల్లెడు నద్దమే మొకోయన నుడువీధిన్ వేగుచుక్క యుదయంబయ్యెన్ 49

ఉ॥ దిక్కులనన్నిటందిరుగ దెప్పరపుంబ్రణయంబులూడఁ బె
న్మక్కువ శ్రౌతకర్మములొనర్పఁగ మాయెనరించుశబ్దమే
నిక్కముమూలమెల్లధరణిన్ వినుఁడంచెజిగించెనోయనన్
గుక్కుటముల్ త్రివైభరినికూసెను ఘుగ్ఘగళస్వనంబులన్॥ 50

చ॥ హరినగరంబుఁ దొల్తొసనయోట సహోర్ముఖమంత్రి తత్పురీ
పరసరతుంగపూర్వగిరి భాసురశృంగ కనత్సువర్ణ గో
పురమునసుంచినట్టి పురుహూద్యుతియుజ్జ్వలకుంభ మోయనన్
సరసిజబంధుబింబముఁ బొసంగెను శోణరుచిప్రసిద్ధమై॥ 51

ఉ॥ కైరవముల్ దపించె విహగంబులుగూండ్లుఁద్యజించెఁ బద్మముల్
గోరికలన్ వహించె నుడుకోటినశించె రంధ్రాగిదంపతుల్
సారెకు సంతసించెఁ బొదఁజక్కెరవిల్దొర తూపులుంచె ది
గ్గారము కాంతి బెంచెఁ బనిపాటలు గేస్తులడాసె నంతటన్॥ 52

—♦ గుహుఁడుపాశుపతవ్రతదీక్షితుఁడై శివపూజసేయుట. ♦—

ఉ॥ అంతకుమున్న లేచి హరిదంబరపుత్రుఁడు గాల్యకృత్యముల్
సాంతముగానొనర్చి ఘనశాంతియుతుండయి తల్లిదండ్రులన్
స్వాంతములోననిల్పుకొని పాశుపతవ్రతదీక్షఁబూని మా
శాంతకుఁబూజఁజేయుటకు యత్నమొనర్చుడు తత్క్షణంబునన్॥ 53

క॥ నలినాక్ష నలినసంభవ బలశాసన సిద్ధసాధ్య పన్నగ గరుడా
దులుఁ దత్పూజకుఁగూర్చిరి ఫలదళయభిషేకజలమువలయునవిమలిన్॥54

మ॥ పొగడల్ మల్లెలు నందివర్ధనసుమంబుల్ నూతనాశోకముల్
దొగలున్ మొల్లలు మాచిపత్రి విరవాదుల్ పొన్నలున్ మంచిగో
జ్జఁగిపువ్వుల్ కలిగొట్లు బిల్వదళముల్ జాజుల్ సరోజాళి సం
పఁగెలున్ మున్నగుపూలుదెచ్చియొసఁగన్ భావంబులో మెచ్చుచున్॥ 55

వ॥ మణిముక్తానదిని సంకల్పపూర్వకముగా శుచిస్నాతుఁడయి వెలువడివచ్చి శివమంత్రంబధికనియమంబునఁ బఠియించుచుఁ దన్మహనీయస్థలంబునఁ దేజరిల్లు మహాదేవునిదర్శించి యేకాగ్రచిత్తుండై కార్తికేయుండు॥ 56

సీ॥ అభ్రాపగాధారి కావాహనము హాటకాద్రికోదండున కాసనంబు
శార్వతీచేతోబ్జ భానునకర్ఘ్యంబు పాద్యంబు గరళైకభంజనునకు
నమృతాంశుజూటున కమృతాభిషేకంబు వస్త్రంబు కైలాసవాసునకును
జన్నిదంబామ్నాయ సన్నుతపదునకు గంధంబు మేచకకంధరునకు

తే॥ నక్షరునకక్షతలటంచు నప్పగించి
తత్సహస్రాఖ్యలపుడు రుద్రమున నమక
మునను బంచాక్షరీమంత్రమునను విరులఁ
బూజగావించె సంతతాభ్యుదయమతిని॥ 57

ఆ॥ నిశ్చలాత్ముఁడగుచు వాశ్చరేద్ధ్వజశాసి పాదపంకజములు బ్రస్తుతించి
యమరులెల్లఁ జోద్యమందివీక్షింపఁగ నర్చసేయుటయును నబ్జమౌళి॥ 58

వ॥ తదీయారాధనంబునకు మెచ్చి॥ 59

సీ॥ గంధవాహాశన కలితదామంబుతో గంగాధృతోత్తమాంగంబుతోడ
భసితప్రలిప్త శోభనశరీరముతోడసింధురదానవాజినముతోడ
శతకోటిమార్తాండ సంకాశరుచితోడ నవదాతవృషభ వాహనముతోడఁ
బ్రబలారినందోహ భయదశూలముతోడ నంబుజభవ కపాలంబుతోడఁ
తే॥ జాతవేదమయాలికేక్షణముతోడఁ జంద్రికాధౌత మందహాసంబుతోడఁ
బార్శ్వదులతోడఁజలిగట్టుపట్టితోడసదయమతితోడ నెదుటసాక్షాత్కరించె॥ 60
క॥ ఇవ్విధమునఁదనచెంగటఁ బువ్విలుదొరసూదునిలువఁ బులకితతనుఁడై
నెవ్వాడిఁగేల్మోడ్చి మనంబువ్విళ్లూరంగ సవినయుండయిపొగడెన్॥ 61
క॥ శ్రుతులునినుఁదెలియఁజాలవు యతులు భవన్మహిమమిట్టిదట్టిదియనలే
రతిపిమలు నట్టినిను సంస్తుతిసేయఁగనాతరంబె సుమధన్వారీ॥ 62
శా॥ సర్వాతీతుఁడవప్రమేయుఁడవు సంసారవ్యథాచ్ఛేదివిన్
సర్వజ్ఞుండవు సార్యనిర్మలమనస్సంవేశివాద్యుండవున్
సర్వేశుండవనంతరూపుఁడవు భాస్వత్కోటితేజుండవున్
సర్వవ్యాప్తుఁడవైననిన్గనుట దుస్సాధ్యంబుసర్వాత్మకా॥ 63
శా॥ వందేహం భవదుఃఖవార్ధితరణం వందారుచింతామణిం
కుందేందుప్రతిమ్మానవిగ్రహరుచిం గోత్రస్ఫురత్కార్ముకం
కందర్పోగ్రతరాటవీదవశిఖం కాత్యాయనీశం సదా
నందం ధారితబాలశీతకిరణం నానామయంసర్వదా॥ 64

—♦ గీత కంద గర్భిత చంపకమాల ♦—

చ॥ పురహరశంకరా భుజగభూష రసాధరభూరిచాప సా
గరశరధీ శివావరద కామవిభంగ సుపర్వవంద్య కుం
జరహరివిక్రమా సవనసంహర తామరసారిజూట మా
వరవిశిఖాభవాదివిజవాహిని సంభృత దీనపోషణా॥ 65

వైపద్యములోనివి.

క॥ హర శంకరా భుజగభూష రసాధరభూరిచాప సాగరశరధీ

తే॥ భుజగభూషరసాధర భూరిచాప వరద కామవిభంగ సుపర్వవంద్య
సవనసంహార తామరసారిజూట దివిజవాహినిసంభృత దీనపోష॥ 2

వ॥ అనితన్నుఁగీర్తించు గాంగేయుంగరుణించి శివుండుఁ బాశుపతాది
రౌద్రసాధనములిచ్చి యంతర్హితుండయ్యె నంత గుహుండు మూఁడుపే
శుల నత్యంతభక్తి మనంబుననంస్మరించి॥

—◆ కుమారుఁడు మరుభూమిమీఁదుగాఁబోయి చరమాద్రిఁజేరుట ◆—

విధివిష్ణుప్రముఖ నిలింపసేనాసముదయంబులుఁగొలువ రథంబెక్కి మరు
భూమిఁజేరంబోయి॥ 66

సీ॥ దారుణరవికరతతినోఁకి యినకాంతిశిలల నగ్నిజ్వాల లలఘులీలఁ
దీంద్రడించుచున్నఁ దత్శిలాళి హేమంతమందున నడురేయిఁ జందురుండు
నణఁపఁజాలనిదాని నగములనావృష్టినైరించి ఫలపలాశప్రసూన
రహితంబులగుచు వర్షాకాలమునసైన చెండల మండునట్లుండుదానిఁ

ఆ॥ జండకిరణకిరణజాల ఘాతంబున బ్రద్దలైన భూమిరంధ్రములను
నతలభువన లేలిహానఫణారత్న రోచులుడుగకెపుడు తోఁచుదాని॥ 67

క॥ మృగములు మనుజులుఁ బశువులు
ఖగములు లోకానొకటఁ దెరువుఁగాం కచటుఁబో
వగఁ దమవులమంటలు పె
ల్లగయుఁడు నవిమరలి నిలువ కేగెడుదానిన్॥ 68

మ॥ కనియచ్చోటికిఁ దాఁజనన్ సుఖదమైకన్నట్టి మాగానికే
పున నీరంబులుఁగట్టఁ జల్లవడుచొప్పుంగాంచి రంజిల్లి శ్రీ
తినిఁబోఁదోలి మనుష్యులొప్పి ఘనదీప్తిన్మించఁగాఁజూచి యిం
పున నభ్భూమినిఁదానువీడ్కొని నిలింపుల్ గుంపులై కొల్వఁగన్॥ 69

వ॥ మహావైభవంబునఁ బార్వతీనందనుండు నస్తాచలంబునకుఁజని యందు
సకలామరపరివృతుఁడయియుండఁ దద్గిరిశృంగంబునం దొండొకదివ్య
ప్రదేశమునఁ దప్తుండు ననంతుండు నందియుఁ జతుర్ముఖుండు వజ్రపా

ణియు మారీచుండు ననువారాఱ్వురుఁ దేజఃప్రభూతులగుమౌనులుఁ దపంబు సేయుచుండుటం జేసి జగత్పీడాపరిహారుండుఁ దారకదైత్యవిదారుండును నగు విశాఖుదవ్వులం గాంచి వారలు భక్తియుక్తులై నమస్కరించి నిలువ నాసమయంబునఁ బౌలోమీప్రియుండుఁ గేలుమోడ్చి బాహులేయునకిట్లనియె॥ 70

—♦ పరాశరపుత్రుల శాపవిమోచనక్రమము ♦—

క॥ వీరు పరాశరసూనులుఁ బారాశర్యాగ్రభవులు బాల్యక్రీడా
ధౌరేయులగుచు జెల్లున వారకనుండుదురు కేకివాహనయెపుడున్॥ 71

క॥ లీలన్ వలలను పురులను గాలంబుల మీఁటబట్టి కడతేర్చుటయే
శీలముగ వీరుమెలఁగుట లాలించి పరాశరుండు నతికుపితుండై॥ 72

ఉ॥ నిచ్చలు మీరలీశరవనిం బ్రవహించుచునున్న గంగలో
మచ్చములై చరింపుఁడని మండిశపించెను బుత్రషట్కమున్
నొచ్చిభయాకులాత్ములయి నూల్కొనివారలు శాపముక్తి వా
క్రుచ్చుమటంచుఁ దత్పదసరోజములం బడివేఁడ నాతఁడున్॥ 73

శా॥ కామిన్యాన్వితుడై కుమారులకనుం గాత్యాయనీస్తన్యమున్
మీనేనాటికిఁ ద్రావ కానో యప్పుడే మీశాపముందీరెడిం
బోరోరే యని యే నెంతపసి తత్పుత్రుల్ వియచ్ఛాహినీ
వారిన్ మీనములై చరించిరి నిలింపస్తుత్యదోర్విక్రమా॥ 74

తే॥ తలఁప వారలభాగ్యంబువలననీవు నచటఁబుట్టి భవానిస్తన్యంబుఁగ్రోల
నప్పుడాక్షీరబిందువులాస్రవంతి సలిలములలోననొకకొన్ని జాఱిపడియె॥ 75

క॥ అక్కణముల మీనాకృతి
నక్కడఁగల మౌనితనయు లలరుచుఁద్రావన్
గ్రక్కున శాపము లయమై
యక్కజముగఁ దొంటిమేను లందిరి నెఱయన్॥ 76

శా॥ కదుభక్తి వారలాఱ్వురు
స్సృడునింగని మ్రొక్కి నుతులమెప్పించుటయుం

బడమటికొండను మీరుం
డుడు తపముననుచు మఱియునుఁ శివుఁడనియెఁ॥ 77

వ॥ మీరిట్లున్నఁ గొంతకాలంబున కమరచమూసమేతుండగుచుఁ గార్తికేయుండు మీయున్నచోటికివచ్చి మిమ్ముల దివ్యజ్ఞాన పరిపూర్ణులుగాఁ గరుణింపఁగలవాఁడింక మీరలుమదాజ్ఞం బ్రవర్తింపుఁడనిన వల్లెయని॥ 78

తే॥ ఇచటవసియించి నీరాకనెలమిఁ గోరి
యుండ శివవాక్యగతిమీర లొప్పుమిగుల
నరుగుదెంచుటచే వీరలతిక్రతార్థు
లైరి ధ్రువముగననవిని యాదరమున॥ 79

వ॥ శరజన్ముండు వారలమన్నించి తత్త్వోపదేశంబొసంగి తనవెంటరా వారల కాజ్ఞయిడి దిక్పాలకాద్యఖిలదేవవర్గంబులతో నరిగి విశ్వకర్మనిర్మితంబై యగణితశోభాయమానమగు శాంతిపురంబుసొచ్చి యతివిచిత్రకల్పనావిశేషంబగు తన్మధ్యస్థిత సింహాసనమునఁగూరుచుండి సురగరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్య విద్యాధర ప్రముఖులూడిగంబులుఁ సేయఁ గొంతతడవుండి హరివిరించనాదులఁజూచి యిట్లనియె॥ 80

ఉ॥ కూరుఁడుమున్నుగాఁగలుఁగు సోకుఁలపుట్టుక వారిసంఖ్యయుఁ
వారలరూపముల్ బలము వారికిముఖ్యులు వారిగర్వముల్
కోరితినాలకించుటకు గోప్యముసేయక తెల్పుఁడన్నఁ గ్రౌం
చారికిఁ గేశవాజ్ఞను బృహస్పతిచెప్పఁదొడంగెసర్వముఁ॥ 81

— రాక్షస వంశోత్పత్తి క్రమము —

తే॥ శంభునందన తొల్లి కశ్యపమహర్షి
యవనిగలఁ డాఘనుఁడు దితియనెడుఁ గాంత
వలన నఱువదియాఱుకోటులనిశాట
వరులఁబుట్టించె మృత్యువువంటివారి॥ 82

క॥ వారుమహాశౌర్యంబున సారెకుఁ దాపన నిలింపచక్రంబులపై
నూరకయె మచ్చరించుచు ఘోరంబవనికినొనర్చి పరగుదురెంతుఁ॥ 83

తే॥ అట్టిదితిజులకందర కధిపుఁడగుచుఁ
బరగునసురేంద్రుఁడను మహాసురుఁడుఁ బత్ని
యైనమంగళకేశియం దపుడుఁగనియె
సురసయనుపుత్రినొక్కతె సురుచిరముగ॥ 84

చ॥ అనుపమసుందరాంగియగు నాత్మజనయ్యసురేంద్రుఁడప్పుడున్
ఘనుఁడగుశుక్రునొద్ద నొడికమ్ముగ విద్యలనభ్యసింపఁగా
నునిచిన నవ్వధూమణి ప్రియోక్తులచే గురుసేవఁ జేయుచున్
వినయమతింజరించి చదివెన్ బహుళాసురవిద్యలన్నిటిన్॥ 85

వ॥ ఇట్లుసకలవిద్యలఁ గరతలామలకంబుసేసిన నప్పాలఁతినీక్షించి శుక్రాచార్యుండుసంతసించి యదినేర్చినమాయావిద్యలకనుగుణంబుగా మాయ యనుపేరిడి తానుదైత్యగురుండగుట దివిజసమృద్ధియు దితిజనాశంబును గని సహింపనోపక॥ 66

క॥ మునుబ్రహ్మసేయు యాగంబున నందికపించె రిత్తవోవునెయది యీ
యనిమిషులసంపదలుఁ జెడుననుటకుసందియమువడగనగునేయింకన్॥87

క॥ ముందటికార్యంబునకీ సుందరి యసమానశౌర్య శోభితులయి పెం
పొందెడుసుతులంగాంచినఁ జిందరవందరగు వారిచే సురబలముల్॥ 88

—♦ శుక్రుఁడు మాయాసతికి హితోపదేశముఁజేయుట. ♦—

తే॥ అనుచుమదిలోనఁదలపోసి దనుజగురుఁడుఁ
బరగమాయాసతిం దనపజ్జనునిచి
కొని రహస్యంబుగా నొకకొన్నిపలుకు
లపుడుబోధింపసాగెనుఁ గృపచెలంగ॥ 89

మ॥ రమణీ దేవతలున్మునీంద్రులును శౌర్యస్ఫూర్తిచే ఘానవా
ద మహాసంపదలాక్రమించుటనుఁ జింతంజెందినీతండ్రి దై
న్యముతోనుండుటఁగాంచి నెమ్మది నొకింతైనంగ్రుధంబూనకన్
సమబుద్ధింజరియింపఁగాఁదగునె యీశాంతంబునేఁడొప్పునే॥ 90

ఉ॥ సూనృతవాక్యగౌరవుఁడు శుద్ధచరిత్రుఁడుఁ దమ్మిచూలికిన్
మానసపుత్రుఁడార్యజనమాన్యుఁడుఁ గశ్యపమౌనిసంగతిన్
సూనులవిక్రమాధికుల సొంపుగఁగాంచి సురారికోటులం
బూనికఁబ్రోవుమంచిటుల బోధయొనర్చిన సమ్మతించుచున్॥ 91

క॥ తనతండ్రికడకు మాయావనితామణియేఁగి శుక్రువచనంబుల నా
తనికివినిపించి తదనుజ్ఞనుఁగైకొని గంగఁజేరఁ గడువడినరిగెన్॥ 92

వ॥ అట్టిసమయంబున॥ 93

—◆ వసంతాగమము. ◆—

మ॥ అరవిందాస్త్ర సుధాశికేతువిభవుండై గాఢ్పుతేరెక్కి స
త్వరరా నూత్నమహీరుహాగ్ర ఘనసౌధశ్రేణిఁగొల్వై లతా
తరుణుల్ పల్లవపాణులన్ సుమములుద్యన్మోదతం జల్లువై
ఖరిఁ గాన్పింపుచుడాసె మాధవుఁడు శృంగారజ్ఞులుప్పొంగగన్ 94

సీ॥ శుకకుమారగణంబునకు విద్యనలవాటు
నందించుటకు నుపాధ్యాయుఁడనుచుఁ
గోకిలంబులకెల్ల వాకట్టువదలింప
వఱలెడు నుత్తమవైద్యుఁడనుచుఁ
దరులతాదులకు వృద్ధత్వమూడఁగ మందు
సిద్ధింపఁజేసెడు సిద్ధుఁడనుచుఁ
బొలయలుకలుఁగల్గుఁ బొలఁతులఁబురుషుల
జోడుఁగూర్చెడుఁ జెలికాఁడనుచును

తే॥ మందపవమాన ధూత మరందసిక్త
బంభరజ్యానినాద సంపద్విలాస
కామశౌర్యసమగ్రుఁడీ ఘనుఁడనుచును
మిగులయశమొంది యామనిమించెనపుడు॥ 95

తే॥ అట్టి వాసంతసమయమందట్లు గంగఁ
జేరి తత్తీరభూమి నిర్జిత సమస్త

బాహ్యావిషయాభిలాషుఁడై పరమనిష్ఠఁ
దపముఁజేసెడుఁ గశ్యపతాపసేంద్రు॥ 96

మ॥ కనిమాయాసతి యాజటిప్రభు నభిజ్ఞానంబు లక్కావ్యుఁడుం
దనకుం బూర్వముఁజెప్పినట్లమరియుండం జూచి మోదించి యా
తనినేలాగుననైన మోహమునుఁజెందంజేసి క్రీడించి నం
దనలాభంబుఁ గనంగనాత్మ నధికోత్సాహంబుదీపింపఁగన్॥ 97

క॥ తనమాయాబలమున న
మ్మునికిన్ దర్పకవికారములు దట్టముగా
జనియింపఁజేయుటకునై
మునుకొని యారామసృజనమున్ దొరకొనియెన్॥ 98

—● మాయాసతి తనమాయవలన నుద్యానవాటికాసరస్తటాకములఁగల్పించుట. ●—

సీ॥ చందనపున్నాగ శారదశాండిల్య మాకందజంబీర మదననింబ
కందరాళశిరీషఖర్జూరనారంగ పనసామ్లకేతకీ పారిభద్ర
గాలవమాధవీ క్రముకతాలలవంగ తక్కోలకపిల హింతాలవకుళ
లుంగప్రియాళు మాలూరదాడిమశక్ర శాపింఛలకుచ పీతద్రుకదళి
తే॥ కురవకాశోకఫలపూర ఘురకసాల
కదరశింశుపచాంపేయ బదరిభూర్జ
సింధుకాశ్వత్థ హేమపుష్పికజయంతి
ముఖ్యతరుపంక్తి నారామముగఘటించె॥ 99

వ॥ మరియు నయ్యుద్యానంబుఁ గౌశికగాలవశాండిల్యకపిలశారద ప్రకాశి
తంబుగావున చతురాననసభాభవనంబును నైరావతజీమూతదేవవల్లభ
లలితంబుగావున సురలోకంబును హైమవతీశివ విరాజితంబుగావున రజత
గిరిని మన్మథశోభనంబుగావున ద్వారవతిననుకరించె నిట్టియయ్యుప
వనంబునందలిసకలపాదపంబులుఁ బర్ణకుసుమఫలభరితంబులయియుండును
తత్సమీప బహిఃప్రదేశమున బహువిధరత్నమండపంబులును మణిమయ
క్రీడాచలంబులును దదారామమధ్యంబునందుఁ బద్మకైరవ కల్హార

హల్లకకువలయ నీలాంబుజన్మప్రముఖ కుసుమవిసర ప్రసరణంబులయి నిర్మలస్వాదుశీతలజలప్రపూరితంబులయి యొప్పు వాపీకూపతటాకపద్మాకరంబులు నిర్మించి యమ్మాయావధూటి తానందు జగన్మోహనసౌందర్యరేఖా విలాసభాసురంబగు మనోహరరూపంబుఁదాల్చి క్రొక్కాఱు మెఱుంగు తెఱంగున నందందుఁదిరుగుచుఁ బుష్పాపచయంబున కుపక్రమించి॥ 100

సీ॥ గానంబుఁబాడి ప్రేంకణము మోదిలఁ జేసి చూతంబుఁజేముట్టి ప్రీతిఁదనిపి
యాలింగనంబున నలరించిగోరంట నగిసురపొన్న నానందపరచి
కమ్మనిమాటలఁ గర్ణికారముఁదెల్పి తన్నిఁయశోకంబు తప్పుదిద్ది
యూర్పునవావిలి నుల్లాసమొందించి వీక్షించితిలకంబు వెలయఁజేసి
తే॥ మొగముకాంతినిఁ జంపకమును గరంచి
యుమిసిపొగడను మోదించు క్రమమొనర్చి
విరియునట్లుగఁగావించి విరులుచిదిమి
తిరుగుచుండెమనీటుగాఁ దెఱవమిన్న॥ 101

వ॥ ఇట్లమ్మాయాభిధాన రక్షఃకన్యక తనశాంబరీవిద్యాప్రభావంబునఁ గశ్యపునకు నత్యంతమోహంబుజనించుటకై యతివిచిత్రంబుగా సంఘటించి యతనిసంయోగంబున కెదురుచూచుచుండెఁ దదనంతరంబున॥ 102

ఆ॥ కశ్యపుండుఁ గొంతకాలంబునకుఁ గన్నువిచ్చిచూచి గాఢవిస్మితుండు
నగుచు హరిహరాబ్జజాదులలో నెవ్వరిట్లుగలుఁగఁ జేసి రిందుననుచు॥ 103

క॥ ఉల్లమునఁదలఁచి యవ్విధమెల్లం గనుఁగొనుచు నందుఁ గృత్రిమగిరిపైఁ
బల్లవశరు శరమోయనఁజెల్లిన చెలిఁజూచి మోహచేష్టితుఁడగుచున్॥ 104

క॥ తలయూఁచి తెప్పవేయక పలుమాఱునువానిఁజూచి భళిరాయనుచుం
బలుకుచు ముక్కునవ్రేలిడి కలికినివర్ణింపసాగెఁ గౌతుకమొప్పన్॥ 105

—◆ కశ్యపుఁడు మాయాంగనను వర్ణించుట. ◆—

తే॥ పంచబాణునియాఱవబాణమనఁగ నిలుకడనుదాల్చు మెఱపన వెలయుదీవి
నిగ్గుగలకొప్పుసుమనసస్నేహమెలమి సలిపికృష్ణతనొందెనాశ్చర్యముగను॥

ఉ॥ బాలశశాంకుఁడీ వనితఫాలతలంబునఁ గోడి లజ్జచే
శైలసుతామనోహరుని సమ్ముఖమొంది తదీయసామ్యముం
దాలుతునంచుఁ జేరె గిరిధన్విశిరంబున నట్లుచేసియుం
బోలఁడుదత్సమాన మెటుబోయినఁ గోర్కి కళంకికబ్బునే॥ 107

ఉ. పూర్వపువైరముఁ మదినిబూని మహోగ్రుధ సైంహికేయుఁడుం
బర్వదినంబులం దనకుబాధయొనర్పఁడుఁ బూర్ణచంద్రముం
డోర్వఁగలేక భీతహృదయుండయి దాసినదంపుజాలకఁ
గర్వముదక్కి యచ్చెలిమొగంబయినిల్చె విలాసమొప్పఁగఁ॥ 108

క॥ తారుణ్యలైనపురుషుల భీరులజతఁ గూర్చ నాదిబీజంబగు పం
కేరుహశరములుఁ దొడిగెడుమారునిచాపంబులీరమణిభ్రూయుగముల్॥ 109

శా॥ ఈకంజేక్షణజన్మకాలమున వాణీశుండ శేషాంగనా
లోకశ్రీవిజితంబులై నిఖిపాళుల్ గోధిపైవ్రాసి కా
వ్యైకశ్రీద్విత యంబుఁ దల్లిఫులకాద్యంతంబులం దుంచెనా
లోకఁ భాసిలెఁ గర్ణయుగ్మము మహాశోభాయమానంబుగఁ॥ 110

తే॥ హాటకలాంఛనాండాస్యమై యమరియుంటఁ
గాంచి తన్నేత్రత్రివిపలేక కైరవములు
నెమ్మి నుపకంఠముఁ గోరి నిల్చెననఁగ
నీపఘూమణి నేత్రంబు లింపొనర్పు॥ 111

తే॥ నువ్వుఁబువ్వులమెచ్చక నవ్వుచుండుఁ
జంపకంబులసౌరు నడంపఁజూచు
హాలముఁదలనెత్తనీక హాస్యంబు సేయు
భాసురంబైన నిక్కాంత నాసికంబు॥ 112

క॥ నిద్దఁపుఁ గాంతులనొప్పెడు
నద్దపుఠేకుల రెయియార మడఁపఁగఁజాలుఁ
ముద్దులకుమూటయగు నీ
ముదియ నునుఁజెక్కు లమర మునగాటికిని॥ 113

చ॥ శుకపికరాజిపీడ కెదఁ బ్రుక్కుచు బింబకిసాలయంబు లీ
సకియకు నోష్ఠమైతనర సత్స్వరవాక్య గళస్వనాకృతిం
బ్రకటచలంబుమీర నవి పైకొనిరాగ నధఃస్థమౌట వా
రక వెదవిఁవచింతు రధరంబనుచుఁ భువనత్రయంబునన్॥ 114

క॥ ఈనెలఁత గళసమానముఁ గానేరక నధికలజ్జఁ గంబుక్త్రింపం
గానెకద దరమటంచుం బూనెనునామంబు నిక్కముగనిద్రాత్రిన్॥ 115

క॥ అందములఁగుకోమల నవకుందములను గేలిసేయుఁ గోమలిరదముల్
నిందించు వెన్నెలను నీసుందరి మందస్మితంబుఁ జూడంజూడన్॥ 116

క॥ విలసితమృణాళములు నీయలివేణి భుజంబులవుర యటుగాకున్నన్
దిలకింపఁగరములనియెడిజలరుహములుఁగలుఁగుకెట్లుచర్చింపంగన్॥ 117

సీ॥ తళుకైన బొంగరములుఁ దాము భ్రమియించ
కితరులభ్రమియింప నెఱిఁగెనేని
పుట్టచెండులుఁ దాముఁ గొట్టుపడఁక యూప
రులఁ గొట్టుపడఁజేయఁ గలిఁగెనేని
తమ్మిమొగ్గలు మెత్తఁదనముఁ దామొందక
నొరుల మెత్తనఁజేయ నోపెనేని
తపనీయకుంభముల్ దాముఁగరంగక
పెఱవారిఁగరఁగింప నెఱిఁగెనేని

తే॥ యౌర సమమనవచ్చు మజ్జా రె సదృశమనఁగవచ్చును యౌరతుల్యంబనంగ
వచ్చు నౌరౌర సరియనవచ్చు నీనితంబినీమణి వర్తులస్తనములకును॥ 118

మ॥ కనకాంగీమణిరోమరాజి సమముంగానెంచి సర్వప్రభుం
డనిలాహారమొసర్చుచున్ సుషిరవాసాప్తిం గృశీభూతుఁడై
దినముల్ ద్రోచి ఫలంబొకింత గనురీతింగాన కార్తిం దొలం
గెను వక్రాధ్వులకెవ్విధింగలుఁగుఁ గోర్కెల్ భోగులై యుండినన్॥119

చ॥ ఉడుగక నెల్లకాలముఁ బయోధరభారముఁ దాల్పఁ గష్టమం
చుడుపథ మీశరతిఁ తమయుగాబనిశాసఁకుఁ గౌనుగాగ నే

ర్పడియె నమైనఁబోదు తలపంగఁ బయోధరభారమద్దిరా
పుడమిని నెందునున్నఁ దమపూర్వఫలంబులుఁ దప్పిపోవునే॥ 120

తే॥ కొలఁకులను జాలనిందించి గెలువఁజాలుఁ
బొన్నపువ్వులఁ దప్పులనెన్నుచుండు
మఱియు నావర్తములసొంపు మాపఁజూచు
భీరుమణిసుగు దీని గంభీరనాభి॥ 121

తే॥ ఈకృశోదరి మైజిగి కీడుగాక
మించు చలియించుటను గాదె చంచలనుఁ
బడుట మృసులూరు కనకరంభా మహీజ
మున జనించిన దళమనఁ దనరె వెన్ను॥ 122

మ॥ స్ఫురదూరుల్ వళులుం బిఱుందును నఖంబుల్ జంఘలుం బాదముల్
వరయానంబుఁ బ్రసాదముల్ గెలుచు రంభా వీచి భూ తారకో
త్కర శైల్యాంబుజ కుంభి కచ్ఛపములం దర్కించి యారౌర యీ
తరుణీలోక వతంసముం బొగడ సాధ్యంబౌనె వాగ్జానికిన్॥ 123

ఆ॥ అనుచునిట్లుదాని యఖిలాంగవర్ణన
మాచరించి మిగుల హర్షమునను
దాపునందుఁ జేరి తమిమీఱి మృదువాక్య
ములను నిట్టులనుచుఁ బలికెనతఁడు॥ 124

—● కళ్యాణ సూర్యాంగనల పరస్పర సంభాషణము. ●—

తే॥ కలికి యెవ్వరిదాన వెందులవసింతు
వేమినీనామ మిచ్చట కేకతంబ
యెట్లు రాగల్గితివొ నాకు హృదయమలరఁ
దెలియఁజేయు మటన్న నాతెఱవపలికె॥ 125

క॥ ఏనొండొకసతి నీగిరి కాననముల నుందు నెందుఁ గామరహితనై
మౌనిజనంబుల వృత్తినిఁ బూనుకొనిచరించుచుండిపొందుగనిటకున్॥ 126

వ॥ మేరుశైలోప వనసీమలంబాసి భాగీరథిం గ్రుంకులిడ నేతెంచితి నిచ్చ వచ్చిన క్రొట్టుబోయినం బోవుదాన ద్విజోత్తమా నీవింక నిలువుమనినఁ గశ్యపమహర్షి యిట్లనియె॥ 127

సీ॥ కనకాంగి నీకు నాకాశకల్లోలినీ ప్రముఖ తరంగిణీ సముదయములు
గణనకసాధ్యమై కన్పట్టి యిలనున్న యకలంక మహిత పుణ్యస్థలములు
నింతియేకా కఖిలేఛ్ఛా ప్రదంబైన కల్పకస్థాయి నాకంబునైన
నేనునీసన్నిధి కిప్పుడ తెప్పింతుఁ గుసుమాస్త్ర కేళి నన్గూడితేని
తే॥ మఱియు దాసీల మంచికుమాళ్లఁ బెక్కు
మందినిచ్చెద ననుడాసి పొందుము బల
యనుడుఁ దత్క్షణమాత్ర మాఁయావఘాటి
తీవియమెఱుంగుపోల్కి నద్భుతశ్రీయైన॥ 128

క॥ దిక్కులుపూచుచు సోలుచుఁ
జక్కెరబొమ్మనుఁదలంచి చంచలుఁడగుచుణ్
మిక్కిలి తత్తఱమున ముని
తక్కక యిలనొఱగె వాత్మతనువు మఱచియుణ్॥ 129

ఆ॥ అంతఁగొంతవడికి యమ్మాయ కశ్యపమౌని కెదుటఁదోపగాను లేచి
పెన్నిధానమబ్బు పేదకై వడిమోహపరవశాత్ముఁడగుచుఁబలికెనపుడు॥ 130

శా॥ రాకాచంద్రనిభాస్య కౌఁగిలియవే రావేననుంగూడవే
నీకారుణ్యముడాపకే గడియు నేనిన్నుణ్ విడంజాలనే
నాకోర్కెణ్ సఫలంబు జేయఁగదవే నానేరమేమే యయో
నీకుందక్కితినే ననుణ్విడువకే నీమూర్ఖముణ్ మానవే॥ 131

వ॥ అనియిట్లా మహర్షిపుంగవుం డధికమోహావేశుండయి బతిమాలుచున్న నయ్యసురకాంత లజ్జావనతయుంబోలె నభినయించుచు నాతాల్పు రూపంబులఁ గనువగురూపంబుల దాల్పఁగల్గితివయేని నిన్నుమదనకేళిఁ దేల్చి ముదమొందించె దననిన నయ్యమిత్రేశుండుఁ బరమహర్షంబునఁ గామరూప ధరుండయి॥ 132

—♦ శూరపద్మ సింహవక్త్ర తారక యాజముఖుల జన్మప్రకారము. ♦—

ఆ॥ రత్నమంటపమునఁ బ్రథమయామంబున
మించుకోర్కెతోఁ రమించుటయును
శూరపద్ముఁడనెడి సుతుఁడుదగ్రుఁడయి
కలిగె నన్నిశాటకాంతయందు॥ 133

క॥ వారల ఘర్మకణంబుల వీరులు మృగరాట్సమాన విక్రము లరిసం
హారులు ముప్పదివేల సురారులు జనియించి రసురు లలజడిఁ నొందన్॥ 134

సీ॥ మగుడనమ్మాయయు మౌనియు రెండవజాముస వేఱొక్కసదనమందు
సింహరూపంబులచేఁ గ్రీడసల్పఁగా వేయిమోములు రెండువేలభుజము
లమరి వికారరూపమునఁ బుట్టెను సింహవక్త్రుఁ డనెడివాఁడు వారిచెమట
బొట్ల నల్వదివేలు బుట్టిరి తోషాటు లాతఁ గ్రియామంబు నందు వార
తే॥ లిరువు రింకొక్కయింటిలో నిభములగుచుఁ
గలయ శతెద తిముఖములు గలిగి యున్న
వింతె తారకుఁ డనువాఁడు విష్టపముల
కధిక సాధ్వసకారుఁ డై కుమార॥ 135

క॥ పుట్టిరియెడ వారితనువుల బుట్టిరి స్వేదంబువలనఁ బొడమిరి దనుజుల్
డిట్టలు నలుబదివేలుం గట్టడులై రాజియు వినుము గౌరిపుత్రా॥ 136

తే॥ గజములుగ వారలిరువురు నవసకేళి
సలిపి నాల్గవజామునం దాస్థమించి
యొక్క మణిగృహాంతర మందుఁ గూడ
జననమయ్యెను నజముఖి యను తనూజ॥ 137

వ॥ తదనంతరంబ వారల రతిశ్రమజనిత నిదాఘకణంబులఁ ద్రింశత్సహస్ర
దైతేయులుద్భవించి రప్పల నమ్మాయయాకశ్యపులు దనివింగాన కుదయ
పర్యంతం బితర గేహంబులందు శార్దూల తురంగ శృంగిణీ కిటి భల్లూక
శృగాల ప్రముఖ పశు మృగాకారంబులతోఁ గ్రీడించినఁ దత్తద్రూపం

బులచే నలువదివేల రక్షోవీరులు ద్భూతులయి రివ్విధంబున బుట్టిన లక్ష ద్వయసైన్యంబును ముప్పురకొడుకుల నొక్కరూపంబుగ గనుంగొని యాశ్చర్యకలితులై తమతొల్లింటి మేనులుఁదాల్చి నిల్చియున్న తల్లిదం డ్రులకు శూరపద్మాసురుండుఁ దమ్ములగు సింహవక్త్ర తారకులఁగలిసి భక్తిం బ్రణమిల్లి మేమాచరింపఁదగు కార్యంబెద్ది యానతిండనిన సంత సించి వారలిట్లనిరి॥ 138

—♦ మాయాకశ్యపులు శూరపద్మాదులకు దపముసేయ నాజ్ఞయిచ్చుట. ♦—

సీ॥ తపమాచరించిబ్రహ్మదారకుల్ మునుకోరి దజనపరత్వమొందిరియతులుగొంద
ఱరయ జీవన్ముక్తి నందిరి త్రిపదార్థ జ్ఞానదంబును ధర్మకార్య సిద్ధి
కరము నానాలోక గమనసంప్రాప్తి ప్రదము నానావిధ యెద్దితపము గాకును
మీరలి క్కార్యంబు మెయికొనిచేసిన నీగుణంబులుమీకు నెసఁగు శుభ
తే॥ కరుణ నిహపరసౌఖ్యముల్ గలుగుననుచు
బలికి వెండియు నాకశ్యపమునివరుడు
సుతులు సద్బుద్ధులగుటకై శూలితత్త్వ
మహిమ శివభక్తియుక్తులు మనుతఁదెలిపె॥ 139

తే॥ అంతనిలువకకశ్యపుఁడనిరియెమఱియు విధువిరించిసురేంద్రాదివిబుధులెల్ల
భక్తవత్సలుఁడగు భర్గుబరమకరుణఁ గాంచిస్వస్థానవాసులైమించిరెలమి॥

మ॥ మును కుత్సుండను బ్రాహ్మణుం డురగరాడ్భూష ప్రసాదంబునం
దనువుంబాసిన కన్యనొక్కతెను నిద్రలేపుచందంబునన్
మనుపండే యదిగాక నీశివుఁడు ప్రేమన్ నిర్జరత్వం బిభం
బునకుం జక్కఁగనిచ్చి పిమ్మట వెసన్ బొందించెసాయుజ్యమున్॥ 141

ఉ॥ కావున మీరలీ గరళకంధరుఁగూర్చి తపంబొనర్చినం
గేవలభుక్తిముక్తుల సుఖంచెదరంచని బోధసేయఁగా
భావమురంజిలంగవిని పల్కెనుదల్లి సుతత్రయంబుతో
నేవిధి మీగురుండువచియించెనొ యట్టులసేయుటొప్పగున్॥ 142

క॥ మీరిట్లుసేయ నాయువు శూరత ధృతి వైరిజయము శుభము ప్రభుతయుం
గీరితి సర్వ జగత్సంచార మహాశక్తియును నిజంబుగఁగల్గున్॥ 143

వ॥ కావున మీరలిమ్మహింగల వటద్వీపంబునకుఁజని యాప్రక్క మహాదేవు
నింగూర్చి వీరయాగంబుసేసి తృప్తుంగావించిన సకలాభీష్ట ఫలసిద్ధులు
మీకుఁజేకూరు నజ్జన్నమునకు వలయుపదార్థంబులు నేనొసంగెదఁ గ్రతు
వొనరింపుఁడని తదీయోచిత మంత్రతంత్రముల నుపదేశించి తపోధన
శ్రేష్ఠుఁడగు కశ్యపునకమ్మాయ యిట్లనియె॥ 144

ఆ॥ ఏనుమాయయనెడు దానవకన్యను సుతులఁగోరి నిన్ను రతులఁగూడి
పుత్రవరులఁగంటిఁబోదుసీశ్వరుఁగూర్చి తపము సేయనింకఁదాపసేంద్ర॥ 145

క॥ అనిపలికి మాయ రయేఁగిన ఘనచింతమునింగ మోహకలితుండయి మూ
ర్ఛనొంద్రియవిలపించుచుమూర్ఛనెనయుమునిఁజేరవారిజుఁడేతెంచెన్॥ 146

ఆ॥ ఇట్లువచ్చి పుత్ర యింతతపఃఅపాటు
తగునె యాత్మయందు నగనివాసుఁ
జూనిపి తపముసేయి శుద్ధుండవై తృప్తిఁ
గాంతువనుచుఁదెల్పి కదలెనజుఁడు॥ 147

శా॥ అంతంగశ్యపమౌని తెల్విఁగని ఫాలాక్షున్ మనోవీధిలోఁ
జింతంజేయుచు నిర్మలుండయివసించెన్ మాయమున్నెంతయో
వింతల్గారచియించినట్టి వనవాపీకూప లీలాద్రుల
త్యంతబౌ మణిమంటపంబులు నదృశ్యంబయ్యె నాలోపలన్॥ 148

వ॥ తదనంతరంబ శూరపద్ముం డసురసేనాయుతుండయి సోదర సహి
తంబుగా వీరయాగమొనరింపనెంచి వటద్వీపాభిముఖుండై చనునప్పుడు॥

సీ॥ దైవవశాత్తు నాత్రోవనేతెంచుచుఁ గావ్యుండు ప్రతిభయాకారుడైన
శూరాది దైత్యులఁజూచి సాధ్వసమున వశ్యమంత్రములను బఠనసేయు
చాసన్నుఁడగుచు నేనసురగురుండనౌటనుమీకునాచార్యుఁడనువినుఁడని
సత్యంబుదెలిపిన సాష్టాంగములొనర్చి శూరాది దితితనూజులు విశుద్ధ

ఆ॥ బుద్ధులగుచు భక్తిఁబూని వినమ్రులై నిలిచియున్న భీతిఁదొలఁగి యాగ
విఘ్ననాశమైనవిధమౌశిమంత్రంబుబోధజేసి తొలఁగిపోయెనతఁడు॥ 150

—♦ శూరపద్ముడు సోదరయుతుండై శివునింగురించి వీరయాగము సేయుట. ♦—

వ॥ అత్తఱి శూరపద్మాదిదైత్యోత్తములు వీరయాగంబునఁ గృత్తివాసారాధన సేయు కుతుకంబున వటద్వీపంబునకరిగి యందుఁ బదివేలయోజనంబుల విరివిగాఁ గ్రతుశాలనేర్పరచి దాని కొక్కశైలంబు ప్రాకారంబుగా నొనర్చి వికారరూపులును బహువిధశరచాపహస్తులును నైన దోషాచరస్తోమంబులఁ జతురాశలఁ దద్రక్షకులై యునిచి దానినడుమ వేయియోజనంబుల విస్తారంబును నంతియ లోఁతునుగా నొక్కకుండంబు నిర్మించి యక్కుండమునకుఁ జుట్టును నష్టోత్తరశత కుండంబులఁ ద్రవ్వి వాటిం జుట్టి వేయునెనిమిదికుండంబులుండునట్లు గల్పించి యందుముఖ్యకుండంబునఁదాను హోమంబుసేయఁబూని శూరుండచ్చోటికింబోయి యత్కుండమధ్యస్థలంబు పాతాళంబుగాఁగాంచి పరిశీలించి యున్నయెడఁ దన్మాతయగు మాయాంగన శాస్త్రప్రకారంబున॥ 151

సీ॥ కింశుకాలర్క వికిరణ తింత్రిణీ విషతరుపర్కటి త్రుషమయూర
కాదిసమిద్రాజి యాజ్యతక్రక్షీర మధుతైలఘటములు మాషతండు
లవ్రీహిముద్గ తిల కదంబకాది ధాన్యంబులు గోలులాయాజ ముఖ్య
పశుసహస్రంబులుబహురక్తభాండముల్ మాంసంపుబ్రోవులుఁబుంచిపుష్ప

తే॥ తతియుఁ గుశకాశదూర్వాది దర్భలును మృ
గమద హిమవాలుకాది సుగంధ వస్తు
లరణి జుహురాది యాగోపకరణములను
నించెఁ ద్రిసహస్రయోజన నియతభూమి॥ 152

తే॥ శూరుఁడదిగాంచి మెచ్చుచు ధీరవృత్తి
శాకినీ దుర్గ భూత పిశాచ క్షుద్ర
కాళి చాముండి డాకినీ గణములాది
శక్తుల దిశాష్టకమున నర్చనమొనర్చె॥ 153

తే॥ అరణులమథించి కుండమధ్యమున నల కృ
శానునుంచి యాజ్యమునఁ బ్రజ్వరిలఁజేసి
వజ్రమయ శూల మొక్కటి వదలకుండ
దానిమధ్యస్థలంబునఁ దనరనిలిపి॥ 154

క॥ తిలమాష ముద్గసర్షప పలతైలాజ్యాది వస్తుపటలిని నబ్దం
బులుబదివేల్ శివమంత్రంబుల హోమము సేయుచుండెఁబూషద్యుతితోఁ॥

వ॥ అట్టియెడఁ గ్రమంబుగా నష్టోత్తరశతా ష్టోత్తరసహస్ర కుండంబులఁ దారకసింహవక్త్రులు విధిప్రకారులయి వేల్వ నక్కాలంబునకు ముక్కంటి గాన్పింపమికి శూరపద్ముం డతిక్రుద్ధుండై॥ 156

— శూరపద్ముండు కుండమందలి శూలముపైఁ బ్రాలి ప్రాణములు విడుచుట. —

ఆ॥ విన్నువీధికెగసి వేయేడులచ్చట
నిలిచి తనదుకాయ మొలిచి రక్త
మాంసయుక్తి మది నుమానాథు స్మరియించి
వేల్వ మెచ్చి భవుఁడు నిల్వఁడెదుట॥ 157

ఉ॥ ఆసమయంబునం దతిరయంబున మింటికి నూర్ధ్వవక్త్రుఁడై
యాసురశాత్రవుండెగసి యార్చుచు శూలముమీఁదఁ బ్రాలి సం
త్రాసమనీషులై సకలదానవులేడ్వ సురల్ చెలంగఁగాఁ
బాసెఁ బ్రాణమ య్యనలభాసితకుండమునందు రోఁజుచుఁ॥ 158

సీ॥ అపుడుదారకుఁడు సింహాస్యుండు దమయుత్త
మాంగముల్ దఱిగి హోమంబుసేయ
మగుడంగనవి మొల్వ మఱిమఱినారీతి
నొనరింపనప్పుడు దనుజవర్యు
లతిసాహసులుగొంద అక్కుండమునఁబడి
చచ్చి రప్పటికైన శంభుఁ డెదుటఁ
దోపమి సింహవక్త్రుఁడు జావదలఁచి బ్ర
హ్మాండమెల్లను మండునట్టు లగ్ని

తే॥ ప్రజ్వరిలజేయునంతలోఁ బన్నగారిగమనకంకాళమూఁతగాగరమునందు
బట్టిముదిబాపఁడై వేదపఠనజేయు చిందుశేఖరుఁడతని కట్టెదుటనిలిచి 159

క॥ నీవెవఁడ వేనికోసరుఁడ వేవాంఛనునేమి సేయు చిటనుంటివి నా
యోవిప్ర నేనికాటుఁడ బావనుఁడగు కశ్యపునకుఁ బట్టినిసుమ్మీ॥ 160

శా॥ మారారాతిని వీరయాగసరణిఁ మాయన్నయా శూరుఁడుఁ
సారోదారమనీషఁ నర్చనము రాజ్యార్థంబుగావించుచుం
గ్రూరంబై తగు శూలముఁదుఁబడి తాఁగోల్పోయెఁ బ్రాణంబులే
నారీతిఁ మరణింపనుంటినిపుడయ్యా యున్న సౌహార్ద్రుఁడై॥ 161

ఆ॥ కపటవిప్రుఁడనియెఁ గలుఁగునీకుశుభంబు ప్రాణములనువిడువవలదటంచు
మధురవచనరచనమఁజమఁజిపోధించి వారిఁ బ్రోవమిన్ను వాఁకఁబిలిచె॥ 162

చ॥ పిలిచినయప్డె హస్తమున బిట్టుగఁగొట్టిన చెండుపోల్కిఁగా
నలఘుతరంగసంఘముల నభ్రములనూచుచుఁ బొంగిమ్రోయుచుఁ
బలువిడివచ్చి కుండగతపావకు నార్చిరయేఁగ నంతలో
నిలిచిరి నిద్రలేచుకరణిం గవిశిష్యులు శూరుఁడాదిగాఁ॥ 163

—♦ శివుఁడు శూరపద్మాసురునకుఁబ్రత్యక్షమై కోరిన వరము లిచ్చుట. ♦—

వ॥ అట్టిసమయంబున సర్వేశ్వరుండగుశంకరుండుఁ గపటభూసురవేషంబుడిగి కైలాసశైలోన్నత విగ్రహంబగు వృషభరాజంబునెక్కి గరుడధ్వజ హిరణ్యగర్భా ద్యఖిలగీర్వాణప్రకరంబును నశేషగణాఢ్యులు సముదయం బును పార్శ్వద్వయంబున సేవించినదువ సర్వమంగళాసహితుఁడై యనంతకోట్యర్కప్రభా విభాసితుడగుచు మ్రోలనిలచినంజూచి శూర పద్మాసురుం డధికహర్ష పులకిత సర్వావయవుండయి సోదరద్వయంబుం దానును రాత్రించరవ్రాతములఁగూడి సాష్టాంగ దండప్రణామములాచ రించి లేచి కరకమలంబులుమొగిడ్చి నిఖలశ్రుతినిగదిత స్తోత్రముల నభి నుతించి వెండియు॥ 164

సీ॥ శూలీ నిశాధీశమౌళీ మునిస్తోమపాలీ మహాకృపాశాలి శరణు
పాంబా విపజాద్రిశంబా మధుద్విట్కలంబా స్తుతమరుత్కదంబ శరణు

### గిరిబంధము.

తృ.ఆ.సెం.166

1

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | శ్రీ | | | | | |
| | | | | హ | రా | ణ్ణ | | | | |
| | | | ద | క | మ | ల | ద | | | |
| | | వా | హ | ని | లిం | పా | ర్చి | తాం | | |
| | ష్ట్రి | వ | న | జా | గ | సు | త | స్నే | హ | |
| ము | ని | ని | చ | ఎ | మం | ద్వా | దే | హ | జ | గ |
| ర్వా | త్రి | కు | లి | శ | దే | వ | సు | చ | రి | తా |

దేవా భవాంబోధినావా విశుద్ధస్వభావా విషాంచితగ్రీవ శరణు
త్ర్యక్షా నతస్వర్గవృక్షా తురంగీకృతోక్షా మనోజాతశిక్ష శరణు
తే॥ యక్షపక్ష గణాధ్యక్ష మోక్షదక్ష దక్షసవశిక్ష రుద్రాక్షదామవక్ష
లక్షణవళక్షకాయ శితక్షితీధ్రకుక్షిజాతపతే విరూపాక్ష శరణు॥ 165

గి రి బం ధ ము.

క॥ శ్రీహీరాగ్నద కమలదవాహా నిలింపార్చితాంఘ్రి వనజాగసుత
స్నేహా మునినిచయవంద్యా దేహాజగర్వాద్రికులిశ దేవసుచరితా॥ 166
వ॥ అనియిట్లభినందించినఁ బరమానందకందళిత మనోరవిందుండై చంద్ర
శేఖరుండిట్లనియె॥ 167
క॥ మీతపమున కస్మన్మది ప్రీతింగనెఁ గోరికొనుఁడభీష్టంబేమో
యీతఱినిచ్చెద ననవుఁడు చేతులుముకుళించి భక్తిచే శూరుడనుఁ॥ 168
ఆ॥ ఈశ్వరేశ వేయునెనిమిది బ్రహ్మాండములకు దొరను జేసి మోదమలర
నాదుయాజ్ఞ యిందునేదెసనైనను చెల్లియుండునట్లు సేయుమయ్య॥ 169
ఆ॥ మఱియునవధరింపు కలకంఠ దుగ్ధసాగర తనూజనాయక ప్రముఖ సు
పర్వచక్రహరణ పారీణసాధనములును నాశరహితమును నొసంగు॥ 170
ఆ॥ ఇందుమకుట వేయునెనిమిది బ్రహ్మాండములను నాదు రాక పోకలకును
యెట్టివేళనైననేవిఘ్నములులేక యుండునట్లువరములిందుదయను॥ 171
వ॥ అనివేఁడిన నప్పరమేశ్వరుండు॥ 172
సీ॥ అసురేంద్ర నీవు నన్నర్థించినవియెల్ల జేకూరు నింతియేకాక నీకు
జిష్ణువిమానంబు సింహవాహనమబ్బు మఱియునీచేఁ జేయుమారుతాప్త
కుండసంభవులైన దండిసోఁకులు నూఱువేలకోటులు భృత్యజాలమగుచు
గొలువ నీవిద్దాత్రి వెలయుదువనిపల్కి యంతనిల్వకను దివ్యాస్త్రసమితి
తే॥ పాశుపతమును నీకునీభ్రాతలకును నాయనుగ్రహమునఁగల్గువాగశాయి
మొదలుదివ్యులదోశ్శక్తి కదనభూమి మిమ్మునోర్వంగజాలదుమీఁగుల తీవ్ర
మైననాశక్తి యొక్కటి యవధిమీకు॥ 173

వ॥ కావున విచారించుకొని నూటయెనిమిది మహాయుగంబులీ యష్టోత్తర సహస్ర కమలజాండంబులేలుచు మహాసుఖంబున వర్తిల్లుఁడనివరంబులిచ్చి యంతర్ధానుండయ్యె నయ్యెడ॥ 174

శా॥ ఆనంతంబున శూరపద్మముఖ దైత్యగ్రామణుల్ డేలుచుఁ
నానా భల్ల కుఠార కార్ముక కృపాణ ప్రాస పాశాంకుశా
స్త్రాసికంబులు దాల్చి బొబ్బలిడి నాట్యంబాడు సైన్యంబులం
డా నెయ్యంబులువల్కి సంతసమునొందంజేసె శూరుండొగిఁ॥ 175

క॥ వారలు వినయంబెనయఁగ సారెకుఁ దన్నొగడవినుచు శంకరదత్త
స్ఫార చతురంగబలముల కారసి సేనాధిపతుల నమరించి వెసఁ॥ 176

ఉ॥ వారలఁగూడి తమ్ములనివారణఁ దోనడువంగఁ గశ్యపుం
జేరఁగఁబోయి వందనముసేసి ముదంబున వేయునెన్మిదౌ
నీరజజాండముల్ ప్రబలనేతృత నేల వరంబొసంగె నా
వీరసవప్రహృష్టుఁడయి విష్ణుశరుండని తెల్పి క్రమ్మఱఁ॥ 177

క॥ ఇఁకముంగలమే మొనరిఁచుటకుఁ దగుపనులెవ్వియో దృఢంబుగఁ జెపుమా
ప్రకటిత యోగధురంధర శకలీకృతమోహపాశ జటిలాధీశా॥ 178

ఆ॥ అనుడుగశ్యపుండు నాలోచనముసేసి యమరులార్తినొంద నౌదురనుచు
నెడదనెఱిఁగికొంతతడవువిచారించి శూరపద్మమోముజూచియనియె 179

వ॥ మీరలిప్పుడ మీకునాచార్యుండగు భార్గవుఁ గానఁబొండని పలికినఁ గశ్యపునివీడుకొని వారలుమహానురాగంబున సకలశాస్త్రార్థకోవిదుండగు శుక్రుసన్నిధికేఁగి వినమ్రులై నమస్కరించి తమకృతార్థచరిత్రం బామూలమువిన్నవించి మహాత్మా! కార్యాకార్యముల విధముఁదెలియ నమవగుబుద్ధిని బ్రసాదింపుఁడని వేఁడిన రక్షోవీరులనెల్లఁ జూచి కావ్యుండే కాంతమునకు శూరునొక్కరుంజేరి యతనితో నిట్లనియె॥ 180

— శుక్రుఁడు శూరపద్మునకు హితోపదేశము సేయుట. —

సీ॥ శివుఁడుమాయనుగూడి దివిమొదల్ పంచభూ
తములబుట్టించెడి సమయమునను

దనయుంశమును జాలుగొని జీవభావాన
సంహాననేంద్రియ సహితుఁడగుచు
సంచరించును విలాసత ఘటాకాశంబు
పాధి నూడిచిమహోత్రంబునందుఁ
గలయువిధంబునఁ గాలత్రయంబు న
శింప నాజీవ్ఁడు శివుఁడగుఁజుమి
తే॥ కాన దుష్కృతసుకృతముల్ కల్లలట్లు
తత్వచింతను మోక్షబంధములుమిథ్య
యగుట నిను శివునకభిన్నుగ గుఱుతెఱిఁగి
దుఃఖమునువీడి హార్యజాదులఁ ద్యజించి॥ 181
తే॥ హృన్నభోమధ్యగతుఁడగు నీకుమదిని
నాశ్రయించి పురందరాద్యఖిల దేవ
వరులభయపెట్టి వారి నివాసములను
నిచ్చ నినుఁగొల్చు దనుజులకిచ్చి హెచ్చి॥ 182
వ॥ వంచనప్రద్వేషణ చౌర్యమారణాది ఘోరకార్యంబుల నాదిత్యులవేధించు
చుండుము॥ 183
క॥ నీవిటు చేయవయేనిఁ దేవాదులయందొకఁడు గణింపఁడునిన్నుఁ
నీవేధోండపువార్తలు నేవేళనుదెలిసికొనుము హితచారులచేఁ॥ 184
శా॥ త్రాతల్ మిక్కిలినమ్రులై కొలువ,నీబ్రహ్మాండమధ్యంబునఁ
బీతత్రాసుఁడవై వసించి జలధి ద్వీపప్రమాణంబులుఁ
భూతశ్రేణులవార్త సర్వనలినోద్భూతాండ విస్తారముం
జేతోవీధిఁదలంపుమంచని మఱిం జెప్పంగనుద్యుక్తుఁడై॥ 185
వ॥ శుక్రుం డఖిలలోక ఢిలీపరిమాణంబులాదిగా బోధింప వలయునన్నింటి
నిం దెలిపిపుత్తెంచిన శూరపద్మాసురుం డమ్మహోనుభావునకెఱఁగి
యచ్చోటుబాసిపోవఁ బ్రయత్నించి॥ 186

ఉ॥ కోటిరవిప్రకాశమును గోటితురంగమ సంయుతంబునున్
హాటకరత్న చిత్రితము నత్యధికధ్వజశోభితంబునుం
బాటిలకుంభిపీఠరుచి బంధురమవ్యయమీశదత్తమై
పాటిలువ్యోమ యానమును బ్రౌఢిమనెక్కెనుశూరపద్ముఁడున్॥ 187

చ॥ అయుతహయాన్వితంబు మణిహాటకనిర్మితమౌరథంబుపై
రయమున నెక్కెఁ దారకుడు రాక్షసులందరు స్యందనంబులన్
హయముల రాసభంబుల మహాంగములన్ ద్విరదంబులన్ మహో
ద్రయమ ననెక్కి యొప్పి రతిభీకర బాణకృపాణపాణులై॥ 188

వ॥ అంత నగణితప్రభావిరాజితంబును శత్రుభీకరంబును మహనీయంబును నగు నొక్కరథంబు సింహవక్త్రుండధిరోహించె నిట్లు సకలదానవవాహినీ సమేతుండయి తమ్ములుం దానును మూడుకోట్లయోజనంబుల పుడమి నెడమీకనడచి శూరపద్ముండు దిగ్విజయాపేక్ష నలకాపురంబునకరిగి విక్రమించి తారకుంగలిసి తన్నగరముఁ గొల్లవెట్టుసమయంబున॥ 189

— శూరపద్ముడు దిగ్విజయము సేయుట —

ఉ॥ చారులు దెల్పఁగా దెలిసి చాలభయంపడి కిన్నరేంద్రుఁడున్
బీరముడించి వచ్చి కృపబెంచి హీనుండని నన్నుఁబ్రోవుఁడో
శూరవరేణ్యులార యనుచున్ వినుతించి కడానిసొమ్ములుం
జీరలుఁ గానుకగానొసఁగి చేరెఁ దదాజ్ఞ నతండువీడునన్॥ 190

ఆ॥ అవలనన్నిశాటు లచ్చోటుఁగదలి యీశానదిగ్జయంబు సలుపనరిగి
భవుసిలాంఛనములఁ బొకి దిమన్నించఁదగిన వారటంచు దలఁచిమగిడి॥ 191

చ॥ ప్రణుతబలంబుతోడ నమరావతికేఁగి పురంబుదోఁపు ద
క్షణమున జేసి కల్పమహిజంబులఁ గూల్చుచునున్నయంతలో
గణనయొనర్పఁగా నలవిగాని భయంబునఁబాఱె మింటికిన్
రణమునకోహటించి సురరాజు మహోర్తి మయూరవాహనా॥ 172

వ॥ ఇక్కైవడి నారక్కసులుక్కుమీఱి పావకుందలపడిరందుఁ దారకా సురుడువిజృంభించి వైశ్వానరువశ్యుంగా జేసి కృతాంతాది తక్కినదిక్ప

తులనోర్చి రసాతలముసాధించి భూలోకంబున సముద్రద్వీపంబుల నన్నిం టినీక్షించుచుఁ బాలమున్నీరు దరియనరిగి యందు యోగనిద్రారతినుండి యిందిరోర్వీపురంధ్రులు మేలుకొలుప నలుకగదిరి యేతెంచు నారాయణునితోఁ బోరునప్పు డమ్మహాత్ము నిర్వక్రవిక్రమంబగు చక్రమత్తారకుని కంఠంబునఁదాఁకి మొక్కవోయి నిష్కంబుక్రియనిలిచినఁ గాంచి కాంచనవస్త్రుండు సంచలించి మగంటిమిడించి యతనిసమీపించి యిట్లనియె॥ 193

ఉ॥ దానవరాజ బాహుబల దర్పసముగ్రుఁడవైన నీవయిం
బూనిరణంబొనర్ప నహిభూషుఁడుదక్క జగంబునందు నే
దానితరంబగుఁ వివిధభంగుల నేనినుధిక్కరించితిం
గాన సహించి నెయ్యమునఁ గన్గొనుఁడాత్మను నీసడింపకన్॥ 194

ఉ త్సా హ.

అని వినమ్రుఁడగుచుఁబలుకు హరినివిడిచి యగ్రజుం
గనఁగనేఁగి మ్రొక్కనతఁడు గారవించి యంతటం
దనుజబలము గొల్చినడువ దర్పముప్పతిల్లగాఁ
జనిరిచూడఁ జక్రవాళ శైలవిస్మయంబులన్॥ 195

ఆ॥ అవలదానిఁబాసి దివిజలోకముసొరఁ దెలిసి శచినిఁగూడి దేవవిభుఁడు
భీతివడివడంకి పికరూపమున నభః పదవినుటుక నమరపటలిబెగడి॥ 196

ఉ॥ నాకమువాసిపోఁగడఁగు టారసి మార్గమునాఁగి పోవఁగా
నీక నిశాచరుల్ చలమునెక్కొన వేల్పులనెల్లఁబట్టుచున్
భీకరభంగిఁగొట్టి చెరబెట్టి పదంపడియవ్వలన్ మహా
ర్లోకముసేరి యందు మునిలోకములిచ్చిన పూజలందుచున్॥ 197

వ॥ అచ్చోటువాసి శూరపద్మాది దనుజత్రయంబు జనలోక తపోలోకంబులతిక్రమించి సత్యలోకముసేరంబోవ హిరణ్యగర్భుండు నవబ్రహ్మలతోఁ జనుదెంచి శూరుంగని సవినయంబుగా నిట్లనియె॥ 198

ఉ॥ నీకుఁబితామహుండ రజనీచరశేఖర నేనునిత్యమున్
నీకుశుభంబుగల్గ మదినిం దలపోయుచునుండ నేఁటికిన్
వాకడ కేఁగుదెంచుకతనన్ ముదమయ్యె ననేక శస్త్రముల్
నీకును నీదుతమ్ములకు నెయ్యముమీఱ నొసంగుదున్ మఱిన్॥ 199

తే॥ కైకొనుండీతు రథమును గమలజాఁ!
మును నటంచిచ్చి శూరుచే ననుమతిగొని
చనియెనజుఁడంత వైకుంఠమునకునడచి
హరినిలోఁజేసికొని దైత్యులచోటుగదలి॥ 200

— శూరపద్ముఁడు కైలాసమునకు పోవుట. —

క॥ అనుజులతోఁజని దవ్వులఁగనియె నసంఖ్యాత ప్రమథగణ వాసంబున్
మునిజల్ప విలాసంబున్ ఘనపాపవినాసమైన కైలాసంబున్॥ 201

క॥ కాంచినమస్కారము లొనరించి కృతాంజలినిబూని రిపునాశనకా
ర్యాంచితులగు తనసేనల నించుక సేఁపచటనిల్పి హితమతియగుచున్॥202

శా॥ తానున్ సోదరులుం గపాలిచరణధ్యానంబుఁ బల్మాఱుఁ జే
తోనందబునఁజేయుచున్ సురనికాయ్యాసన్నుఁడై నందినిన్
నానాస్తోత్రములన్ భజించి నిలువన్ సత్త్వోచరా యీడకున్
రానేకార్యమటంచతండనఁ బురారాతింగనన్ వచ్చితిన్॥ 2:3

క॥ కరుణింపుఁడనుచు వేఁడిన బరికించి శిలాదసుతుఁడు బశుపతికసురే
శ్వరుగోరికవినిపింపఁగ నరిగెన్ శుద్ధాంతమునకునార్ద్రహృదయుడై॥ 204

ఆ॥ ఇట్టులరిగి నందకేశ్వరుఁడశివున కెలమిఁదెల్పి యతనిసెలవువడసి
శూరపద్ముఁ దదనుజులనుదోడ్కొనిపోయి లేలిహానవలయుమ్రోలనిలిపె॥

వ॥ అట్టిసమయంబున శూరపద్మాసురుం డనుజసహితంబుగా నీశ్వరు సంద
ర్శించి సాష్టాంగదండప్రణామంబులాచరించి లేచి మహావినయంబునఁ
బ్రాంజలియై॥ 206

యమకము.

సీ॥ రజతాద్రిగృహ మహారజతాద్రికోదండ పీనవాహనకాండ తేనమోస్తు
ఫాలలోచన ద్విడ్విఫాల లోచనకర్ణ దివ్యసాలంక్రియా తేనమోస్తు
శంకర పంకనాశంకర పంకజాసీనకరోటిభృత్తే నమోస్తు
కాలకంధర కాలకాల కంధరవాహ దివిజపూజితపాద తేనమోస్తు
తే॥ మీనకేతనమదభంగ తేనమోస్తు ద్విరదచర్మమయాంబర తేనమోస్తు
మౌనిమానససంచార తేనమోస్తు దేవదేవమహాదేవ తేనమోస్తు॥ 207

మ॥ అనిస్తోత్రించి శుభంబుగూరుపుము నిత్యంబంచుఁ బ్రార్థింపఁగా
విని నందీశ్వరుఁగాంచి శూరుదెస విశ్వేశుండు గేల్సాపి యి
మ్మనుజాశీంద్రుఁడు నాకుభక్తుఁడని ముమ్మాల్లప్పుడు బోధించె న
ద్దినిజంబేకద మంచిభక్తుడయినఁ దేవుండు మోదింపఁడే॥ 208

ఉ॥ వెండియుశంకరుండనియె వీనికినేమునుపిచ్చినట్టి బ్ర
హ్మాండములంగనుగొనుచు నచ్చటనచ్చట స్వాధికార్లఁ గా
పుండవిధించి సర్వవిభవుండయి యీతఁడు నీయజాండమం
దుండెడుగాకయంచనిన నూఁకొని నందివచించెశూరుతోఁ॥ 209

చ॥ అసురకులేంద్ర భూతవిభునానతి నౌదలఁదాల్చియేఁగుమీ
మసలుటతక్కఁయున్నఁ బలుమాఱునుతించి శివుందొలంగి సం
తసమున నందికేశునకు దండముపెట్టి సగర్వుఁడై లండ దా
ననమునశూరుఁడప్డు గలయుంజనె సేనలఁ గుక్కుటధ్వజా॥ 210

- శూరపద్ముఁడు వేయిన నిమిది బ్రహ్మాండములను సాధించి స్వాధికారముంబొంది కొనుట -

వ॥ ఇట్లనుజ దనుజవాహినీ సహితుండయి ఖండపరశు దత్తాజాండంబు
లీక్షింపఁ జనువేళఁ దదీయాండ భిత్తి ద్వారరక్షక రుద్రగణ సహస్రంబా
శూరపద్మునిఁజూచి శివభృత్యులగుట శంకరాజ్ఞావిధంబున భిత్తిద్వారంబు
విడచి దవ్వేఁగ నతండు దద్వార పాలనమునకై స్వీయులకు వారిఁ
గొందఱ నవ్వోటనుండనియమించి॥ 211

క॥ ఇతరాండ భిత్తిమార్గస్థితులట్టులె చెలఁగ నైజసేనల నాయా
క్షితినిలిపి యచ్చటచ్చట ధృతిరాజిల శాత్రవులవధించి ప్రభుతచేఁ॥ 212

వ॥ సమస్తభోగములనుభవించి వేయునేనిమిదియగు బ్రహ్మాండములకీక్రియ నిజాధికారుల నధిపతులఁజేసి విక్రమోపేతుఁడై శూరుండీశ్వరాజ్ఞను దలంచి తత్క్షణంబ తొలినెలువనుద్దున కేతెంచునప్పుడు॥ 213

తే॥ శూరుఁగన నసురేంద్రుఁడు శుక్రుఁగూడు
గొని యెదుర్కొని మును రణక్షోణి సురలు
దన్ను మార్కొన్నవిధమును దనదు కీర్తి
హానియును దన మాతామహాత్మసరణి॥ 214

మ॥ కవిచే సర్వముదెల్పఁజేయ ననురాగంబూని నానావిధ
స్తవముల్ సేసి వినీతి వారిరువురన్ సంతోషమొందించి తా
నవలీలన్ నిఖలాశలంగెలుచు వృత్తాంతంబు విన్పించుచున్
భువిజేరెం దనతాతకావ్యుఁడు బలంబుల్ వెంటరా శూరుఁడున్ 215

క॥ అత్తఱి సురలత్యాతుర వృత్తిని బురుహూతుఁగూడి విష్ణునికడకున్
మొత్తములై చనిరిపుల మహాత్త్వబాధలను దెల్ప హరి హరిహయుతోన్।

చ॥ విను మనమీ దితిప్రభవవీరుని గెల్వఁదలంపుగల్గి చే
సినబలుయత్నముల్ ఫలము జెందవు దక్షుఁడొనర్చు నధ్వరం
బున హవిరంశముల్ భుజగభూషణు దప్పొనరించి ముక్ భుజిం
చిన ఘనపాపముల్ గుడువఁజేసె సురుండదె రిత్తవోవునే॥ 217

ఆ॥ మీరలింక స్వాధికారంబులకు నాసపడ వలదని దేవపటలితోడ
శూరపద్మచెంతఁజేరి నీచమచేత సౌఖ్యముంటిననుచు శౌరియనుఁడు॥218

—♦ విష్ణువు శూరపద్మునకు నేకాదశకోటి రుద్రులు దేవతలొగలసిన కథను దెల్పుట ♦—

ఆ॥ కనులుమూడు నీలకంఠంబులొప్పారి ఘనులుర్ద్రుదు లేమికతన సురలఁ గలిసియున్న వారొ తెలియఁజేయుమటన్న. బలికెఁజక్రిశూరపద్ముఁజూచి॥

సీ॥ దైత్యేంద్రమున్ను పితామహుండొకనాడు
ముక్కంటిమాయా విమోహితుఁడయి

దురహంకృతిని జరాచరసృష్టిపాలన
దక్షుండ నేనని తలఁపనపుడె
సృష్టింపలేక నిశ్చేష్ట సృష్టిస్థితి
సంక్షయానుగ్రహాచ్ఛాదనముల
కాదికారణుశంభు నతిదుష్టబుద్ధిచే
మరచిపోయినదోష మహిమగాదె

తే॥ మొదటికిని మోసమయ్యెనం చెద నెఱింగి
స్వీయభ్రూమధ్యమున దృష్టిఁ జేర్చి గగన
మధ్యగుండగు బరమేశు మహితభక్తి
ధ్యానమొనరించుచుండెఁ దన్మయుఁడునగుచు॥ 220

వ॥ అంతఁ గతిపయవాసరంబులకా శితికంఠప్రేరణ విరించిఫాలంబున నేకాదశరుద్రులుజనించి ప్రసన్నాననులై మ్రోలనిలువ వారలంగాంచి చతుర్ముఖుండు వినమ్రుఁడై నమస్కరించి వివిధస్తుతుల నలరించి యాగతమునకుఁ గారణంబడుగ వారలు మృత్యుంజయుశాసనంబుచే జగత్సృజనంబు సేయ నేతెంచితిమన మోదించి శతానందుం డందులకొడంబడియె నప్పుడ యేకాదశరుద్రులు రుద్రసారూప్యలగు వారి నేకాదశకోటిరుద్రులఁ గలిగించినఁ జూచి తమ్మిచూలి వారలకిట్లనియె॥ 221

క॥ విరమింపుఁడు మీసృజనము గరుణ నేనన్యసృష్టిగావించెద నం
చు రజతభూమీధరమున కరిగెందొడుకొనివారి హరుదర్శింపన్॥ 222

క॥ ఈరీతినరిగి నగరద్వారమున శిలాదసుతుని దర్శించి మనో
జారిని గనఁజేయుటకై సారెకు బ్రార్థింప నతడు జయ్యనవారిన్॥ 223

క॥ మన్ననఁదోడ్కొని శంకరుసన్నిధి జేర్పన్ విరించి సాష్టాంగంబుల్
హ్రన్నతినమలరఁ జేయుచు సన్నుతులొనరించి నిలువ శంభుండనియెన్॥

వ॥ వాణీశా! ఇచ్చోటికెందులకై వచ్చితివనిన భయాకులాత్ముఁడయి చతురాస్యుండిట్లను వేనున్మదంబున గర్వించుటం జేసి యియ్యేకాదశరుద్రుల రుదెంచి పదునొకొండుకోట్లు రుద్రులజనింపఁ జేసిరని వినయభయ

భక్తులతో విన్నవించిన నాలించి శూలపాణిమన్నించి యాదరపురస్కృతంబుగా నిట్లనియె॥ 225

సీ॥ నేఁడాది గర్వంబువీడి నాయానతిచే విష్టపంబుల సృష్టిసేయు
చాదిత్యసంకాశులగు రుద్రకోటుల ద్రిదశులతోఁ జేర్చి నిదిమొదలుగ
నదితినందనులు ముప్పదిమూఁడుకోట్లనఁ జాటంగఁబడి భూరిసత్వులగుదు
రనిపల్కి లోకేశు జనుఁగొని యువల నేకాదశరుద్రులఁ గరుణాదనర

తే॥ స్వస్థలంబులకనుపుఁడు వాక్ప్రియుండు
శివునిగొసియాడి చని నిజస్థితినిగనియె
ననుడునుప్పొంగి శూరుండు దనుజగురుని
ప్రేరణను విశ్వకర్మరావించి యనియె॥ 226

— శూరపద్ముఁడు విశ్వకర్మచే వీరమాహేంద్రాదిపురములు నిర్మింపజేయుట. —

వ॥ దక్షిణసముద్రమధ్యంబున నతిరమణీయంబుగా నెనుబదియోజనంబుల పరివియును శతయోజనవిస్తీర్ణ వీధీ విలసితంబునుగా నొక్కమహాపుట భేదనంబును దానికష్టదిక్కులఁ నెనిమిదిపురములును లవణాంబురాశ్యుత్తర దిగ్భాగంబున నొక్కనగరమును మేరుగిరిదక్షిణంబున బురంబొక్కటియు హేమకూటాచలప్రాంతమునఁ బత్తనంబొండును సముద్రద్వీప సప్తక మధ్యభాగంబుల నొక్కొక్కప్రోలును గల్పింపుమనిన నతండు వల్లెయని తద్వాక్యంబుచొప్పునఁ బురంబులనిర్మించి క్రమంబుగా వీర మాహేంద్ర హైమాసుర వామదేవ లంకా నీల శ్వేతపద్మాసుర జంబూ ద్వీప మాయానగరంబులనియెడి నామంబులిడి యప్పురంబుల శూరున కుసమర్పించి సురశిల్పిచనిన యనంతరంబా యసురవల్లభుండు ముకుంద శతానందేంద్రాది బృందారక సోదరసమేతుండయి వీరమాహేంద్రపురం బునొచ్చి దానిసౌందర్యమునకు మెచ్చుచుఁ దన్నగర మధ్యస్థలంబున బహువిచిత్ర శిల్పకల్పనా చాతురిందనరారు నాత్మీయ గృహరాజమునఁ బ్రవేశించి నిఖిలరాత్రించర సందోహంబు లానందింప విరించనదత్తమగు మకుటంబుధరించి నవరత్నమయ సింహాసనాసీనుండయి కొలువుండె

నయ్యవసరంబున॥ 227

—• శూరపద్ముడింద్రాదుల నీచోద్యోగంబులయందు నియమించుట. •—

ఉ॥ శూరుఁడు నేనురమ్మనినచో జనుదెమ్మిపుడేఁగుమంచు దై
త్యారినిబంచి యష్టమగిశాధిపునిం బదియొండుకోటులా
వీరులరుద్రులఁ నిజనివేశములఁగననంపి సంగర
క్రూరులఁ దమ్ములఁనిలిపెఁ గూరిమితో నియతస్థలంబులఁ॥ 228

సీ॥ తరువాతవావ కాంతకులు వాఃకలశముల్ మిత్రచంద్రులుసితచ్ఛత్రములును
వృత్రారి పీటికాపేటికభృంగారు ఖడ్గంబునై బుతి గంధవహుఁడు
సురటియువ్యజనంబువరుణుండుధనపతిపూగభస్త్రికయునుబొలువుమీఱఁ
దాలిచియుండ గంధర్వకిన్నరసిద్ధ గరుడవిద్యాధరుల్ గానములను

తే॥ బాడ రంభోర్వశీ ముఖాప్సరలుమిగుల
నర్తనంబులు సేయుచుండగ నగణ్య
రత్నమయసింహపీఠి సామ్రాజ్య విభవ
మెసఁగ నాశీనుఁడై యుండె నసురవిభుడు॥ 229

శా॥ ఈలీలఁగొలువుండి శూరుఁడు నిలింపేంద్రుం బ్రతీక్షించి నా
ప్రోలఁ మద్భటచోదితుండవయి యోగ్యుండాల్చి నీవిమరు
త్పాళింగూడి కృషిఁఘటింపుమనుచుం బల్కెఁదయాహీనుఁడై
కాలంబేరికలంఘ్యమఁపలుకు నిక్కంబేకదా యారయఁ॥ 230

క॥ అనలునిఁగని నిన్నంటిన దనుజులలవమాత్రమేని దహియింపక నా
పనుపున నిప్పురి వండెడుఁబని సేయుచునుండుమనుచుఁ బలికెఁగఠినుఁడై॥

క॥ యమునింగన్గొని మద్భటసముదయముల నెల్ల నాదుశాసనమున నీ
వుమహాశాంతుఁడవగుచును గ్రమమునఁగాన్పింపుమనుచుఁ గట్టడచేసెఁ॥

తే॥ నీటిఘొడయనిజూచి దోషాటవిభుఁడు
నాయనుజ్ఞ దొలంగకీనగరమందు
నంబువులఁజల్లుచుండుమం చనివిధించెఁ
తెడుగుదొరయైన యోగ్యులు వడరెక్రిందు॥ 233

ఉ॥ వాయువునంతఁగన్గొని సువాసనమించఁగవీచుచో నవ
శ్యాయకణాలి ముగ్ధజలజాతుల చన్గవలందుఁజల్లుచుం
జాయకమత్పురిన్ భవనపంక్తులు శుభ్రమునొందునట్లుగాఁ
జేయుచునుండుమీవని వచించెఁ గఠోరముగా షడాననా॥ 234

తే॥ నీయధీనంబులగు నవనిధులు భాగ
ములనొనర్చి మదీయభృత్యులకు వలయు
పగిది విత్తంబునిడుమని పనిచెక్రీడు
గ్రూరకర్ముడన కెదురాడు వారలెవరు॥ 235

మ॥ తరణిన్ గన్గొని నీవు నాపనుపుచేతన్ మత్పుర ద్వారగో
పురసీమన్ వసియించి యాతపము నాపూఁబోండ్ల కత్యుష్ణమై
క్కిరణింగల్గకయుండ వేఁడుఁబదొలఁగంబెట్టి నిత్యంబు హే
చ్ఛరికన్ వర్తిలుమంచుఁజెప్పె దితిభూ సంప్రీడుమానందనా॥ 36

తే॥ శశిసిఁగనినీవు నుభయపక్షములఁ బదియు
నాఱుకళలొంది మామకీనాంగనా మ
నములు శంబరవైర్యధీనంబులగుచు
నుండ నర్మోక్తులాడుచు నుండుమనియె॥ 237

ఆ॥ దశశతనూజ నవ విధాతృలతోఁగూడి ప్రతిదినంబు నాదుపట్టణమునఁ
దెల్పుచుండుమీవు దినశుద్ధియని నియమించె నదయుఁడై విరించినపుడు॥

— శూరాసిదనుజత్రయంబు వివాహమై సంతానము వడయుట —

వ॥ ఇట్లాశూరపద్ముండు శక్రాద్యనిమిషులతోఁ బనులుగొనుచు మహావైభ
వంబున సార్వభౌముఁడై యుండి సౌందర్యరాశియగు త్వష్టృతనూభవఁ
బద్మకోమలానామ కన్యామణిని బల్మింజేసికొని తదీయగర్భంబున భాను
కోప వహ్నివక్త్ర హిరణ్య వజ్రబాహులనియెడి పుత్రుల నతిపరాక్రమ
వంతుల నలువురఁబడసి పదంపడి రక్షస్సిద్ధగంధర్వ విద్యాధర సురాసుర
నాగకన్యకల వరుసఁగా బరిణయంబై వారలయం దధిక బలశౌర్యసహి
తులగు కుమారుల సహస్రత్రయంబుఁగాంచి నిజభ్రాతయగు తారకుని

గోటిదైత్యసైన్యంబుతో మాయాపట్టణంబున కధిపునిఁ జేసి సింహవక్త్రున కొక కోటిసైన్యంబు జతగావించి యసురాఖ్యనగరమున కభిషిక్తుఁగా నొనరించిన॥ 239

తే॥ వాఁడుదత్పురినుండి వైవస్వతాత్మ
జాతయైన విభీతకాఖ్యాతసతినిఁ
బెండ్లియై దానియందునఁ బ్రియతనూజుఁ
గనియెనొకని మహాశూరుఁడనెడువాని॥ 240

వ॥ మఱియు సింహవక్త్రుఁడు గొందఱ నిందుముఖులఁ బొంది వారియం దమితబలసంపన్నులగు కొడుకుల నూఱ్వురంబడసెఁ దదనంతరంబున॥

క॥ మాయాపురిఁ దారకదైతేయుండుండియు జతుర్ద దిక్పాలసుతన్
జాయగ నేలెను గౌరీతోయజముఖ నధిక వేడ్కతో శూరాజ్ఞన్॥ 242

ఆ॥ అసుశీలయందు నతిధర్మవర్త్మను సుగుణసహితుదివ్య సుందరాంగు
నధికశౌర్యరాశి నసురేంద్రుఁడన నొక్క సుతునిగాంచె దేవవితతి బెగడ॥

వ॥ ఇవ్విధంబున సింహవక్త్ర తారకులు బరివారసహితులయి తమతమ నగరంబులనుండిరంత॥ 244

సీ॥ పదుదీవులనేలు పోఁడిమిఁగల దైత్యబలముల రెండుకోటులనుబంచి
మఱియును సురలోక మర్త్యపాతాళలోకములనుపట్టోటియమరరిపుల
విడియుంచి తానుండు వీరమాహేంద్రపూర్వ్యష్టదిక్పురముల హస్తివక్త్ర
హరిపోత్రి శార్దూల యాళిగవయబుతు సప్తివక్త్రుల నష్టసంఖ్యఁగూర్చి

తే॥ రక్కసులు వేయునెనిమిది యొక్కరొకరిఁ
గొలిచి నిలువంగనేమించి బలుపుగాను
లక్షదోషాచరుల నిజాలయమ్ము రక్ష
సేయనుంచెను శూరుండు జిత్రగతుల॥ 245

వ॥ మఱియును బ్రాకారగోపుర ద్వారదేశంబుల నసమాన విక్రమోపేతు లగు యాతుధానులనుంచి ధర్మగోపుఁడును శంఖపాలుండును దుర్ము

ఖుండును వక్త్రపాలుండును దుర్గుణుండును మర్మవిదుండును మహి
షుండు నమోఘుండునను వారి నెనమండ్రం బ్రధానులుగాఁ గైకొని
శూరపద్ముండు నిర్విరోధియయి రాజ్యంబేలుచున్న యప్పుడు॥ 246

—♦ శూరుఁడింద్రాది దేవతల మత్స్యములఁ దెనిపించుట ♦—

అమరవిభుండు నాకులు మహర్షి సమాజము శూరపద్ముఁడే
సమయము నెద్దిపంచినను సంఘటియింపుచు హానిపుత్రులుఁ
రమణులు బంట్లు మంత్రు లనురాగమునొంద మెలంగుచుఁ విహం
గమపతిగన్న సర్పముల కైవడినుండిరి భీతచిత్తులై॥ 247

॥ అక్కాలంబున నొక్కనాఁడు దనుజాధ్యక్షుండు శ్రద్ధఁ సుధా
భుక్కాంతాదుల నెల్లరంగని ఝషంబుల్ దెండు శీఘ్రంబ మీ
రొక్కండై చని యంచు నాజ్ఞయిడ వారుల్లంబులం దుచ్ఛమౌ
యిక్కార్యం బెటుసేతుమంచును మహాప్రీహి దుఃఖముల్ తాల్చుచుఁ॥

పృ థ్వీ వృ త్త ము.

ప్రతివచనములు బల్కఁ భయాన్వితహృదయులయి నీరధికిఁ
ద్రుతగతినరిగి దుఃఖముచే గతిచెడివరుణుఁ గాంచిధృతిఁ॥ 249
దనుజుఁడానతిచ్చు పనిదెల్పి విచ్ఛిన్నమొందకుండ మీలనొనరఁదెచ్చి
యిమ్మటన్నఁబాశి యెంతయు గాసిలి యెట్టకేల కెడద దిట్టపరచి॥ 250
తిమినడమీన తిమింగిల ప్రముఖాండజ పటలిబట్టి రత్నాకర తీ
రమునం బెట్టుడువానిఁ యమునా సహజాతుఁడపుడు నసువులు బాపెఁ॥
వెండి యామత్స్యముల సూర్యుఁ డెండఁజేయ
వాసవాదిసురల్ నాగపాశములను
గట్టులుగగట్టి తలల పైఁ బెట్టితెచ్చి
యొక్కచరి శూరుచెంగట నుంచుటయును॥ 252
వాఁడమరాగ మొంది సురవల్లభముఖ్యులఁగాంచి మీరలీ
జాడ నవారతంబును విసారములంగొని తెచ్చి యిచ్చుచుఁ

నేఁడు మొదల్ చరింపుఁడని నిర్దయనాడిన దుఃఖశాంతున్మలై
పోఁడిమిదక్క వానినుడిపోల్కని వర్తిలుచుండిరందఱున్॥ 253

తే॥ అనిన సూతునిగని శౌనకాదిమునులు
వీరిచారిత్రమికనిల్పి వీరి చెలియ
లయిన యజముఖచర్య లేమయినఁజెప్ప
వైతివింపాకఁ దెల్పుమం చడుగుటయును॥ 254

ఆ శ్వా సాం త ము.

శా॥ ప్రాంచద్విష్ణుపద స్ఫ్రుగాతత చలద్భంగాపగా పద్మినీ
పాంచాల స్మయఘూసనాశన కనద్బాణప్రఘూతాగ్ని ని
ట్పంచారప్రకరాధిరా డ్డళశిరస్సంహారపారీణ దోః
పంచాస్య ప్రథమాన శౌర్య భృగుజ ప్రావృట్ప యోదానిలా॥ 255

ఉ పేం ద్ర వ జ్ర ము.

ఉమాసుతాస్వాంత లసత్సరోరు ట్పుమంథయా కల్పక శుభ్రఘృష్టి
ర్హిమ స్మరారి త్రిదివేభ హర్మ్యతు మౌక్తిక ద్యోత విశాలకీర్తీ॥ 256

మాలికాచతుర్విధకందము.

క॥ శ్రీగోపావన భవహర భోగా పావనినుతపద మునిగణభయ వా
ర్యా గోపావనతాంఘ్రియుగా గోపావనజద్భృశ యుగళగురుప్రతిభా॥

పై పద్యములోని పద్యములు.

క॥ గోపావన భవహర భోగా పావనినుతపద మునిగణభయవార్యా
గోపావనతాంఘ్రియుగా గోపావనజద్భృశయుగళ గురుప్రతిభా శ్రీ॥ 1

క॥ పావన భవహర భోగా పావనినుతపద మునిగణభయవార్యా గో
పావనతాంఘ్రియుగా గోపావనజద్భృశయుగళ గురుప్రతిభా శ్రీగో॥ 2

క॥ వనభవహరభోగా పావనినుతపదమునిగణ భయవార్యా గోపా
వనతాంఘ్రియుగా గోపావనజద్భృశయుగళ గురుప్రతిభా శ్రీగోపా॥ 3

మాలినీవృత్తము.

జలజదళనిభాక్షా సాధులోకేంద్రవృక్షా
ఖలజనమదశిక్షా గౌతమీశాపమోక్షా
విలసితవృథువక్షా వీరవర్యప్రతీక్ష్యా
కలుషహరణదక్షా గ్రావచారీశపక్షా॥ 258

గ ద్య ము.

ఇది శ్రీరఘునందన చరణారవిందవందన మరున్నందన నిరతిశయకరుణా కటాక్ష వీక్షాసంభావిత చతుర్విధానూన కవితాప్రసారిత వసుంధరా రమణ సభాప్రకాశిత విద్వన్నికాయ రుక్మాంగద నలచరిత్రాభిధ యక్షగానద్వయ మనఃప్రబోధ రామచంద్రప్రభు ధీనిధీనామక శతగ్రంథత్రయ మదాలసాభిధానైక నాటక పుష్పగిరిపీఠాధిపత్య జగద్గురు శ్రీమదఖిన వోద్దండ విద్యాశంకర భారతీస్వామి చాతుర్మాస్యదీక్షా గద్వాలసంస్థానాధీశ్వర వంశవృక్షవర్ణన ప్రబంధనిర్మాణచాతురీవిరాజిత భారద్వాజస గోత్ర పవిత్ర భట్టురాజవంశ క్షీరసాగర రాకానిశాకళత్ర రామదాస పౌత్ర సంజీవరాజసత్పుత్ర కొడవలూరి రామచంద్రరాజ నామధేయ కవివర్య ప్రణీతంబయిన శ్రీస్కాందపురాణాంతర్గత శంకరసంహితాభినివేశ మహాసేనోదయంబను మహాప్రబంధమునందు ద్వితీయాశ్వాసము॥ 259



శ్రీరస్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

# మహాసేనోదయము.

(పద్యకావ్యము.)

## —• చతుర్థాశ్వాసము. •—

మద్దివ్యమునీంద్ర
స్తోమాపచిత ప్రసిద్ధ సుకుమారపదా
సామజరిపు సమవిక్రమ
ధామా వైదేహికామ దశరథరామా॥ 1

తే॥ అవధరింపుము శుకశౌనకాది తాపసులకు సర్వకథారథ సూతుఁడైన
సూతుఁడనియెనుమందాకినీతరంగ ప్రబలఘోషానుకారివాక్పటిమతోడ॥

—• **అజముఖి దూర్వాసుని బలవంతముగా భోగించుట** •—

సీ॥ మునులార వినుఁ డజముఖియొక చోనుండ
కతికామవశమున నఖిలలోక
ములఁ జరించుచు ద్విజుల్ మునులు సురాసురుల్
నరులు గంధర్వులనకను మఱియు
రూపవంతులు బుధుల్ రూపహీనులు వృద్ధు
లని లెక్కయిడక సహస్రసంఖ్య
పురుషుల బలవంతముగబట్టి నిరతంబు
భోగించుచును నిట్లులాగయాశి

తే॥ కనులకగపడ్డ సౌందర్యకలితలైన ప్రౌఢలను ముగ్ధలను బల్మి బట్టితెచ్చి
తనదు తోఁబుట్టువులకిచ్చుఁ దాపసాశి భవనపంక్తుల దుశ్చేష్ట భంగపరచు॥

వ॥ వెండియు నాచండరక్కసి భయంకర కృత్యంబు లఖండముగా నాచ
రించుచు స్వైరిణియై సంచరించుచుండ నొక్కనాఁడు॥ 4

అం త్య ప్రా స ము.

ఎ॥ కనియెఁ మార్గమునన్ మహానియమయోగాభ్యాసు నత్యంతపా
పనిరాసున్ భసితానులేపనతనూభాసున్ సదారణ్యదే
శనివాసున్ భగవత్పదాబ్జ భజనాంచన్మానసోల్లాసు శో
భనహాసున్ హరిణాజిన ప్రకట శుంభద్వాసు దూర్వాసునిన్॥ 5

॥ చూచియతనికనియె సుతులనుబడయఁగాఁ గోరి నీదురాక గోరియుంటి
నతనుకేళినన్ను నలరింపఁదగునన్న నెడదజడిసినుడివెఁ బడఁతికపుడు॥ 6

॥ ఓసిదురాత్మురాల తెరువుంబడిపేఁగెదు నన్ను గాముకే
ళీ సరసంబులందనుప లెమ్మనిపల్కితివే నరణ్యసం
వాసినశక్తుఁడన్ ముసలివాఁడనుగావున నీయభీప్సితం
జేసమకూర్పఁజాల వరియింపుము నీసరిరూపయౌవనున్॥ 7

॥ అన నలదుష్టదానవి రయంబున బైఁబడి పౌనివర్యునిన్
వెనుకకునూకి వాతెఅను వేమఱునొక్కుచుఁ జాటుచోటులన్
గనుచు బలాత్కృతిన్ బిగువుఁ గౌఁగిఁటనుంచి విరుద్ధమైన రీ
తి నెఱయఁజేసెఁబో యుపరతిన్ దురితంబనుటల్ దలంపకన్॥ 8

ఇల్వల వాతాపుల జననము.

వారలిద్దఱ రతివేగవశత నిల్వలుండు వాతాపియనఁగ నుద్దండబలులు
దల్లిదండ్రులఁబోలిన దనుజు లుదయమైమె భవత్తపమిమ్మని యనిరిగురుని॥
ఇట్లు దుష్టవర్తనులై యడిగిన దూర్వాసుండుఁ జండకోపుఁడై తులువ
లగుమీరు దపోదానంబునకు యోగ్యులుగారని యవమానించిన నాయి
ల్వలవాతాపులుగనలి జనకుని హింసింపఁగడంగిన నెఱింగి యతండు
మీరలీకరణి బ్రాహ్మణాపకృతి నొనరింపుచుఁ దనువు విడువగలవారని
కనికరమడఁచి వారలశపియించి యథేచ్ఛంజనియె నంత॥ 10

అన్నిశాచరు లిద్దఱభివృద్ధిగాఁగోరి యోజించియజుగూర్చియురుతపంబు
సతినిష్ఠతో ననేకాబ్దముల్ సేసియు వరదుఁడుగామి భీకరపు వీర

యాగమారంభించి యతిభక్తి నిల్వలవాతాపు లాత్మీయ వపురవయవ
ములఁ గోసి శిఖివేల్వ జలజాసనుం డిచ్చమెచ్చి చెచ్చెరవచ్చి ముచ్చటెచ్చ
ఆ॥ నిచ్ఛలిత్తువన్న మచ్చికవాక్రుచ్చు మనిన నిల్వలుండు నజునిజూచి
కల్లమేఁకరూపు గాంచి వాతాపి నేబిలువఁ దొల్లిటట్ల చెలఁగుటిమ్ము 11

— ఇల్వలవాతాపులు పైతృక మిషమున ననేక బ్రాహ్మణవధ సేయుట. —

క॥ అని యడిగిన నట్లగునని వనజాసనుఁడరుగ ముదమువడి మాతులుఁడై
తనరిన భూసురకక్కథ వినిపించి తదాజ్ఞనొంది వెడలిరివారల్॥ 12
వ॥ ఇట్లు దుష్టాత్ములై భూసురవ్యథయందు మనంబుజొనిపి॥ 13
సీ॥ కుటకదేశమునందుగురుతరాటవినొక్క నిలయమేర్పరచియిల్వలుఁడువిప్ర
వేషుడై యిట్టటు విహరించుచున్నంత నాత్రోవ మునులెవ్వరైనఁబోవఁ
జూచియిల్వలుఁడప్డుబఱతెంచిబహుభక్తి నర్ఘ్యపాద్యములిచ్చియాదరమున
ఋషులార నేఁడు నాగృహమునఁబైతృకం బొనకూడె నిద్దిసుదినముగాన
తే॥ నిటకువేంచేసితిరి మీర లేను ధన్యతముఁడనైతిని యిచటభూతలముపుణ్య
భాజనంబయ్యె నని తీయపలుకులాడి ముచ్చుమోసానవారలఁదెచ్చినిలిపి॥
క॥ మహితాత్ములార నాయీగృహమందు నిమంత్రణంబు గేవలకృపతో
వహియించినన్ను దుఃఖాపహుగా నొనరింపుఁడనుచు బలికి రయమునన్॥
ఆ॥ పర్ణగృహము వెడలి పజ్జఁబచ్చికపట్ల మేషరూపమొంది మెలగుచున్న
పాపవర్తనుండు వాతాపిబిల్చి మైదటిగి వండి వారి కెఱచిపెట్టి॥ 16
ఆ॥ భుక్తిచన్న వెనుక ధూర్తుఁడౌయిల్వలుఁ డింటిబయలనిల్చి యిందురమ్మ
టంచు నమజాబిల్వఁ గొంచక వాతాపి వారిగర్భములను వ్రచ్చివెడలు॥ 17
వ॥ ఇట్లువెడలి యుదరదళంబునఁ బంచతనొందు తాపసుల నన్నయుం
దమ్ముఁడును గడుపారగుడుచుచు నీవడువున ననుదినంబతికాంక్ష నశేష
ఋషిసంఘంబులఁ బితృకార్యంబనిబతిమాలి తెచ్చి మృతులం జేయుదురిది
యజముఖవృత్తాంతం బిఁక భూరపమ్మ వర్తనంబువినుఁడు॥ 18
శా॥ శూరుండింద్ర విమానమెక్కి భువనస్తోమంబు వీక్షింపగాఁ
వారంబొక్కట నాగవిష్టపము భవ్యశ్రీలఁ గీర్తించుచున్

జేరంబోయి దినార్థమందచట సుస్థేమంబుతో నిల్చుచుఁ
సారప్రజ్ఞ నిశీధకాలమునకాస్థఁ వచ్చుఁబో ప్రోలికిఁ 19

ఉ॥ ఈక్రియఁబూని లోకములనెల్లఁ జరించుచు నబ్జజాండముల్
భీకరశాస్త్రినేలు చగభేదికుటుంబిని యంగసౌష్ఠవ
శ్రీ కడునాలకించి తమిఁజెంది మనోజునిబారిఁజిక్కి ప
ల్పోకలమెచ్చి మించువలపుఁ వెలిసేయక డాచి సూతుతోఁ॥ 20

—◆ శూరపద్ముఁడు శచినిబట్టి తెచ్చుటకు సూతుని బంపుట ◆—

క॥ నవకోటి దనుజకాంతలఁ దవిలిరథంబెక్కి వేగఁదరలి మహేంద్రుఁ
రవరవదొలంగి కట్టియు నవలనిటకుదెమ్ము శచిని ననుటయు వాఁడుఁ॥

వ॥ అమరావతిఁ బ్రవేశించిన॥ 22

ఉ॥ శూరుఁడనుజ్ఞసేయుగతి సూతుఁడు వచ్చుటయెల్ల మున్నె గో
త్రారి యెఱింగిడాఁగెను భయంపడి కామినితోడనవ్వలం
గ్రూరలు దుష్టవర్తనలు గుచ్ఛితలైన నిశాటభామినుల్
గోరినయట్లు నాకపురిఁ గొల్లనుపెట్టిరి సింహగర్జనఁ॥ 23

సీ॥ అంతటనుడుగక యమరభృత్యులఁబట్టి వేధింప మిక్కిలి వెఱపుఁజాల్చి
యేమెఱుంగముమీరలేతెంచుసడివిని యొందుడాఁగెనోయింద్రుడింతిఁగూడి
మమ్మేలతన్నెద రిమ్మాడ్కిదయలేక ననిసూతుతో వారలనుడు మరలి
శూరునిముంగలఁ జేరి మ్రొక్కివినీతి జరుగువార్తనుదెల్పి జరిగెనతఁడు

తే॥ నంత నిజచారులనుజీరి యధికపూన్కిఁబంచబాణుఁడుప్రేరేపఁ బాపమనక
పాకశాసను నాతనిపత్ని శచిని రోయఁబంచెను శూరుండు వేయుగతుల॥

ఉ॥ అప్పుడు నాకముందొలఁగె నబ్జనివాసిని యింద్రుడింతితో
దెప్పరమైనభీతి దనతేజముడాచి మఱుంగుపడ్డచో
జెప్పగిదెం గనంబడమి నేడ్చిజయంతుఁడు ఖిన్నతండ్రియై
యొప్పు సముద్రశాయికడ నుండెను నెమ్మది కొంతయూరటఁ॥ 25

సీ॥ అనుడు శుకశౌనకాది సంయములు సూతుఁ
గాంచి పురుహూతసూతి యేకారణమున

నలిననాభునికడనుండెఁ దెలుపుమనిన
బలికెనాతఁడు మృదువచోభంగి మెఱసి॥ 26

ఉ॥ మున్నసురాళిబాధ భయముంగని నైజనివాసభూమికిన్
వెన్నుఁడు సేరఁబోవగను వేల్పులతోఁ బురుహూతుఁడేడకో
చన్ని జయంతుఁడప్పుడతి సంభ్రముఁడై పినతండ్రియౌ హరిం
గ్రన్నన సేరి యచ్చట సురద్విషులండమినుండె సౌఖ్యతన్॥ 27

క॥ కాపున వాసవిగానన్ దైవతవారములువోయి దైన్యంబడరన్
దేవినిగొని నీగురుఁడేత్రోవనొ చనఁ గొల్చుకోర్కెతో నీకడకున్॥ 28

క॥ వచ్చితిమన స్వర్గంబున కచ్చుగదేవతలతోడ నరిగి దితిసుతుల్
నిచ్చలు జెప్పెడు పనులన్ నొచ్చికొనుచుసల్పుచుండె నుసలుటలేకన్॥

వ॥ ఇట్లుండి జయంతుఁడు దనతల్లిదండ్రు లనుభవించు బాధలకు నుల్లంబునఁ దల్లడిల్లుచుఁ గృశీభూత శరీరుండయి దినంబులుద్రోయుచుండి విధి వశంబున॥ 30

— జయంతుఁడు నారదునిఁ జూచుట. —

సీ॥ దివ్యప్రభా మహతీతంతుసంజాత హరికీర్తనాలాప మాత్మనలముఁ
బ్రణవపూర్వకనమఃపదయుక్త నారాయణాయేతి వాక్యమానందమొసఁగ
దీర్ఘజటారుణ దీధితిద్యుమణి యజ్ఞానాంధకార ఖండనముసేయఁ
ద్రిజగచ్చరిష్ణు వర్ధితనిర్మలఖ్యాతి పితృగోష్ఠ్యవిచికిత్స హాతమొనర్ప

తే॥ హృష్టుఁడై తనకీపోల్కి నిష్టమయిన
మహిమలలరారి యేతెంచు మౌనివరుని
దేహశుభ్ర ప్రభావ్యాప్త దిఙ్నికరుని
నారదునిగాంచె జంభారి నందనుండు॥ 31

క॥ కని వినయంబెనయఁగ వందనశతమొనరించి పగచి తాపసనాథా
జననీజనకులఁ గానక వనటనిటన్ నిల్చియున్నవాఁడ ననుటయున్॥ 32

ఉ॥ నారదుడిట్లువల్కు సురనాథతనూభవ నీగురుండు దే
వేరినిగూడిరాఁగలఁడు వేగమె నిశ్చయ మాత్మదుఃఖమున్

జారుమునీవు బూర్వమున సల్పినకర్మము లూరకేఁగునే
యేరికినైన నెందువసియించిన భోగ్యములౌ ధ్రువంబుగన్॥ 33

॥ దైత్యనాశంబుగోరి నీతండ్రి తపము
సేయుచున్నాఁడు నీవాదితేయ సహిత
ముగను శూరాజ్ఞ మెలఁగుచు మోసపోక
నుండుమీపట్లనని నారదుండుసనియె॥ 34

అంత॥ 35

॥ ప్రాకారాలి చిదంబరాంతికమునన్ భాస్వన్మహాక్షేత్రమౌ
శ్రీకాపాఖ్యపురంబునందు శరణార్థివాంఛిత కల్పద్రుమంబం
బౌ కైలాసనివాసుఁగూర్చి తపముద్యల్లీలఁ గావించుచో
లోకశ్రేణులఁదన్నురోయు తొలివేల్పుంబంట్లు గాన్పించుదుల్॥ 36

ధరభేదికంపించి తత్పురాశ్వార్ణ కాంతారద్రు నివహామధ్యంబునందు
ద్వాక్సారరూపుచేఁ దపము సేయుచునున్న సప్పుడనావృష్టి నయ్యెనయ్యె
మంతయు నెండిన నమరేంద్రుఁ డదిగాంచి నేనిట జేరి నిక్కానయపగా
గావున బూర్వదుష్కర్మ ఫలంబులు నజునకైనను దప్పవనుచు వగవ
గగనవాణి యతనిఁగని చింతిలకు కొద్దినాళ్ల కిచట జాఱు నదియొకండు
పాదపములు పుష్పఫలయుక్తిఁదనరారు ననిననింద్రుఁడలరియచటనుండె॥

—♦ నారదుఁడు వింధ్యపర్వతుని యొద్దకు వచ్చుట ♦—

అయ్యెడనారదుండు కలహాశననామము సార్థకంబుగాఁ
జయ్యనవింధ్యపర్వతుని సన్నిధికింజనుదేర నాతఁడుల్
నెయ్యముమీర నర్చిడి నేనుగ్రతార్థుఁడ మిమ్ముఁజూచుటన్
వెయ్యునిఁకేలనంచన వివేచనజేసి సుకర్తిఁబట్లనన్॥ 38

నగోత్తమా! సుజనావనుండవగుసీకు శుభంబకదా యీవలకునేను గనక
గిరికింబోయితి నతండుగర్వించి నాతోనాడిన దుర్భాషలెట్లుబోధింతు
నయినను నీకునాయందత్యంత గురుభక్తి విశ్వాసంబులుండుటంజేసి
యవ్వాక్యంబు లుపదేశింపుమని మన్మనంబు పురికొల్పుచున్నయది

కావున జెప్పెదవినుమని యిట్లనియె॥ 39

చ॥ గ్రహశశితారకారుణులు రాశిసమేతము నన్నుఁజుట్టి ప్ర
త్యహమును సంచరించెదరు దన్వనిషంగుఁడతిక్రుధం బ్రిపూ
ర్వహనము సేయునాఁడు వసుధన్వముగాఁగొనె నాపయిఁ సురల్
మహిళలతోవసింతురు సమంబెవ రద్రులలోన నాకనే॥ 40

మ॥ అనినన్ వింధ్యుఁడసహుఁడై యలుక నిష్వాసాకృతింగాంచి శం
భునిచేనొంచుటనొందుటల్ సురలగుంపుల్ కాళ్లతోఁద్రొక్కుటల్
ఘనమెట్లో నరసింహభిచ్ఛరభరాట్కారిన్యపున్ గిట్టలం
దున మాపాకృతినుండుటల్ మఱచెఁగా దుర్మార్గుఁడీలోననేఁ॥ 41

ఆ॥ బళిర మఱియు శరభ పశువిశేషమునం గరంబు జ్యోతిరింగణంబు
బోల్కిఁదాభ్రమించుపూర్వవృత్తాంతమే తెలుఁగు మేరుగిరికిమఱపువచ్చె॥

క॥ అనివింధ్యుండాడినవిని యనిమిషముని గారవమున నాశీస్సులువే
యొనరించి మింటి తెరువునఁ జనియెన్ గోవిందనాను జపతత్పరుఁడై॥ 43

ఉ॥ అంతటవింధ్యుఁడల్క బ్రుహిణాండమునిండఁగ మేనువెంప ను
డ్కాంలెరవిప్రచారములు గల్గుటలేమిని కాలకృత్యముల్
శాంతినెసంగుటల్ దివిజజాలము యోజనచేసెఱింగె ని
శ్చింతలు వింధ్యపర్వతుని వెక్కసపుంబనులంచు నాత్మలోన్॥ 44

—♦ దేవతలు మేరువందున్న యగస్త్యుని జూడవచ్చుట. ♦—

ఆ॥ తెలిసిమేరుగుహను నిలిచితపంబున్న కుంభభవునికడకు గుంపులగుచు
నేఁగిమ్రొక్కినుతుల రాగంబునొందించి విబుధులెల్ల విన్నవించిరిట్లు॥ 45

వ॥ మహాత్మా! వింధ్యుండహంకరించి యిట్లుసేయ రాత్రింబగళ్లులేక లోకంబునందొక్కెడ సూర్యరశ్మియు నొక్కెడ నంధకారంబుగా నుండుటఁ జతుర్దిక్కు లొక్కవైఖరిం బ్రవర్తింపవు దత్కారణంబున జగంబునందధ్వరాది కార్యంబులు బూజ్యంబులగు నందుచే దేవతల తృప్తింగని చింతింతురుగావున మున్ను నీవంబుధిజలంబులంద్రావి

జగ[్రదక్షిణమొనరించిన మహామహిముఁడవగుటనిన్నా[్రశయించితిమిపుడు జగదవన సమర్థుండ వీవకాని యొరులెవ్వరు దుర్మదంబునఁ బెరిగిన వింధ్యశిఖరి నణచి భువనంబుల యథావిధినొందింపుమని ప్రార్థించిన వల్లెయని॥ 46

క॥ ఘటజుం డమరులవీడ్కొని నిటలాక్షుని దనదుమదిని నిల్పి భజింపం
దటుకున శూలిగనంబడ ఘటితాంజలియై యగస్తి గడుభక్తి మెయిన్॥ 47

క॥ స్మరియించి మ్రొక్కి వింధ్యుఁడు
దురహంకృతి నాచరించు దుష్కృత్యములున్
సురబలములార్తిఁ జేఁ దను
శరణము వేఁడుటయు నాది సర్వము జెప్పెన్॥ 48

సీ॥ కుంభసంభవుఁడప్డు శంభునిరీక్షించి యురగభూషణ వింధ్యునొంచగల్గు
బలమును దోయంబు బరువడినిమ్మన్న విని బలంబిచ్చి కావేరినిపుడ
కుండికయం దుంచికొని యేఁగుమనుటయుఁ జింతించియున్న దిశిపునితోఁ బఁ
బురుషునివెంట నన్నొమ్మన నెటుబోదు ననిపల్క శంకరుండనియెసురల

తే॥ ధన్యుఁడీయన పావనధరణినిన్ను విడుచుననిచెప్పఁ గావేరి జడుపుమాని
యుండెను కమండలములోన నెండికొండ జేరఁగానేఁగెనంతట మారవైరి॥

భూ తి ల క వృ త్త ము.

అప్పుడగస్త్యుఁడు వింధ్యుజూడ రయంబునంజనుచాటలో
నొప్పుఖలుండగు [్రౌంచదానవుఁ డోలిఁదారకవాసవౌ
కుప్పముచెంత వెసన్ స్వమాయను గొండనంబువు వంబువుం
దిప్ప మహింజల మప్పుఘూమిగలిన్ ఘటించుచుజృంభియై॥ 50

తే॥ దివిజమానవపన్నగ భువనములకు వ్యాప్తిగుంబొనర్చుచును నీలాద్రిపోలె
దారినరికట్టియున్న చందంబుజూచిగిరి యు కానెంచికలశజుండరుగుచుండ॥

చ॥ కనుఁగొనదారిగన్పడియు గన్పడకన్ మఱిఁబోవఁ ద్రోవచి
క్కనగలినుండి చిక్కుకిటు గృత్రిమముల్ గలిగింపఁ గుంభజుం

డును నడికొండనుండియు నడుంగులుతొట్రిలఁ జేవదప్పి భీ
తినిఁజన బెక్కుమార్గములు దృశ్యమదృశ్యముగాఁగ నుండుటన్॥ 5

—♦ క్రౌంచరాక్షసుని యగస్త్యుడు కొండగా నుండునట్లు శపించుట ♦—

సీ॥ పదియుదోచకా ఋషివిభ్రమంబున నుండనవ్వేళ క్రౌంచుండుబెలుచ
నంబుధరావరణంబును ఘటియించి చిమ్మచీఁకటి గ్రమ్మఁజేయనపుడు
నగ్గిరివనమధ్య మభ్రంబుబెట్టుగా నుఱుముచు నధికమై మెఱుపులెసయ
బిడుగులుబడిబడి బడగవర్షింపుచు దారుణ దారుణంబై రహించి

తే॥ సర్వమోహనమగుచుండ జటివరుండు
దిక్కుదెలియక మఱిఁ దనదివ్యదృష్టిఁ
గాంచి క్రౌంచుని మాయలటంచుదెలిసి
రోషియై దండహతుఁజేసి రూఢినని యె॥ 5

క॥ దోషాట నన్ను బర్వతవేషముధరియించి కపటవృత్తిని దురితా
శ్లేషుఁడవై భ్రమియించితి వీషత్కాలంబు నినుసహింపం దగునే॥ 5

ఉ॥ నీవిదియాదికొండవయి నిల్చి కుమారునిశక్తిఘాతచే
జీవములూడ్చుమంచుఁ దన చేజలమెత్తి శపించి కుంభజుం
డావెనుకన్ మహామహిమ నందిన కాశికినేఁగి సర్వస
త్త్వావలికర్ణ నిర్వ్యథన తారకబోధను విశ్వనాథునిన్॥ 5

వ॥ దర్శించి యగస్త్యుం డామ్నాయోక్తంబుగాఁ బూజలిడి గీర్వాణ
ప్రయోజనము సేయఁబోవుచు వింధ్యగిరింజూచి ప్రశంసించి॥ 5

తే॥ తాపసాశయసంతోష తత్పరుఁడవు వివిధభూతప్రవృత్తి నివృత్తులకును
గర్తవీవటుగాన నీక్షణమవాచి దేశమునకేఁగవలె నాకుఁ దెరువువిడుము

మ॥ నగముఖ్యా దమజాడఁగావలయునన్నన్ దుష్టుఁడై మీరలేఁ
గగ మార్గంబిటలేదు మీరెవరొ వేగం బవ్వలన్ బొండనన్
మొగమెత్తుందనమొందఁజేసి కరమ న్మూర్ధోత్తమాంగంబుపైఁ
బగచేనుంచి యడంచెఁగ్రిందువడఁ గుంభప్రోద్భవుండత్తఱిన్॥

చ॥ వడఁకుచు నేలపైఁబడి జవంబటి దీనత నోఘటోద్భవా
కడునపరాధి నీమహిమ గానక చేసినతప్పులెల్లఁ బో
విడిచి యనుగ్రహింపుమిదె వేఁడెద మున్పటియున్నతంబుచే
నిడుమదొలంగియున్కి దగనిమ్మను వింధ్యునికాఘనుండనుꠂ॥ 59

క॥ ఈపగిదిని నీవుండఁగ నేప్రొద్దుననేను మరలియేతెంచెదనో
యాప్రొద్దటుండఁజేసెద రాపర్వతయనుచు మౌని రయమునబోవꠂ॥ 60

—♦ అగస్త్యుఁడిల్వల వాతాపుల రూపుమాపుట ♦—

ఆ॥ తుల్వరక్కసులగు నిల్వలవాతాపు లున్నవనము సేరియుండె మార్గ
వశత ఘటజుఁడౌర నశియించపనున్న వా రెచటనున్న మృత్యువేలవిడుచు॥

వ॥ ఆసమయంబున॥ 62

ఉ॥ పాపమతుల్ సమస్తమునిభక్షణలోలుపు లిల్వలుండువా
తాపి యగస్త్యునింగని ముదంబునమ్రొక్కుచు మాయదృష్టతం
చాపస మీరువచ్చితిరి ధన్యులమైతిమి మాగృహంబునꠂ
సాపడుఁడీదినంబున విచారముమానియటంచు నమ్రులై॥ 63

క॥ బలువినయంబున వేడిన గలశజుఁడంగీకరించె ఘాతుకుఁడౌ ని
ల్వలుఁడెప్పటియట్టుల సత్ఫలసూపక్షీరభక్ష్య భక్ష్యాదులతోꠂ॥ 64

క॥ వాతాపితనుక్రవ్యము ప్రీతింగుడువంగబెట్టి వెసనిల్వలుఁడా
వాతాపిఁబిల్వఁ గలశోద్భూతునిగర్భమునవాఁడు బొరలినయంతꠂ॥ 65

ఆ॥ అలఘటోద్భవుండు దెలిసియువ్వాతాపి జీర్ణమగుటకొఱకు జీర్ణమంత్ర
ములఁ బఠింప తనదు బొజ్జనునివ్వరుడు శిష్యునికరుణవాఁడు జీర్ణుడయ్యె॥

వ॥ అంతనిల్వలుండు గలుషించి దుర్వర్తనంబునఁ దాఁకిన గుశఘాతమ్మృతి
బొందించి యచ్చోటుగదలి కొంకణదేశంబుసొచ్చి యచ్చటినిశాటులఁ
గీటడఁగింప బ్రహ్మహత్య నిరతంబుదన్నుబీడించుచున్న లోపాముద్రా
ప్రియుం డఖ్యామి శివలింగంబునిలిపి యర్చించి నిర్దోషుండయ్యె
నయ్యెడ॥ 67

—♦ ఇంద్రనారదుల సంభాషణము ♦—

శా॥ ఆదిత్యర్షి సురేంద్రుఁజూడఁజనఁగా నర్ఘ్యాదులందన్వి య
య్యాదిత్యప్రభుఁడిట్లువల్కు ఖలదైత్యవ్రాతాసముంబాసి వ
న్నాదిత్యుల్ గొలువంగ నెన్నఁడు మదీయస్థానమందుందునో
నాదైన్యంబుదొలంగుటెన్నఁగను స్వప్నద్రవ్యముల్ బోలెడిన్॥ 68

తే॥ అచ్చటచ్చటదిరుగు ఘోరాపసర్ప వితతిగన్గొనె నేని బల్వేతలఁ గుడువ
జేయుననుశంకనీవనసీమ వేఁడుమూర్తి శచిఁగూడియున్నాఁడమునివతంస॥

చ॥ కటకట నేనొనర్చు తొలికర్మఫలంబు లవగ్రహోక్తృతిం
గటికితనంబుతో నిచటికానన మెండుటసేయబూనె ని
య్యటవి మనోజ్ఞమై చెలఁగునట్టుల వర్షమువచ్చుటింక నె
న్నఁటికొ యటంచువంచుఁబెన నారదుఁడూరడనాడి వజ్రితోన్॥ 70

శా॥ ల్పావనేహాముకన్ సుపర్వసముదాయంబుల్ నినుఁగొల్వఁగాఁ
బొల్పారం దివమేలఁబోయెదవిఁకం బోఁజేయుసంతాపమున్
జల్పంబుల్ పనిలేదు రాజితగిరిన్ సప్తాపగామధ్యలో
నిల్పంగన్న కవేరజన్ ఘటజమౌనిశ్రేష్ఠుఁ డుత్సాహియై॥ 71

క॥ కుండికనిడుకొని యిచటికి నండం గొంకణముసేరె నది యివ్వనిముం
దుండు క్రియసేయఁ దేబడె ఖండితమిమ్మాట లశని ఖండితశైలా॥ 72

ఆ॥ అనిమిత్తమున గజాస్యునర్చించిన సుముఖుఁడై యతండు సులభముగను
నమ్మహాస్రవంతి నిమ్మేదినికిఁదెచ్చు ననుచుఁజెప్పచనియె నమరమౌని॥ 73

ఆ॥ అవలవజ్రి వారణాస్యుఁ బయిన్పూప మోదకోదనాజ్యముల సభక్తి
నర్చసేయమెచ్చి యవ్వేల్పు ప్రత్యక్షమగుడు సంతసించి పొగడెఁబెద్ద॥ 74

క॥ అప్పుడు నానందంబున నప్పద్మముఖుండువలికె నభిమతమేమో
చెప్పుమొసంగెదవన నతఁడొప్పుగనుతియించి దైన్యమొలయఁగఁబలికెన్

ఉ॥ ఇచ్చటనున్న పాదపము లెండుటలేక చెలంగునట్లు నీ
రిచ్చి కృతార్థుజేయుమన నీద్రుహిణాండ బహిర్గతాంబువుం

దెచ్చెదనో త్రివిష్టప నదీజలభోగవతీజలంబులం
దెచ్చెదనో వచింపుమని తేజమెసంగ గణేశుఁడాడినన్॥ 76

— విఘ్నేశ్వరుఁడగస్త్యుగమండలమునందలి కావేరీజలము తెచ్చుట —

వ॥ మరున్నాథుండో మహాత్మా! యగస్త్యుండు గావేరీజలయుతుండయి యిచ్చోటికిఁ గుఱంగట గలండజ్జలింబిచ్చోటికే తేర నియ్యటవి పవిత్రంబగు ననిన వినాయకుండు సమ్మదంబంది వాయసాకృతినచ్చటికింజని॥ 77

సీ॥ ఘటజుండు విస్మృతిగానున్నతఱిఁ దత్కమండలుపై నెక్క మౌనివరుఁడు గనలి యక్కరటంబు గరములనదలింప నది తత్తరంగిణీయుదక ముర్వి దొరుగునట్లుడుఁగుల ద్రొక్కి చెంగటనిల్వ నాఘనుఁడాత్మలో హానుహేళ యెంతచేసితివని చింతించిఘుకాకి యుపకారమొనరించి యంతబోక

తే॥ ఇంతటంతటదిరిగెడు నింకదీని సైఁపఁదగదని తెంపుచే సంహరింపఁ బూనిడగ్గఱమాయమైపోయెనద్దియందులకుకుంభజన్ముఁడాయాసమొంది॥

తే॥ సర్వదిక్కులవెదకెడు సమయమందు వర్ణియై కానుపింప నివ్వఁడుఁగువాఁడు సేసెనిట్లనిచేయెత్తి శిరముబొడువనందినటులుండియందకయవలికుఱికి॥ 79

క॥ ఉరమునజందెము మెఱయఁగ
సరసను బాలకుఁడునగుచుఁ జతుర్ద్వయ గో
చరుఁడగుడు బొంచిమొట్టెను
మరలం గలశజుఁడు గుపితమానసుఁ డగుచున్॥ 80

క॥ ఆదెబ్బవడక దృక్యుండౌ దారికి నధికవిస్మయంబున ఘటజుం
డీదారకు నెటుబట్టుదు హాదైవమయనుచు దిక్కులారయుచున్నన్॥ 81

ఉ॥ అంతటవిఘ్నరాజు గరుణాతిశయంబువఁ గుంభసంభవ
ప్రాంతమునందుదోఁచుటయు నమ్మునిహర్షమునొంది వందనా
నంతసపర్యలందనిపి నన్ను సహింపుఁడు మిమ్మెఱుంగకన్
బంతముబూని నాసలుపు బాలిశకృత్యము లెన్నకీశ్వరా॥ 82

మ॥ అనిప్రార్థించిన మోదకప్రియుఁడు నత్యానందుఁడై నీవుగో
రినకోర్కుల్ కృపనిత్తువేఁడుమన వార్ధిక్షీరపూరంబు వా

ర్పినదిట్టండు మహాత్మ నీచరణరాజీవద్వయంబందు వి
డనిభక్తిఁ జనియింపఁజేయవె యఖండప్రేమ లంబోదరా॥ 83

క॥ అనికుంభజుండు వెండియు వినుజుట్టుననుజ్ఞ నాదువెంబడిజనుదెం
చిన కావేరిని బొర్లించిన నదివో యెనని యలుకచే నజ్ఞుఁడనై॥ 84

క॥ నిను మొట్టవచ్చి యపకృతి యొనరించినవాఁడనని నిడూర్పుచుఁ గేలం
దనతలను మొట్టుకొని యమ్మునియంతట వినయవాక్యములనిట్లనియెన్॥

క॥ దేవా శంకరునర్చన గావించుట కెంతమాత్ర కావలయుజలం
బివేయనఁ దొండముచేఁ గావేరీజలకణంబు గైకొనియంతన్॥ 86

వ॥ కమండలునిండించిన ఘటజన్ముండు మోదించె నయ్యేడ వేదండముఖుం డమ్మునినిగని మహేంద్రుండుండు వనవాటి శోషించుటవలన నన్నర్థించి యతండు వారినివ్వుమనుటయు నిచ్చటికరుదెంచి యిట్లొనర్చితి వెండియు నీశ్వరపూజ నా కృత్యంబునకు సలిలంబులు వలయుననివనునీటచే నిన్నదీతోయంబు మదీయకరాగ్రంబున భవత్కుండికనిండించితి కుంభజా! నీవాచరించిన నేరంబువాయుటకై నిండారుగా నాముపోలఁ జేఁదోయిచే శిరఃకుట్టనంబు లొనర్చుకుంటి వెందులకుదయజనించె నిది భువనంబున నాకుఁబ్రీతికరమని యసంఖ్యాతవరములిచ్చి గణేశుండంత ర్థానుండయ్యె నయ్యెడ॥ 87

—♦ అగస్త్యుఁడు కుత్తాలపురమున విష్ణుమూర్తిని లింగాకారముగా జేయుట. ♦—

ఆ॥ కుంభసంభవుండు గుత్తాలపురి సేర వద్ది వైష్ణవాగ్రహారమగుట
వలన నందునున్న వైష్ణవులందఱు శైవలాంఛనము లెసంగుఘటజు॥ 88

క॥ కనుఁగొని నీవీపురమున కనర్హుఁడవురాగ జరుగుమవ్వలననఁగా
విని ఘటజుఁడొప్పికొని ముదమున నప్పురికనతిదూరమున నిల్చివెసన్॥ 89

సీ॥ వైష్ణవవేషంబు వహియించి మగుడ నన్నగరంబునొరఁగఁ దన్నగరినున్న
వైష్ణవుల్ తిలకించి పరమభాగవత శిఖామణియని నమస్కారములను
నతిభక్తిసేయుచు నచ్యుతాలయమున కమ్మునిదోడ్కొని యరిగి వినయ
సంభ్రమంబుల మతసాంకేతరీతులఁ జర్చించుచుండ నాసమయమందుఁ

తే॥ గలశజుఁడు నేను విష్ణునేకాంతముగను నర్చసేయఁగవలె మీరలందఱిచట
నుండకవ్వలఁబొండన నొండనకను సకలవైష్ణవులాక్రియ సల్పిరపుడు॥ 90

వ॥ కపటవైష్ణవాకృతియగు కుంభజుం డయ్యాలయంబునఁగల విష్ణువిగ్రహంబును దనమనంబున శంకరునిగా భావించి వేదోదితసూక్తంబుల ధ్యానింప నాకేశవమూర్తి లింగాకారంబు దాల్చియుండఁ దల్లింగమును మహాన్యాసపూర్వకైకాదశరుద్రాభిషేక బిల్వార్చనల నర్చించుచున్న నప్పనులన్నియు నొకవర్గమూలంబుగా నెఱింగి॥ 91

క॥ కనలుచు వైష్ణవులెల్లరు మునినిఁబీడింప రూఢముగ, బయిరాగం
గనికలశజుండు రూక్షేక్షణములవీక్షింప వారుజడిసి నలుదెసఁ॥ 92

వ॥ పరువిడినంజూచి యాస్థలంబున శివభక్తులఁ గొందఱనివసింపఁజేసి నందికేశ్వర గౌతమ దూర్వాస కణ్వ భృగు బ్రహ్మ దధీచి శాపంబులఁ దలంచి చంద్రశేఖర విరోధులు గతిపయవారంబు లీయిలనుండి లవారగుట దెలిసి యొండు సేయందలంపక యగస్త్యుండు సహ్యాపర్వతముకుఁ జనియెనంత॥ 93

—♦ ఇంద్రుఁడు వేణురూపముమాని నిజరూపమొందుట ♦—

సీ॥ కలశసంభవు కమండలువీడి కావేరి నదియు శ్రీకాపాఖ్యనగరిబయలి
వనవాటికలయందు బ్రవహింప నావృక్ష సంకులంబప్పుడ యంకురించి
శాఖోపశాఖావిశాలంబునై పత్రపుష్పఫలంబులఁ బొలుపుగాంచె
నందున్నవజ్రి మహామోదభరితుఁడై వేణువై యున్నట్టి విధముమాని
తే॥ తనతనువుఁదాల్చి యింద్రాణిఁదగిలి సురభి
కుసుమపత్రఫలంబులఁ గొమ్ముగూర
ఖండశశిమౌళి బూజించుచుండె కుటిల
శాత్రవ జిగీషతో వినిశ్చలమనీష॥ 94

ఉ॥ ఆసమయంబునన్ దివిజులందరు నింద్రునిడాసి మ్రొక్కి దే
వాసతిఁగూడి వేణువంశవర్తులనేల యథావిధిన్ భవ

ద్వాసము సేరవచ్చి ఖలదైత్యభయంబుదొలంగి నెమ్మదిన్
ఖాసిలియుండనొప్పునన బల్కెను వాసవుఁడప్డువారితోన్॥ 95

శా॥ పూర్వంబే ఋషమాంసముఁ దినదినంబుం దెచ్చి యర్పించున
న్నోర్వంజాలక బంధనాలయములో నుంచంగనూహించియున్
గర్వాంధుండగుశూరపద్ముఁడు శచింగామించి తేఁబంచినన్
నిర్వేదంబున మానభంగభయ ఖిన్నీభూతభావుండనై॥ 96

క॥ వచ్చి యిటఁజేరి దనుజులు సచ్చుటకై మృడునిపూజ సల్పుచునున్నా
నచ్చుగ మీతోనిప్పుడు జెచ్చఱకనువేల్పుమలకుఁ జేరివినీతిన్॥ 97

తే॥ జరుగువృత్తాంతమంతయు శంకరునకు
విన్నపము సేసి యాయన యన్నయటుల
నాచరించెదనన వేల్పులాలకించి
మంచికార్యమటంచు హర్షించిరంత॥ 98

క॥ తననాథుడు దన్నిచ్చట నునిచిసురలఁగూడిపోవు నుద్యోగంబుం
గనివగలగూరుశచితోఁ గనికరమునఁ బాకదనుజ ఘస్మరుఁడనియెన్॥ 99

క॥ కాంతావగవకు గౌరీకాంతునిదర్శించి శీఘ్రగతివచ్చెద నీ
యంతికమునఁబోషణకై యుంతును సూ శాస్తనసుడుయుగ్మలివలికెన్॥

వ॥ మహాత్మా! శాస్త్రలోకపాలకుండెట్లయ్యె నన్నేక్రియబోధించు నతండె
వ్వండన నాఖుండలుండు బౌలోమింజూచి యిట్లనియె॥ 101

—♦ శాస్త్ర జన్మ ప్రకారము. ♦—

మ॥ కలశాబ్ధిన్ మును దేవదైత్యులు మహాకాంక్షన్ మథింపన్ సుధా
కలశం బందుదయింప దానికొఱకై కయ్యంబుగావించు ది
వ్యుల దైతేయులమాన్పి వెన్నుఁడల పీయూషంబుదా మోహినీ
లలనాకారముతో నొసంగె సురలెల్లం దృప్తులానట్లుగాన్॥ 102

వ॥ అట్టియెడ మహాదేవుం డమ్మోహినీకాంత రూపసౌందర్యమునకలరి
తత్సమీపంబునకు॥ 103

ఉ॥ మోహముమీఱవచ్చియల మోహకమోహినినైయె జగత్త్రయిన్
మోహమునొందఁజేయగల మోహినిమోమునజూడ్కినిల్పి నా
మోహముదీరనేలుమన ముద్దియయిట్లను నేనువిష్ణుఁడన్
మోహినినైతి నిట్లునిను మోహముదీరఁగఁ గూడుటెట్లగున్॥ 104

క॥ అనియిట్లుపలికి హసితాననయగుచును నధికసిగ్గునం దలవంపం
గనుఁగొని గంగాధరుఁ డత్యనురాగము మీఱఁబలికెనంగనతోడన్॥ 105

తే॥ తొలుతనీవు మచ్ఛక్తి చతుష్టయంబునందు బుంరూపశక్తివనం దగితివి
కాన నారాయణుండనఁగాఁ జెలంగితీవు నేనునుమునుగూడుటీ వెఱుఁగ వె॥

సీ॥ చేడెరోమనరతి క్రీడచేఁ బరమేష్ఠి గలిఁగె నట్టుల దారుకావనమున
ఋషులవంచించుట కీవుమోహినిరూపమమరినన్నువరించి తపుడువినుము
కలసెద నింకొక్క కాలంబునందని పలికితికాన నిప్పగిదినేఁడు
నేవరించితినిన్ను నావిశాలినిబాపు మన సమ్మతిలకున్న హరుఁడుహాని

తే॥ వేణిబలవంతముగబట్టి వివిధరతుల జంబుపాదపషండ మధ్యంబునందు
సాలవృక్షాంతికంబున సల్పుటయును దద్రతిక్రీడకోర్వఁగాఁ దరముగాక॥

క॥ మేమజెమర్పఁగ నోరన్ ఫేనం బురుతరముగాఁగ వెడలఁ దదీయం
బౌ నీరటప్రవహింపంగా నది బేరొందె గండకానదియనఁగన్॥ 108

వ॥ అంత కించిత్కాలంబున కత్తరంగిణియందు వజ్రదంతకీటంబులుజనించి తదీయంబగు సన్నమన్ననఁ గులాయంబులేర్పచుకొని శిశువులఁగలి గించుకొనుచు గూటంబుల నిండ్లుగావించుకొనియుండఁ దటినీలహరి యధికంబయిరా నగ్గూడులజ్జలంబులగలిసి పుత్త్రడిపురుగులుమన్నిగొని యస్నీడంబులు ప్రవాహముతో గూడంజని ప్రాఁచినీట నాటఁబడి యుంట గృష్ణవర్ణంబున మృత్తికపరిణమించి రాలగుట ప్రసిద్ధంబుగావున నక్కీటకకులాయంబులు శిలలవై ఖరిఁ జెలంగియున్న జాలరులు వలలం గొనితెచ్చి తత్కీటక కల్పితవివరంబుల గ్రమ్మిన వానిమూలంబెఱింగి శిలాకలభేదించి రంధ్రంబులగల కనకంబుఁ బుచ్చుకొని యారాతిగూళ్ల

ధీవరులెందెందు విక్రయింతురవి సాలగ్రామంబులన నొప్పె నవి విష్ణువద
నోద్గార జనితములయినకతమున వైష్ణవశిలలయి ప్రఖ్యాతినొందె
నప్పుడు॥ 109

క॥ కేశవ శివ సంయోగముచే శాస్త్రజనించి భక్తిచే జనకుండా
యీశునిఁగని నమ్రత నాకేశాసనమను డతండు నిట్లనిపలికెన్॥ 110

—♦ శచీరక్షణకై శాస్త్రనుంచి యింద్రుఁడు కైలాసమునకు బోవుట. ♦—

క॥ నీకున్ జగదవనత్వము ప్రాకటముగ నొసఁగినాఁడఁ బట్టియనుచున్
శ్రీకంఠుఁడనియెఁ గాన సతీ కావఁగఁగలఁడతండు దృఢబలుఁడు సుమీ॥

చ॥ అని శచినూరడించి పవిహస్తుఁడు శాస్త్రఁదలంపఁ బార్షదుల్
వెనుకొనిరా నతండధిక వేగమునం బఱతెంచి నన్నునే
పనికయి చీరినాడవన భర్గుని సన్నిధికేఁగివత్తు నీ
వనితను గాచుచుండుము ధ్రువంబుగ నాచనుదెంచునంతకున్॥ 112

క॥ అని శాస్త్రనచటఁగాపిడి ఘనవాహనుఁ డీశశైల గమనము సేయన్
ఘనుఁడగు నతఁడు మహాకాళ నామగణరాజునొకనిలఁ ఋంచియనెన్॥113

వ॥ నీవి శచింగాచుకొలకిచ్చటన యుండుమన నతండియ్యకొనియె వంత
శాస్త్రనిజనివాసంబునకుబోయెనప్పుడు॥ 114

చ॥ అమరులఁగూడి వజ్రి రజతాద్రికినింజని నందికేశ్వరున్
సముచితభంగిగాంచి నుతిసల్పి ప్రణామములాచరింపఁగా
నమితకృపన్ శిలాదసుతుఁ డమ్మఘవానునిజూచి మీరలీ
క్రమమున నిందురాఁగలుగు కార్యము దెల్పుడటంచు నాడినన్॥ 115

క॥ నెలతాల్పుం గనుఁగొనియెడి తలఁపున వచ్చితిమటంచు దైన్యంబడరన్
బలభేదివలుక నేఁడది ఫలియింపదటంచు నందిపలికి మఱియున్॥ 116

క॥ సనకాదులకును దత్త్వము గనికరమున బోధసేయు కాలంబిపు డీ
పని యొనగూడదు కావునఁ జనుడన నిర్జరులఁగూడి శతముఖుఁడప్పుడున్॥

తే॥ శ్వేతగిరి నన్యశిఖరంబు సేరి భవుని పాదపద్మము లెదలోన బహుళభక్తి
నభినుతించుచు వసియించెనంతనిచటదోషకార్యానుషక్తయౌ మేనుషక్తి॥

—♦ అజముఖిశచిని శూరపద్ముని కడకు గొంపోవ బ్రయత్నించుట. ♦—

ఆ॥ కమలజాండమెల్ల నిమిషమాత్రంబున గలయఁదిరుగుచుఁ దనకనులకెదుర
బడిన యన్యపురుషవరుల బల్మినిబట్టి ప్రతిదినంబు గఠినరతులఁబెనఁగు॥ 119

ఉ॥ అగ్రజుఁడై నశూరునకు నన్యవధూటుల రెండువేల న
త్యుగ్రతబట్టితెచ్చి వినయోక్తులచే నిరతంబునిచ్చుచున్
దిగ్రమణుల్ సలింపఁగ యథేచ్ఛఁజరించుచు దుర్ముఖీసతిం
బ్రాగ్రహారాశిగాఁగొని నిరంకుశవృత్తినివచ్చి వచ్చియున్॥ 120

వ॥ శ్రీకామాఖ్య నగరోద్యానవాటిం బ్రవేశించి యందున్న పురందరేంమి
ముఖిం దిలకించి క్రోధించి దుర్ముఖియను సఖినిగలిసి డెందంబుజిగురింప
బ్రల్లదంబుగా నిట్లనియె॥ 121

శా॥ పౌలోమీ వినుమేను నీకొఱకు నీభామామణింగూడి నా
నాలోకంబులురోసి కంటినిట నానందంబుసంధిల్లె నీ
కేలా యీగతిలోఁగియుండ మదిహోయింజెందఁగా శూరునిన్
లీలన్ గై కొనుమెల్లభంగి మరుకేళిన్ నిన్నుభోగించెడున్॥ 122

చ॥ అదియునుగాక నిన్నుఁ దనయంతిపురాంగనలెల్లఁ గొల్చున
ట్లొదవనొనర్చు శూరునకు నోడి సురావళులెల్ల భృత్యులై
యొదిగి చరించుచుండుటను నోపరుకావఁగనిన్ను రిత్తయా
పదరులుమాని నేఁదెలుపు వాక్యముద్రోయక రమ్మువెంబడిన్॥ 123

మ॥ అటుకాదంటివయేని యేబలిమి దైత్యశ్రేష్ఠుఁడౌ శూరు చెం
గటికిన్ నెట్టుదు వాకు దండనము గల్గం జేయువారెవ్వ రి
చ్చటవంచుం గఠినోక్తులాడెడు నిజాస్యంజూచి నిర్భీతయై
దిటముంచాలిచిపల్కెనిట్టుల శచీదేవి ప్రసిద్ధంబుగన్॥ 124

సీ॥ గర్వించకుముఖున్న సర్వోన్నతినిబొంది
సురలున్నయెడ దితిసూనులోర్వ
లేకాశ్రయించరె లేఖల నటుగాన

బూర్వజన్మార్జిత పుణ్యపాప
కర్మానురూప సుఖంబుదుఃఖము నెవ్వ
రయిన నాయావేళ ననుభవింత్రు
యిద్ధాత్రి బరమేష్ఠియింతికి నెవ్వాని
బతియంచుఁగూర్చెనో పతియతండ
ఆ॥ కాకనన్యుఁడగునె కలిమిలేములురెండు ధర్మవర్తనంపు దారులగునె
సాధ్విధర్మమమృతసంప్రాపితము దానిగడచినడువ జాలగట్టువాయి॥125
ఉ॥ ఈయెడ నన్నుగాచెడు గణేశునెఱుంగక మందబుద్ధివై
కూయవె నీకుఁబ్రాపెవఁడకోయని యిట్టుల మూర్ఖమూనకఁ
పోయెడిత్రోవఁబొమ్మనిన బోరున నాశచికేలువట్టి నీ
కైయెవఁడేఁగుదెంచి కృపగాచునొ చూచెదనంచు నీడ్చినఁ॥ 126
వ॥ అత్యంత సుకుమారాంగియగు నింద్రాణి యయ్యజముఖసేతకుం దత్తఱించి కేలెత్తి హా! మహాకాళాయని యాహ్వానింప సమీపస్థిత ద్రుమాగ్రంబుననుండి యతండు సనుదెంచి యత్తులువరక్కసి చనియెడు దారి కడ్డంబునిలిచి యిట్లనియె॥ 127
క॥ దేవేంద్రుదేవి విడువుము వేవేగమె విడువవేని విడువనునిన్నుఁ
జీవములుగొందు నదవిని నీవెవ్వఁడవనుచుఁబలుకు నిశిచరితోడఁ॥ 128
క॥ దేవేంద్రసఖుఁడ నేనీ దేవిని రక్షింపవచ్చితిఁ గర్వోక్తుల్
పోవిడి చనుమన నజముఖ చేవ మహాకాళుపై నిశితశూలంబుఁ॥ 129

—♦ మహాకాళుకజముఖి చేతులు నఱికి శచిని విడిపించుట ♦—

క॥ వైవ నతండదిఖడ్గముచేవిఱిచిన మేషముఖ శచీకరమపుడుఁ
వేవదలి డాయుమర్ముఖ చేవయిచి మహాట్టహాస జృంభితయగుచుఁ॥130
తే॥ కవిసి దుర్ముఖ శూలంబు గరమునందు
దాల్చి గణనాథుద్రేయ నతండుదాని
నఱుక నాశాత్రిచరి యొక్కనగమువైవ
ఖడ్గహతి దానినొందించె ఖండనంబు॥ 131

తే॥ శైలఘట్టన హత కరవాలుఁడగుచు
నుండెడి గణాధిపతిగాంచి యుబ్బియార్చి
యిలనుగూలెను నీఖడ్గమింక నెటుల
నడ్డగింపఁగఁజాలుదు వంచుఁగినిసి॥ 132

ఉ॥ శక్రకులాంగనంగొని వెసం జనుదానను జూపుమిప్డు నీ
విక్రమమేమొచూతునని బీరములాడి పులోమజాత నా
స్త్రాక్రమణంబుసేసెడు గజాననదుర్ముఖచేతులన్ నితాం
తక్రుధ సూక్ష్మఖడ్గమునఁ దప్పకత్రుంచె గణేశుఁడత్తఱిన్॥ 133

వ॥ కచినివిడిపించి మహాకాళుండధిక రోషావేశుఁడై యన్నకత్తించరే నేలఁబడ
త్రేయ నది వివిధభంగులఁ బ్రలాపించుచు నిట్టూర్పులు నిగిడించుచు
నిలంబొర్లుచుఁ దునిసిన కర శకలంబులఁ గనుఁగొనుచు మిక్కిలి
దుఃఖించుచు సక్రోధయై॥ 134

మ॥ రవిసోమప్రముఖగ్రహోడుతతి గోత్రింగూల్తు రత్నాకరాం
బువులం బానముసేతుఁ దజ్జలములీ భూమీస్థలింజల్లుదున్
జవసత్వంబుల మన్నుమిన్ను నొక యోజంజేతునంచున్ మహో
రవముంజేయ వయస్యపల్కె నజవక్త్రంగాంచి ఖిన్నాత్మయై॥ 135

శా॥ అమ్మా నీవిటులాత్మదుఃఖితవుగా నాలించి యోదార్చుచున్
నెమ్మింజూపెడివారలెవ్వరిట శాతింబొందుమీ దక్షయ
జ్ఞమ్మందున్ మును వీరభద్రువలనన్ నాసత్రవోరోజ హ
స్తమ్ముల్గోల్పడి దేవకామినులు జింతామగ్నలై యుండరే॥ 136

తే॥ పను నీక్రియనయిలిగాదే నభోవ
నీపరిత్పతులకు బాధసేసితేని
యధిపుఁడగు శూరునకెకల్లు హానిగాన
వలవదన మాని యజముఖ కలుషయగుచు॥ 137

క॥ చెంగటనున్న మహాకాళుం గాంచి మదీయహస్త లూనముగని యు
ప్పొంగునినీను నీశత్రకతునిం గడుసగుగొలుసుగమిని నిలగట్టింతున్॥ 138

చ॥ అటులఘటింపనేని విమమా చనుదోయినిగోసికొందు నం
చటఁగల దుర్ముఖుంగలిసి యవ్వలికింజనె నంత భూధర
త్రుటితుఁడు దద్విధంబును మరుద్రుమ చేవిని నందితోడ ను
న్నటులలవార్తదెల్పి గమనంబొనరించెను బత్నిడాయగన్॥ 139

క॥ వచ్చినపతిఁగని శచితన కచ్చటప్రాప్తించినట్టి యగచాల్లెల్లన్
నొచ్చికొనుచువినిపించిన నచ్చెడుసేతలకు నింద్రుఁడడలుచుఁ బలికెన్॥ 140

వ॥ మనతొల్లింటికర్మంబు లీక్రియ వేధించుచున్నవని శచీదేవినూరడించి మహాకాళుననిచి సుమేరుగుహఁ బ్రవేశంబుజేసి నిటలాక్షుంగూర్చి భార్యాయుతుఁడయి సురపతి తపముసేయ నారంభించెనంత॥ 141

—♦ అజముఖి తనపరాభవముజెప్ప శూరునియొద్దకు వచ్చుట ♦—

ఉ॥ అచ్చటమేషవక్త్రి తనయన్నసమీపమునొంది యేడ్చుచున్
నెచ్చెలిజూచుచుఁ గనులనీరు నఖంబులఁబాయఁద్రోయుచున్
హెచ్చినకిన్కతోఁ దనకు హీనకరత్వము గలువార్త వా
క్రుచ్చిన సర్వమున్విని విరోధముదాలిచి శూరపద్ముఁడున్॥ 142

చ॥ గ్రహనవకంబు నిర్జరనికాయములం బిలిపించి నిర్భరా
గ్రహమున శృంఖలావితతి గట్ట ననుజ్ఞయొనర్చి కారలో
నహితముబోవవైచియు నజాస్యకుఁ జేటగు దేశపాలమ
స్త హననమున్ఘటించి తనసన్నిధినున్న హిరణ్యగర్భుతోన్॥ 143

తే॥ అజముఖశరీర మెప్పటియటులనుండ
రహినిజేయించె దుర్ముఖసహితముగను
వారిమనములు సంతోషవారిరాశి
మగ్నభాజనములుగా సుమాకుమార॥ 144

ఉ॥ అప్పుడుశూరపద్ముగని యబ్జజుఁడిట్లను మోద్పుగేలుతోఁ
జెప్పెదఁజిత్తగింపుము కుశేశయమిత్రముఖగ్రహంబు లె
ల్లప్పుడు లోకపాలనవిలాసమునన్ భ్రమియింత్రుగాన వో
యప్ప కృపామతిన్ విడువ నానతియివ్వుము వారికిత్తఱిన్॥ 145

క॥ అనివిన్నవింప శూరుఁడు గనికరమున నవకసంఖ్య గ్రహములఁ జెరసా
లను వెడలఁజేసి తొల్లిటియనువునవర్తింపఁబనిచె నాశ్చర్యముగాఁ॥ 146

వ॥ అంత బంధుమిత్రపౌత్రపుత్రామాత్య భృత్యవర్గంబులతోఁ బేరోలగ
ముండి శూరపద్ముండు దనమనంబున॥ 147

సీ॥ ధారుణీధరవైరి కారణంబునఁ దన
చెలియలికొందిన చేటుదలఁచి
కడుఁగోపుఁడై దంతఘర్షణమొనరించి
కొలువువారెల్లను దెలియవినఁగ
నింద్రుదూఱుచునున్న నెదుటనిల్చియువాని
పెద్దకొమారుండు బృధుబలుండు
భానుకోపుఁడు శౌర్యభాసితుఁడై తండ్రి
గనుఁగొని నేనిదె చనియిరాజు

తే॥ నతనిసతితోడఁ బట్టితెమ్మనినదెత్తు వారుగాన్పింపకున్న దివంబుగాల్చి
యన్నిలింపులఁదెత్తు మీసన్నిధికిని నానతిమ్మన్న మేలంచు నతనిఁబొగడి॥

వ॥ పంచిన భానుకోపుఁ డరాతిజిగీషనరిగె నిచ్చట శూరపద్ముఁ
డు గాంచనాంబర విరించనాచె బృందారకులఁ దమతమ మం
దిరములనుండ నియమించి తానధికవిలాసంబుతో నంతఃపు
రంబునకుఁబోయెఁ దదనంతరంబున॥ 149

—♦ భానుకోపుఁడు స్వర్గముమీద దండెత్తిపోవుట ♦—

సీ॥ ప్రళయార్కుఁడోయన భాసిల్లు భానుకో
పుఁడు సాంపరాయికంబునకు వేయి
మంది సేనాధిపుల్ సింధురసైంధవ
స్యందన భట సమూహములుదన్ను
గొలుచుచువెంటరా గుఱ్ఱంబు లరువది
వేలుగట్టిన తేరువేడ్కనెక్కి

దూర్వారకోపుఁడై దుర్ముఖతోడ శ్రీ
కాపాఖ్యపురికేఁగి కడురయంబ
సీ॥ దాఘునందున్న వనముల రూపుమాపి
యమరవిభునచ్చటచ్చట నెమకినెమకి
కాన కాత్మనుగనలి నాకమునకరిగి
తలుచుకలచ నిరోధించెఁ దత్క్షణంబ॥ 150
శా॥ అవ్వార్తల్ విని పాకశాసనసుతుఁ డాలోచనగ్రస్తుఁడై
చివ్వం జేయుతలంపుతో ననిమిషశ్రేణుల్ దనుంగొల్వఁగా
నవ్వేళన్ బహుళాస్త్రముల్ గొని వళదానేకపారోహియై
క్రొవ్వంజూపఁగడంగితాఁకె మదరక్షోవాహినిం గ్రుద్ధుఁడై॥ 151
క॥ అయ్యెడ నిరుదెస సేనల కయ్యంబోరమితముగను నాకాలమువం
గయ్యాపు నేలను నిలువక యయ్యమరులుఖిన్నులగుచు నరుగుచునుండన్॥
సీ॥ దానవులుగాంచి పోనీక త్రాళ్లగట్టి
భానుకోపుని యెదట నిర్బంధతనిలుప
నపుడు సురలనుజూచి జయంతుఁడధిక
శౌర్యసారుఁడై దైత్య సంచయముమీఁద॥ 153
ఆ॥ కవిసి యొక్క పెట్ట కాండవర్షంబున ముంచెధవళదంతి మించుటలుక
నసురబలముపైనిఁ గసిమసంగి యనేక దనుజవరుల యమునితావుకనిచె॥
చ॥ అదిగని నీలికేశుఁడనునట్టి నిశాచరుఁడాశుగంబ ము
ర్మదమున నడ్డమై నిశితమార్గణపంక్తులు నైంద్రినొవ్వఁగాఁ
బొదివిన వానిపై నతఁడు భూరిశరంబులువైచి వర్మముం
జిద్రుపలు సేసి యాగ్రుడును శీఘ్రమె దానవుఁడాగ్రహంబునన్॥ 155
క॥ అనిమిషవల్లభనందను ధనుర్గుణముదుమురు సేయఁ దనమాయలచేఁ
దనువుల నేకము దాలిచి దనుజున నేకాస్త్రముల నతఁడు నొంచుటయున్॥
సీ॥ బలమెల్లఁగోల్పోయి ప్రతి సేయఁజాలక
నీలికేశుండున్న జాలియెటిఁగి

సోముండుబద్ముండు వాముండుదంతకుం
డునుసుర కేసరి యునువరుణుఁడు
మారుతబలియును మాయాబలియు మాగ
ధుండాది తొమ్మండ్రు చండబలులు
తలపడి పెక్కుముల్కుల నేయుచును జిత్ర
రణముగావించు పురందరజుని
తే॥ మాయలకులోఁగి చేష్టలుమఱచి నిలువఁ
బ్రథితవిక్రమశాలియౌ భానుకోపుఁ
డడ్డమైనిల్చి వీరోక్తులాడి కఠిన
సాయకంబుల నతని నోనేయుటయును॥ 157

—♦ జయంతభానుకోపుల యుద్ధము. ♦—

చ॥ హరిహయసూనుఁడేచి విలయాంతకుఁడై వడి బిట్టదల్చుచున్
శరములువేయియొక్క పరిశక్తియెసంగఁగ నేసి చాపమున్
హరణముసేయ శూరసుతుఁ డన్యధనుర్ధరుఁడై తదస్త్రముల్
ధరనొఱుగంగనేయుచు రథస్థుఁడునై పఱతేరఁగాంచియున్॥ 158
ఉ॥ క్రూరశరంబులన్ సవితృకోపురథాశ్వములన్ జయంతుఁడి
ద్ధారుణిగూల్పఁగా నతఁడు దగ్రతనన్యశరాంగ మెక్కి దో
స్సారమునం దదీయతనుసంధుల నమ్ములుగ్రుచ్చిడాసి తూ
ణీరములందెమల్చి మెయినింజొర ఘోరశరంబులేసినన్॥ 159
మ॥ తనువాద్యంతము రక్తసిక్తమయి సుత్రామాత్మజాతుండు మూ
ర్ఛనుదాల్పం దెలిగొరురోసమున సంగ్రామక్షితిన్ బాయకన్
దనతుండాయస దండఘట్టనల సూతస్యందనచ్ఛిన్నముం
గొనసాగించి మహోగ్రహంబుగొని రక్షోనాథపుత్రాగ్రణిన్॥ 160
వ॥ సమీపించి యద్యైరావణంబు దనరెండుకొమ్ముల నొత్తినఁ బెనుఱాతిం,
బోలి యత్యంతకఠినంబగు నతనిరొమ్ముదవిలి దంతద్వయంబువిఱిగె

నప్పుడు భానుకోపుఁడుగోపించి గండముల నిజహస్తంబున మోదిన సాహజంబు మూర్ఛిల్లుటయు రక్షోబలంబులు సెలరేఁగి కలకలార్భటులచేఁ ద్రిదివంబు మగుడదహించి మైమరచిపడియున్న జయంతుని దివిజయుతంబుగా బంధించికొని తెచ్చి శూరపద్మపురోభాగంబున నిల్పి యావ ద్వృత్తాంతము భానుకోపుఁడుదెలుప శూరుండురోషించి యజముఖి సూచుచుండ వేల్పుల నందఱదండించి హస్తపాదచ్ఛేదనముగావింప నవ్వెంట నవి మరలనంకురించుచున్న నమృతపాన ప్రభావమని

—♦ శూరుఁడు జయంతాదిసురల చెరసాలయందుంచుట. ♦—

తెలిసి జయంతాది నిలింపుల శృంఖలాబద్ధులఁజేసి చెఱయందునిచి దేవకాంతల నీచరాక్షససేవకు నియోగించి తనపెద్దకొడుకగు భానుకోపున కిట్లనియె॥ 161

తే॥ బాల్యదశయందు నుయ్యెలఁబవ్వళింప
సూర్యుఁడవ్వేళ జాలకసుషిరగతుఁడు
నై తనదుభానువులనిన్ను నాక్రమింపఁ
బట్టి యుయ్యెలకోటికిఁ గట్టితీవు॥ 162

మ॥ అపుడత్తామరచూలివచ్చి నిను నత్యంతంబు బ్రార్థింపఁగాఁ
దపనుఁబీడి యజాస్త్రమాదియగు శస్త్రంబుల్ సురజ్యేష్ఠుతో
నుపమాభావముగాఁగ గైకొనిన నీకూహింప నీవాసవిఁ
విపరీతం బెఱయింపఁగా నని మహోవిశ్వాసముంజూపుచుఁ॥ 163

తే॥ నైకహిత వాక్యకలన బహూకరించి
భానుకోపునిబుత్తెంచి తాను దనదు
నంతిపురికేఁగె శూరపద్మాసురుండు
ప్రబలకీర్తిసమేతుఁడై పరిఢవిల్లి॥ 164

ఉ॥ అంతటనిచ్చటఁ ధవళహస్తి బలంబఱిమూర్ఛదేఱియుఁ
దంతహతవ్యథంబొరసి ధాత్రిని శ్వేతవనాఖ్యపట్నమం

దంతకవైరిగోల్చి వినయంబున నున్నతముల్ దృఢంబులుꣳ
గాంతియుతంబులైన రదనంబులుదాల్చి చెలంగెఁదత్కృపꣳ॥ 165

తే॥ ఇట్లుపల్లులువడసి మహేంద్రుఁజూడ
మేరుగిరికేఁగెఁ జప్పుదంతి శౌరి వజ్రి
పంకజాసన మౌని సుపర్వులెల్ల
నొదిగి కనకాద్రిగుహాలలో నుండిరంత॥ 166

చ॥ అనియిటులాబృహస్పతి మహాబలశాలియు సౌఖ్యదాయకుం
డనఘుఁడు మాసుతుండగు షడాస్యునకీగతి శూరుఁడాదియౌ
దనుజులపుట్టుకందెలిపెఁ దాపసులార యటంచు సూతుఁడిం
పెనయఁగ శౌనకాదుల కహీనమతిꣳ వినిపించెనమ్ముదై॥ 167

వ॥ ఇట్లెఱిఁగింప నాలించి యవ్వలి కథావృత్తాంతమెట్లంగి సెల్లెనని యడుగుటయు॥ 168

ఆశ్వాసాంతము.

స్రగ్ధర.

రాజీవప్రోద్భవ స్వర్వరివృఢ జటిలేంద్ర ప్రణమ్యాంఘ్రియుగ్మో
ర్వీజాత స్వచ్ఛ హృద్వారిజ మధుప దశగ్రీవ కుంభశ్రవాసు
భ్రాజిష్ణు క్రూరబాణాపహరణ సతతాఖ్యర్చ భక్తేష్ట కల్ప
ద్మాజ శ్యామాభ్రవర్ణా సవితృకుల పయస్సాగరోద్భూతచంద్రా॥ 169

● పంచదశాంధ్రపద్యగర్భితాష్ట సమాస కల్పిత కల్పవల్లీ ప్రహరణ కళికవృత్తము. ●

శరముఖశరధిం సరసిజచరణం సరససుచరితం సరమపశరణం
శరదహసరథం శరజభృశరణం శరవిశరిపుం చరుభుగజరసం॥ 170

పై పద్యమందలి గర్భపద్యములు.

● సప్తాక్షరైక పాదగర్భ ప్రథమ మదన విలసిత వృత్తము. ●

శరముఖశరధిꣳ సరసిజచరణుꣳ సరససుచరితుꣳ సరమపశరణుꣳ॥ 1

● సప్తాక్షరైక పాదగర్భ ద్వితీయ మదన విలసిత వృత్తము. ●

శరదహసరథుꣳ శరజభృశరణుꣳ శరవిశరిపుꣳ చరుభుగజరసుꣳ॥ 2

వ॥ కొందఱీ రెండువృత్తములు మధుమతీవృత్తమందురు॥

● చతుర్దశాక్షరైక పాదగర్భ ప్రహరణకలిత వృత్తము. ●

శరముఖశరధిఁ సరసిజచరణుఁ సరసచరితుఁ సరమపశరణుఁ
శరదహాసరధుఁ శరజభ్రుశరణుఁ శరవివశరిపుఁ చరుభుగజరసుఁ॥ 3

● పంచదశాక్షరైక పాదగర్భ మణిగణనికరవృత్తము. ●

శరముఖశరధిని సరసిజచరణున్ సరససుచరితుని సరమపశరణున్
శరదహాసరధుని శరజభ్రుశరణున్ శరవివశరిపుని చరుభుగజరసున్॥ 4

● అష్టాక్షరైక పాదగర్భ ప్రథమాష్టమాత్రా వృత్తము. ●

శరముఖశరధిని సరసిజచరణుని సరససుచరితుని సరమపశరణుని॥ 5

● అష్టాక్షరైక పాదగర్భ ద్వితీయాష్టమాత్రా వృత్తము. ●

శరదహాసరధుని శరజభ్రుశరణుని శరవివశరిపుని చరుభుగజరసుని॥ 6

● షోడశాక్షరైక పాదగర్భ మధురగతిరగడ. ●

శరముఖశరధిని సరసిజచరణుని సరససుచరితుని సరమపశరణుని
శరదహాసరధుని శరజభ్రుశరణుని శరవివశరిపుని చరుభుగజరసుని॥ 7

వ॥ కొందఱు దీనినే షోడశలఘు వృత్తమందురు॥

● పంచదశాక్షరైక పాదగర్భ ద్విపదము. ●

శరముఖశరధిని సరసిజచరణు సరససుచరితుని సరమపశరణు
శరదహాసరధుని శరజభ్రుశరణు శరవివశరిపుని చరుభుగజరసు॥ 8

○ ద్వాత్రింశదక్షరైక పాదగర్భహరిణగతిరగడ. ○

శరముఖశరధి సరసిజచరణు సరససుచరితు సరమపశరణు
శరదహాసరధు శరజభ్రుశరణు శరవివశరిపు చరుభుగజరసు॥ 9

గర్భ ప్రథమ కందము.

క॥ శరముఖశరధిఁ సరసిజచరణుఁ సరససుచరితుని సరమపశరణుఁ
శరదహాసరధుఁ శరజభ్రుశరణుని శరవివశరిపుని చరుభుగజరసుఁ॥ 10

గర్భ ద్వితీయ కందము.

క॥ సరసిజచరణుఁ సరససుచరితుని సరమపశరణుని శరదహాసరధుఁ
శరజభృశరణుని శరవివశరిపుని చరుభుగజరసుని శరముఖశరధిఁ॥ 11

గర్భ తృతీయ కందము.

క॥ సరససుచరితుఁ సరమపశరణుఁ శరదహాసరధుని శరజభృశరణుఁ
శరవివశరిపుని చరుభుగజరసుని శరముఖశరధిని సరసిజచరణుఁ॥ 12

గర్భ చతుర్థ కందము.

క॥ సరమపశరణున్ శరదహాసరధుని శరజభృశరణుని శరవివశరిపున్
చరుభుగజరసుని శరముఖశరధిని సరసిజచరణుని సరససుచరితున్॥ 13

గర్భ పంచమ కందము,

క॥ శరదహాసరధున్ శరజభృశరణుని శరవివశరిపుని చరుభుగజరసున్
శరముఖశరధిని సరసిజచరణుని సరససుచరితుని సరమపశరణున్॥ 14

గర్భ షష్ఠ కందము.

క॥ శరజభృశరణుని శరవివశరిపుని చరుభుగజరసుని శరముఖశరధిన్
సరసిజచరణుని సరససుచరితుని సరమపశరణుని శరదహాసరధున్॥ 15

గర్భ సప్తమ కందము.

క॥ శరవివశరిపుని చరుభుగజరసుని శరముఖశరధిని సరసిజచరణుఁ
సరససుచరితుని సరమపశరణున్ శరదహాసరధుని శరజభృశరణున్॥ 16

గర్భాష్టమ కందము.

క॥ చరుభుగజరసున్ శరముఖశరధిని సరసిజచరణుని సరససుచరితున్
సరమపశరణున్ శరదహాసరధుఁ శరజభృశరణుని శరవివశరిపున్॥ 17

చ॥ భృగువరసూను దుర్మదకుభృచ్ఛతకోటి వనాటవాహినీ
సుగమ పయోధిబంధన విశుద్ధపవిత్రచరిత్ర గౌతమీ
యగణితపాపభంజన దయారసరక్షితరావణానుజా
నగసమధీర పంక్తిరథనందన శైలసుతాభినందనా॥ 171

మాలినీవృత్తము.

తనువిజితమసారా దైత్యనీహారసూరా
యనుపమభుజసారా యార్యనీతిప్రచారా
కనకకుధరధీరా కాననోర్వీవిహారా
కనదురుమణిహారా కల్మషత్రాసదూరా॥ 172

గ ద్య ము.

ఇది శ్రీరఘునందనచరణారవింద వందన మరున్నందన నిరతిశయకరుణా కటాక్ష వీక్షాసంభావిత చతుర్విధానూన కవితాప్రహర్షిత వసుంధరా రమణ సభాప్రకాశిత విద్వన్నికాయ రుక్మాంగదనలచరిత్రాభిధ యక్ష గానద్వయ మనఃప్రబోధ రామచంద్రప్రభు ధీనిధీనామక శతగ్రంధత్రయ మదాలసాభిధానైకనాటక పుష్పగిరిపీఠాధిపత్య జగద్గురు శ్రీమదభిన వోద్దండ విద్యాశంకరభారతీస్వామి చాతుర్మాస్యదీక్షా గద్వాలసంస్థా నాధీశ్వర వంశవృక్షవర్ణనప్రబంధనిర్మాణ చాతురీవిరాజిత భారద్వాజస గోత్రపవిత్ర భట్టరాజవంశక్షీరసాగర రాకానిశాకళత్ర రామదాసపౌత్ర సంజీవరాజసత్పుత్ర కొడవలూరి రామచంద్రరాజ నామధేయ కవివర్య ప్రణీతంబయిన శ్రీస్కాందపురాణాంతర్గత శంకరసంహితాభినివేశ మహా సేనోదయంబను మహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము॥ 173



శ్రీ ర స్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

# మ హా సే నో ద య ము.

(పద్యకావ్యము.)

—• పం చ మా శ్వా స ము. •—

శ్రీమదయోధ్యా నగరీ
ధామా రవివంశకలశతటినీశ సుధా
ధామా మణిమయముక్తా
దామా లావణ్యసీమ దశరథరామా॥

తే॥ అవధరింపుము శుకశౌనకాది తాప
సులకు సర్వకథారథ సూతుఁడయిన
సూతుఁడనియెను మందాకినీతరంగ
ప్రబలఘోషానుకారి వాక్పటిమతోడ॥ 2

వ॥ మునీంద్రములారా! యిట్లు సుబ్రహ్మణ్యుండు సురాచార్యునిచే శూర పద్మాది రక్షోవీరుల జననాదిచరిత్రంబాలించి కృపాకటాక్షవీక్షణంబుల నధోక్షజాది సకలామరులఁజూచి యిట్లనియె॥ 3

క॥ మలినాత్ముండగు శూరునిఁ గులబలములతోడ నిలనుగూల్చెద మిమ్మున్ నిలిపెద మీమీచోటులఁ జలియింపకుఁడిదియె శంభుశాసనముసుఁడీ॥ 4

క॥ వినను రిపుఁడగు శూరుని మానసమెఱుఁగుటయు నీతిమార్గంబగుటం బూనిక నచ్చోటికిఁజని రానోపినపురుషు వేగిరము పంపఁదగున్॥ 5

—• వీరబాహుని రాయబారము. •—

వ॥ అట్టివాఁడెవ్వఁడో నిరూపింపుఁడనిన సురలెల్లరు శౌర్యరాశియగు వీర బాహుంజూపినఁ గుమారుండు సంతోషించి యతనితో నిట్లనియె॥ 6

క॥ నీవిప్డుచని శూరునింగాంచి నేనాడుపలుకుగా నిట్లు జెప్పంగవలయు భాకశాసనిమొదల్ నాకులనందఱ బంధంబులూడిచి పంచుమనుము

గర్వంబువిడనాడికడునయంబూని నీయూరిలోసుఖముగానుండుమనుము
నీకిహితంబును నీమీద దయదాల్చి బోధింపగా నన్నుఁ బుచ్చెననుము

తే॥ ఇందులకువాఁడు సమ్మతినొందకవల నాగ్రహంబున వికటోక్తులాడెనేని
కులబలంబులతోనిన్నుగూల్చువాడు కార్తికేయుఁడటంచునిక్కంబుచెపుము॥

తే॥ వేగమున బోయిరమ్మన వీరబాహుఁ డాంబికేయునకెఱగి దేవాళితోడ
నధికసన్మానమునుబొంది యరిగి గంధమాదనంబనుశైలంబుమీఁదనెక్కె॥

వ॥ అప్పుడు॥ 9

చ॥ నిజతను వజ్జ్రాండమును నిండఁగఁ బెంచి మహోగ్రమూర్తియై
గజరిపుసామ్యవిక్రమ వికాసిత దానవసైన్యయుక్తముఁ
ధ్వజరథవప్రగోపుర వితానమణీ గృహసౌధసక్తముఁ
వ్యజిననివాసమౌ యసురవీరుపురంబును గాంచి యంతటఁ॥ 10

క॥ గిరులన్యదేశములు సాగరములుదిలకించి యసురగణములతో దు
శ్చరితుఁడగుశూరునగరము నరయంగాఁ దిలలఁదిలల యంత్రంబుక్రియఁ॥

వ॥ నిజహస్తద్వయంబున॥ 12

ఆ॥ నులిమివేయ మదినిఁదలఁచి నిర్జరులప్పురంబునందునున్కి ప్రాణహాని
వారికగునొయంచు ధీరాత్ముఁడూహించి శాంతినిల్చియుండెశైలమందు॥

ఉ॥ వెండియు నట్టహాసమలి విక్రమమూనియొనర్చ నాధ్వనిఁ
రెండగు హజ్జశాకుడులఁ బృథ్వీధరంబు గుహాప్రవేశులై
యుండెడి శూరసైన్యముల నుబ్బుచెడం బయిఁబడ్డ నందుచే
దండధరుంగనంజనిరి దానవులందొక కొందఱయ్యెడఁ॥ 14

వ॥ వీరబాహుండు సముద్రోల్లంఘన సమర్థంబగు మూర్తినవలీలఁదాల్చి
చిత్తంబున నిర్మలుండును గురుండునునగు శరజన్ము నునిచి కంధి నతి
లఘుప్రచారంబున మింటందాటనెంచి యుప్పురంబునకుఁ గుప్పించునప్పు
డప్పర్వతంబుగ్రుంగి నేలంగలిసె నిల్లైగసిపోవునెడ నతనిమెయింబుట్టు
కరువలిచేఁ బెనుగట్టులు దూదిప్రోవులక్రియ నెగసినేలంబడ దదీయాని

లోద్ధతిచే నెగసిరూపఱెడు దరఁగల య్యాదోరాశి బాడబింబునుజల్లార్ప
నావిత్య శశాంక ధారాధర మండలంబులు నడకచెడి యట్టిట్టుబడ వీర
బాహుండు లంకాపట్టణంబు డాయంబోవు నవసరంబున॥ 15

—◆ వీరసింహుండు వీరబాహునితోఁబోరి మడియుట. ◆—

శా॥ ఆలంకాపురమేలు నాశిముఖదైత్యశ్రేష్ఠుసేనాని శా
ర్వాలంకారుఁడు వీరసింహుఁడనువాఁడత్యంత వీర్యంబునం
గాలుండోయననొప్పి పంచశతరక్షఃపాళితోఁగూడి యా
ఖీలుండై చను రత్ననూతికెదురై బీరంబుగాన్పించుచున్॥ 16

క॥ ఎటఁబోయె దెవఁడవీవని చటులక్రోధమునఁబలుక షణ్ముఖునూతం
బటుజవమున శూరునిచెంగటికేఁగెద నడ్డగింపఁగానీతరమే॥ 17

తే॥ నీవు నన్నేమిసేయంగ నేరవనుచు వీరబాహుఁడువలికి దోస్స్ఫురితముమున
నవ్వలంబోవనున్నంతనసురుఁడెకిరి కఠినబాణంబులతనిపై నప్పాటయును॥

ఆ॥ కనిబీరబాహు ఖడ్గంబుగై కొని వీరసింహుఁడేయు ప్రదర శల్ల
సంచయంబుదునిమి శౌర్యమేపారంగ గుటిలదనుజసేన గూలనేసె॥ 19

ఉ॥ అవ్విధమంతయుంగని మహోగ్రహుఁడై యసురుండు నాజిలోఁ
గ్రొవ్వున వజ్రశూలముఁ గొట్టినఁ జేఁగలఖడ్గధారచే
నవ్విబుధారియేయు విశిఖావళితోడ దవీయుకంధరం
బవ్వసుధాస్థలింగెడపి యేఁగెఁ బదంపడి మింటితెన్నునన్॥ 20

క॥ ఈగతిని వీరబాహుండేఁగుటయును నచటిదితిజు లీక్షించియుఁ దె
న్నాగిఁయదలింప వారల నాగులగరుడుండువోలె నలినలిజేసెన్॥ 21

సీ॥ అంత మహాశూరుఁడగు వీరబాహుండు పటుజవంబున లంకపైనిదుముకఁ
గంపంబునొంది లంకాపురంబెల్లను గూలె మేడలతోడఁగూడి విఱిగి
యాసమయంబునం దాయాస్థలంబుల నున్నదైత్యులు బెల్లునన్నిఁగొనిరి
యటమీఁదఁగలకలార్భటులుప్రోలునమించ వినితత్పురీనాయకునికుమార

తే॥ కుండువతివీరుఁడనువాఁడు జండకోపుఁ
డగుచు నాయోధనోద్యుక్తుఁడై యనేక

దితితనూజులుగొలువ నద్భుతమువడుచు
రత్నసుతుదాఁకి బాణవర్షంబుగురిసె॥ 22

—♦ వీరబాహుండతివీరుఁడను రాక్షసుని జంపుట. ♦—

చ॥ కురియుడు రత్ననందనుఁ డకుంఠపరాక్రముఁడై తదస్త్ర సం
హరణమొనర్చి దానవసమాజమునొంచుడు శేషరాక్షసుల్
గరువముదక్కి పాఱుటయు గన్గొని యయ్యతివీరుఁ డుగ్రుఁడై
గురుతరశక్తివైచుటయు గూల్చె నతండది ఖడ్గధారచేఁ॥ 23

తే॥ అంత దనుజుండు గదద్రవేయ నరిగి వీర
బాహుసింహుఁ దాఁకి చూర్ణమైపడిన నసుర
[illegible]ముపైచిన దెగువ దాని
హస్తతాడనమున [illegible] యార్చె॥ 24

వ॥ దానిం [illegible] యతివీరుండు వైరిమారణసమర్థంబునుజతుర్ముఖదత్తంబును
నమోఘంబునునగు కరవాలంబుగొని నలుదిక్కుల గిరగిరంద్రిప్పుచుఁ
దాఁకిన సేనానిపూర ఖడ్గంబువట్టి కలహానైపుణ్యంబు గాన్పించుచు
నారక్కసుని శిరోహస్తంబులు నేలఁబడనడిచి లంకాపురదైత్యులనేకు
లొక్కుమ్మడి దన్నుఁజుట్టిన వారినెల్లమాపుమాపి మెండొడ్డి యోజన
సహస్ర పరిమాణంబును సలిగంభీరంబును నగు నగరఖేయంబవలీల
లంఘించి వీరమాహేంద్రపుర సాలంబున నుత్తరదిగ్గోపురంబునందుగల
భయంకరాకారులగు ఘోరాతిఘోర నామక ద్వారపాలురఁగాంచి తన
మనంబున నిట్లనివితర్కించె॥ 25

—♦ వీరబాహుండు గజముఖుఁడను ద్వారపాలకునిజంపి వీరమాహేంద్రిపురముసొచ్చుట. ♦—

ఉ॥ వేయురథంబులుం గరులువేయును రెండగువేలుగాల్వురుఁ
వేయుతురంగముల్గలిగి వెల్గుచువీరలునున్నవార లీ
చాయను నేనుబోయినఁ బోసంగునుయుద్ధమునాకువీరితో
నోయనఁగన్నుఁ బ్రామి చనుటొప్పునటంచదిదాటి శీఘ్రతఁ॥ 26

సీ॥ ప్రాగ్దిశకుబోయి యట వీరభాను మహిష
నేత్రులను క్రూరదానవుల్ నిల్చిముందు
వారికై వడిఁ జతురంగబలముతోడ
నున్నఁగన్గొని పగబూనకోసరించి॥ 27

॥ దక్షిణగోపుర ద్వారమార్గంబున బురముసొచ్చెదనని పోవుటయును
దుండంబులొకవేయి రెండువేలుకరంబు లుత్తమాంగంబులునొక్కవేయి
గలిగి గజాస్యుఁడంబోలదిండి జతురంగబలముతో నచ్చోటనిలిచియుండి
వీరబాహునిజూచి యోరినీవెవ్వండ వేనియాజ్ఞనువచ్చి తిందుఁజేరఁ

౯॥ గార్యమేమియనుచుఁ గడుఁగోపమునఁజల్క
శైలమొకటివేయ సత్వరమున
నదియునతనిఁదాఁకి చిద్రుపలైధరప్రాల
రాక్షసుండు శౌర్యరాశియగుచు॥ 28

॥ తుండసహస్రంబునఁ బెనుగొండలువేయింటినేయఁ గూలెనవియు న
ద్దండిమగనిమెయిసోకుట వెండియునారక్కసుండు విక్రాంతుఁడై॥ 29

॥ గదబలుప వీరబాహుండదిఖడ్గముచేతనఱుక నసురుఁడుమఱియుఁ
బదినూఱులతొండంబులఁగొమకకవటవృక్షములనుగొనివేయుటయుఁ॥

వ॥ కదుకోని వీరబాహుఁడురుఖడ్గముచేఁ దునియింప రక్కసుం
డెడలక ముష్టియుద్ధమున కేచి భుజద్వయిమీఁదికెత్తఁగా
జడియక నాతడఁడ్యోడ నిశాటుని తుండసహస్రసంఖ్యయుఁ
బెడిదపుగత్తిచేనటికెఁ బృధ్వినిడొల్ల సమూలకంబులై॥ 31

తే॥ ఇట్లుఁ దనతొండములువోవు టెంచకసుర
నాగ్రహంబునబైఁబడ నరుగుదేరఁ
గాంచివీరుండు మీదుగుప్పించి యొక్క
తన్నుదన్నిన వాఁడుర్వి దనువువిడిచె॥ 32

—♦ వీరబాహుండు వీరమాహేంద్రపురమున గూఢముగా దిరుగుట. ♦—

వ॥ అంతవీరబాహుండు దేవకార్యంబిచ్చగించి తన్నిమిషంబున సూక్ష్మ రూపంబుగైకొని పశ్చిమద్వారగోపుర శిఖరాగ్రంబునఁ గూరుచుండి బహువిస్మయప్రదంబును ననేకవిధ దోషాచరస్తోమభరితంబును శూరపద్మ పాలితంబును నగు వీరమాహేంద్రపట్టణంబును గనుంగొని తన మనంబున॥ 33

శా॥ వాణీనాయకలోకమందున రమాస్వామిజగంబందు రు
ద్రాణీవల్లభపిష్టపంబున మరుద్దొరేయువాసంబునన్
రాణింపంబడదిట్టివైభవము నేత్రాల్ వేనవేలుండినన్
దీనింజూడఁగనోపవంచు మదిలోఁ దీర్మానముం జేయుచున్॥ 34

చ॥ తడయకగోపురంబుడిగి తత్పురిసొచ్చి యనేకవీధులన్
పిడువకసంచరించి బలువిస్మయముల్ గని యేఁగుచున్ జయం
తుఁడుమొదలైనవేలుపులు దుష్టనరాసులు సేయుకష్టముల్
కుడిచెడివీధిజేరి మిరుఁగుంబడి వారలనెల్లఁజూచుచున్॥ 35

తే॥ వానిమాటఁ విని యు నవ్వఁగనుసిరిచి
యెసుండెవప్పుడు వీరబాహుండునంత
బంధనుబడియున్న యుగ్రమునిశిఖ మొదలు
సురలఁజేరి నిశాచరుల్ గాంచుమూలి॥ 36

–♦ చెఱనున్న జయంతాదులు రాక్షసులనేయు బాధకోర్వక శివుని ప్రార్థించుట. ♦–

క॥ పట్టుచు దిట్టుచుఁ గొట్టుచు
గట్టాటమి శచియుదము గనుమొఱఁగిరో యా
గుట్టును జెప్పఁడు చెల్పక
యుట్టిటు నుసిగిలిరయేని యుడఁతుము మిమ్మున్॥ 37

క॥ అనిపలికి సూదిముల్లులు దనువులఁగడుమెత్తనైన శాఖలయందున్
గనలుచుఁ గ్రుచ్చుచు బహుకీలిని బాధలపరచుచున్న దితినందనులన్॥ 38

ఆ॥ నిదురనొందఁ జేసె నెమ్మితోవీరుండు నంతనింద్రపుత్రుఁ డాదిదివ్యు
లసురవరులు సేయు యలజడికోర్వఁగా దరముగాక శంభుదలఁచిభక్తి॥ 39

వ॥ మనంబున సాష్టాంగనమస్కారములు సమర్పించి మహార్తులై యిట్లని స్తుతించిరి॥ 40

దండకము.

శ్రీమన్మహాదేవ దేవాదిదేవా! మహావిక్రమోపేతుఁడౌ దైత్యులీజాడ మమ్ముఁ వ్యర్థఁ బెట్ట నీవూరకున్నఁ సహింపఁ దరంబౌనె మాకుఁ ఖలుల్ బాధలొందించగాఁ జూడసాధ్యంబె పూర్వంబు ముప్రోలురా కాసిభీతిఁ నినుఁ వేడఁ బ్రేమించి వారిఁ క్షణంబందునిర్జించి మమ్ముంగటాక్షించవే నేఁడు పేక్షింపనాంయుంబె గౌరీప్రియా కాలకూటంబు ధాత్రీస్థలింబర్వ మేమోర్వఁగాలేక ప్రార్థింప బాసంబుగావింపవే దాని పాలేక్షుణా బంట్లమౌమాకు శ్రేయఃప్రమొందంచు విఖ్యాతినింగాంచుచుఁ జండముండుండు ఖండుండు దుర్గుండుమం బంచమేధ్రుండు మాతంగ దైతేయుఁడాది కుపాచారులంద్రుంచి వైసారిణః కూర్మ సూకార మర్త్య ద్విపారాతి ఖర్వావతార ప్రతీకంబులం గూర్చియుఁ వాని నేత్రాస్థి దంష్ట్రింబులుం గృత్తికంకాళముల్ దాల్చి లోకంబులఁ సాకి మమ్ముఁ సదాప్రోచితీవేళ నెందేఁగితో యాపదోద్ధారకా యింద్రుడింద్రాణితోఁగూడి శోకాతురుండై యదృశ్యుండునై పోయె మేమింక నవ్వజ్రినింజూతుమో లేదొ బాలేందుమౌళీ చతుర్దంత నాగేంద్రమయాపదల్ గాంచెనో వైజయంతంబు నుచ్చైశ్శ్రవంబుఁ సుధర్మామరావత్యభిఖ్యా పురీ నందనారామముల్ మాతలీముఖ్యులేమైరొకో నీలకంఠా! సుపర్వాణు లీబాధలంబొంద నేపాపముంజేసిరో శంకరా! జంగమ స్థావరాది ప్రపంచంబు బుట్టింపఁ బోషింప మాయింప నీవేకదాకర్తవా త్తావనా! మమ్ము గారుణ్యదృష్టిఁ విలోకించి శీఘ్రంబ చేపట్టి రక్షించవే భోగిభూషా! మరందోరుఘోషా! నమల్లోకతోషా! నమస్తే నమస్తే నమః॥ 41

— జయంతాదులఁ గుమారుండు స్వప్నమున నూరడించుట. —

మ॥ అని ఫాలాక్షునిసంస్తుతించి సురలత్యారాటమున్బొంది ని
ద్రనుగన్నట్టుల నొళ్లెరుంగక యలంతన్ సుప్తినొందం గుహుం
డనుకంపామతి ముందురాఁగడగు కల్యాణంబుబోధింపఁ దోఁ
చెనుస్వప్నంబున దేవజాలమునకున్ శృంగారదివ్యాంగుడై॥ 42

చ॥ ఇటుగలయందుఁదోఁచి సురలెల్లరనూరడబల్కి యైంద్రితో
దిటమున నీదుతండ్రియును దేవియు మోదతనున్నవారు మీఁ
దటవగమాని మీరలు ముదంబుననుండఁగలారు నేడు నా
భటుడు మహాబలుండిటకువచ్చె నటంచునుజెల్పి క్రమ్మఱన్॥ 43

సీ॥ శూరపద్మునిఁ భ్రాతృసుతహిత సేనా సమేతంబుగాఁజంపి మిమ్ము ముందు
లీల మీమీచోట్ల గ్రాలఁజేసెదనంచు నాడి తిరోహితుండయ్యెనపుడు
సురలెల్లమేల్కని శరజుండు గలలోన గనఁబడుటెల్ల నొక్కనికినొకఁడు
వినిపించుకొనువేళవీరుఁడచ్చట జయంతాదులకుందోఁచి యనియెగూర్మి

— వీరబాహుండు జయంతాదుల నూరడించుట. —

తే॥ నీగురుండగునిద్రుండు వాగధీశ
వాసుదేవులఁగూడి కైలాసమునకు
నరగ శివుఁగాంచిమ్రొక్కి శూరాసురుండు
సల్పుబాధలు వగపుతోఁ దెల్పుటయును॥ 44

క॥ నెలతాల్పు యామినీచర కులమును మడియించుకొడుకు గుధరజవలనం
గలిగించి శూరపదునిఁ బొలియింపఁగననుపనతఁడుమునిసురయుతుఁడై॥

తే॥ వచ్చి శ్రీశాంతినగరంబు సొచ్చి యిచటి
వార్త నెఱుఁగుటకై నన్నుబనుప నేఁగు
దెంచితిని నీదుతలిదండ్రు లంచితముగ
నొక్కచోటున సుఖముగానుండి యిపుడు॥ 46

క॥ తమకుశలము మీకుంజెప్పుమనిరి మద్భర్తగుహుఁడు బోడవడగించెన్
సమరమునఁ గ్రౌంచతారక సుమనద్వేషులశౌర్యశోభితుడగుచున్॥47

శా॥ ఇంకన్ శ్రీఘమ శూరపద్మముఖులన్ హింసించిపాలించు ని
శ్శంకన్ నీతలిదండ్రులన్ నినుమనుచ్చక్రంబు నిక్కంబుగా
సంకోచింపకుఁడన్న వేల్పులు నిజస్వప్నంబువిన్పింప మో
దాంకూరంబున దానురాబడిన కార్యంబున్ విమర్శించుచున్॥ 48

వ॥ దివ్యులఁదోషింపఁజేసి వీరబాహుండచ్చోటుగదలి యావలంబోయెఁ గావలివారలుం దెలిసిరానియుంబునఁ గుమారుదూత వీరమాహేంద్ర పురవీధులందలి విచిత్రంబులఁజూచుచుఁ బోయిపోయి శూరపద్మ గృహంబు గమఁగొని ప్రతిహారులగు నుగ్రముయూరాది దైత్యులకగో చరుండయి సూక్ష్మరూపమునఁ గొలువుకూటమునకరిగి యందు హాటక

—♦ వీరబాహుండు శూరశాస్త్రావతున గత్న పీఠమున వసించుట. ♦—

మాణిక్యరచిత భాస్వత్కిరీట హారకేయూర కుండలకటకాంగుళీయకాది నానావిధ భూషణాలంకృతుండును భస్మత్రిపుండ్రాంకిత ఫాలభాగుఁడును యోజనసహస్ర విస్తార సభాదేశ నివాసుండును వాదిత్ర కావ్యగీత తాండవాది విద్యాప్రమోదభరితుండును శుభనీరాజన కరనిలింపాంగనా సమావేష్టితుఁడును దుర్వారవైరికీకస వైకవీరాసుర కోటిసేవితుండును మంజులదుకూల పరిధానధారియును దేదీప్యమాన మణిఖచిత సింహాసనా సీనుండును నగు శూరుసింగని కనలి హృదయంబున సదయుండగు కుమారుపదపద్మంబులు ధ్యానింప. దక్షణంబ యమ్మహానుభావ, నమగ్ర హంబున శూరపద్మ సింహాసనాధికృతంబును మహాతేజస్సంపన్నంబును నవమణిప్రభావిరాజితంబును నగు నొక్కపీఠంబచ్చోటఁ గాన్పింప మహా నందంబున వీరబాహుండు నిజరూపంబుగైకొని దాని శూరపద్ము నెదుటనుంచి కోటిసూర్యప్రకాశ నీకాశుండయి తత్పీఠంబున నధివసించె నయ్యెడ॥ 49

వ సం త తి ల క ము.

దైతేయుతెల్లరు నితండు పితామహుండో
భూతేశుఁడో వనధిపుత్రి మనోహరుండో

యాతీరుగా నొకరుఁ డిద్ధబలంబుతో ని
ర్భీతాత్ముఁడై యిటఁజరించుట చిత్రమయ్యెన్॥ 50

క॥ అని యతనిఁజూచుచుండెడి దనుజులఁగని శూరపద్మ దైతేయవిభుం
డనిలునిగతినుండుచు నిట్లని యెన్ శరజన్ముదూత కబ్దధ్వనితోన్॥ 51

—• శూరపద్మ వీరబాహుల సంభాషణము •—

ఉ॥ ఎవ్వఁడవీవు నేమిపనికిచ్చటికిం జనుదెంచినాఁడ వీ
వెవ్వనివాఁడ వెందువసియింతువొ యింద్రమహేంద్రవిద్యలం
దెవ్వఁడు నిన్ను బోలఁడని యెంచితి మామక కొల్వుకూటమం
దివ్విధి నబ్జజాద్యమరు లించుక సేపును నిల్వజాలరున్॥ 52

ఉ॥ ఈవిచ్చోటున నొక్కగద్దియుపయిన్ హేమించికూర్చుండి నా
నావిన్నాణపు భూషణప్రతతి మేనందాల్చి శృంగారివై
భావంబందున జంకులేకెదుట నప్రబంబయ్యెనిట్లుంటకున్
నీవివ్యంగడు మెచ్చి దానమొసఁగన్ నిక్కంబుగా నెంచితిన్॥ 53

తే॥ ప్రాణపూతి దానమిచ్చెద నాలసింప కీవువచ్చినపనిదెల్పు మెంతసాహ
సంబుగలవాఁడవనిన నయ్యాంబికేయుదూతయిట్లనిపలికెఁగోపాతిశయత॥

క॥ శ్రీకరుఁడగు శరజన్ముఁడు నీకుం దెలుపుమని కొన్నినీతులు సెప్పెన్
వాకొనియెద నప్పలుకులు నేకమతిన్ వినుమటంచుహితమధురోక్తిన్॥ 55

క॥ మును నీకులోఁగివిష్ణుఁడు వనజజుఁడును వజ్రి రజతపర్వతమునకుం
జని సర్వాత్ముండగు శివు వినుతుల్ గావించి నీవు వెంగలివగుచున్॥ 56

తే॥ బాధయిడుటయు నీసంబంధులెల్లఁ
బీడసేయుటయును విన్నవించివగచి
స్వామి మేమీవ్యథల నోర్వలేము శూరు
జంపఁగలపుత్రు నొకనిబుట్టింపుమయ్య॥ 57

క॥ అనివేఁడ గౌరియందున దనయునిఁగలిగించి శివుఁడు దరలింపఁగ నా
యనఘుండుదనదు వెంబడి ననుకూలత భక్తిగొలుచు చజరులురాగన్॥ 58

మ॥ అకలంకుండయి వచ్చుమార్గమున సంహారించె నక్రౌంచతా
రకదైతేయుల నంత పంధినగరీరత్నంబులో దేవతా
ప్రకరంబుల్ దనుఁగొల్వనుండి దయదోపన్ నీకు మేల్గూర్పనే
తకునై నన్నిటఁబంచినాఁడు విను వాస్తవ్యంబుగా జెప్పెదన్॥ 59

సీ॥ ఇంద్రనందనుఁడాది యెల్లవేల్పులు నీదుపట్టణంబునఁ గారఁబడి కృశించి
యున్నవారలు వారినూడ్చుమర్యాదగా నాజ్ఞ మీఱక వినయమున నైజ
పురినుండుమిమ్మాటబోఁద్రోచి మెలఁగిన నినుజముప్రోలికిఁబంపుతునని యెఁ
గానమహాసేను నానతియిట్టులఁ గావింపఁగుశలంబు గాంతువనుచు

తే॥ వీరబాహుండు మిగులగంభీరముగను జెప్పియూరకయుండఁగనప్పుడధిక
కోపుఁడై శూరపద్ముఁడుగ్రూరదృష్టి నతనిఁగన్గొనికటతటంబదరననియె॥

—♦ శూరపద్ముఁడు వీరబాహునితో జనబలపరాక్రమములు జెప్పుట. ♦—

సీ॥ నా శౌర్యగరిమఁ గానకమందెమేలంబు గావించెదవు బాలుఖండనంబు
సేయ నేమిఫలంబు సేకూఱదని లెక్కయిడకున్నఁ దారకుమడియఁ జేసి
సంగరంబునుగోరి చనుదెంచెగుహుఁడని వాక్రుచ్చెదవు నిట్టివదరులిచట
నాడఁబోకుముజయంతాదులవిడుమన్న మాటచెప్పఁగరాకుమా యెదుటను

తే॥ దేవతలకష్టములుమాన్ప ధీరుఁడగుచు వచ్చినకుమారుబాధించి పట్టితెచ్చు
కొంటకునేనిచ్చట నెయుండికటకునల్ల ద్రాగుదులమూఁకనంపెదవేగిరమున॥

వ॥ అనియిట్లు శూరపద్ముండు దురహంకారంబునఁ బలికినవిని వీరబాహుం
డధిక రోషదందహ్యమానుండయి॥ 62

క॥ దైత్యేశ శివాత్మకుఁడును నిత్యుండు గుహాఖ్యుఁడనుచు నీవెఱుఁగక నా
కాత్యాయనీకుమారకు బ్రత్యతుము బాలుఁడంచుఁ బలుకంజను నే॥ 63

ఉ॥ అమ్మహితాత్ము మేనున నజాండములుద్భవమౌ నడంగు న
గ్గమ్ముగ నన్నదాతయని కాలులుపల్కుశివప్రమేయుఁడౌ
నెమ్మహనీయు వేలుపును నిందయొనర్చితివై ననేమి నీ
విమ్మెయినాడఁ జెల్కుఁదన మెచ్చనెమాకు నిశాచరాధమా॥ 64

క॥ శిష్టసముత్కరచేతో ద్దిష్టముగానవమతంబు బెరయించినినుం
గష్టములపాలు సేసియు దుష్టాత్మా! పోదునంచు దూషించుటయున్॥ 65

ఉ॥ ఆయసురాధినేత దురహంకృతిచే ద్విసహస్రహస్తముల్
వేయిశిరంబులుంగలుగు వీరనరాదులవేలసంఖ్యలం
బాయక షణ్ముఖానుజునిఁబట్టి వధింపఁగనంప నాతఁడున్
మాయము సేసె నద్దనుజమండలమున్ భ్రుకుటీకరాళుఁడై॥ 66

తే॥ అంతనాసభఁబాసె గుహానుజుండు నాసనమదృశ్యమైపోయె నాక్షణంబ
శూరపద్ముఁడువీరుదుర్వార శౌర్యసారమునకాత్మ వెఱగందిధీరుఁడగుచు॥

—♦ శూరపద్ముఁడు శతాననుని వీరబాహునిమీఁద యుద్ధమునకు బంపుట. ♦—

క॥ అతిబలవచ్ఛౌర్యుండగు శతాననుని దైత్యుఁబంప సంరంభత వాఁ
డతిరయమున సేనాసంగతుఁడై మాఱ్కొన్నఁజూచికడుఁగోపముతోన్॥

ఉ॥ లక్షసువర్ణకుంభముల లక్షణహౌనొకగోపురంబు రూ
క్షేక్షణుఁడై వడింబెఱికి యీశ్వరపుత్రునిబంటు దుష్టమా
రాక్షససేననేయుటయుఁ బ్రాణములంబెడశాసిరందఱున్
దక్షుఁడు నాశతాననుఁడుదగ్ర శరాసన బాణపాణియై॥ 69

చ॥ అగణితతీక్ష్ణబాణముల నాతని నేయఁ దదీయదేహముం
దగులుటచేఁ దునింగియవి ధాత్రిపయింబడెనంత వీరుఁడుం
బొగరున గోపురంబొకటి బోరునబెల్లగిలంగఁజేసి వ్రే
యఁగ నసురుండు దానిఁబరిహారమొనర్చెను బాణపంక్తిచేన్॥ 70

వ॥ వెండియు నారక్కసుండు ననేకమార్గణ తోమరకుంత శక్తిపరిఘాదులఁ
బ్రయోగించిన రత్నతనయుండు శౌర్యసారుఁడయి వానినెల్లందునిమి
చాపహీనుం జేయ నప్పాలసుదిండి బలము మెఱసి తనకరశతద్వయముచేఁ
దలిమిపట్టిన వీరబాహుండు నిజబాహువుచే నురస్తాడనంబు సేయ దాన
పుండిలఁ గూలినంగని యొక్కకాల నక్కునుగ్గయిచచ్చునట్లదిమి తక్కుఁ
గాల వానిమూఱుతలలుఁ జేగలమెకంబు బొండంబున టెంకాయలుం

బోలె దొరలించి యధికతేజోవిరాజితమగు మూర్తినిధరించి రోషాధి
కుఁడై తత్కృతలంబువగులమోదె నయ్యవసరంబున॥ 71

సీ॥ ధరవ్రక్కలై బిలద్వారంబులందుండి యుదకప్రవాహము లుద్భవిల్లి
యచ్చటచ్చటఁగలహయరథదను జేభగణముముంచినఁ బంచు కాలమునను
దైత్యులేఁబదిసంఖ్య చాఁకిరత్నజు నురస్థలమున నవమవంబులను రక్త
ధారలుదొఱఁగఁగ నారాచములనేను [illegible] వారందఱ హస్తపాద
తే॥ ములను దునుమాడి పురపాలకులను నట్లు
గూలఁగానేసి యొకమహాగోపురము
నసురపతి కొల్వుమండపమువనిగలిపి
మఱియుఁ బెక్కుదెఱంగుల నుఱిదిమెఱసి॥ 72

శా॥ నానాగండశిలల్ మహీజములు నానాగోపురంబుల్ [illegible]
నానాదిక్కులనేయుచుఁ దనుజులన్ నాశంబుగావించుచున్
స్థానీయంబునుముట్టడింపుచు స్వహస్తద్వంద్వమెత్తి ప్రమో
దానన్ నాట్యముసేయుచుండ ఖలదైత్యశ్రేణి వీక్షించుచున్॥ 73

క॥ హతశేష దనుజులెదవడి
చతురాశలబాఱుచున్న జాడను రక్షః
పతిగాంచి కొలువుకూటము
గతమగుటయు బురముసెకుట గన్గొనియూర్చెన్॥ 74

వ॥ సహస్రకరంబులు నేనూఱుశిరంబులుం బొలుపొందు నాలివేలుపుల
బెక్కువేలసనుచుటయు వారలగణిత బంధుమరణంబునకడలొంది మచ్చ
రించి చని నానావిశిఖజాలంబులు వీరబాహునపయిం బ్రయోగించిన॥ 75

చ॥ అతఁడొకసాలవృక్షమున నమ్ములుకుల్ నుఱుమాడి వారలన్
హతమొనరించు టంతయును నద్దనుజేంద్రుఁడు వేగువాండ్రచే
శ్రుతమునుజేసి రోషమున సుస్థిరుఁడై సుతు వజ్రబాహునిన్
జతనముమీఱఁబంచె శరజన్మునిదూతను జంపుపూనికన్॥ 76

క॥ పంచిన వాఁడు మణీమయ కాంచనభూషలు ననేక కఠినాయుధపా
శ్యాంచితముగ ధరియించియు బంచాశద్ద్వయతురంగబద్ధ రథముపై॥ 77

తే॥ దివ్యదేదీప్యమానుఁడై దేవవైరి
యెక్కె యేనూఱుతేరులు నేనుఁగులును
నన్నియె తురంగములు వేయునసురవరులు
వేలురెండునుగొల్చిరా విక్రమించి॥ 78

— వజ్రబాహుఁడను దైత్యుఁడు వీరబాహునితో బోరుట. —

క॥ భేరీపటహాదిక వాద్యారావములుల్లసిల సితచ్ఛత్రములుం
జారుతర చామరధ్వజ ధారులయి యనేక దైత్యతతులు నడువఁగన్॥ 79

వ॥ విరాజిల్లి యవ్వజ్రబాహునామకరాక్షసుండు వీరబాహునిపయి నురవ
డించునప్పుడు॥ 80

శా॥ ఉల్కాసంఘమురాలె నెండినతరువ్యూహంబులం గాకిమూఁ
కల్కాయంగఁదొడంగె నెల్లెడలనక్కల్ బెట్టువాపోయె నీ
పోల్కిం జేటొదవించు దుశ్శకునముల్ బుద్ధిన్విచారించకన్
జల్కాకింతయులేక నార్చుచసురుల్ స్కందానుజుందాఁకినన్॥ 81

కనుఁగొని వీరబాహుఁడధికత్వర నీపఱతెంచు సేనలన్
హననముసేసి శక్తిధరునంఘ్రులకుబో యెదనట్లుచేయకుం
డిన గుహుదూతనేయని కడింది ప్రతిజ్ఞ యొనర్చి యాకసం
బునకురువేగుఁడై యెగసి బొబ్బనుబెట్టుచు నృత్యమాడుచోన్॥ 82

॥ చూచివజ్రబాహు వైచిత్ర్యమునుబొంది నిజశతాంగసూతువిజయుతోడ
నీమహోద్భుతంబు నీక్షించితివి కాదెయనుచుఁబలుక వాఁడువినయమునను॥

॥ అవ్విధమంతయుం దెలుప నద్దిగణింపక వజ్రబాహుఁడుం
జివ్వకెదుర్కొనుం డతని సేనలు వీరునిపై శితాస్త్రముల్
నెవ్వడినెత్తురుల్దొరుగ నించిన నాతఁడునొచ్చి కోపమున్
నివ్వటిలంగఁబట్టికొని నింగికివైచెను దుష్టదైత్యులన్॥ 84

ఉ॥ కొందఱుఁద్రిప్పి నేలపయిఁగొట్టుచుఁ గొందఱు వార్ధివై చుచుం
గొందఱు ముష్టి మొట్టుచును గొందఱు దిక్కులఁ బాఱమీటుచుం
గొందఱుఁ గాళ్లఁ దట్టుచును గొందఱు దీవులు సేరనేయుచుం
గొందఱు మింట వైచుచును గొందఱుఁ జేతులు వట్టి త్రుంచుచున్॥ 85

ఉ॥ కొందఱు జక్రవాళమునకుం జననేయుచుఁ గొందఱం దలల్
తుందములోనడంచు చెదఁద్రొక్కుచుఁ గొందఱు నిట్టులాజిలో
నందఱు దైత్యసైన్యముల నంతకుఁ జేర్చి తదీయుఁ డంత్రముల్
గ్రందఁగఁగొట్టె నొక్కముష్టిఁ మాఁకున శౌర్యవిజృంభమాణుఁడై॥ 86

—♦ వీరబాహుండు వజ్రబాహుని జంపుట. ♦—

శా॥ ఆ శౌర్యంబును గాంచి వజ్రభుజుఁ డీర్ష్యం జూపుచున్ భీషణం
బై శోభిల్లు సహస్రకాండముల నేయన్ వీరుఁ డన్నింటినిన్
నాశంబొందఁగ జేసినన్ మగుడ నానక్తం చరుండుం గ్రుధా
వేశుండై మితిమీరి తీక్ష్ణశరముల్ వేసెన్ మహీపుత్రుపై॥ 87

ఉ॥ ఆమ్మన తత్కలంబముల నన్నిఁటిఁ ద్రుంచి యయోగ్రమేయఁగా
నాయసురుండు దుక్కలగునట్లొనరించి యనేకశస్త్రముల్
కాయము వ్రీలి నెత్తురులు గాఱఁగఁ బొన్పిన వీరుఁ డోర్వలే
కాయెడ మూర్ఛనొందె సమరాంగణమందు నిమేషమాత్రమున్॥ 88

వ॥ అంత వీరుండు దెలివొంది మధ్యందినమార్తాండునిగని మండుచు వజ్ర బాహురథంబు గలహమధ్యంబునఁ బ్రహరింప నది పొడిపొడియైరాలిన రక్కసుండొండు తేరెక్కి లెక్కకెక్కుడగు ములుకులు మొగంబునాట నేయఁ గొమరుసామితమ్ముండు బీరంబుమిగిలి వాఁడేయువాలుల నేలఁగలిపి వైశంబచని యిరుగేల నరదంబువట్టికొని శేద్రిమ్మరిత్రోడం గూడ మువ్వరంబు దగుల్కొన వ్రేసిన బాణవేగంబున శతసహస్రయోజ నంబులు మీఁది కెగసి పుడమింబడియును జడిమగొనక యురువడిగలేచి గట్టియగు పిల్లెక్కడ వీరుఁడొక్కుకున దానినొడిసి తుత్తునియలు గావించెనప్పుడు॥ 89

క॥ అసురుఁడు ఖడ్గకరుండయి కసరుచుఁ దనుఁదాఁక వానిఖడ్గము గరముఁ
వసుధపయిగూల్చె వీరుండసహాయ పరాక్రమాఢ్యుఁడై యవలీలన్॥ 90

శా॥ ఆవెంటన్సురవైరి భీషణగదాహస్తుండునై వీరునిన్
లావుందూల నురంబుమోదిన మదిన్ లక్ష్యంబులేకగ్గదన్
జేవన్ శంభుకుమారసోదరుఁడు నిస్త్రింశంబుచేఁద్రుంచి వీ
రావేశంబునఁ గూల్చె వానితలలభ్యామర్దరంగంబునన్॥ 91

ఆ॥ ఇట్లుప్రతినభంగి నెల్లదైత్యులఁజంపి
నట్టుపట్టికోడుకుఁ దిట్టినట్టి
ఫలముబొందెదరనుచు బహుముదంబునుగాంచి
చరమగిరికిఁ దరలిచనెడు తఱిని॥ 92

క॥ సరగుననేఁగెడుదమితోఁ బురవీధులబోవుచుండి భూరిజవమునన్
వరణంబుదాటి ఱివ్వన వరవిభవముగల్గు లంకపయిఁ బడదుమికెన్॥ 93

—♦ యాళీవక్త్రుఁడు వీరునిందాఁకి పెనఁగుట. ♦—

క॥ అలంకా నాయకుఁడగు యాళీవక్త్రుండు మహదహంకృతి సుతునిం
గాలుపురికనిచె మునుపని చాలఁగరోషించి రత్నజని నరికట్టన్॥ 94

వ॥ సైన్యంబులంబంచి సహస్రమస్తకంబులు ద్విసహస్రహస్తంబులఁ దన
వారు నయ్యాళీవక్త్రనిశాటుండు వీరునితో మచ్చరించుచు మత్సుతుఁ
డనుమాడిన నిన్నిచ్చోట వధించెద మదీయ సాహసబల విక్రమంబులు
నూడుమనిన వీరబాహుండు మందస్మితుఁడయి యిట్లనియె॥ 95

చ॥ కలహమునందు నీబలము గన్పడఁజేయుము రిత్తప్రజ్ఞలం
బలుకకుమన్న రక్కసులు బల్వురనేకశరంబులేసినం
గలఁగక వానినన్నిఁటని ఖడ్గహతిందునుమాడినన్ నిశా
టులు దృఢమార్గణంబులు గడుంగడుఁగప్పిరి వీరబాహుపై॥ 96

క॥ ఆయమ్ములెల్ల నాతనికాయమువెసఁదాఁకి విఱుగ గని యతిరోషం
బై యాళీవక్త్రుఁడు దన వేయుభుజంబులను మోదె వీరునురంబున్॥ 97

ఉ॥ ఉరుకోపంబున వీరుఁడయ్యసురు బాహుల్ వేయు ఖడ్గంబుచే
ధరణిం గూల్చిన నవ్యహస్తముల నింద్రద్వేషి సాహస్రసగా
ధరముల్ వైనఁ దదంగఘట్టనముచేతం జూర్ణమై రాలె న
గ్గిరులంతన్ జలధుక్షహాస్రికరముల్ గెంటించె పీనుండనిన్॥ 98

సీ॥ అంతరాతుసుఁడు సహస్రతుండంబుల మణిపనూభన బట్టికొనఁదలంచి
గమకించువేళ విక్రమవంతుఁడై వాని తుండంబులన్ ధార ఖండములుగ
నిలఁగూల్చి యస్త్రమై త్వరల నిర్జించి యిడియుంచి యలఘుజవంబుననద్రిదాటి
గంధమాదనమను గట్టుకు సూటిగా గగనవీథిని నిరాఘాటముగను

గీ॥ నిమిషముననేఁగి షణ్ముఖు నిలయమగుచు
జెలఁగు శ్రీసంధినగరంబు జేరి చిత్ర
వేషి తనతొలిరూపున వెలసినట్లు
స్వస్వరూపియై వీరుండువచ్చుచుండె॥ 99

క॥ ఈరీతి నేఁగుదెంచెడు వీరునకెదురేఁగి తెచ్చి విబుధులు వృషుఁడున్
గూరిమిఁ గౌఁగిటఁ జేరిచి పొరెకుఁగొనియాడితగినచాడ్పుననతనిన్॥ 100

వ॥ సందర్శించి సంతోషవాక్యంబు లాడుచుండిన నతఁడు వారినెల్ల నా
లింగనము సేసి తాఁబోయివచ్చినవృత్తాంతము దెలుపుచు నందఱం
గలసి బాహులేయు గేహంబునొచ్చి దేవసేవ్యుఁడగు సుబ్రహ్మణ్యుం
గాంచి సాష్టాంగములొనర్చి యగణితస్తోత్రములనలరించి లలాటన్యస్త
హస్తుఁడయి భయభక్తి వినయసంభ్రమంబులుదోప నిలిచి తదీయాను
మతింగైకొని యిట్లనియె॥ 101

—♦ వీరబాహుఁడు కూరవల్లిప్రాయము షణ్ముఖునితో జెప్పుట. ♦—

మ॥ అవధానుదేవ మీరానతిచ్చినమాడ్కి నఖిలంబునాతోడ వాలకించి
దనుజేంద్రుఁడడిలెక్కగొనక క్రోధంబూనివినుతిశిక్ష సేయఁగొందఱను దైత్య
పతులనంచిన భవ త్పరమకారుణ్యాతిశయమున వారలసంహరించి
చనుదెంచినాఁడ మీసన్నిధికనవిని తారకాసురవైరి వీరుఁజూచి

తే॥ వత్స నాయాజ్ఞఁ బాలింప బహుప్రయాస
పడితివని యూరడించి వాక్పతి మొదలుగ
దేవజాలముగనుఁగొని ధీరమతిని
బార్వతీనందనుఁడు దేటపడఁగననియె॥ 102

తే॥ శూరపద్ముఁడు దుర్మదుఁడై రవంత
యేని నాయాజ్ఞ సేయక యీసు బెంచె
నింక మోమోటముడిగి నిశ్శంక వానిఁ
దునిమి వైచెద మీరెల్లఁగనుచునుండ॥ 103

మ॥ అనిబోధింపఁగ నాలకించి సురలత్యానందముంబొందిరో
మునులారా! మణిసూతి రాక్షసులనిర్మూలంబు గావించుటల్
వినినాఁ డేకద యింకనవ్వలికథల్ విన్పింతునాద్యంతముల్
ఘనభక్తిన్ వినుఁడంచు సూతుఁడనియెన్ గంగాతరంగార్భటిన్॥ 104

ఆ॥ శూరపద్ముఁడంత సుతుచావు వేగరుల్ దెలుప నెఱిఁగి దుఃఖకలితుఁడగుచు
నుండువేళ నతని యువతిలలామంబు బద్మకోమల కడుఁ బలవరించి॥ 105

క॥ దనుజాంగన లత్యంతము దనవెంటను నలఁతనొంది తడబాటునరాఁ
గనుదోయినశ్రులొలుకఁగఁ జనుదెంచిహృదీశుఁ జేరిచకితాత్మకయై॥ 106

వ॥ పెల్లుచింతించుచున్నంగని ధర్మగోపుఁడనుమంత్రి శూరపద్మునకు సవిన
యంబుగా నిట్లనియె॥ 107

—◆ వజ్రబాహుని మరణమునకు వగచు శూరుని ధర్మగోపుఁడను మంత్రియూరార్చుట. ◆—

సీ॥ అసురేంద్ర ధైర్యమహైశ్వర్యగాంభీర్య శౌర్యవివేకాది సద్గుణముల
గడుఁ దేజరిలి సర్వకాల సర్వావస్థలను సర్వతంత్రంబు లనునెఱింగి
వర్తించుమీరిట్లు వగచుచుండిన నింద్రుఁడాది గీర్వాణులు నపహసింత్ర
వజ్రబాహుఁడు శౌర్యవారాశియయ్యునయాయుఃప్రమాణమత్యల్పమగుట

తే॥ దూతచేఁజచ్చె నిందుకై దుఃఖమేల
ననుచుబోధింపఁదెలివొంది యంతికమున

గలుగువారలఁజూచి యాఖలుఁడు గళఁడొ
చనెనొ విన్పింపుఁడన వారు చనియెననిరి॥ 108

ఉ॥ అత్తఱిఁ బద్మజుం బిలువనంచినఁ జారులువోయి వేలుపుల్
మొత మ్ములోన నాలుమొగముల్గల దేవరయొద్దనుండు నా
పుత్రుడిబోజ్జవానిఁగని పోదమురమ్మనసోరురాక వా
రుత్తలపాటుతోమరలి యున్నటులాడిరి శూరపద్మతోన్॥ 109

తే॥ అలనుడుల్విని మదికోపమంది దాని
నడఁచికొని యన్నికమెలఁగర్బాంగమెంచు
నిలుచు బ్రహ్మనురావించి నిజపురంబు
మునుపటట్లుల సేయించి పనిచెనతని॥ 110

ఉ॥ అంతట నన్యదేశవిషయంబులుఁ జూడఁగఁబోవు వేగరుల్
సంతసమేదివచ్చి సురశాత్రవవల్లభుఁగాంచి మ్రొక్కి బో
ధింతుము మేముబోయిచనుదెంచినవార్తలు చిత్తగింపు నీ
స్వాంతములోనటంచు మృదువాగ్రచనన్ వచియించిరిక్రియన్॥ 111

—• చారులు శూరపద్మునకుఁగుమారురణోత్సాహము దెల్పుట. •—

క॥ శ్రీసంధినగరమందున వాసరవరివృఢ సహస్రవరతేజుండై
భాసిల్లుచున్న హైమవతీసూనునిఁగంటిమయ్య దితితనయాఢ్యా॥ 112

వ॥ భూతపటలంబు ద్విసహస్రవాహినులును సేనానేత లష్టోత్తరశతంబును నవాధికలక్షవీరులును దన్నుబలసికొలువ భీషణాకారంబున నమ్మహాను భావుండు॥ 113

క॥ తారకునిజంపి శతధృతి వారిజనాభుండు దేవవరుఁడాది మరు
ద్వారములు గొలిచిరాఁ దత్ప్రేరితుఁడయి వీరునమప బింకంబుమెయిన్॥

తే॥ అతఁడు యాళీముఖాది దేవాహితులను
మరణమొందించి నగరంబు మహివిగల్చి
పోయి నీమతమెఱిఁగింప బుద్ధిఁగనలి

115

క॥ వనమాలి బ్రహ్మజిష్ణులఁ గనుఁగొని కూరునకునాకుఁ గదనము రేపే
యనృతముగాదు నిజంబని యనికిఁ సన్నద్ధుఁడయ్యె నని తెల్పుటయుఁ॥

ఉ॥ తమ్ముఁడు సింహవక్త్రునిఁ బ్రధానుల మిత్రుల సైన్యనాథులన్
నెమ్మినిఁ గార్యభారమును నిర్వహణంబొనరించువారి నీ
ప్రమ్మున కూరపద్ముఁడు సభాస్థలికిం బిలిపించి వాడు వా
క్యమ్ము బరాకులేక వినుఁడందఱు నేఁడనిపల్కె వారితోన్॥ 117

మ॥ హరియుం బ్రహ్మయు నింద్రుఁడాదియగు దివ్యశ్రేణిచింతించి శం
కరునిం జేరి మహాత్మ కూరుఁడనురకుస్వామి క్రూరాత్ముఁడై
సురలన్ మౌనులఁ బెక్కుదుర్వ్యథలచే స్రుక్కించుచున్నాఁడు దు
ర్ధరుఁడై మేరఁదొలంగి యెందునువిహారంబుల్ ఘటించున్ శివా॥ 118

—♦ కూరపద్ముఁడు మంత్రాలోచనము సేయుట. ♦—

ఉ॥ ఇత్తఱిమాకుఁ దారకుఁడవీవగుటన్ ఖఱియించినారమో
చిత్తజవైరి యన్న విని చెచ్చెరఁ బుత్రు పరాక్రమాఢ్యు ను
త్పత్తినిజేసి నిర్జరులబాధలుమాన్పఁగఁబుచ్చె నాతఁడుం
బుత్తడివల్లివాని సురపుంగవు వాగ్విభు సర్వదివ్యులన్॥ 119

తే॥ కలిపికొనివచ్చి నాతోడఁ గలను సేయఁ
దలఁచి శ్రీసంధిపురమున నిలిచెనంట
మున్ను నాతమ్ము దారకు మన్నిగొనిన
సమయమున వానిఁజంప యోచనము జేసి॥ 120

శా॥ బాలున్ దొడ్డుగ నెంచి ప్రాణములఁ బాపన్ నిందగావింత్రు న
న్నీలోకుల్ తగదంచు మానితిసుడీ యీవేళలో మీరు మీ
రాలోచించి వచించుడీ తెలియఁగా నంచాడినన్ వారిలోఁ
గేలున్ మోడ్చి మయూరమంత్రి యనియోన్ గీర్వాణవైరీంద్రుతోన్॥ 121

చ॥ భుజబలశాలి దారకుని పొంగడఁగించిన నప్పదాయుధ
ధ్వజుఁ బసివాఁడనంజనునె వజ్రభుజుం దలద్రుంచు నమ్మహా

భుజుఁ దగవౌనెచూతయన బుద్ధిని మీరలెఱుంగనట్టివేఁ
ద్రిజగములందులేవుగద దేవరవారికిఁ దెల్పువాఁడనే॥ 122

చ॥ అయిననుఁదెల్పువాఁడ వినుఁ డాజిని శత్రులసంహరించి ది
గ్జయమునుబొందుటే ప్రథమకార్యమునుమ్మని మిన్నకుండఁగాఁ
బ్రియమున దుర్గుణుండనెడు బ్రెగ్గడపల్కెను ఘాతసైన్యసం
యమును జాలునింగెడపు సైన్యమునంపినఁజాలునంచునుఁ॥ 123

—♦ శూరపద్మునితో మంత్రిబాంధవులు వచించిన కార్యంబులుగ్గడించుట. ♦—

చ॥ మఱియును ధర్మగోపుఁడు మంత్రి పదానమట్టితేర ని
త్తఱినశివక్త్రినామక సుఘాశనశాత్రిప్రనో హిరణ్యుఁ
తఱలఁగఁజేయఁజాలరొకొ తారకుడర్భకుఁడౌట మాఱుము
ల్కొఱుఁగకకూలెఁ గుంభజునహీనపుదిట్టునఁ గాంచుఁడీకిగెఁ॥ 124

తే॥ వజ్రబాహుండు రథచాపవర్జుఁడయి చూతచేఁదిజగాక యాలేతఁవాని
కింతయేటికి మనవాహినీశ్వరులను బనుప వారుందఱబట్టి తునిమిరారె॥

క॥ అనిపలుకఁ గాలచిత్తుఁడనుజుండు బరాక్రమమున దైత్యేంద్ర ననుం
బనిచిన జయంబుగైకొని చమదెంతుననంగ నవల పండుండనియెఁ॥ 126

క॥ అనతియివ్వండిప్పుడ నేనేగి వరూథినులను నిర్జించి గుహుఁ
బూనికను బట్టితెచ్చెద నా ననలుండట్లుపలికె నందఱువినఁగాఁ॥ 127

తే॥ సింహుఁడనువాఁడు బలికెను శిశువనొంప
యోచనమిదేల నన్నంప యుద్ధమునను
నన్యబ్రహ్మాండములనున్న యమరులలని
బ్రక్కఁజేరిన నిర్జించిపట్టితెత్తు॥ 128

వ॥ అనునవసరంబున నతనిమంత్రులును ధ్వజినీపతులు నవ్వాక్యంబులే
యుపన్యసింప వాలకించి దుర్వారబలవీర్యుఁడను భానుకోపుఁడు నిజజన
కుఁడయిన శూరపద్ము నవలోకించి యిట్లనియె॥ 129

ఉ॥ క్రౌంచుఁడు దారకుండరుగుకాలమునఁ నను వారివెంటనం

వించి తొలంగుదూతను వివేకమెఱుంగనిజాలు వాజిలోఁ
ద్రెంచక ప్రాణయుక్తముగఁదెచ్చెద వారలునాకులెక్కయే॥ 130

క॥ సెలవిచ్చితేని ప్రజ్ఞాకలితుఁడనై నీదుసమ్ముఖమునకుఁదెత్తున్
బొలదిండిఁజేడఁయున విని పలికె హిరణ్యాంఁడు శూరపద్మునితోడన్॥ 131

సీ॥ చిత్తగింపుముత.ద్రి చిన్నవిన్నపమొుఁడు నధికబలాటోపుఁడైన శూర
పద్మరాత్రించరకర్త యాహవమున నొక్కకుజ్జునిఁజంప యోచనంబు
సల్పుచున్నాఁడిసి నిన్నులాడుచునుండు దీపనికై భానుకోపుఁడరుగఁ
గొంచపుఁడిసికిసె గొపు వాఁడేగుట యపకీర్తియగునాదె రిపులలోన

తే॥ నన్నుబనిచిన వానిసెసలనుద్రుంచి
పట్టి నీయొద్దకిపుడె డింభకునిఁదెత్తు
ననినవిని యగ్నిముఖుఁడను తనయుఁ డఖల
దైత్యులాలింప వాక్రుచ్చెఁ దండ్రితోడ॥ 132

క॥ స్వామీ బాలుఁడు దూతయు నేమాత్రము నన్నుబనుప బ్రతనలతోడన్
భూమిసిజడఁగూల్చక నీసామీప్యంబునకురాను సత్యముదేవా॥ 133

పంచచామరము.

రసాతలాధివాసులైన రాక్షసోత్కరంబులన్
వెంజుఱుంచినట్టి బాహువీర్యశాలినౌట మా
నసంబులో నెఱుంగరే ఘృణామతీ విరించనుం
డొసంగు వర్మ తూణ కార్ముకోగ్ర సాధనంబులున్॥ 134

క॥ నాయందుఁ గలవుగావున జేయుముపయనంబు నన్ను జీవ్వకుఁజనఁగా
నోయయ్యయనుఁడునితరులు వాయోజనుబలుకుచుండునవసరమందున్॥

క॥ సకలార్థసార విజ్ఞాన కుశలుఁడగు సింహాముఖుఁడు నక్తంచరనా
యకునకుయథార్థవాక్కులబ్రకటంబుగఁజెప్పఁదొడఁగెథయభక్తులతోన్॥

—♦ సింహాముఖుఁడు శూరపద్మునకు నీతిని బోధించుట. ♦—

॥ సాక్షాత్పరబ్రహ్మణ్యుం డక్షయ్యుండగు కుమారు నర్భకుఁడనుచున్

సీ॥ ఏమహాదేవుని ప్రేమవర్ధిలి సార్వ
భౌముండవై తివో నీమనమున
నతఁడీతఁడని యెంచు మితనికాయమున బ్ర
హ్మాండముల్ బుట్టుచు మాయుచుండు
గాన నీఘను జాలుగా నెంచఁబోవక
దివిజసేవ్యుండని తెలిసికొనుము
సర్వేశ్వరుండిచ్చు సంపదల్ గుడిచి సు
ఖింపక సర్వనిలింపతతిని
తే॥ యధికబాధలనొందించి తడియొకాక శక్రసుతుమంచితివి చెఱసాలయందు
నిట్లుచేసిన నలుఁగకహితమునీకు జెప్ప భటునంప విని యట్లుసేయవయితి॥
వ॥ అదియునుఁగాక గర్వాతిరేకంబునఁ బెచ్చురేఁగి హెచ్చులు పలికితి
విదియంతయు ననిమిషులు వినిపింప నమ్మహాసేనుండు నిన్నుహింసించు
కొఱకు సంధినగరంబునకు వచ్చి చేరె శివుండు వరమునవిచ్చిన
యాయుష్యంబు నూటయెనిమిది మహాయుగంబులునిండె॥ 139
తే॥ శక్తియనుపేరునొందిన సాధనమునఁ జత్తువీవని ఫాలలోచనుఁడువలికె
నీకువరమిచ్చుతఱినల్లెనిన్నుఁడునుమశక్తిధరియించియే తెంచెషణ్ముఖుండు॥
ఉ॥ ఏరికినైన రాజతగిరీశుని వారియునెఱుంగశక్యమే
భూరివిపత్తులొందుతఱి బుద్ధిజడత్వమునొంది విస్మృతిం
గోరివిరుద్ధకార్యములఁ గూర్చుచునుందురుగాన నింతకుం
గారణమీవు నీయధికగర్వమెకాక దదన్యమున్నదే॥ 141
క॥ ఇఁకనైన జింతసేయక యకలంకుండయిన పర్వతాత్మజసుతు జెం
తకునేగి మ్రొక్కి దివ్యుల సకలులఁ జెఱవీడఁజేసి సౌఖ్యముగనుమా॥ 142

— • శూరపద్ముఁడు సింహావక్త్రునిదూతి పలుకుట. • —

మ॥ అనిసింహాస్యుఁడు వల్కు పల్కులకుఁ గోపాటోపుఁడై కన్నులం
దసజ్వాలలురాల దుర్మదముతో నంగంబునన్ జెమ్మటల్

జనియింపఁ రదనచ్ఛదంబుల్ద్రువం జండాట్టహాసంబుతో
ననియెం దమ్మునిఁజూచి శూరదనుజాధ్యక్షుం డహంకారుఁడై॥ 143

ఉ॥ లజ్జయొకింతలేకిటుల లగ్గని కొన్నిదురూక్తులిప్డు నా
పజ్జనుబల్కితొ యొఱుకఁజాసి జయంతుని వీడుమంచునుఁ
హాజ్జలనొత్తి బాలకునియానతినుండుమటంచు సేనలుఁ
ముజ్జగముల్ జయించు బలముంగలరంచు భయంబుగొల్పెదే॥ 144

వ॥ వెండియు శక్తియనునాయుధంబు మృతిహేతువనియు మహాయుగా
ష్టోత్తరశతంబాయువనియు నోరికొలంది కల్లలాడితి వింకనిలుపుమనిపలికి
శూరపద్ముండాగ్రహంబున మఱియునిట్లనియె॥ 145

సీ॥ అనుజా! యిపుడునీవు మునుపటివాఁడవుగావో భవత్పరాక్రమముసెడెనొ
మదివికలత్వంబుగదిరెనో పగవారిమాయయోబలమెందుమఱుఁగుపడెనొ
కానిచోనీవిట్లు కడుభయంపడిపల్క దొడగుదువే నాకుమృడుఁడొసంగు
బలువైన వరములే పగిదిసెఱింగితి పీవింక నిచ్చోటునీఁగిపొమ్ము

తే॥ యాలసింపకననిపల్క నాతఁడులికి నాదుబుద్ధులునితనికిఁ జేఁదుదోఁచెఁ
గానసభిమతమైనవాక్యములనాడికొలిచియుండెదననిమదిదలఁచియనియె॥

శా॥ రక్షోనాయక నన్నుబంపుము సముద్రంగంబులో భూతసై
న్యక్షోభంబొనరించి దూతముదముఁ నాశంబుగావించి శి
తక్షోణీధరపౌత్రుదఁాల్చి తమచెంతం జేరనేతెంతు నా
కక్షీణప్రహానానతిప్వుమనఁగా నానందమగ్నాత్ముఁడై॥ 147

క॥ శూరుండిట్లను నామనమారయుకొఅక్కట్టులంటి వద్దినిజంబౌ
కారణముగల్గువేళల బోరునకుంబోదు విపుడు బొమ్మిలుసేరఁ॥ 148

వ॥ అనిరక్షోబలంబులనెల్ల వారివారిమందిరంబులనుండ నియమించిశూరుండు
నిజనిశాంతమునకరిగి సుఖంబుండెనంత నవ్విభావరిగ్రమించి ప్రభాతం
బగుటయు॥ 149

తే॥ అచ్యుతాంబుజగర్భ శక్రాది సురవ
రులు నవాధికలక్షవీరులును భూత

సైన్యములు గొల్వ గొలువుండి షణ్ముఖుండు
వనియె రత్నతమాభవాగ్రణినిజూచి॥ 150

—♦ సుహుఁడు శూరపద్మునిమీఁద యుద్ధమునకు వెడలుట. ♦—

క॥ సంగరకార్యక్షమము శతాంగముగొని రమ్మటన్న దనుయకనతఁడా
సంగతి మారుతునకుఁ జెప్పంగ నతండుజ్వలత్ప్రభంబగు రథముఁ॥ 151

క॥ కొనివచ్చి యెదుటనిలిపినఁ గని సింహాసనముడిగ్గి స్కందుండా స్యం
దనమెక్కి కూరుచుండెను యనిమిషలోచనానేకకోరకాబ్జుండగుచుఁ॥ 152

చ॥ అపుడుజతుర్భుజుండు బతగాధిపు వజ్రిపిమాని ముఖ్యాసు
ర్లవను దుహాంసముఁ రథములఁధ్వజినీశులు దక్కసేన లి
ష్టపుహయరాజినిఁ దదనుశాస్త్రినెక్కియు రెండువేల భూ
తపటలమెక్కటంగదలె దైత్యకులాంతముసేయు కోరికఁ॥ 153

శా॥ అక్కాలంబున దేవదుందుభులుమ్రోయఁ భేరికాఘూర్ణత్కి
ధక్కారావము లంత్యకాలతటిసిద్ధానంబు మాయింపఁగా.
దిక్కుల్ పుష్పలువేల్పుజెట్లుగురియఁ భీమాట్టహాసధ్వనుల్
దిక్కుల్ వ్రీలెడునట్లు వీరభటులొందించఁ బయోత్సాహతఁ॥ 154

తే॥ గంధగజ జవవత్తురంగమ శతాంగ శౌర్యపూరిత వాహినీచరణధూళి
ధూళి గగనంబువ్యాపించి తోయరాశి పంకిలంబయి యొప్ప నిశ్శంకనడిచి॥

వ॥ సముద్రముదరియనరిగి భూతసైన్యంబును సేనానాయకులును ద్రొక్క
వడువ సప్తయోనిధిమధ్యభాగంబు పాంసుపరిపూర్ణంబయ్యె నిట్లు
సాగరోత్తరణంబుగావించి శిఖావలతురంగునిఁగూడి సేనలుత్తరదాప
రంబువరకు రత్నాకరకూలంబాని మెండుకొనియుండె నాసము
యంబున॥ 156

సీ॥ ఇందిరేశుఁడు శతానందుఁడు స్కందునిభావించి మ్రొక్కి యోదేవదేవ
భక్తకామిత ఫలప్రద మీరలుండుట కిప్పురి పాపభూయిష్ఠమగుట
యోగ్యంబుగాదుకావుననిందెవసియుంచిపగవారిమడియింపఁదగునటంచు

దెల్ప గుహుఁడు దేవశిల్పితోఁ బ్రోలిందు గావింపుమా యనఁగానతండు

—♦ కుమారుఁడు హేమకూట పట్టణమున వసించుట ♦—

తే॥ వివిధరత్నప్రభాకీర్ణ వీధి హర్మ్య వరణ గోపుర మంటప ద్వార వేశ్మ
బంధురంబగునట్లు కల్పనముఁ జేసి దానికిడె హేమకూటాభిధానమపుడు॥

క॥ ఇటు విశ్వకర్మ నిర్మితి ఘటియించినఁ బారితోషికములొసఁగి మరు
త్పటలంబుగలిసి డాసెను నిటలాంబకనందనుండు నిజమందిరముఁ॥ 158

వ॥ ఇవ్విధంబునడాసి భవనద్వారదేశంబున నరదంబుడిగి క్రమంబున కుంభుం
డును మేఘమాలియు శ్వేతశీర్షకరుండును గపాలియు సప్రశిద్ధుఁడును
జిత్రాంగుండును మొదలుగా నష్టోత్తరశతసంఖ్య సేనాపతుల నాహ్వా
నము సేసి తన్నిమిత్తము గల్పించియున్న నికేతనంబులు బ్రవేశించు
నట్లాజ్ఞాపించిన వారలట్లుగావించి యెలమింబొందిరంతటఁ బద్మనాభ
పద్మజాది దివౌక స్సంచయంబులు లక్షయుందొమ్మందగు వీరులును
నూటయెనమండ్రగు సేనానాయకులును ఋషిషట్కంబును సేవింప
వందిమాగధులత్యంతము వొగడ షాణ్మాతురుం డాత్మీయ గృహ
రాజంబుసొచ్చి మణిమయ సింహాసనోపరిభాగంబున నాసీనుండై
యుండెనప్పుడు॥ 159

—♦ నారదుఁడు కుమారుని కడకు వచ్చుట. ♦—

మ॥ ఒడలందుఁబసుమంబలంది ప్రణవంబూహించుచుఁ బావకో
ల్లడుగుంజంటను జేర్చి కెంజడలుజీరాడంగఁ గృష్ణాజినం
బిడిచంకఁ జపమాలద్రిప్పికొనుచుఁ హేదేవదేవానమో
మృడయంచుఁ జనుదెంచెనారదుఁడు బేర్మిఁ గూరునింగానగఁ॥ 160

ఆ॥ ఈతెఱఁగునవచ్చి యాతనిచే నర్చలందిపలికె మీకునార్యుఁడైన
భార్గవుండునాకు బహుకాలహితుఁడౌట వచ్చినాఁడ మేలుముచ్చటింప॥

మ॥ అసురాధీశ విశాఖుఁడాహవముసేయఁ వచ్చియున్నాఁడు నీ
యసమానప్రథ సార్థకంబుగనున ట్లాఖీలతంగదాఁకి ఘో

క॥ సమీకంబొనరింపు మేనువిజయార్థంబై తపంబుండెదరా
మసలంబోకు మటంచుఁదెల్పి క్రతుభుక్ష్మానీశ్వరుండేగినన్॥ 162

తే॥ శూరుఁడంతట నుత్తరద్వారసీమ నిలుచు ఘోరాతిఘోరుల వలన దనదు
సమ్ముఖము జేర నధిక వేగమ్ము మీఱ నంబురాశిని రాఁజేరియని యెఁగినుక॥

తే॥ భూత సేవలఁగూడి షాణ్మాతురుండు గడఁకని వ్వోటికై వచ్చు కాలమునను
నడ్డగింపక మార్గమిఁయంగ నీకుఁ దగునెయన వార్ధినుడివెను దిగులుసెంది॥

సీ॥ దనుజేంద్ర భర్గనందనుఁడు సర్వప్రాణి రక్షకుండయ్యు రూపేక్షణముల
ననుఁజూచి నీరంబులనునింక జేసి కాల్నడవాటిరాఁగ నేనుడుగఁ జేయ
నేరకోటమినొంది నిలిచియుండితిగాని తప్పెన్నఁటికిఁ జేయదయనుజూడు
మనిచెప్పుచున్న వేళను చారులరుదేర శూరుండు వారలఁజూచి యచటి

తే॥ వార్త లేకై వడినటంచు బ్రశ్న సేయ వినయభయభక్తి యుక్తుల విస్తరిల్లి
మనవి జేతుము మేమెఱింగినవిధంబు వినుమనుచు జెప్పసాగిరి విశదముగను॥

ఉ॥ భూతబలంబుతో నభవపుత్రకుఁ డత్యవలీల సింధువున్
వేతరియించి వీరుభుజవిక్రమమర్దితమైన లంక సం
ప్రీతినిజూచుచుం దనదువీడునకుత్తరభాగమందు వి
ఖ్యాతిగ నొక్కపత్తనముఁ గల్పనజేసి నిరంతరాయుఁడై॥ 166

—● శూరపద్మ ప్రేరితుండై భానుకోపుఁడు యుద్ధమునకు వెడలుట ●—

ఉ॥ వారిజసంభవా ద్యమరవర్గము గొల్వఁగఁ దత్పురంబునన్
ఘోరరణంబులోన నినుఁగూల్చుతలంపున నున్న వాఁడనన్
శూరుఁడు దుర్నివారపరుషుండయి యగ్రతనూభవున్ సమి
ద్వీరుని భానుకోపుఁ బిలిపింప నతండతిశీఘ్రయానుఁడై॥ 167

క॥ దనుజబలంబులుఁ గొలువఁగ జనకునిపాలికిని జేరఁజనుదెంచి గృహాం
గణమందు శతాంగముదిగి మునుకొని తత్సన్నిధానమున కతిభక్తిన్॥ 168

ఆ॥ పోయి మ్రొక్కి నిలువఁ బుత్రునిగని శూరుఁడెల్ల వార్తలతని కెఱుకపఱప
భానుకోపుఁడని రొఁబగతురనుగ్గాడి ప్రౌఢిమెఱపి జేను బాలుడెత్తు॥ 169

వ॥ అనిపలికిన పుత్రునిమాటలకు సంతసించి శీఘ్రంబునఁబోయి జయశాలి వయి రమ్మనిదీవించి వీడుకొలువ శూరపద్మునకు మ్రొక్కి యచ్చోటు వాసి తేరెక్కి కదలి యాత్మీయ భవనరాజంబునకేతెంచి శత్రువధసేయు నుత్సహించి యుద్ధసన్నద్ధుఁడై వజ్రమయమగు కవచంబుదొడిగి మూఁపునఁ దూణీరంబుదాల్చి హస్తంబున మండలాగ్రంబుపట్టి కడా నిడాలుజాలువారు పచ్చనివలువ నడుమునకుఁ జుట్టి మానికపుదొడవులు మేనంబెట్టి వీరపట్టాంచి తోత్తరీయంబు వయిచి ద్రోణకుసుమ మాల్యం బలంకరించి యగణిత సమ్మోహనాస్త్ర నికరంబులూని మణిబంధంబున గోధాచర్మంబుగట్టి మహోద్భుతకరంబగు నిస్త్రింశంబు గటితటంబునఁ గూర్చి జవసత్వ సహితాయుత త్రయ తురంగసంబద్ధ రథంబెక్కి యసంఖ్యాత భృత్యసందోహములు ఛత్రచామర వ్యజన వీటికాపేటికా పానోదకాది వస్తుజాతంబులు దాల్చి యనుగమింపఁ గృపాణఖేట గదాది సాధనంబులు ధరియించి యనేక దోషాటులు వెన్నంటిసేవించు చుండం బోవుచు॥ 170

సీ॥ విజయుఁడుముసలియు విజయసేనుఁడుశని
యుగ్రబాహుఁడు దుర్జయుఁడు మహిషుఁడు
శూన్యకేతుపిచండ శుచివక్త్రసోమకుల్
శశిజిన్మధూచ్ఛిష్ట శతముఖులును
గంటకుండనువాఁడు ఖరముఖుండును విష్ణు
సేనుండు మొదలుగా దానవులును
నొక్కకోటియునైన రక్కసిమూఁకలు
నరదముల్ లత హయములుబెక్కు

తే॥ గొలువ డిండిమమడ్డు మర్దళములాది
ధ్వనులు హయహేష లిభబృంహితములు జక్ర
ధణధణల్ కేతు పటపటాత్కారములు శ
తాంగవేష్ట్య నిశాచర ధ్వానములును॥ 171

ఆ॥ కలశి కల్పకాల జలదనిర్ఘోషము భంగినొప్ప సైన్యపాదధూత
పాంసుపటల ముగ్రభాను ప్రభలముంప వందినికరముల రవంబుచెలఁగ॥
ఆ॥ విలయసమయ దహనతులిత భటోద్ధత్య
మునను బుడమియద్రువ ముదముమీఱి
యహితదుర్నిరీక్ష్యుఁడై భానుకోపుండు
నిజపురంబునుండి నిర్గమించి॥ 173
క॥ ధృతివిక్రమ గాంభీర్య సహితుఁడయి భండనముసేయ నేగెడునపుడుఁ
సితమౌని యవ్విధంబును హితమతి శరజునకుఁదెలుప నేతెంచెవడిఁ॥174

— ♦ నారద మహర్షి మాన్యుల సంభాషణము. ♦ —

ఉ॥ నారదుఁడిట్లువచ్చి హరనందనుఁజేరి నమస్కరించి కై
వారముసేసి యార్యజనవంద్య చరాచరసారవేత్తలౌ
మీరు ముహూర్తమాత్రమును మిక్కిలిప్రేమ జరాకులేక నా
నేరని ప్రార్థనంబు వినిరింజొరనిందు దయాపయోనిధీ॥ 175
క॥ ఇచ్చోట మీరలిపుడు వియచ్చరతతిఁ గూడియుండు టాలించి మదం
బెచ్చి సముద్రుని మిమురానిచ్చుటకై దూఱి శోణితేతుఁడగుచుఁ॥
క॥ తనసుతుని భానుకోపుని బనిచెనుశూరుండు వీఁడు బాల్యంబున సూ
ర్యుని నిజడోలా మూలంబున నంటఁగఁగట్టె నేమిబోధింతునిఁకఁ॥177
మ॥ హరిచక్రంబు విరించిపద్మము శచీప్రాణేశువా ల్దక్కఁగా
వరుణోష్ణాంశుసుతాదులంగెలిచి తత్పాశాదులఁబల్మిమై
హరియించెఁ మును పిట్టిదుష్టుఁడగు నియ్యల్పుఁ శివాజ్ఞావిధిఁ
నిరపాయంబున గెల్తుగాకయను మౌనింగాంచి లేనవ్వునఁ॥ 178
చ॥ శరజుఁడుపల్కునిట్టుల గజంబుమృగేంద్రముపై మృగేంద్రముఁ
శరభముపైని ద్వీపిపయిజంబుకముఁ వెపనేగునట్లుగా
వరినసుడాసి గాసివడి యాలపునేలదొలంగి భీతిచేఁ
బరువిడకుండునే యనుచు బజ్జనునిల్పిన వీరుతోనముఁ॥ 179

వ॥ సోదరా! నీవు లక్షయుండొమ్మండ్రగు వీరులను వేనవేలు భూతసైన్యం బులనుగొని మున్నుగాఁబోయి॥ 180

క॥ ప్రాకార గోపురంబుల జీకాకుగ గెడపి దొమ్మిసేయుచు దనుజుఁ డీకొని జయింపు వీరో ద్రేకంబున ననుచు జెప్ప ధీరోద్ధతుఁడై॥ 181

వ॥ వీరబాహుండు రణోద్యోగియై మణిమయ కేయూరహార కుండల కటి సూత్రకిరీట కంకణాంగుళీయకాది సమస్తభూషణంబులుదాల్చి పాణి తలంబున గదనుబట్టిపార్శ్వంబుల నిషంగములుగట్టి ఘోరాకారుండయి॥

తే॥ హస్తమొకటి మహోద్దండమగు శరాస
మూనుట పినాకపాణియా యుగ్రుఁబోలి
కులిశ తోమర నిశితాసి కుంత ఖడ్గ
ముఖ్యనిశ్శేష సాధనంబులు ధరించి॥ 183

ఉ॥ మందర హేమకూటముల మాడ్కి సమున్నతమైన భీషణ
స్యందనమెక్కి భేరిమురజప్రముఖాఖిల వాద్యఘోషముల్
వందిజనస్తుతిధ్వనులు వారక నెల్లెడలందునిండఁ బూ
ర్ణేందు విభాసమంబయి రహించిన ఛత్రరుచుల్ వెలుంగఁగాఁ॥ 184

వ॥ చామరవ్యజన సంవీజ్యమానుండై ధ్వజపటాంచల చుంబితవిష్ణుపదుండై కదళీకాదుప్రమషండ మధ్యస్థితాచల ప్రకాశంబు విస్తరించి వెడలు నప్పుడు॥ 185

సీ॥ అవ్వార్త తెలిసి సైన్యాధీశులును భూతవిసరంబులు రథాది వివిధయాన ములనెక్కినడువఁజమూసమూహరథాశ్వపద్మపదోద్ధూతపాంసుచయము దన్మహోజ్జృంభిత ధ్వనులుమున్ముసన్నె ప్రస్థానసంరంభము శత్రువులకుఁ దెలుప సేనలువేగ మొలసియొకండొరుఁబట్టి నెట్టుచుఁబర్వుటాలుకొనుచుఁ

తే॥ బోయి నగరంబుచుట్టునుముట్టడింపనంతకునుమున్న శూరసుతాగ్రగణ్యు డెల్లవిని తంద్రిదొద్దకు తెల్లుచూలి బట్టితెచ్చెదనని ప్రగల్భములువలికి॥

—♦ భూతరక్షోబలంబుల సంకుల యుద్ధము. ♦—

శా॥ కోపాటోపముచే నిశాచరులనేకుల్ దన్ను సేవించుచుం
రా బ్రోల్విడినయంత భూతపృతనల్ రాకాసులీక్షించి లో
నేపాటిం గణనంబుసేయక నితాంతేర్ష్యం మహాగర్జన
వ్యాపారంబొనరింప దానివిని భూతానీకినుల్ క్రుద్ధులై॥ 187

చ॥ అరిభయదంబుగా మృగవరారవముం ఘటియించి దైత్యుల
న్నురువడిఁదాఁకినం దనుజులుద్ధతి శస్త్రమహాస్త్రపాళులం
గరకరిసేయ పాణిపదకాయశిరంబులు నక్కడక్కడం
బోరిపొరిఁదున్కలై పడఁగఁ బొందిరి మూర్ఛల భూతజాలముల్॥ 188

చ॥ అదిగని యందుఁగొందఱు మహాబలశాలులు భూతసైనికుల్
కదనములోన శాత్రవనికాయము మూర్కొని భీషణంబుగా
మదకలపంక్తి సారథుల మావులఁ దేరులతోడ దైత్యులం
మదమఱి ధారుణీస్థలిని మ్రగ్గఁజేయుచు నుగ్రమూర్తులై॥ 189

చ॥ అగణితయామినీచరుల నంతకుఁజేర్చుచునున్నఁ జూచి శౌ
ర్యగరిమ భానుకోపుపృతనాధిపుఁ డయ్యనలాసురుండు భీ
మగతిని సింహగర్జనము మాటికిమాటికి జేయుచుం సమి
జ్జగతిని శాత్రవాటవిని శాతశిముఖవహ్ని గాల్చుచుం॥ 190

తే॥ అమితభూతబలంబుల నాజిఁద్రుంప
భయముచే వాల్గుదిక్కులఁ బఱచిరపుడు
నధికబలవంతుఁడగు సింహుఁడనెడు భూత
నాయకుఁడు క్రోధఘూర్ణిత నయనుఁడగుచు॥ 191

సీ॥ చండదండము బాహుదండమునను దాల్చిదండిఁబోలుచు దైత్యబలము
హతముసేయుచుడాసియనలాసురస్యందనాశ్వపాళినిదండహతినిఁగూల్చి
వాఁడుగ్రదేహుఁడై నేఁడు వీనివధింప కుండితినేని కోదండమాజి
ధరియింపనని శపథములాడిశరవృష్టిముంపఁగాసింహుఁడ మ్ముఖులకును

తే॥ నభిముఖంబుగ నడుచుచు స్యందనంబు
పయికిలంఘించి వాని చాపంబునొడిసి
తీతినివైచిన ననలుండు సింహు వజ్ర
తనువునొప్పించెఁ దన దండతాడనమున॥ 192

ఉ॥ అప్పుడు సింహుఁడుగ్రుఁడయి యగ్గనుజోరము ముష్టిఘాతచే
గుప్పి చలంబుమించి యడుఁగుల్ వడిమీఱఁగఁబట్టి గిర్రరం
ద్రిప్పి ధరిత్రిమోదుటయు దేజముఁరూపఱి మూఱుతున్కలై
యప్పిశితాశి మన్నిగొనుటారసి చండసమాఖ్య దైత్యుఁడున్॥ 193

వ॥ విజృంభించి రణోన్ముఖుండయి విశిఖవిసరంబులు ధారాధరం బంబుధారలఁ గప్పువడువున సింహుపయిం బఱపిన నతండన్నింటినిం దప్పించుకొని యాలంబునఁద్రెళ్లిన యనలునిదండం బత్యద్భుతంబుగాఁగొని చండాసురు మూర్ధంబవియ నడచెనప్పుడు॥ 194

మ॥ ఉరువేగంబున నప్పలాశనుఁడు సింహున్ మోదె దండంబుచే
పరినయ్యిద్దఱు మూర్ఛబాల్పడి రణక్ష్మాభాగమందుంబడన్
స్థిరశౌర్యుండు మయుండు లాదితిసుతశ్రేష్ఠుండు ఘూతోత్కరే
శ్వరుఁడౌ నీలునిగాంచి మాఱుకొని దోశ్శక్తిం గడుంబోరుచోన్॥ 195

క॥ నీలుండు బెల్లుకినుకం గ్రాలుచు మయు గదనుమోద రణరంగమునన్
సోలి మఱిదెలిసి రయమునశూలముగొనినీలుమేనుసొరగ్రుచ్చుటయున్॥

తే॥ కనలినీలుఁ డరాతివక్షంబు హస్త
మునననడంచియు దనకరంబులను వాని
కరములను గట్టిగా వెనుకకునుదిగిచి
పట్టి మానుపరాని కోపమ్ముగదిరి॥ 197

సీ॥ కఠినదంతంబులు గళసీమగీలించి
తద్గళస్రావ రక్తంబుబీల్చ
పడిమూలియద్దైత్యుఁడెడలిప్రాణంబులు

బుడమి పైఁ బ్రాలె నయ్యేడను దొల్లి
మూర్ఛిల్లియున్న సింహుఁడు జండుఁడును దేఁటి
చలము నెక్కొన దండములను బూని

— సింహుఁడను భూతపతి చండాసురునిఁ జంపుట. —

వెగ్గలంబుగఁ బోరువేళ వారన్యోన్య
దండఘాతలు నిజదండములను
తే॥ మాన్పుకొనుచు నాలీఢాది మానములను
నొక్కచో లక్ష్యముంచి వేఱొక్కచోట
వ్రేయు చాత్మ బరస్పరోపాయములను
దెలిసిపోరిరి పెక్కురీతులఁ గడంగి॥ 198

వ॥ అట్టిసమయంబున సింహనామకభూతపతి తనదండాయుధం బహిత వ్యూహ విభ్రమంబుగాఁ ద్రిప్పి చండునిదండంబు ఖండింప వాఁడు దీర్ఘ క్రోధుండయి క్షీణాయుధుండయ్యు నీడంబోక భీమంబుగా భూతపతిం దలపడి భుజాదండమునఁ బ్రహరింప సింహుండురువడించి దోస్సారంబున దండహతి దనుజుదక్షిణహస్తంబు నఱకిన భయంకరుండై భూమిఁబడి యున్న కరంబును వామపాణినిబట్టి దానన సింహునిలక్షించి యేయు చండుని యఖండధైర్యంబునకు వెఱఁగుపడి తెఱఁగంటు లుచ్చైర్నాదం బులతో సింహునుద్దేశించి॥ 199

శా॥ స్వర్వైరిద్విపసింహ సింహ ధర నీచండుండు దోర్విక్రమా
ఖర్వుండౌ సుమి వీనినోర్వక వెసం గాలుంగనంబంపుచే
సర్వోత్కృష్టమటన్న వాతఁడిభరాజంబుఁ మృగేంద్రక్రియఁ
బూర్వామర్త్యుని ద్రెంపవ్రేయుడు శిరంబుఁ బ్రీతి యాచింబడేఁ॥ 200

ఆ॥ అట్టితఱిని శమనుఁ డనిపినదూతలు వానియొద్దనిలువ వడఁకునొంది
దవ్వుదొలఁగియున్న దర్శించి సింహుండు నపహరింపుఁడితనియసువులనిన॥

వ॥ దూతలు భయంబువాసి వానిండాసి తత్ప్రాణంబులు బాసి చనఁజేసి చన సమీపవాసియగు నజముఖాసురుం డదియంతయు జూచి దుఃఖ కోపంబులు సందడింప సంగ్రామాపేక్ష వివిధాయుధ ధారియయి కల్పాంతసమయ జలధరప్రతిమాన సింహనాదుండై తారసించెనప్పుడు॥

అజముఖాసుర మధుఘాతనాయకుల యుద్ధము.

చ॥ మధుఁడనుఘాతనాయకుఁడు మానవభక్షుఁడుఁదాఁకినన్ మహా
క్రుధ నతఁడుగ్రబాణము లకుంఠత నేయఁగ లెక్కసేయక
మ్మధుఁడు వటద్రుమంబొకటి మచ్చరమూని యజాస్యుదేరిపైఁ
బ్రధుబల శౌర్యధైర్యముల పెంపుగనంబడ నేసియార్చినన్॥ 203

శా॥ ఆవాదంబువిని క్షుపాచరుఁడు ధైర్యంబేది భీతిన్ రణ
క్షోణిన్ ద్రుక్కివడంకుచున్ శవములాగున్ భూమిపైనుండఁగా
దానీక్షించి మధుండు జంకువిడుమాత్రన్ నీవసిల్లైనవో
నేనాజిన్ నినుఁదాఁకఁ బొమ్మనిన మోమెత్తంగ లేకాతఁడున్॥ 204

సీ॥ రణమువీడ్కొని శిబిరము జేరి తేజొక్కని ధృతిబెంచియాహవక్షితిఁదొలంగి
వచ్చి యపక్యాతిదెచ్చితి నీకిని నేనుజీవించిన హితులహితులు
మతిహీనుఁడందురు మరణముచొచ్చుటనే కాంచుటమేలని కదనమునకుఁ
బోయి మధుండను ఘాతవల్లభు శౌర్యసారుఁడై కదిసి యవారశస్త్ర
తే॥ సముదయంబుల మూఁకనుజదిపి యార్చ
నాయుధవిహీనుఁడయ్యును నమ్మధుండు
బాధనొందక యజముఖాశ్వములతోడ
రథముగిరగిరఁద్రిప్పి సంద్రమునవైచె॥ 205

ఉ॥ వైచిన మేషవక్త్రుఁడు నపాంపతిలోఁ బడి లేచి విక్రమం
బేచి రణేచ్ఛవచ్చి మధునీక్షణచేసి యురంబుముష్టిచేఁ
దాఁచిన నీడఁబోవక యతండు రిపున్ పరిఘోపమానమై
తోఁచు స్వకీయహస్తమున దూల్చె మహిన్ గిరినింద్రుపోలికన్॥ 206

ఆ॥ అంత మరలలేచి యసురుండుఁ దనుదాఁక
మధుఁడు వానినెదిరి మహితశక్తి
సహితుఁడగుచు బాహుసంగ్రామ మొనరించు
చీసువెంచి వారలిర్వురవల॥ 207

వ॥ కచాకచి బాహాబాహి ప్రముఖ సంగరవిశేషంబులఁ బెనంగుచు ధర
వ్రాలి విలాసముగా మల్లయుద్ధంబున నల్లిబిల్లిగాఁ బొరలాడుచు
లేచుచుఁ గేలంగేలును దగిల్చి విస్మయంబుగాఁ బోరుచున్న యెడ॥208

సీ॥ నేలవ్రాలిమధుండు గాలుసేయాడించ కోడినగతిఁ బడియుండఁజూచి
నక్తంచరుఁడు వంచనంబనియెంచక వధియింపదగ్గఱ మధుఁడుదెలిసి
యుప్పరవీధికిఁ గుప్పించి వాని యుద్ధాడంబరము మానునట్లుఁగాఁగఁ
దన్నిన మఱిలేచి క్రన్ననసేతేర హుమ్మని బొమ్మునఁ గ్రుమ్మటయును

తే॥ దనువుసెడివాఁడు శాంబరీతనువుఁదాల్చి
వైష్ణవంబగు చక్రంబువైవ నదియు
వచ్చి మధుఁడు నిరాయుధపాణియగుటఁ
దొలఁగిచని వేగ నజముఖు తలనుద్రుంచె॥ 209

క॥ దానింజూచి నిశాచర సేనాపతులెల్లఁ గలఁకజెంది నితాంత
ధ్వానము లొనర్చుచును భూతానీకినిజుట్టి బెట్టిదముగా నపుడున్॥ 210

—♦ దండకుఁడను భూతపతి రక్షోబలంబుల నుఱుమాడుట ♦—

క॥ తోయదముల చందంబున సాయకవృష్టిని నిగుడ్చఁ జకితాశయులై
యాయెడ భూతబలంబులు బాయకదండకునిమఱుఁగుబాఁటిరివెఱతోన్॥

తే॥ గోగణంబుల గోపాలకుండదల్చు పగిది దండకుఁడను భూతపతి నిశాట
వరులనందఱనదలించిగురుతరాస్త్రసంచయంబులనేసినొప్పించుటయును॥

క॥ దితిజబలంబులు సేనాపతులు బృథగ్విధమహాస్త్ర పటలముచేతన్
ధృతిఁబోరుచు నాదండకు నతులితతేజిత శిలీముఖాహతి వశతన్॥ 213

సీ॥ తునిఁగినభుజములు ద్రుంగుపాదంబులు
ఖండఖండములైన కవచములును

బోడియైన మణిబంధములు ఖండితములైన
హస్తముల్ శకలంబు లగునొడళ్లు
శీర్ణంబులగు శ్రుతుల్ చూర్ణమౌనంసంబు
లిలఁగూలునాసలు గలిఁగి యందు
నిలువఁజాలక భీతి నలుగెలంకులఁబాఱు
వారునుఁ బ్రాణముల్ వాసి నేలఁ
తే॥ బడెడువారును మృతులైన పగిది నొఱఁగి
కనులుమూయుచు వాయుధారణము సేయు
వారు భ్రమనొంది హాహారవంబు సేయు
వారునై కుందు వాహినీవరులఁగాంచి॥ 214

చ॥ కనులరుణచ్ఛవిం దనరఁగా రవికోపుఁడు క్రోధమూర్తియై
యనలునియట్లు దేజరిలి హస్తమునన్ విలుబూని దంతఘ
ర్షణమొనరించుచున్ మిగుల సన్నముదిప్పనియంచు నేనుపే
తునునికి రెండువేల దనుజప్రభులీల్గిరి ఖండనంబులోన్॥ 215

క॥ ఏనింక శత్రుబలముల సేనానులఁబట్టి నుఱుము సేయకయున్నన్
దానవమూర్ధన్యునకున్ సూనుఁడనేయనుచుఁబలికి సూతునితోడన్॥ 216

వ॥ పటురయంబునఁ దేరువోవనిమ్మనుటయు నతండట్లచేసె నంత నబ్భాను
కోపుండు ప్రళయకాలభైరవుంబోలి ధనుర్ధరుండై సంవర్త జలధరస్తని
తాతిక్రమణ శింజినీరావ కలితుఁడగుచు భూతబలంబులఁదాఁకి నిదాఘ
తోయదంబువై ఖరిఁ దూపుజడి గురియించిన॥ 217

— భానుకోపుఁడు దండకునితోఁ బోరుట. —

ఉ॥ భూతబలంబు లద్దనుజపుంగవుమీఁద ననేక మేదినీ
జాతము లద్రులున్ శిలలు శస్త్రములుం బఱగింప నాతఁడున్
హేతులుగోటిచే నవి లయింపఁగనేసియు వింట బాణసం
ఘాతము గూర్చుటేయుట లోకళ్లకుదోఁచకయుండు నట్లుగాన్॥ 218

మ॥ శతలక్షప్రదరంబులేయ నవి ఘస్రస్వామిఘృష్టుల్ హిమ
ప్రతతిన్ బోలుచు భూతపంక్తి కరముల్ పాదాదికాద్యంగముల్
హతిసేసెన్ మఱిజృంభితుండయి యగణ్యాజిహ్మాగంబుల్ సము
ద్ధతుఁడై వైవఁగ భిన్నగాత్రులయి భూతశ్రేణులత్యార్తిమై॥ 219

వ॥ తనుస్రావ శోణితధారా లహరిందేలువారును బంచత్రాపించి సమిద్ధరణి దూలువారును గాయములబుట్టు నాయాసమున విస్మృతింగని సోలువారును బలవీర్యధైర్యంబులు మెఱసి గతాసులగునంతకు బెనంగి కూలువారును బ్రాణేచ్ఛచేఁ బరాఙ్ముఖులై నలుగెలంకుల కుఱుకువారునునై కోలాహలంబులు మినుముట్టఁ బరువిడెడు దనసైన్యముల జూచి యుగ్రనామక భూతవల్లభుండు నిజభుజాదండమునం దమర్చు దండమునుద్రిప్పుచు సింహనాదంబడరించుచుసమ్ముఖమ్మున కేతేరఁ గనుంగొని భానుకోపుం డత్యంత రోషుండయి యప్పుడు॥ 220

ఆ॥ కోటికోటి బాణకోటులాతనిమేను నాటనేయ నుగ్రనాముకుండు
శూరునగ్రసుతుని క్రూరభల్లముల నుదగ్రభంగి నఱకె దండహతిని॥221

ఉ॥ అప్పుడు శూరసూతి దురహంకృతి భీకరదండ ముగ్రుపైఁ
దెప్పున నేయఁగాఁ దనదు తేజితదండముచేత నాతఁడుం
దప్పకదానిద్రుంచి యలదైత్యు నియంతృ రథాశ్వజీవముల్
తప్పిచనంగఁజేయుడు నుదగ్రబలుండగు భానుకోపుఁడున్॥ 222

శా॥ వేఱొస్యందనమెక్కి వాఁడిములకుల్ పెక్కేసి రౌద్రంబు బెం
పాఱన్ భూతవరేణ్యుదండమును సంహారంబుగావించి వే
నూఱుల్ తీక్ష్ణశరంబులంబఱపి మేనున్నెత్తుటన్ముంచినం
దాఱంపిల్లుచు నుగ్రుఁడన్నిఁటిని జెండాడెన్ మహోద్దండుఁడై॥ 223

ఆ॥ దనుజుఁ డధికవేగముననేక కలంబములను బఱపవెఱపుఁదొలఁగఁద్రోచి
ఘననదీ ప్రవాహమున కెదురేగెడు జేపపగిదినేగి జృంభణమున॥ 224

క॥ దుర్భరుఁడగు శూరాసురు నర్భకు నరదంబువట్టి హస్తంబులచే
స్వర్భువనమంట మింటికి నిర్భయముగఁద్రిప్పివైచె నిమిషములోనన్॥225

—◆ ఉగ్రభానుకోపుల యుద్ధము. ◆—

చ॥ అదిగని చండరశ్మి యకటా! యిసుమంతయుగాని నేరముం
 వెదకినలేదు నాయెడల వీఁడిటు గ్రూరత నింతదన్నె యె
 య్యెదితలపోసి వచ్చెనొకొ యిప్పుడటంచును గుందుచుండఁగా
 విదితబలాఢ్యుఁ డయ్యసురవీరుఁడు నైజ రథంబుతోడుతన్॥ 226

ఆ॥ సూర్యమండలంబు చుట్టునుభ్రమియించి ధరణిమీఁదఁబడిన దద్రథంబు
 భగ్నమయిన మాన కగ్నిభట్టారకు కరణి నుల్లమందు గనలుమించి॥227

వ॥ భానుకోపుండు జతురాననదత్తంబగు శక్తి నుగ్రుమీఁద వైవ నతండు
 సొమ్మసిల్లె నదియంతయుజూచి దండియనుభూతపతి దురాగ్రహాకలి
 తుండై కడంగి మహోగ్రగాత్రంబు నసురునిపై నేయ నాతఁడగ్గిరి
 నుగ్గొనరింప నభ్భూతపతి తత్పూతుఁ దునుమ నంతలో భూతపతు లనేకు
 లొక్కుమ్మడి దలపడి రక్కసుతో నుక్కునఁ బెనంగు నక్కాలంబున
 గుపితుండయి వాఁడు నిఖిలారిధ్వంస చణంబగు నారాయణాస్త్రంబు
 వీరసింహ నామకునిపైఁ బ్రయోగింప నతండు గండుమీఱి ప్రత్యాయు
 ధం బూహించుకాలంబున సముద్రేకంబున విలయానల భయంకరంబై
 చనుదెంచి తద్వక్షుంబుదూఱిన నిశ్చేష్టితుఁడై యతండు ధరణింబడియె
 నయ్యవసరంబున వీరాంతక వీరమాహేంద్ర వీరవీర వీరపురందర వీర
 మాహేశ్వరులను వారలేవురు వీరబాహు సోదరులు విజృంభించి
 నిలిచి॥ 228

సీ॥ కోదండపాణులై ఘోరరావంబుల ఘనపంక్తి గేరుచు•గఠినమయిన
 నారసంబులఁ దోయధారలకై వడి ముంచుచు రాకాసిమొత్తములను
 దత్సైన్యపతులను దఱుముచు వైరులఁ బ్రోవులనిడి శూరపుత్రుడాయ
 వాఁడు మణీమయ స్వర్ణరథంబెక్కి పలుతూపులెంతేని బఱపుటయును
తే॥ మున్ను నేను నేనుమున్నంచు వీరులు
 నాగ్రహమునఁ దేజితాస్త్రపటలి

నేయుచును సురారి యేయు సాయకములు
దుమురుగాఁగ నాజి ద్రుంచుటయ్యును॥ 229

— వీరాంతకాది వీరపంచకము భానుకోపునితో బెనంగుట. —

క॥ బోరున దనుజాధీశ కుమారుని శరపంక్తి రక్తమయ గాత్రునిఁగా
ధీరతను జేయ వాఁడుఁ వీరో ద్రేకంబుమించి విశిఖాహతిచేఁ॥ 230

చ॥ ఇరువురఁ గయ్యముందొలఁగ నేసియు నొక్కనిమూర్ఛముంచియుఁ
విరథులుగాఁగ నిద్దఱను వేయుఁడు బూర్వసుపర్వులెల్లరుఁ
బరమముదంబునంబొదలి బాణశరాసనఖడ్గఖేటముల్
కరములదాల్చి యార్చుచు మగంటిమి నృత్యముసల్పుచున్నెడఁ 231

శా॥ దానిం గన్గొని వీరబాహుఁడు గుభృద్ధైర్యుండునై యాత్మలో
సేనానిఁ శ్రుతిసూక్తిమ్రొక్కులిడుచుఁ జేవింటిసిం దాల్చి ఘో
రానీకంబొనరింప స్యందనముపై నారోహముంజేసి గ
ర్జానాదం బొనరించుచుఁ వెడలె శౌర్యంబెల్లరుఁ మెచ్చఁగఁ॥ 232

వ॥ ఇట్లువెడలి॥ 233

ఆ॥ నాగభూషణుఁడు బినాకంబువట్టిన యట్లు ననుపమానమైన యొండు
ధనువుభాహుదండమునఁదాల్చిఫణిభీమమైనయల్లియ మొరయంగఁజేయ॥

వ॥ అగ్గంభీరస్వనంబునఁ దమ్మిచూలి యలుకొంద నజాండవివరపూర్తితమై
సుబ్రహ్మణ్యు కారుణ్య సముత్పన్నంబగు శబ్దబ్రహ్మమో సంవర్త
సమయ వేలావినిర్గత సాగరావిచ్ఛిన్న ప్రాంశువీచీ స్వనంబోయని
జనములుగ్గడింప నొప్పియుండె మఱియును దన్నినాదంబాకర్ణించి॥235

మ॥ మృగముల్ వ్యాఘ్రరవంబటంచు మృగరాడ్గ్రీవస్వనంబంచు నే
నుఁగులుఁ బెబ్బులులేన్గుబృంహితములన్చుఁ సంశయంబూని పెం
దిగులుంగాంచి మహీధ్రగహ్వరములం దీవ్రంబపోఁద్రోచి ది
క్కుగములూఁచుచుఁ బాఱె నెల్లెడలకుఁ ఘోరంబుగానార్చుచుఁ॥ 236

వ॥ ఇట్లు గుణష్టంకృతులొనరించుచు నభిముఖుండగుచు నేతెంచిన వీరబా
హుంజూచి భానుకోపుండిట్లనియె॥ 237

—♦ వీరబాహుభానుకోపుల యుద్ధము. ♦—

క॥ దూతా! నీవు విరించివో భూతేశుఁడవో! బలారివో! విష్ణుఁడవో!
దైతేయబాలకుల నిశ్చేతనులనుజేసి వైరి జిత్తుఁడననుచున్॥ 238

తే॥ మించితివి దుర్మదంబునఁ ద్రుంచఁదగదు
దూతననినాఁడు విడుచుటచేతనీవు
నట్లుగాదిప్పుచూడు నీయఖిలబలము
మృతినిగని నొచ్చి పఱచుట లెఱుఁగవేమొ॥ 239

క॥ ఇచ్చట నిన్నువధించి వియచ్చరులకు శృంఖలముల నంటించి మహో
మచ్చరమున జెఱనుంచెద దచ్చనకాదనిన గుహునితమ్ముండనియెన్॥

సీ॥ దానవాధమ దుర్మదంబుననిట్లాడ ఫలమేమి వచ్చితిఁ గలహమునకు
నతిథినటంచు నుద్ధతితోడఁ బెనఁగుము షణ్ముఖుదూతను సత్యముగను
దూతలు విక్రమోపేతులుగారని యూహింపఁబోకు నీయుల్లమందు
గర్వంబుమాని సంగరము సల్పుమటంచు నాడిన శూరజుండాగ్రహించి

తే॥ విశిఖ దశకంబువఱపిన వీరబాహుఁ
డడరి పదిబాణముల వానినడుమ నఱుక
భానుకోపుఁడు శతశితప్రదరములను
నెఱప వీరుండు నూటింట నుఱుముసేసె॥ 241

ఉ॥ వెండియు శూరనందనుఁడు వేయిలకోరులనేయ వీరబా
హుండవి మాన్చెనన్నిఁటనె యుగ్రతతోఁ బదివేలతూపులన్
గండునదైత్యుఁడేయఁ గడిఖండములై పడనేసె నన్నియా
కాండములన్ వడింబఱపి క్రౌంచనిషూదను తమ్ముఁడుద్ధతిన్॥ 242

శా॥ అంతన్ దైత్యుఁడు లక్షకాండములనేయన్ వీరబాహుండు వి
క్రాంతుండై నియుతాస్త్రసంహతిని మొక్కల్ చేసి గర్జిల్లుచున్
గుంతంబుల్ పదిలక్షలన్ విడువ రక్షోవీరుఁడన్నింటినిన్
వింతైతోపఁగ ద్రుంచి కోటిశరముల్ వీర్యంబుతోవైవఁగన్॥ 243

సీ॥ స్కందసోదరుఁ డనర్గళముగా వాఁడేయుశరముల దచ్ఛరసంఖ్యతచే
శకలముల్ సేసి. భీషణరోషములు లక్షకోటులా రక్కసునాటనేయ
నాతఁడన్నింటిచే నవియెల్లబొడిచేసి కల్పాంతకృష్ణ మేఘంబుకరణి
నగణితశరవృష్టి నవ్వీరుముంచిన వీక్షించి క్రోధతామ్రాక్షుఁడగుచుఁ
తే॥ ప్రళయసమయ సముత్థితాభ్రంబుపోలి
రిష్టివృష్టి నిరంతరీకృత దిగంత
రుండగుచు నట్టహాసంబు రూఢిసలుప
నయ్యోవారిర్వురకుఁ జిత్రమగురణంబు॥ 244

వ॥ ఇట్టులద్దండిమగలకు ఖండనంబుసెల్లుచుండ నతిసాధ్వసప్రద కోదండ గుణారావ స్తనితంబు నునిశితశిలీముఖ నికరద్యుతి భాస్వచ్చంచలా లతావితానంబును వలయితాఖిల దిగంతారుణ మండల కదంబాతి వృష్టియు సాయకోత్కర మహావాహినీ ప్రవాహమధ్య భ్రమిస్యందన శిలోచ్చయంబును ఖంజితకాండ శ్వేతచ్ఛత్ర డిండీరంబునునై యెందెందుసందులేని కఱకుటంపఱ నునుపునందోఁచు నన్యోన్యముఖం బులు గలిగి వర్షావసర దుర్దినోల్లాసంబు వహింప నత్యంతభీష్మంబగు తదుభయ బాణసంధాన నైపుణి గీర్వాణు లీక్షించుచుండి రప్పుడు॥245

తే॥ ధీరుఁడై భానుకోపుండు వీరబాహు చాప ముక్తశరంబుల రూపుమాపి
దశనిశితమార్గణముల నాతనిధనుష్షు ఖండనముసేసి గ్రీష్మాభ్రగతినినార్చె॥

చ॥ అనితరవేగుఁడై మణిజుఁడత్తఱి వేఱొకవిల్లుబూనిదై
త్యుని శరవృష్టిగప్పి విలుద్రుంచి జయధ్వనిజేయ నాతఁడు
క్కునఁ బెఱవింట వీరునెదఁగ్రుచ్చె ననేక శిలీముఖంబులం
గని పొగలేని వేల్పులమొగంబన వీరుఁడుబ్రజ్వరిల్లుచున్॥ 247

క॥ శతకోటి కర్కశంబగు దితిజునిమకుటంబు సప్తతిగ్మాస్త్రములన్
క్షితిడొల్లనేయ వాఁడుద్ధతి నన్యకిరీటమపుడు దాల్చెడు లోనన్॥ 248

క॥ కవచము దునిమినతఱి పూర్వ విరోధముకతన దివసవరుఁడాక్రియకున్
నవ్వుచుండ నన్నిశాటుఁడు భువనంబులుబెదరనారి మ్రోయించివెసన్॥249

క॥ వీరు లలాటమున నాటఁగ ఁ గ్రూరాంబకముల్ నిగుడ్చ గొంకకవతఁడుర్
ధీరతఁ గరములనూడిచి భైరవ నినదంబుసేసి పటురౌద్రమునన్॥ 250

వ॥ సహస్రాశుగంబు లురముననాటం గ్రుచ్చి బాహుదండంబుల దోస్సంధి యుగంబున మోమున నన్యాంగముల మర్మస్థానంబుల నగణ్యావిశిఖంబుల నత్యంతసులభమునఁ జొనుపుటయు నగ్నిజ్వాలా కరాళంబులగు తచ్ఛిలీముఖ సంజాత వ్యథా దందహ్యమానుండయి వికచప్రసూనరాజిత కింశుకంబుతేవ శోణితసిక్తగాత్రుఁడై పొలిచి యరాతి కించిన్మూర్ఛ ధన్వంబుపైఁ జేయూఁతఁగొని నిలిచె నయ్యేడ॥ 251

సీ॥ దానవసైన్యముల్ దచ్చమూవల్లభు లెల్లనుగూడి మేనెఱుఁగకున్న భానుకోపునిఁజుట్టి మానితశౌర్యులై వీరబాహునిజూచి విజయకాంతు నుష్ణావపర ఘనవ్యూహంబుక్రియ బాణవృష్టిని గురియింప వీరుఁడాత్మ నిష్టార్థదాయియు దుష్టదైత్యవిదారియగుకుమారుస్మరించి యాగ్రహించి

తే॥ గర్జనముజేసి కఠినాశుగములు కోటి
వేలు బఱగించి తద్రోపజాలమడఁచి
మగుడ దీప్తాస్త్రములుపెక్కు మానవాద
మండలముపైఁ బ్రయోగించె గండుమిగిలి॥ 252

చ॥ మును త్రిపురంబు లైదుమొగముల్గలదేవరయట్లు దైత్యవా
హినులఁ జలంబుచేతమడియింప శిరంబులుగొన్ని బాణపుం
గొనలను లగ్నమై నదులఁ గొండల దీవుల వారిరాసులం
దునబడి కొన్ని వారల వధూటులముంగల వ్రాలెవీడునన్॥ 253

ఉ॥ అత్తఱి శేషరాక్షసు లహంకృతి నొక్కమొగి న్మణీసుతున్
మొత్తములౌ తదీయభటముఖ్యులజుట్టి యనేకబాణ సం
తి నిగుడ్చ నద్దురము బాధవిచిత్రము చూచువారికిం
జిత్తములందుగొల్పె బహుసింహరవంబులు మిన్నుముట్టుచున్॥ 254

వ॥ అప్పుడప్పెనుకువతలంబు వంజుడురొంపులును నెఱులనాఁచును వెలిగొడుగునురువులును బొరలుపుఱియల తామేళ్లను గాముగుంపునీటిపిట్ట

లును గలిగి నెత్తురుచేఱులువాఱ వీరబాహునివింటవిడుచు కఱకుట
మ్ములు నెఱపినఁ బెక్కుపోలికలగు మొండెములు మిత్తితోయములై
యచ్చోట నాటలాడుచుండ నక్కాలంబున భూతవల్లభులును దత్సైన్య
ములును మూర్ఛఁదేరి మనోనందంబుననుండిరి భూతపతియగు శివుండు
మరున్నికరంబులకు సహాయుండై యుండ నిరపాయులై జీవించుటాశ్చ
ర్యంబుగాదు॥ 255

తే॥ అంత నవ్వీరభూతసైన్యములుగూడి
భుజబలాధిక్యమున మేటిపోటరులయి
తమిని బాటలుబాడుచు దాండవంబు
సల్పి యానందమొందిరా సమయమునను॥ 256

—♦ భానుకోపుఁడు మూర్ఛదేఱి మరల వీరబాహునితో బోరుట. ♦—

క॥ శూరజుఁడు మూర్ఛదేఱ్కొని ధీరుండై మహినిబడిన దితిసుతసేనా
వారములఁ గుశలులై రణభారంబునకూను వేల్పుపోఁజునుజూచెన్॥257

ఉ॥ చూచి సరోషుఁడై యధికశూరత మున్ను మదీయక్రూరనా
రాచములన్ స్మృతిన్‌విడి దురంబున మూర్ఛమునుంగువారలా
హా చెలరేఁగి నాయెదుట హాస్యములాస్యము సేయుటబ్రమీ
నీచులతో ననింబెనఁగ నిల్చుట నాకుచితంబుగాఁబుపో॥ 258

తే॥ ఎదుట ననికిఁ బోటొగ్గు నావిదితబలుఁడు
నాకుదగువాఁడు గావున వీఁకమెఱసి
గడియలో వీనిమడిపెద్ఁ గాకయున్న
జిచ్చులోనిప్పు వింటితోఁ జొచ్చువాఁడ॥ 259

చ॥ అనిశపథంబుపల్కి ద్విరదారికిశోరము వైఖరిన్ విప
ఱునికరమున్ వెసందగిలి శస్త్రచయంబుల దేవసంఘముం
దఱనుముచు వేయిమొనలతూపులునేయ దిశీర్షశస్త్రమై
తనరు సహస్రకాండముల ధాత్రినిగూల్చెను వీరుఁడన్నిఁటిన్॥ 260

వ॥ వెండియు ననేక సహస్రాశుగంబులు వఱఁగించిన దోషాచరుండు వేయింట వానిమాయించి॥ 261

ఆ॥ దశసహస్రసంఖ్య విశిఖంబులడరించి రథతురంగసూత వధముసేయ
వీరబాహుఁడప్డు విరథుఁడై మచ్చరమూని వేఱు తేరిపైననెక్కి॥ 262

సీ॥ కడఁగిచతుశ్శత కాండంబుల శతాంగ రథ్య కోదండ సారథులగెడప
రవికోపుఁ డింకొక్క రథమెక్కివిలుపూని పంచశతాశనీ ప్రదరములను
బరగింప వీరుండు ఖండనంబునమూర్ఛగాంచి తెప్పిఱి రోషకలితుడగుచుఁ
దశాక్కార్ముకము జతుర్దశ భల్లములద్రుంచి దితితనూభవ మదద్విరదమడల

తే॥ సింహనాదంబుసేయుచు శితసహస్ర
శస్త్రముల సూతఘోటకస్యందనములఁ
జదిపి యాసున నిశితాస్త్రచయము భాను
కోపు గఠినోరమున జొరగ్రుచ్చుటయును॥ 263

వ॥ కలుషించి శూరసుతాగ్రణి వేఱుతేరెక్కఁబోవు సమయంబున॥ 264

శా॥ తూణీరంబు సహస్రకాండములచేఁ దూటాడి ఘోరాంబక
శ్రేణుల్ రొమ్మునదూఱసేయుటయు వార్తింజెంది కోదండముం
బాణింబట్టెదువారిలో నితనితోపాటెందు నేరింగనం
గానగ శక్యముగాదుగెల్వ బలవిక్రాంతుండు సుమ్మీతఁడుఁ॥ 265

— వీరబాహుఁడు మూర్ఛ నొందుట. —

క॥ అని దనుజుఁడెంచి వంచనమును జేయఁగఁబూని సర్వమోహనకరమై
తనరిన సమ్మోహన మార్గణమభిమంత్రించి విడువ రయమున నదియుఁ॥

ఉ॥ భీషణమై రణస్థలము బెల్లిరులొందఁగజేసి చావకఁ
శేషిలువారిఁ జీకులుగజేయుచు గాఢతమిస్ర పూరితా
శేష దిగంతరాయె జవముచే నపుడడ్డము భూతసైనికుల్
రోషిలిచొచ్చి వైచు శితరోపములఁ హతిసేసివచ్చుటఁ॥ 267

ఉ॥ వీరభుజుండు సూచి కడువిస్మితుఁడై యిదియేమి యస్త్రమో
భూరిశరంబులన్నిఁటిని బొంగడఁగించుచు వచ్చుచున్నదా

రా రయమూని దీనిని ధరాస్థలి మూల్చఁగఁజాలఁ డొక్కరుం
డారయనంచు నెంచు సమయంబున నాఘనమోహనాస్త్రముల॥ 268

వ॥ హయారోహకులు వాహనంబులను శాదచారులుర్విని దెలియక సోలు విధంబున సేనలనుబడవాలు వీరబాహుని నాలంబున బెన్నిదురనొంద జేసె నయ్యెడ॥ 269

తే॥ మౌనివరులార యేమని మందలింతు
గటగటా! యప్డు దామెనగట్టి యెుక్క-
కుట్టువాఁడైన దలపడి కుత్తుకలను
ద్రుంపఁదిలకించు దిక్కెందు దొరకఁబోదు॥ 270

క॥ ఈరీతి మూర్ఛజెందిన వైరులగని సంతసించి వాసవరిపుడుం
బారంబులేని ములుకుల ధీరతనిగుడించి రక్తదేహులజేసె॥ 271

వ॥ అక్కాలంబున॥ 272

సీ॥ శ్రీకంఠగర్భ వార్నిధిపూర్ణశశియన నొప్పువాఁ డతికూర్మి గుప్పువాఁడు
దాససంఘము కామితంబుల నెనరున నిచ్చువాఁ డహితుల ద్రచ్చువాఁడు
నిగమచతుష్కవర్ణితదివ్యచరితంబు గలుఁగువాఁడుదనంతవెలుఁగువాఁడు
దారకాసురగర్వదళనంబుగావించుబలమువాఁ డఘములనులుమువాఁడు

తే॥ శుభములిడువాఁడు భాస్కరప్రభలవాఁడు
మేలిమదివాఁడు దీనులపాలివాఁడు
నిజముగలవాఁడు సద్గుణవ్రజమువాఁడు
నాఱుమొగములవాఁ డదియుంతజూచి॥ 273

క॥ సమ్మోహనాస్త్ర శమనార్థమ్మగుచు నమోఘమైన ప్రహరణ మతిభీ
మమ్ముగ నేయఁగ మంటలు జిమ్ముచు నిజకాంతి వెలుఁగ జేసె దెసలన్॥

— కుమారుండు వీరబాహ్వాదుల మూర్ఛలనుండి తొలగించుట. —

తే॥ కటికిచీఁకటిఁజాయ పెన్మిటియడంచు
నట్లు నయ్యస్త్రకృత మోహమపహరించి

తారకారినిజేర నందఱును నిద్ర
లేచు చందముదోపఁగా లేచిరపుడు॥ 275

వ॥ మహానుభావుండగు గార్తికేయు ననుగ్రహంబునఁ దెలిసితి మిందులకుఁ బ్రత్యస్త్రం బెఱుంగనివాని శౌర్యంబేమాత్రమని వీరబాహ్వాది వీరులు సిగ్గరులై పార్వతేయు నత్యంతము వేదసూక్తముల నభినుతించుచుఁ గ్రోధాతిరేకంబున సంగ్రామ మాచరింప భానుకోపుని డాఁకునప్పుడు వీరబాహుండా తుచ్ఛునిఁ దెగటార్చు నిచ్చచేఁ బాశుపతాస్త్రంబు గరంబునదాల్ప రక్షోవీరుండు భయకంపితుఁడై యాత్మగతంబున॥ 276

—♦ భానుకోపుఁడు బరాజితుఁడై నిజపురంబు జేరుట ♦—

సీ॥ ఇది యమోఘాయుధం బీయస్త్రమునకు మా
ఱేమిలే దటుగాన నిపుడపురికి
నరిగినేఁ బాశుపతాస్త్రంబు గైకొని
యనిసేయవచ్చెద ననితలంచి
త్వరితంబ సూక్ష్మరూపముదాల్చి యమితదై
న్యమున ముక్తశతాంగుఁడగుచు గదలి
నగరంబుజేరి నానారత్న చిత్రితం
బై యందమగు స్వకీయాలయమున

తే॥ సుందరాకృతి శోభిల్లు నిందుముఖులు
సందడిగ దన్ను వేష్టించి డెందమలర
వినయమున బరిచర్య గావింపుచుండ
నుండె బలుచింతబూని ఖిన్నుండునగుచు॥ 277

తే॥ అంతనిచ్చట భూతసైన్యములువాహినీపతులు బహుకలకలనినదములను
జేయ దివ్యులు దుందుభుల్ మ్రోయజేసిజలజలంబూవులెల్లెడఁజల్లిరపుడు॥

శా॥ భూతశ్రేష్ఠులు వీరబాహువదనంబుం జూచి పూర్వంబు జీ
మూతాశ్వాత్మజు బట్టికట్టెఁగద యిమ్మూర్ఖుండు దోశ్శక్తితో

నాతీరిత్తఱి వానిబట్టికొని శౌర్యాటోపతం దెత్తుమో
మాతోఁ జెప్పు మటంచుబల్క రణధర్మంబూని వీరుండనెన్॥ 279

క॥ ఎవఁడేనియు ననిఁబాఱిన నవమానము నట్టివాని నక్రమబుద్ధిన్
దవిలియొనర్చుట శూరులకవినీతియటన్న మోదమందిరి సర్వుల్॥ 280

ఉ॥ ఇంకిటఁమీద గయ్యమునకేడ్తెఱవచ్చిన ఖానుకోపునిన్
బింకమడంతు నిక్కమని వీరుఁడు సేనలగ్రమ్మరించి శౌ
ర్యాంకసమేతుఁడై చనె బురంబునకత్తఱి పేళ్లగుంకె నన్
సంకటపెట్టునో వెఱచిజాఱిన శూరజుఁడంచు నార్తిమై 281

వ॥ ఇట్టులర్కుండస్తమింప భూతబలంబు లరాతిజయంబుఁగాంచి ప్రశంసార్హులై యమితానందంబున గుమారునిదర్శించి వందనంబులొనరించి నానావిధంబుల వినుతించి యావద్వృత్తాంతము దెలిపి తత్ప్రసాదంబు వడసి నిలిచియున్న వారల నమ్మహనీయుండు గరుణాతిరేకంబునఁ జూచి వారివారి నికేతనంబులనుండ నియమించె॥ 282

క॥ అనియిట్లురోమహర్షణి వినిపించిననాలకించి విస్మితచేతో
వనజులయి శౌనకాదులుననఘా! యెఱిఁగింపుమవలననియడుగుటయున్॥

—♦ ఆ శ్వా సాం త ము ♦—

ముక్తపదగ్రస్తము.

మ॥ శ్రితసందోహ మనోరథాజర జగత్పృథ్వీజ పృథ్వీజహృ
చ్ఛృతపత్రగ్రహరాజ రాజధరభీష్మ ప్రస్ఫుటోష్మాసఖం
డితదోర్విక్రమ విక్రమానుగతపంక్తిగ్రీవకుంభశ్రవా
హితరక్షఃకులనాశ నాశరహితాహీనప్రశిద్ధాహ్వయా 284

కవిరాజ విరాజితము.

తనుజితనీరద దానవిశారద దాసముదప్రద దైత్యభిదా
వినుతగుణాకర విశ్వశుభంకర విద్విషభీకర వీరవరా
మనుకులపావన మన్మథశోభన మంజులభాషణ మానధనా
ఘనమణిమండన కామనిషూదన కార్ముకఖండన కవ్యవనా॥ 285

నిరోష్ఠ్యము.

ఉ॥ కంధరకృష్ణదేహ దశకంధరకంధరలుంఠితా దయా
సింధు నిరస్తతాటకనిశాచరినాశన దాసతోషణా
సింధురశత్రుశౌర్య సరసీజదళాయతనేత్ర జానకీ
గంధగజేంద్రయానహృదికాంత యతీన్నికరార్చితోన్నతా॥ 286

భుజంగ ప్రయాతము.

బలారాతిసేవ్యాంఘ్రి పంకేజయుగ్మా
ఖలారాతివాతూల కాకోదరేంద్రా
కులాహార్యసామ్యోగ్ర కోదండభంగా
జలేరుట్సురానూన సౌందర్యరూపా॥ 287

గద్యము.

ఇది శ్రీరఘునందన చరణారవింద వందన మరుస్నందన నిరతిశయకరుణా కటాక్ష వీక్షాసంభావిత చతుర్విధానూన కవితాప్రహర్షిత వసుంధరా రమణ సభాప్రకాశిత విద్వన్నికాయ రుక్మాంగద నలచరిత్రాభిధ యక్ష గానద్వయ మనఃప్రబోధ రామచంద్రప్రభు ధీనిధీనామక శతగ్రంధత్రయ మదాలసాభిధానైక నాటక పుష్పగిరిపీఠాధిపత్య జగద్గురు శ్రీమదఖిన వోద్దండ విద్యాశంకర భారతీస్వామి చాతుర్మాస్యదీక్షా గద్వాలసంస్థా నాధీశ్వర వంశవృక్షవర్ణన ప్రబంధనిర్మాణ చాతురీవిరాజిత భారద్వాజస గోత్ర పవిత్ర భట్టరాజవంశ క్షీరసాగర రాకానిశాకళత్ర రామదాస పౌత్ర సంజీవరాజసత్పుత్ర కొడవలూరి రామచంద్రరాజ నామధేయ కవివర్య ప్రణీతంబయిన శ్రీస్కాందపురాణాంతర్గత శంకరసంహితాభిని వేశమహాసేనోదయంబను మహాప్రబంధమునందు బంచమాశ్వాసము॥ 288



శ్రీరస్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

# మ హా సే నో ద య ము.

(పద్యకావ్యము.)

## —• ష ష్ఠా శ్వా స ము. •—



కైలాసైరావణ
నాకధునీ హంస శీతనగ శారద ద
ర్వీకరవిభు పవి కుంద సు
ధాకర సమ కీర్తిధామ దశరథరామా॥ 1

తే॥ అవధరింపుము శుకశౌనకాది తాప
సులకు సర్వకథారథసూతుఁడయిన
సూతుఁడనియెను మందాకినీతరంగ
ప్రబలఘోషానుకారి వాక్పటిమతోడ॥ 2

ఆ॥ శూరపద్ముఁడు దనసుతుఁడు బరాజితుఁడగుచు వచ్చువార్త లాలకించి
దారుణానలంబుతీరున మండుచు గన్నుదోయి నరుణకాంతిమించి॥ 3

### —• శూరపద్ముఁడు యుద్ధమునకు వెడలుట •—

క॥ రే పాలమునకునేఁజని యాపాపనిసైన్యములనుహతిజేసి బలం
బేపార గెలుతునిక్కం బీపలుకనిపలికి తనదుయింటికిఁజనుచోన్॥ 4

క॥ దూతనుబంచి మనోవ్యథ రాతిరియంతయునుగడపి ప్రాతర్వేళన్
వీతకములుదీర్చి మణిద్యోతాసనమందు హితులతోడంగొలువై॥ 5

చ॥ పరుషములాడుచుం గనలుపాటున గోట్లకొలందిదూతలన్
ధరణినిసర్వదిక్కులను ధాత్రీధరంబుల దీవులందునన్
దిరుగు నగణ్యదైత్యవితతిం బిలువంగబిరానబంచి యె
ల్లరుజనుదెంచుచున్న బహుళంబగువేడుక వారిఁజూడఁగన్॥ 6

క॥ దైత్యాధీశలలాముం డత్యున్నతగోపురమున నారోహణుఁడై
దిశ్యాపత్యప్రకరము లత్యంతంబేగుదెంచుటంతయు నపుడున్॥ 7

తే॥ దాపునందున్న వేగరుల్ సూపఁదెలిసి
సంతసిలి గోపురముడిగ్గి సచివమిత్ర
సైన్యనాథులుదనుజుట్టి సంభ్రమమున
నడుచుచుండంగ శూరపద్మ్ముఁడుగడంగి॥ 8

వ॥ మహేంద్రధనుస్సహిత మేచకాంబరంబన బహువిధ రత్ననికర రచిత శరాసనంబువట్టి చంచలేతర శంపావృత నీరదంబన నాయుధభరిత తూణంబులుదాల్చి నైకబిసకంఠికా వ్యూహ మనోహరంబగు జీమూతంబన ద్రోణసుమనోహారంబుల దేహంబునిండించి జలధరం బచలంబధిరోహించుగతి నతిశయమనోజ్ఞంబును నమూల్యమాణిక్యమయ కుంత పరిఘ పట్టస కృపాణ స్వధితి ముఖ్యాఖిల ప్రవిదారణ ప్రశస్తసాధన సంయుతంబును నభస్తరంగిణీ తోయస్పర్ధి సముత్తుంగధ్వజ ప్రచురంబును మేరుమంథానపర్వత ప్రతిమానంబును నగు నింద్రస్యందనం బెక్కి సామంతహితామాత్య చమూవల్లభులును నధికబలవచ్ఛౌర్యులగు ననేకరథికులును సేవింప నానాస్త్రకలితంబులగు నసంఖ్యాక రథంబులనుగమింప రాజమార్గంబునబోయి నగరద్వార గోపురప్రదేశంబున నిలిచి॥ 9

సీ॥ సింహాస్య తారక శిశువులౌ యతిశూరుఁడసురేంద్రుఁడనువారినఖిలసైన్యములకధీశులఁజేసి ముందువారుజనంగనియమించి భేరి డిండిమ మృదంగ
మర్దళ ఝర్ఝరీ మడ్డు ఢక్కా కాహళాది వాద్యధ్వను లబ్జ వేణు
వీణాది నినదముల్ ద్విపబృంహిత తురంగహేషా రథాంగనిర్ఘోషములును
తే॥ వాహినీకంఠసంరావ వందిమాగధస్తుతిధ్వానములు నొక్కటఁజెనిగలిసి
విలయకాల సముద్ధిత సలిలరాశి భంగకోలాహలంబును భంగపరుప॥ 10

క॥ ద్యుతిసహిత బహుళమణి చిత్రిత చామర ఛత్రనికరవృతముఖుఁడగుచున్
దితినందనమూర్ధన్యుఁడు బృతనాయుతుఁడై సమిద్ధరిత్రిం జేరన్॥ 11

వ॥ వరూధినీపరంపర పదోద్ధూతరజఃపటల ముర్వింగలయ రవిబింబంబుగప్పె
నప్పుడు॥ 12

మ॥ శరజన్ముఁ బలవైరిగన్గొని నమస్కారంబుగావించి యా
సురనాథుండు రణోర్వి జేరువిధముఁ సూచించి యుద్ధార్థియై
యరుగుం దెంచినదుష్కృతాత్ముఁడగు నీయల్పుఁ నిదానించకఁ
బరిమార్పం దగునంచు విన్నపముసల్పఁ స్కందుఁడాలించుచుఁ॥ 13

తే॥ మీరలాడినరీతిగా శూరపద్ముఁ ద్రెంచెదనటంచుబల్కి గద్దియనుడిగ్గి
యంతికంబునఁదనయాజ్ఞ ననిలదేవుఁడాయితము సేసితెచ్చినయరద మెక్కి॥

♦ కుమారస్వామి శూరపద్మునిమీఁద యుద్ధమునకు వెడలుట. ♦

వ॥ హరిబ్రహ్మ పురందరాద్యమర సేవ్యమానుండును గీతాభిజ్ఞ తుంబురు
నారదాద్యభినుతుండును గరధృత దండలాస్యజటిపట్కసంవృతుండును
గాహళ శంఖ నిస్సాణ వీణా మర్దళ మడ్డు ఝర్ఝరీ వేణు డిండిమ
దుందుభి ధ్వాన జైత్ర ధునీరమణ నినాదుండును నగణిత గాయక
పాఠకగంధర్వ వందిగణ వేష్ట్యుండును జామరాతపత్ర వ్యజనపంచశాఖ
రంజిత దేవసమూహుండును నానావిధ భృత్యజన సహితుండును నై
శక్తిధరుండు వెడలెనప్పుడు॥ 15

శా॥ భూతాధీశులునూఱువేలు నవకంబుఁ సంఖ్యవీరుల్ చమూ
నేతల్ సర్వశతాంగయానులగుచుఁ నిర్భిద్రరోపార్భటీ
జాతంబుద్ధతిఁ జేయుచుఁ వెడల నాసైన్యాంఘ్రిధూళ్యాళి ఖ
ద్యోతుంగప్పఁగ నందఱుం బ్రధనముఖోద్యోగులై యుండఁగాఁ॥ 16

ఉ॥ భూతబలంబు లద్దితికిబుట్టుకొమారులపిండు నౌర్వస్వా
హాతరుణీశుఁడంబుధిమహాంబువులట్టుల నాక్రమించి వి
ఖ్యాతిగ శైలవృక్షనిచయంబులవేసిన దైత్యపంక్తి సం
ఖ్యాతములౌ స్వకీయవిశిఖంబులు సేయ మహోగ్రమూర్తులై॥ 17

ఆ॥ గండుమీఱి భూతకాండంబు దానవశతముచేత దైత్యశతము హాయ స
హస్రకంబుచేత హయసహస్రం బిభదళశమునను గుంభిదళకమడఁచి॥ 18

తే॥ వానియడుఁగులుఁ జేఁబట్టివసుధ వ్రేసిమడియఁజేయుచు రాక్షసమండలముల
దీనదశనొందఁజేయుడు దేవరిపులు భూతముక్తాద్రిభూజముల్ పొడవడంచి॥

క॥ బహుబాణపరంపరలన్ గుహుబలములఁ గ్రుచ్చిచంప గుంపుచెదరుచున్
సహనంబులేక భూతనివహములు వాలిం దదీయవల్లభులంతన్॥ 20

వ॥ పరాక్రమంబునఁ బ్రచండదండ శస్త్ర ఖడ్గాద్యనేక సాధనంబుల నసుర శ్రేణిహింసించినఁ దత్కబంధములత్యంతము రణాంగణమునందుఁబడి క్షతజప్రవాహములు గ్రందుకొని మహానదీలలామంబులై వడిఁబాఱ నంతయుంగాంచి బలశౌర్యశాలియగు నతిశూరుం డట్టహాసరవ సంభరిత దిశిరింభోళుఁడయి భయంకరమగుకదనంబున రథభగ్నంబయినఁ బునరారోహణకై శతాంగసహస్రద్వయము పార్శ్వంబుల గమనింప దశసహస్ర వాజిబద్ధ రథంబెక్కి మొనముంగలికివచ్చి॥ 21

— ఉగ్రభూతపతి యతిశూరదనుజునితో బోరుట. —

మ॥ అసితాభ్రంబువిధంబుగర్జిలుచు భూతానీకినిన్ వాఁడినా
రసమొత్తంబులనేయ నుగ్రుఁడను పేరన్ మించు సేనాని యా
రసుఁడై వానిమొగంబుచాయఁజన ఘోరంబైన బాణౌఘమున్
వెసతోనేయఁగ నాతఁడద్భుతముగా విద్వేషియౌదానవున్॥ 22

మ॥ కరదండంబునవర్మముంబగుల వక్షంబందు మోదన్ జిరా
ధరణిన్ వ్రాలిన లక్షసాయకములన్ దైత్యుండునోసేసి నె
త్తురు మేనెల్లనునిండఁజేయుటయు నిస్తుల్యప్రతాపంబునం
కరమొప్పారుచు నుగ్రుఁడయ్యసురునిన్ గాటంపుశైలంబునన్॥ 23

క॥ వైచి రథంబును మావుల బీఁచమణచుడున్ సురారి బెఱతేరెక్కం
జూచి యొకదెబ్బచే నతఁడాఁచక రథరథ్యములను హతమొనరించెన్॥ 24

తే॥ విరథుఁడయి యతిశూరుండు వేఱుతేరు నెక్కి వేగమ పదిపదులిషువులేయ
నుగ్రుఁడుద్దండ దండము నూనివైచి రథహయంబులజంపిగర్జనము సేయు॥

క॥ అతిశూరుఁడతనిమదమున కతిశయమగు గనలునొంది హయవిరహితమై
ద్యుతిదఱగు తద్రథంబున ధృతినింగూర్చుండి యనలదేవాస్త్రంబున్॥ 26

వ॥ ప్రయోగించి దిక్చక్రంబద్రువ భయావహంబులయి నిఖిలజగంబులు జీకాకగునట్లు గర్జించిన॥ 27

సీ॥ అయ్యస్త్రమపుడు శతాకారములుదాల్చి విస్ఫులింగంబులు విస్తరముగఁ
గ్రక్కుచు వైరిభీకరముగా హేతివ్రజముబర్వ నేతెంచుసరణిజూచి

— ఉగ్రుఁడగ్ని వరుణబ్రహ్మ నారాయణాస్త్రములను మ్రింగుట. —

యుగ్రుఁడుగ్రాకృతినొప్పిమంతనమున బాహులేయుననూనభక్తిదలఁచి
హస్తంబుచేదాని నట్లెపట్టి నిలింపులసురు లత్యద్భుతమంద మ్రింగఁ

తే॥ గోపియై యతిశూరుండు ఘోర వరుణ
సాయకంబేసియార్వ నయ్యాయుధంబు
బహునదీకలితాభంగ భంగసహిత
వారిరాశివిధంబున వచ్చుటయును॥ 28

క॥ ఉగ్రుండు దానిబట్టి యుదగ్రుండయిమెసవఁ బూర్వదైవతుఁ డసమా
నోగ్రిత శోణేక్షణుఁడై వాగ్రమణాస్త్రంబుబూని వైవఁగ నదియుఁ॥29

తే॥ అన్నిదిక్కుల నుత్తలమందజేసి
యాననచతుష్కమున మహోస్వానములను
నాచరించుచు జగముల నటమటంబు
నల్పుచునురాగ నుగ్రుండు జలముమిగిలి॥ 30

మ॥ వివృతాస్యుండయి పార్వతేయుని మనోవీథిఁ నుతుల్ సేయుచుఁ
జవసత్వంబుల దానిబట్టిమెసవఁ సక్రోధుఁడై దానవ
ప్రవరుండుఁ నిఖిలాసుహృద్విదళన ప్రాశస్త్యముఁ నిస్సమా
న విరావోత్కటముఁ బ్రభాలసితమౌ నారాయణాస్త్రంబొగిఁ॥ 31

వ॥ విధ్యుక్తంబుగాఁ బ్రయోగింప నయ్యస్త్రంబాత్మీయ తేజోజాలంబుల దిక్సమూహములదూలించుచు సంవర్తసమయకంధర స్తనితాడంబరంబున బహువిధాకారములతో సమీపించిన నుగ్రుండుగ్రోధించి॥ 32

తే॥ మదిని శరజన్ముఁదలచి నమస్కరించి
సింహనాదంబు సెసి జేజేలు బలల

భక్షణులు సూచి యత్యంతభయమునొంది
సన్నుతింప నారాయణాస్త్రంబు మ్రింగె॥ 33

వ॥ అట్టియెడ నతిశూరుండు భయవిహ్వలుండయి॥ 34

క॥ చతురాననుండొ హరియో శితికంధరుఁడో యితండు చిత్రంబుగనీ
శితదివ్యాస్త్రములెల్లను మెతుకుగతిఁ మ్రింగి లావుమెఱసెడినౌరా॥ 35

క॥ తలపోయ నీతఁడతులిత బలవంతుఁడు శౌర్యధైర్యభరితుండహహా
బలుచిత్రంబుగదా యని తలఁపున గంపించుచున్నతఱి దైత్యతతుల్ ॥36

క॥ ధృతిదూలి వెతలనొందిరి క్రతుభుజు లవ్విధముగాంచి కరమాశ్చర్యా
న్వితమతులయి గీర్వాణపతిగన్గొని పలికిరిట్లుఁ బరమవినీతిఁ॥ 37

—♦ దేవతలకు బ్రహ్మ యుగ్రుని మహిమను దెల్పుట ♦—

ఆ॥ మునుపుజూడమిట్టి ఘనబలంబును వీర్యధైర్యములును నెవ్విధమునగలిఁగె
వీని కిపుడుమాకు విన్పింపవలెనన్న నప్పితామహుండు ననియెనిట్లు॥38

క॥ ఈతఁడు శివభక్తులలో ఖ్యాతుండితఁడిచ్చదలఁప గమలభవాండం
బాతంకమేమిలే కొకచేతూరిఁ మ్రింగుసంతటి సమర్థుఁడు సూ॥ 39

చ॥ అదియునుగాక షణ్ముఖు దయారసమొందినవాఁడు నీఘనుం
డుదధిశయానుచక్రమును నుక్కునమెక్కగలాడు నీనిశా
ట దళములేమిలెక్కగు నిటాలతటాక్షసుతార్పితాత్మకుల్
కదనములోన శాత్రవనికాయజయంబును బొందుటబ్రమే॥ 40

వ॥ దేవాసురమండలంబుల ఖండించు నఖండవిక్రమంబునఁ మీఱి తావకీన
హితులయ్యెదరనిచెప్పి॥ 41

సీ॥ కమలగర్భుఁడు నీలకంఠవాహను మదియందునదలఁచి యానందబాష్ప
జలముగన్నులనించి పులకితగాత్రుఁడై నన్నుతించుచు దేవసహితముగను
భూతవల్లభు నుగ్రు బొడగాంచి నీకింత కంటెను ధైర్య విక్రమ గభీర
సంపద ద్వాదశశయుఁడనంత మొసంగు ననుచు నాశీర్వాదమర్థినిచ్చి
తే॥ చూచుచుండిరి రణ మతిశూరుడిట్లు
దనమహాస్త్రంబులెల్ల వ్యర్థమయిపోవఁ

జింతసేయుచు నెట్లుజయింతు నింత
బలియుఁడగు వీనినని యాత్మదలచిఁయంత॥ 42

—♦ ఉగ్రునిమీఁద బ్రయోగించిన పాశుపతము వ్యర్థమై పోవుట ♦—

ఆ॥ ప్రధనభీమమైన పాశుపతాస్త్రంబు మానసార్చ జేసి మాంసభోజి
యుగ్రుమీఁద లక్ష్యముంచి ప్రయోగింప వివిధవిధులనదియు విక్రమించి॥

సీ॥ సంహారకారణ జ్వలనరుద్ర భయంకరాట్టహాసమురీతి నధికరవము
అంభోరుహ ప్రభూతాండ కోటరమును నిండజేయుచును నుద్దండ దండ
ధర వహ్ని గరళ భూతముల ననేకాస్త్రచయముగల్పించి జాజ్వల్యమాన
ముగను మండుచు సర్వజగముల వెఱపించుచతివేగమునభూతవితతిబెగడి

తే॥ దిక్కులకుఁబర్వడాసిన నుక్కుదక్కి
దండమిలవైచి యుగ్రుండు దండమిడుచు
వడవడవడంకి మనమున మృడునిలిపి ష
డక్షరీమంత్రపఠనంబు నాచరించి॥ 44

క॥ కడుభక్తిఁగనులమూసియు వడిదూలుచు హరహరేతి వచనంబుల నె
క్కుడు రవళిని మొఱవెట్టుచు బడిబడి మలినంబులేని భావముతోడన్॥45

వృత్త్యను ప్రాసము.

ఉ॥ త్ర్యక్ష విపక్షశిక్ష బలదక్ష ఋభుక్షసురక్షితాద్రిజా
ధ్యక్ష నతేంద్రవృక్ష కమలాక్షనుతోక్షహయాదిభిక్ష హ
ర్యక్షసదృక్షశౌర్యయుత యక్షపపక్ష వళక్షదేహ మాం
రక్ష యటంచు బల్కుచు దురంబుననిల్చె నిరాయుధుండునై॥ 46

వ॥ అట్టిసమయంబున॥ 47

క॥ అయ్యస్త్రప్రాగ్రహారము చయ్యననే తెంచి శూలశయు ననుమతిచే
నయ్యుగ్రు ముట్టనొల్లక నయ్యోడఁబనివినిరొ శంభునంతికమునకున్॥48

—♦ ఉగ్రుండతిశూరుని వధించుట. ♦—

చ॥ అనవినిసూతుఁగాంచి మును లస్త్రవరేణ్యము సర్వదేవతా
హననసమర్థమున్ రిపుభయంకరమౌ శశిమౌళిశస్త్ర మ

య్యనువున శార్వతీరమణు నంటకుబోవుట కెద్దిహేతువో
చనువున జెప్పుమన్న విని సంతసమందుచు నాతఁడిట్లనుణ॥ 49

క॥ ముని నీయస్త్రం బతిశూరునకిచ్చెదు నట్టితటి హారుండాయుధహీ
నునిమీఁదఁ బ్రయోగించిన నను జేరును శాస్త్రవుని నణంచక వృధయై॥ 50

వ॥ అని పరమేశ్వరుం డానతిచ్చుటం జేసి యట్లరిగె నంతఁ బాశుపతంబు సార్థ
కముగాక దొలఁగిచనుట కతిశూరాది రక్షోవీరులందఱును భగ్నమనో
రథులై భయంబున హాహారావంబులాచరించిన భూతబలంబు లుల్లాసం
బునఁ జెలరేఁగి కలకలంబులొనర్చుచుండి రప్పుడు॥ 51

ఉ॥ పాశుపతాస్త్రమేగిన సుపర్వులు దేవతరుప్రసూనముల్
రాశిగవృష్టినించిరి సురద్విపవీరుఁడు దేరుడిగ్గి కో
పాశయుఁడౌచు దండమును హస్తమునణధరియించి యుగ్రభూ
తేశితువక్షముంజొరఁగనేసి జయధ్వని సేయ నాతఁడుణ॥ 52

ఆ॥ హస్తలాఘవమున నసురునిదండంబుపట్టి దాన నతని గొట్టుటయును
దానవుండు బిట్టదరి మృతుండయి యన్యదితితనూజులడల ఢీతినిఁద్రెళ్లె॥

శా॥ అంతణ భూతపతుల్ వరూధినులు నత్యంతంబు సింహోర్భటుల్
సంతోషంబున జేయఁ దారకతనూజన్ముండు క్రోధాకుల
స్వాంతుండై సమరంబు సేయుకొఱకై సైన్యాగ్రముం జేరి దు
ర్దాంతశ్యామపయోధరంబుగతి గర్జారావసోజ్జృంభుఁడై॥ 54

మ॥ శరవృష్టిణగురియింప భూతబలముల్ శౌర్యంబుబోనాడి స
త్వర వద్దిక్కులఁ బ్రాణభీతినుఱుకణ దర్పోద్ధతిణ భూతరా
జురుశక్తిణ గనకాభిధానుఁడు సమీకోర్వీస్థలిణనిల్చి భీ
కరనాదంబొనరించుచుంగదిసె లేఖద్వేషణాగ్రేసరుణ॥ 55

—♦ కనకాది భూతపతి షట్కము సురేంద్రునితో పోరి సోలుట ♦—

చ॥ అపుడసురేంద్రుఁడొక్క నిశితాంబకమంగము నాటనేయఁగాఁ
గుపితమనస్కుఁడయ్యు గనకుండు జవంబున బైకిలేచి య

క్కృపణురథంబుపై దుమికి కేలను సారథిమస్తకంబు బె
కుక్క పటియతౌవిధం బమరగొట్టి రథంబుల జాపశింజినిఁ॥ 56

క॥ కోటికి బహుసత్వరంబున నుటికి సరకుగొనుటమాని యొకమల దలపైఁ
బఱపిన దారకసూనుఁడు బెలవింట శరాష్టకమున విదళిచెదానిఁ॥ 57

వ॥ వెండియు నిశితాంబక సహస్రంబేసి కనకు మహింగెడపిన భూతసైని
కులు జేష్టలు మఱచియున్నంజూచి యసురేంద్రుం డన్యునొక్కని
దేరుదోలనియమించుకొని మార్తురందఱిమిన నచ్చెరువొందుచు ధరా
ధరప్రతిమానుండగు నున్మత్తనామక భూతశ్రేష్ఠుండు॥ 58

ఆ॥ కేలనొక్కగిరిని దాలిచి దంతి కేసరిని గదియబోవు కరణిడాసి
తేరుగుఱ్ఱములను ద్రెళ్లనేసిన దైత్యవరుఁడనూనరోష భరితుఁడగుచు॥ 59

క॥ అత్తఱి నున్మత్తుని మై నెత్తురుజొత్తిల మహాస్త్ర నిచయంబులచే
మొత్తిన దచ్ఛ్రమనొందుచు సత్తువచెడి కూలెనతఁడు జగతీస్థలిపై॥ 60

వ॥ వానింజూచి॥ 61

సీ॥ దుర్దాంతుఁడైన మత్తుఁడుభూధరంబొండు జేతనెత్తెడులోనయాతుధానుఁ
డుత్కటముగను బృషత్కముల్ పదిజొన్పి తనువుభేదించినఁ దత్తరిలక
రక్తసిక్తాంగుఁడై రంజిల్లుచుదదీయ కుధరమురంబున గుదియవ్రేయ
నసురుండు సడ్డసేయక రొమ్మునొడ్డిన శంబదారిత పర్వతంబుపగిది

తే॥ వ్రక్కలై నేలవ్రాలిన రక్కసుండు
గోపశిఖిగ్రాలుచు సహస్రరోపములను
నొడలు జెక్కులు వాయగొట్టుఁడును రక్త
ధారలొలుకంగ నపుడు యుద్ధమునవొదిగె॥ 62

క॥ అదిజూచి సింహుఁడాగ్రహ మొదవి గిరిఁవయిచి గర్జలుడుగక చేయఁ
మదమున దైత్యుఁడు నిశితప్రదరంబులు బఱపి దానిభంజించె వెసఁ॥ 63

క॥ కడువడి సింహుఁడు దండమువిడువ నరాదుండునటికి విశిఖములమిత
మ్ముడరింపభూతరమణుఁడు బడియెనువింతైనమూర్ఛబాల్పడియనిలోఁ॥

శా॥ దానింజూచి నిశాటుఁడార్చుచును భూతవ్రాతముల్ భూతసే
నానాథావళిదాఁకి ముమ్మరముగా నారాచముల్ గ్రుమ్మచున్
గానన్ గోవులదోలుగోపకుగతిన్ నల్దిక్కులందోలఁగా
నా నీరంధ్రపరాక్రమంబు దన కన్నారంగ వీక్షించుచున్॥ 65

వ॥ మణిపుత్రికా ఘర్మకణ సంజాతుఁడగు దండకుఁడను మహాబలాఢ్యుండు సంగ్రామంబునకుఁ గోల్తలసేసి భయంకరుండై సునిశితకాండంబు లఖండంబుగాఁ బ్రయోగించిన నసురేంద్రుఁడు నిష్ఠురసాయకంబులు లలాటంబునఁగ్రుచ్చిన నసమానమూర్ఛవిస్మృతుఁడై పుడమింబడియె నంత॥ 66

క॥ సోమకుఁడను నాతండు మహా మచ్చరమునఁ గడంగ నసురేంద్రుఁడు నా
నా మార్గణములనేయఁగ నేమాత్రము గాసినొంద కీసున నతఁడున్॥ 67

మ॥ రణభీముండయి ఖడ్గతోమరముఖాస్త్రంబుల్ సహస్రంబు బె
ల్చననోనేసి తదీయసారధి రథాశ్వధ్వంసముం జేయఁగా
దనుజుండన్యశతాంగమెక్కి మదిఁ జింతంగూరి యంతన్ ధృతిం
గొని శక్తిన్ ధృఢముష్టివైవ నది దిక్కుల్ నిండ గర్జిల్లుచున్॥ 68

వ॥ మహీతలం బద్రువ నేతెంచి సోమకు వివశుం జేసినఁ గనుంగొని విజయుండు భుజబలంబున బాణసహస్రంబుచే నద్దోషాచరు ధనుస్సారథుల వధియించిన॥ 69

సీ॥ అద్దైత్యుఁడుద్దండమగు దండమంతరిక్షమున ద్రిప్పుచు బ్రయోగంబు సేసి
యార్వగా నది యసంఖ్యాతబాణంబుల విజయుండుబఱిగింప బెండువడక
వీఁకతోనెదిరించి తాఁకిన నాతండు జెచ్చెరఁబడి మూర్ఛజెందునపుడు
తిలకించి లక్షువీరులు నొక్కపరిరేఁగి కలకలస్వనము దిక్పటలినించి

తే॥ తగిలి వివిధాస్త్రశస్త్రముల్ నిగుడజేయు
నవిగణింపక నసురేంద్రుఁడలుకమించి
శరపరంపరబఱపి కేసరి యనేక
పవ్రజంబువిధంబున బాఱఁదటిమె॥ 70

—♦ వీరబాహుండసురేంద్రుని మార్కొని చంపుట. ♦—

ఉ॥ అప్పుడువీరబాహుఁడు సురాహితు శౌర్యబలప్రతిష్ఠలం
దప్పకచూచి విస్మయముదాలిచి సజ్యధనుర్ధరుండునై
యప్పలలాశిదాఁకి వివిధాస్త్రచయంబులు మేననెత్తురుల్
చిప్పిలనేయ వాఁడతని చేవతొలంగఁగ వేయిముల్కులన్॥ 71

క॥ తనువునగ్రుచ్చిన శోణితతనుఁడై సప్తాశుగముల ధన్వము ఖండిం
చిన వీరబాహుఁడొండొక ధనువున్ ధరియించి యధికదర్పోద్ధతుఁడై॥ 72

తే॥ శరసహస్రంబుచే వాని హరి శతాంగ
చాపహతిజేసి కల్పావసర పయోధ
రంబుకైవడి నార్వ నారాఘసుండు
వేలుతేరెక్కి యొకదొడ్డ విల్లుబూని॥ 73

వ॥ బహుప్రదరంబు లడరించి రథంబు భగ్నంబుగావింప వీరబాహుఁడుప్ప
రంబునకుఁ గుప్పించి మానసాబ్జమున మహాసేనునిధ్యానించి మ్రొక్కి
భీషణధ్వానముసేయుచు నుక్కుతునియలగు రక్కసులు మిక్కిలివెఱ
పునెంద ఖడ్గధరుఁడయి॥ 74

చ॥ దనుజురథంబుపైదుమికి తత్కరఖండనమాచరింపఁగాఁ
గనలిద్వితీయహస్తమున గర్బురుఁడుగ్రపు దండమూని వీ
రు నురముమోద నాఘనుఁడు గ్రూరత వానిశిరంబు గాలుతో
డ నడిచి మింటిపై కెగసి డయ్యకత్రుంచెఁ గృపాణధారచేన్॥ 75

వ॥ తత్సమయంబున॥ 76

క॥ దితిజబలంబులు నలుగడ వెతనొందుచు బాఱుటయును విబుధులు మోదా
న్వితులగుచు గలకలంబుల నతిశయముగజేసి మీఱుటూరసి యంతన్॥ 77

క॥ శూరుండమర్ష ఘోరాకారుండయి సాంపరాయికమునకు నెదురై
వైరులువలంక ధన్వము ధీరత ధరియించి గుణముదీడినయంతన్॥ 78

వ॥ శింజినీసముద్భూత నినాదంబోదైత్యాధమా! నన్నిట్లుమన్నింపక తాడ
నంబుగావించుట విహితంబుగాదు సంగరాగ్రంబునందీఫలంబు నీకు

సిద్ధించునను విధంబున మొరసెఁ దద్ధ్వనివిని మహేంద్రాది దేవవ్రాతం
బులు భీతిచేఁ గాతరులై యాత్మావనార్థంబుఁ జతురాశలఁబలాయితు
లైరి మఱియు నాజ్యాఘోషంబు ద్వాదశవర్షంబులుడుగ కనేకప్రకా
రంబున నజాండ పిఠరంబునిండి యతిశయించెనప్పుడు॥ 79

—♦ శూరపద్ముఁడు భూతసైన్యముల బాఱఁదోలుట. ♦—

తే॥ అధిక తేజో విరాజితులైన వాహినీశులొక్కటగదిసి మహీధ్రశాఖి
సాయకప్రముఖాఖిల సాధనముల నగణితంబుగనేసి యాహవము సేయ॥
ఆ॥ శూరుఁడు బదిపదియు వారసములవైచి వారి శైల వృక్షవర్గమడఁచి
శతసహస్రకోటిసంఖ్య మార్గణముల శత్రుముక్త బాణసమితిదునిమి॥ 81
సీ॥ తచ్ఛమూనికర గాత్రములు గండ్లొనరింపవ్యసనాంతరంగులై పొఱువారు
శయపాదచలన వర్జనులయి మిన్నకయుండువారిల బొర్లుచుండువారు
నై వాహినీపతు లతిపరాభవమొందుచుండుటజూచి ప్రచండులగుచు
మణిపుత్రికా స్వేదకణజాతులగు లక్షవీరులేకంబుగాఁ బోరనిలిచి
తే॥ శూరపద్ముని నగణిత క్రూరవిశిఖవర్షమునముంప వాఁడు గర్వమున వాని
నన్నిటిని రూపుమాపి సహస్రకోటి భీకరాశుగపంక్తిని బెలుచనేసి॥ 82
క॥ వారల శతాంగ ఘోటక సారథులన్ వధముసేసి శౌర్యాంకితులౌ
వీరసహస్రశతంబును వారకనొకతఱిని భిన్నవపులజేసెన్॥ 83

—♦ వీరమార్తాండాద్యష్టవీరులు శూరపద్మునితోఁబోరి సోలుట. ♦—

వ॥ అంతఁ దద్వేదనాభరంబున వారలు మూర్ఛమునింగిన వీరశిఖామణినాఁ
దగు వీరమార్తాండుం డనుక్రోశావేశ దారుణుండయి కవిసి॥ 84
మ॥ ఖరశస్త్రంబులనేకముల్ బఱప దోర్గర్వంబుచే శూరుఁడా
శరముల్ మధ్య దళించి ఫాలమునలక్ష్యంబుంచి సాహస్ర దు
ర్భరకాండంబులనేసినంగనలి వీరబ్రహ్మఁడుద్వేగియై
హరియించెన్ దదజిహ్మగంబుల ననాయాసంబుదీపింపఁగాన్॥ 85
ఉ॥ అత్తఱి శూరపద్ముఁడు సహస్రశగంబులఁ జాపరథ్యముల్
బత్తళికన్ రథంబును విభగ్నముసేసి మహోపరాక్రమో

ద్వ ృత్తిని వేయిములుక్కలను వీరవికర్తనుగూల్ప రోషని
ష్వృత్తిని వీరరాతుసుఁడు సమ్ముఖుఁడై పదినూఱులమ్ములన్॥ 86

చ॥ విడిచిన శూరపద్ముఁడతి విక్రమమూని తదీయకాండముల్
నడుమనడంచి యన్నియగు నారసముల్ బలిగించి చాపమున్
గెడపిన వీరరాతుసుఁడు గేరుచు మీఁదికిలేచి వాఁడియౌ
నడిదమువట్టి వానిరథమందునదూఁకి ధనుస్స్రుదుంచినన్॥ 87

వ॥ అని కార్ముకంబులు నుఱుమై రాలిన వీరరాతుసుండు ముష్టింబోరుచు నెదుర్కొనునంతలో నాయుధహీనుండగు నతనిపాదములువట్టి గగనంబునకెగయవ్రేయ నజ్జవ వశంబున నజాండోర్ధ్వకర్పరంబు దగుల్కొని పిండీకృతశరీరుఁడై మగుడఁ బుడమింబడిన గనుంగొని వీరమాహేంద్రుం డురువణించి॥ 88

శా॥ సింహారావముసేయుచున్ శితశరశ్రేణిం బ్రయోగింపఁగా
సంహారంబొనరించి శూరుఁడటులే శాతాయుధస్తోమమున్
రంహుండై వయివంగ వారు రథచిత్రభ్రాంత యానంబులన్
సింహద్వంద్వముమాడ్కి భీమముగ నాజింజేయుచున్నంతటన్॥ 89

సీ॥ రోషరసావేశ కాషాయననయనుఁడై శూరపద్మాసురస్తోమభర్త
ముప్పదిముప్పది ములుకులచేఁ బాణి పదముల నలువది బల్లెములను
వక్షఃప్రదేశంబు వ్రక్కలుగామోది వీరమాహేంద్రుని వివశుఁజేయ
వీరవీరుఁడునొచ్చి వివిధబాణంబుల నడరింప శూరపద్ముఁడు సహస్ర

తే॥ సాయకంబులఁ దద్బాణ చాపములను
రజముగాజేసి యుగ్రమార్గణము లేదు
బలిపి యరదంబునఱుక నబ్బలుమగండు
ఢాకతో దండపాణియై డాయుటయును॥ 90

ఉ॥ నాలుగుతూపులన్ దనుజనాథుఁడు దానినివమ్మొనర్చి ప
ద్నాలుగుభీకరాస్త్రముల నాకవిభుండు ధరాధరేంద్రముం

గూలుచునట్లుగా నతనిగూల్చిన వీరమహేశ్వరాహ్వయుం
డాలము సేయడాసి విశిఖాసనకౌశలి గానుపించుచున్॥ 91

క॥ ఈతండ జేయుఁడంచున్ శాతంబగుశక్తి నేయు సాహస్రేషుల్
దైతేయుఁడేయఁ ద్రోయుచునే తెంచియురంబుఁదాఁకె నెంతేనివడిన్॥ 92

క॥ ఇటుఁదాఁక శూరువక్షము పటువజ్ర ప్రతిమమగుటఁ బాషాణముపైఁ
జటులముగఁ బడినలోష్ఠం బటువలె నాశక్తి చూర్ణమై పోవుటయున్॥ 93

వ॥ వీరమాహేశ్వరుండు దండాయుధంబుగొనం దివిఁగెడునడుమన శూర
పద్మిండు శరసప్తకంబున నతని నేలదూలించినంజూచి॥ 94

చ॥ కడువడి వీరకేసరి యఖండబలంబునదాఁకి లెక్కకె
క్కుడుగఁ గటారులంబఱపఁ గ్రోధముమించి సురారివాఁడియా
నడిదము లేడిటం దనువు స్యందనమున్ శతమార్గణంబులన్
బొడియగునట్టులేసి పెనుముల్కులువేయి లలాటమేసినన్॥ 95

ఆ॥ సారధైర్యుఁడగుచు వీరకేసరి శైలమొకటివైవ దనుజుఁడొక్క కఠిన
శరముపఱపి యణచి చటులప్రతాపుఁడై చెలఁగుచెల్ల వీరసింహుఁడరసి॥

క॥ భయదముగి నతనియరదము పయిదుమికి తదీయ కఠినవక్షస్థలమున్
శయఘాతఁ బొడువభంజితశయుఁడై తద్రథముమీఁదఁజయ్యనబడియెన్॥

వ॥ ఇట్లు వీరకేసరి మూర్ఛిల్లిన శూరపద్మిండు మాత్సర్యమున నతని కర
దండంబున జిమ్మివైవ మున్నీటంబడి తెలిసి నిజసేనా సముదయంబుల
జేరె నంత॥ 98

ఉ॥ వీరపురందరుండధిక విక్రముఁడై కనులెఱ్ఱసేసి దో
స్సారతఁ గాలశస్త్రము వెసంబఱగించిన దైత్యరాట్కఠో
రోరముదాఁకి చూర్ణమగు డోదక వెండియు నాతఁడుగ్రుఁడై
వారిజసంభవాస్త్రమునవైవఁగడంగుతఱిన్ మహోద్ధతిన్॥ 99

క॥ శూరుండు శతసహస్ర కఠోరాస్త్రము లంగమున గడుంగ్రుచ్చుటయున్
ధారుణిపై నతఁడొఱగెను వీరాంతకుఁడదియుజూచి విజయస్పర్థన్॥ 100

చ॥ చటులమృగేంద్రగర్జన మెసంగ గదంబకవృష్టిముంచుచుం
గుటిలనిశాచరప్రతతి గూలఁగనేసిన శూరపద్ముఁడు
త్కటశరముల్ నిగుడ్పఁగ నతండు సహస్రశిలీముఖంబులం
దటుకునఁద్రుంప దానవుఁడెదం గసలొంది ప్రచండమూర్తియై॥ 101

చ॥ రథమును ఘోటకంబులు శరాసము బాణసహస్రకంబుచేఁ
బృథివినిగూల్చి వక్షమునుభేదిల లక్షశరంబులేసినం
బృథు వివశత్వముంగనియె భీమరణానని నాతఁడయ్యెడం
బ్రథితుఁడు వీరబాహుఁ డసురప్రభుకృత్యముగాంచి కుందుచున్॥ 102

—♦ వీరబాహు శూరపద్ముల యుద్ధము. ♦—

వ॥ సంగ్రామరంగంబున కభిముఖుండగుచు నేతేర నుపలక్షించి శూరపద్ముం
డిట్లనియె॥ 103

క॥ నాతో మాటాడుటకై దూతవిధంబుననువచ్చి దొంగవయి బల
వ్రాతంబుదునిమి మత్సుతు వీతాసునిగాఁగ జేయవే పూర్వమునన్॥ 104

ఉ॥ ఇచ్చటవిల్లుబోవిడిచి యేగినమేలగునీకుఁ బోరికిన్
వచ్చి పెనంగినన్ గటకువాలుల జీవములూడ్చు దొంగవై
చెచ్చెరఁబాఱినన్ విడువ సిద్ధముసుమ్మన వీరబాహుఁడా
గచ్చులవాలకించుచు మగంటిమిడించకపల్కె నీక్రియన్॥ 105

శా॥ చాముండన్ భటుఁడన్ గుమారునకు నీచా! నీకుగాఁబోను నే
నీరజ్జుల్ కొఱగావునిల్పుము రణంబీవేళగావింపఁగా
రారమ్మంచు దిరస్కరించిన మహోగ్రక్రోధ రక్తాక్షుఁడై
శూరుండొందు సహస్రకోటి కఠినాస్త్రోకాస్త్రముల్ వైచినన్॥ 106

తే॥ వీరబాహుండు గలుషించి ధీరుఁడగుచు
వానినన్నింటి నడుమన వమ్ముసేసి
లక్ష సాయకములనేయ రాక్షసపతి
కోటిమార్గణముల వానిగూల్చి మఱియు॥ 107

క॥ ఒకకోటి కఠినశరములు ప్రకటమ్ముగనేయ వీరబాహుఁడు శితసా
యకకోటిఁ బ్రయోగించియు శకలమ్ములుసేసెవానిఁ జతురత్వమునన్॥
ఉ॥ నూతనమార్గణంబు లొకనూఱెదఁగ్రుచ్చినఁ దచ్ఛరంబులున్
జూతనుగ్రుచ్చు సూదులతెఱంగునుబోలి ధరిత్రిరాల వి
ఖ్యాతబలుండు షణ్ముఖు శయస్థితశక్తియొకండుదక్కఁగా
నీతని నన్యసాయకములెవ్వియుజాలవు నొంపనంచెదన్॥ 109
వ॥ తలపోసి వీరబాహుండు గ్రమ్మఱ దనమనంబున॥ 110
క॥ అట్లైనను గానిమ్మప్పటికిన్ మత్కర శితాస్త్రపటలహుతాశి
చ్ఛటలన్ ఖిన్నాత్మునిఁ జేయుటకూనెదనంచు నెంచి సోత్సాహుండై॥
క॥ నిశిత శరవిసర మంగమ వశతంగనులాగువైవ వడిదూలక య
న్నిశిచరపతి యన్నింటిని నశియింపఁగఁజేసి సింహనాదముతోడన్॥ 112
తే॥ వీరు భుజముల రొమ్మున వేఁడితూపు లష్టసంఖ్యను నాటింప గష్టపడక
కోటిశరములసూతునిగూల్చుటయును వానిమరణంబువీక్షించిదానవపతి॥
శా॥ మాత్సర్యంబున నేన్పదుల్ములుకు లమ్మాణిక్యజాసూతి తే
రుత్రిక్తంబునగూల్చ నాఘనబలుం డుత్తుంగ దివ్యద్రథం
బుత్సాహంబున నన్యమెక్కి కలహోద్యోగుండునై శూరప
ద్మోత్సేకంబు దొలంగునట్లొకట వాయుఃకీలికాండంబులన్॥ 114
క॥ విడిచిన నురముపయింబడి పొడిపొడియైపుడమిరాలబొగరునమఱియున్
వడియామ్య సూర్యకాండము లడరించిననవియునేగి.యసురునురంబున్॥
క॥ ఉద్ధతినిదాఁకి మొనచెడి యిద్దరఁబడె మగుడ వారుణేంద్రశరంబుల్
క్రుద్ధుఁడయి నిగుడఁజేయఁ బ్రసిద్ధంబుగ నవియురంబు ఛేదించుగలిన్॥
వ॥ జవాతిశయంబున నేతెంచి రాత్రించరాధీశ వక్షస్తాడనంబున నిరర్థక
ములయి యిలంగలిసె నంత మాయాసురాస్త్రంబులువైచిన నవి గొద
గొనుపగిది బఱతెంచి రొమ్ముదూఱఁ జెదరి భూతలంబునబడియె దద
నంతరమున భువనసంహారహేతు ప్రతిభయంబులగు బ్రహ్మనారాయణా

స్త్రంబులు ప్రయోగింప నవి పెల్చనగవిసి పుడమిజారిన దిదృశుకు రింభోళి
మహోద్భుతంబునఁ దదీయ బలశౌర్యములుగ్గడింపుచు జన్యంబున దివ్యా
స్త్రంబులు దన్నుజుట్టినఁ దలకక యురంబొడ్డెనని ప్రస్తుతించుచుండ
నాలించి వీరబాహుండు॥ 117

ఉ॥ విస్మయముఁ వికల్పమును వేమఱుబొందుచునున్న మాంసపుఁ
ఘస్మరవర్యుఁడుగ్రుఁడయి గాఢతరోక్తుల బాడబాగ్నిలో
గా స్మయమాఱఁజొచ్చు మశకంబులభాతి భవత్కులంబపా
శ్యస్మదురంబుదాఁకి రజమయ్యెను చూచితె నాసమర్థతఁ॥ 118

సీ॥ తొలుదొల్త నేనిన్ను దునుమనెంచితిగాని నీబలశౌర్యముల్ నిపుణతలును
దర్శింపఁగోరి యిందాకఁదాళితినింక జూడుము నిను జంపువాఁడననుచు
నుల్లసంబుల నాడుచుండ వీరభుజుండు జండకోపానల జ్వాలుఁడగుచు
నస్త్రవరేణ్యమైనట్టి పాశుపతంబు దూర్ణంబుగా వింటిదొడిగియేయ

తే॥ నది ఫణివిషాగ్నికీలల నఖిలదిశల నావరించుచు రాఁజూచి యసురవిభుడు
నప్రతిహతంబునైన నయ్యస్త్రమునకు బ్రతిశరంబేసెనద్దియే ప్రతిభ మెఱసి

తే॥ అప్పుడయ్యస్త్రయుగ్మంబు నసదృశముగఁ
బోరి పిమ్మట శాంతించి వారివారి
సాయకంబులు వారల సరసనిలువ
శూరపద్ముఁడు వీరునిజూచి యనియె॥ 120

ఉ॥ చూచితినేను నీయధికశూరత నింక మదీయశౌర్యముఁ
జూచి యెఱుంగుమంచని యిషుప్రతతిఁ బఱగింప వీరుఁడుఁ
వైచెనుదత్క్రియఁ దనుజవర్యుఁడు వెండియు గ్రూరశాత నా
రాచములై దునుంబది శరంబుగవైచియు విల్లుద్రుంచినఁ 121

మ॥ కినుకఁ వీరభుజుండుదగ్రుఁడయి శక్తిఁవైవ ఘోరంబుగా
దనుజాధీశునురంబుదాఁకి పొడియై ధాత్రింబడఁ శూరుఁడు
క్కున భీమంబగు దండముఁబఱపఁగాఁ గోపించివీరుండు గ్ర
క్కునఁ దానుఁ దృఢదండమొండువిడువఁ గ్రోధించియారెండునుఁ॥

చ॥ తలపడి శూరుదండమతిదారుణభంగిని వీరుదండముం
బొలియఁగఁజేయ వేగమున బొంగుచు నాతనిఁదాఁక దేహముం
దెలియకసోలెనంతటను దేఁకువసూతుఁడు సేదదేర్చఁగాఁ
దలఁచి వెసన్ రథంబచోటు దాటఁగఁదోలిన జూచి శూరుఁడున్॥ 123

మ॥ ప్రకటక్రోధమనీష భూతనికురంబంబున్ నిశాతాయుధ
ప్రకరంబుద్ధతినేసిపోఁదఱుము భాస్వత్కోటి తేజోజ్వలుం
డకలంకుండగు పార్వతేయుఁడు నిశాటాధ్యక్షు దోర్విక్రమా
ధికతన్ నైజబలంబులొందిన మహాదీనత్వమున్జూచుచున్॥ 124

తే॥ ఒడలెఱుంగక వివశుఁడై పడిన యధిక
విక్రమాటోపుఁడైనట్టి వీరబాహుఁ
గాంచి నిర్ణిద్రరోష కర్కశుఁడునగుచు
దేరిపయినెక్కి యనికి నేతెంచుటయును॥ 125

—♦ కుమారస్వామి శూరపద్మునిపైఁ గవియుట. ♦—

వ॥ శూరపద్ముఁడు గుమారుండనియెఱిఁగి జగన్నాథుండును రాక్షసవంశో
త్పాటనదక్షుండగు నమ్మహాత్మునితో దుర్మదాతిరేకంబున నిట్లనియె॥

ఉ॥ ఓయిషడాననా! రణమహోగ్రులునైన భవచ్చమూపతుల్
కాయములూడ్చి కూలుటలుగన్గొని యింతటనైన మూర్ఖముం
బాయక నన్నుమార్కొనునెపంబున నిల్చితివాజియందు నీ
కాయువునిండి నిక్కమిదియంచు మనంబుననెంచుమర్భకా॥ 127

మ॥ బలహీనాంగులు క్రౌంచతారకులతేవన్ నన్నుభావించితో
తెలియంజాలవు మత్పరాక్రమబలస్థేమంబులన్నీవు గుం
డలితల్పాద్యమరాదులన్ గెలుచుజాడన్ గెల్తునిన్నాజిలో
పలనన్నన్ విని మందహాసముఖుఁడై పల్కెన్ మహాసేనుఁడున్॥ 128

మ॥ వినరా! యోరి! నిశాచరాధమ భవద్వీర్య ప్రతాపాదులన్
క్షణమాత్రంబున మాయఁజేసెద ననున్ గర్వంబుచే బాలుఁడం

చని మాటాడితివౌర పంకరుహగర్భాండంబులెల్లం ద్రిలో
చను నేత్రాగ్నికణంబొకండు దహియించంజాలదే దుర్మతీ॥ 129

తే॥ పనికిమాలినమాటల ఫలముగలదె
యనిన శూరుండు రోషభీషాస్యుఁడగుచు
హరి త్రివిక్రమగాత్రంబుకరణి మిగుల
నున్నతంబైన కోదండమూని యంత॥ 130

వ॥ మౌర్వీ నినాదంబొనరించినఁ దద్గంభీరనాదంబు సప్తసముద్రధ్వాన
జైత్రంబయ్యె నప్పుడు కార్త్తికేయుండు॥ 131

సీ॥ మృత్యుసంహారోర్ధ్వనృత్యవేళాక్షిప్త చరణతుల్యంబును నిరుపమాన
మగువిల్లుదాల్చిబ్రహ్మాండంబులన్నియు నేకకాలమ్ముమ్రోయనెట్టులుండు
నారీతిజ్యానాద మడరింపఁగాఁజూచి శూరుండు గాంగేయు సూతరథ్య
రథములఁ దచ్ఛరీరంబును లోకముల్ నిండునట్లు ననేకకాండసమితి

తే॥ నేయ నవియన్ని నడుమన మాయజేసి
క్రౌంచవైరి నిదాఘమేఘంబుకరణి
నధికశరములువర్షించి యార్చుటయును
నాగ్రహోదగ్రుఁడయి శూరుఁడతిరయమున॥ 132

క॥ శరజన్మునిసాయకముల హరణంబొనరించి మగుడ నగణితబాణో
త్కర మతనిపయినినేయఁగఁ గరమరుదుగవానిరజముగాగుహుఁడేసెన్॥

తే॥ మగుడ గుహుఁడు జతుర్దశమార్గణముల
యామినీచరు బాహుద్వయమునబఱప
నాటకమ్ముల్కులిలగూలినం గడింది
కోపమునఁ బార్వతీసూనుఁడేపుమీఱ॥ 134

క॥ కుధర మశనిచేఁ ద్రుంచినవిధమున నొకవేయి క్రూరవిశిఖంబుల శూ
రు ధనుర్దండముగూల్చిన నధికౌద్ధత్యంబుతోడ నసురేంద్రుండున్॥ 135

మ॥ హరిపంకేరుహసంభవాదుల కశక్యంబైన శక్త్యాయుధం
బురువేగంబునవైవ శంకరసుతుండుర్వింబడంజేసె భీ

కరభంగిం బడునాల్గుబాణములవీఁకఁ దానివీక్షించి యా
శరుఁడాశ్చర్యమునొందుచుఁ బటుతరేషా్వసంబు జేబట్టుచుఁ॥ 136

ఉ॥ శింజిని మ్రోయఁజేయుచు నజిహ్మాగవృష్టినిముంపఁ దద్విధిఁ
బుంజుసిడంబువాఁడు శరపుంజముసేయఁగ నిట్టులొండొరుల్
కుంజరయుగ్మకంబుగతి ఘోరరణంబొనరించుచుండి యు
న్నంజుడుతిండితేఁడు శివనందనుబాహులనేసె నేడిటఁ॥ 137

వ॥ అబ్బాణంబు లమ్మహితాత్ము భుజంబులందగిలి విశీర్ణమగుటయు సేనాని రౌద్రోద్రేకచిత్తుండై నిశాతశర చతుర్దశంబునఁ దదీయ శతాంగ రథగుప్తి కోదండంబుల నోలి నేలంగూలిచి యత్తఱి సహస్రాంబకంబు లడరించుచుఁ దక్షణంబున జతుర్దశలక్షసాయకంబులు రొమ్మునంగ్రుమ్మిన శూరపద్ముండానేఁతకోరిమిబూని సింహనాదంబుసేసి॥ 138

సీ॥ ధైర్యసామగ్రి నవార్యమౌశూలంబుబరగింపఁగా గాంచి బాహులేయుఁ
డసిచతుష్కంబున హతిసెసి మఱి సప్తనిశితశరంబుల నిర్జరారి
ధవళాతపత్రముల్ దఱిగియామీఁదట నొకముల్కి మకుటంబునుర్విడుల్చి
యగణితాస్త్రంబుల నఖిలభూషణములు జివ్వనేలనుబడఁజేయుటయును

తే॥ సురకులారాతి చింతించి పరిభవమున గలిగినట్టిబలంబెల్ల దొలఁగిపోవ
బలువయినపేదగతిఁగుందువడుచునుండె నపుడురక్షోబలంబులహాంకరించి॥

క॥ ఆదైత్యుఁజుట్టి కలకలనాదములొనరించి యుగ్రనారాచ ప్రా
సాది మహాయుధములుగుహుమీఁదంబఱపుచునుదొమ్మి మెఱసిరికడకఁ॥

— ♦ షాణ్మాతురుఁడు చక్రాయుధమున దనుజుల నఱ్ఱాడుట. ♦ —

తే॥ అద్దిగనుఁగొని శరజుఁడత్యాగ్రహమున
సర్వహరణసమర్థము బూర్వదేవ
విలయము సహస్రకోటి సంకలితమైన
చక్రముం ద్రిప్పివైవ నాసమయమందు॥ 141

చ॥ ఇటు గుహుపాణిముక్తమయి పెచ్చినవీర్యముతోడఁ జక్రము
త్కటబ్బల యామినీచరవితానముగూల్చుచు శత్రుసేనలం

గటి కర నాసిక శ్రవణ కంధర పాద శిరోజ నేత్రముల్
తటుకునద్రుంచి ఘోటక శతాంగచయంబుల దూల్చి క్రమ్మఱన్॥ 142

ఆ॥ వెలిగొడుగుల గెడపి కలహాంగణంబున నన్నికడల బఱచినట్లొనర్చ
రాక్షసుల యముండు భక్షింపనుంచిన వెండితళియలట్టులుండెఁజూడ॥ 143

వ॥ ఇట్లు నిర్వక్రవిక్రమంబున నమ్మహాచక్రంబు ఖండనోర్వీస్థలంబునఁ గబంధనటనంబును బిశాచనికరఘోషణంబును గంక గృధ్ర కాక శశాదన సంకుల కోలాహలంబును నెగడఁజేయ నక్కాలంబున గరుడధ్వజ సుదర్శనము భయాన్వితమై యుద్ధానిఁ బెద్దయుంబొగడె నంత నాచక్రంబు॥ 144

శా॥ ఆజిక్షోణినిగల్గురాక్షసుల సంహారంబుగావించి గౌ
రీజానిప్రియసూతిఁజేరఁజని కూర్మిన్ పాణిలోనిల్వఁగా
శ్రీజేమార్తురచచ్చినట్టి దనుజశ్రేణిన్ విలోకించి యీ
తేజోధిక్యశరంబు పాశుపతమో తిగ్మంబునౌ శక్తియో॥ 145

ఆ॥ అదియుగాకయున్న నత్యద్భుతంబగు
శాపమో! యటంచు గోపవిస్మ
యములు మదినిబెనఁగ ననలునిక్రియిమండి
శరజుమీఁద బ్రహ్మశరమువఱపె॥ 146

మ॥ అలబ్రహాస్త్రము భీషణాకృతి నభేద్యారావముం జేయుచున్
బ్రళయోత్పాదనకారణంబనఁగ నొప్పారి ప్రజేశాకృతుల్
బలుగాన్పించుచుఁజేరరా గుహునికేలంగల్గు శక్త్యాయుధం
బలఘుప్రౌఢిమ్రమింగె శూరుఁడెదలో నార్చర్యముంబొందగాన్॥ 147

ఉ॥ ఆయెడగోపవేగమున నద్దితినందనరాజమౌళి నా
రాయణశస్త్రమున్ వయిచె నయ్యది మిక్కిలిభీకరధ్వనిన్
జేయుచు శౌరిరూపములనేకముతో గుహుఁజేరరాఁగ న
త్యాయతశక్తిచే మెసవెఁ దత్కరసంస్థితశక్తి యొక్కటన్॥ 148

క॥ అంతటనద్దేవద్విషకాంతుండిటు తనశిలీముఖములు సెడుట కా
వంతయును జింతసేయక పంతంబునవైచెఁ బాశుపతమార్గణముల్॥ 149

—♦ శూరపద్ముఁడు కుమారునిమీఁద బాశుపతాస్త్ర మేయుట. ♦—

వ॥ అప్పుడమ్మహానీయసాధనంబు రక్షఃపిశాచ భూత పన్నగ నికాయంబుల
నసంఖ్యాతముగాఁ గలిగించుచు మహోద్రేకంబున దిగ్భాగంబులదర
నొక్కుమ్మడినార్చుచు మట్టుమీఱి భూతవీరగణంబులు బెదరఁ గుమా
రుంజుట్టిన నమ్మహానుభావుఁడు దేవబృందములద్భుతంబంద ననాయా
సంబున హస్తాగ్రమున బట్టినంజూచి శూరపద్ముఁడు విచారగ్రస్తుఁడయి
కదనంబున నీతని నెదిరి సాధింపరాదనియూహించుచు ధైర్యసంపన్నుఁ
డగుటంజేసి నిశ్చలంబుగా నిలిచియున్నసమయంబున వానింజూచి
గంభీరోక్తుల సేనానియిట్లనియె॥ 150

సీ॥ ఓరిదానవ భీతినొందునిర్జరులను విడిచిపుచ్చుమటంచు వివిధగతులఁ
జెప్పిపంపుట మనస్సీమదలంపుము వారిబాధించుచు ఖండనంబు
వాంఛించివచ్చి మీవారలుహతులైరి పగనుబెంపక సురప్రకరములకు
బంధనాలయమునుబాప శుభంబబ్బు నామాట నీనెమ్మనంబునకును

తే॥ హితముఁదోపకీర్ష్యవహించితేని
దునుముదునునిన్ను మున్ను నీయనుజునట్లు
కరుణనీపైనగలిగినకతన నిట్లు
బోధజేసితిఁ గినియుటబోవజేసి॥ 151

తే॥ తేజితంబయి మెఱయు మదీయశక్తి
వయివఁ గ్రూరాత్మ నీతల వసుధగూల్చు
ననిన దైతేయనాయకుం డాత్మవగచి
యాంబికేయుని న్గుడు లప్రియముగజూచి॥ 152

చ॥ అతఁడు వివేకశూన్యమతియై విభవవ్యయకాలమౌటచే
నితఁడణిధైర్యమూని దివిజేశసుతుల్ విడిపింతునంచుఁ దే

జితమగుశక్తి నీయనుజుజీవములూడ్చినయట్లు నేఁడు నిన్
మృతునిగ జేయఁజాలియు శమించి త్యజించితినంచు బల్కెడిన్॥ 153

శా॥ బాలుండౌట మదీయ శౌర్యబలముల్ పాటింపకన్ వీఁడు నా
కేలన్ శస్త్రము జెంత సైన్యమును వీక్షింపంగలేకున్కిచే
నీలీలన్ననుఁ దూలనాడెఁగద నేనింకన్ దటిన్వేచి సై
న్యాళిందెచ్చి పెనంగుటొప్పిదమునుమ్మంచున్ వితర్కించుచున్॥ 154

తే॥ అంతలోన నదృశ్యుఁడై యసురవరుఁడు
నరిగెఁ నిజపురిజేరంగ నపుడు గుహుఁడు
దనదు శక్త్యాయుధంబున దునుమఁజాలి
యూరకుండెను బగతునియుల్లమరయ॥ 155

క॥ అంతఁ జతురాస్య హరి జంభాంతక ముఖ్యామరాళు లభవాత్మజు న
త్యంతమగు భక్తిఁబొగడుచు సంతసమునబలికిరిట్లు సవినయమతులై॥ 156

శా॥ స్వామీ మీబలమెంచ మాదృశులకున్సాధ్యంబె మిమ్మున్ సమి
ద్భూమిన్ మాటొక్కన నెవ్వఁడోపు నిపుడీదుష్టున్ విదారింపఁబో
కీమాడ్కిన్ విడిపుచ్చుటల్ మనసులో నీనీచు దోశ్శక్తినిన్
దామీక్షింపఁదలంచికాని నిజమెన్నన్ భారమైకాదు సూ॥ 157

ఆ॥ కడు విలాసమునను గాలనిరీక్షణమును నొనర్చుచుంటిరనుచు వినయ
వినమితాంగులగుడు గనుఁగొనివారల నీశ్వరీకుమారుఁ డిట్టులనియె॥

క॥ ఈరాక్షసుఁడిమ్మెఁదట బోరికినేతెంచెనేని బోనీయక ని
ష్కారుణ్యుఁడనై త్రుంచెద మీరలునమ్ముఁడనిచెప్పె మిక్కిలిదయతోన్॥

—♦ భూతవీరగణములు శూరపద్మని పట్టణము గొల్లపెట్టుట ♦—

వ॥ ఆసమయంబున మూర్ఛదెలిసివచ్చి తనచెంగటఁ గలకలంబులొనర్చుచు నిలుచున్న నవాధికలక్షవీరులను భూతగణంబులను గనుంగొని పడాన నుండు గలుషించి మీరలు శూరునిపుర లుంఠనముగావింపుఁడని యాజ్ఞా పింప వారలు మహాసంరంభంబున॥ 160

సీ॥ పటుతరకలకలార్భటబధిరీకృత
సకలదిగ్భాగులై సరగఁగదలి
పట్టణవరణంబుపజ్జకుఁజని యంద
ఱొక్కపెట్టునవార్చి యుక్కుమీఱి
తత్సాలమునుగూల్ప దద్ద్వారమాలించి
బలశాలియగు ద్వారపాలుఁడొకఁడు
నతిఘోరుఁడను దైత్యుఁడమితవరూధినీ
సహితుఁడై యెదిరింప మహితముగను
తే॥ భూత దైతేయవాహినీ వ్రాతములకు
సంకులాహవమగుడు నాసమయమందు
నసురులు బరాజితులునగు టంతజూచి
లోహమయమగు ముసలంబు సాహసమున॥ 161
చ॥ కరమునఁదాల్చి భీకరముగన్వడఁగా నతిఘోరుఁడప్పుడుౘ
బిరబిరద్రిప్పుచుౘ రిపులబింకమడంచుచు భూతసేనలం
బరిభవమందజేయుడు నపారబలుండగు మేఘుఁడౘ జమూ
వరుఁడొకకొండ బాహువిభవంబునవైచిన దైత్యుఁడోడకౘ॥ 162
క॥ ముసలంబున దూలించిన
వెస మేఘుండొక్క కఠినవిశిఖముగొని య
య్యసురు నురమందుగ్రుచ్చినఁ
గసిమించియతండు నొడుగఱచుచు గడఁకౘ॥ 163
తే॥ ముసలమునవైవ నతివేగమునను మేఘుఁ
డెగిరితప్పించుకొని కన్నులింగలములఁ
గురియఁదనకేల దైత్యుచెక్కులనుగొట్టి
హింససేసినగని భూతపృతనలెల్ల॥ 164
ఆ॥ ఒక్కలై సహస్రయోజన విస్తీర్ణమును పురీలలామమును ననంగ
వెలయుచున్నయట్టి వీరమాహేంద్రపూర్ద్వారగోపురంబువడఁగఁ బెఱికి॥

శా॥ పారావారమునందు మందరము దేవశ్రేణిచందంబునన్
భూరిధ్వానముపిక్కటిల్లవయివన్ బూర్వంబునన్దత్పుర
ద్వారస్థానికులైన దానవులతో నగ్గోపురంబంతటన్
వారాశింబడఁ దజ్జలంబులికి పైపైఁ నాక్రమించెన్బురిన్॥ 166

వ॥ అప్పుడప్పట్టణోత్తరదిశావప్రంబును భూతబలంబు లురులంద్రోచి త్వరిత యానంబునఁ బురప్రవేశమొనరించి యథేచ్ఛగా దైత్యచ్ఛేదనముసే యుచు నిల్లిల్లుగొల్లపెట్టియు నామూలంబుగా నాప్రోలు నేలంగలిపియు నానావిధంబుల బీభత్సంబుసేసి యచ్చోటువాసి భూతసైనికులు విశాఖు సముఖంబునకువచ్చిన నమ్మహానుభావుండు సకలసేనాయుతుండయి హేమకూటపురంబునకుజేరె నయ్యవసరంబున॥ 167

సీ॥ కుసుమవర్షంబును గురిసిరిదేవతల్ వందిమాగధుల కైవారమెసఁగె
సురదుందుభులుమ్రోసెసురలోకభజమానపాదపంకేజుఁడౌబాహులేయు
డఖిలసేనాసమూహముల యథాస్థానములకన్పి మణిపీఠమునవసించి
సౌఖ్యంబుగానున్నసమయంబునందర్కుఁడంబరంబుననుండియతిముదమున
తే॥ గార్త్తికేయునివిజయంబుగనుచు జరమ
కంధిలోమున్గె నంత రాకాసిఱేఁడు
దనవనిత పద్మకోమల తానుగలిసి
రేయియంతయు రణచింత సేయుచుండె॥ 168

వ॥ ఇట్లు శూరపద్ముండు రణమున పరిభవంబునొంది యేతెంచుట తదగ్ర సుతుండు భానుకోపుఁడనువాఁడు చారులచే నెఱింగి తత్సమయకృత్యం బులగు విజయమంత్రానుష్ఠానమును గలహాశితులును మాయాకల్పన క్రియలును దొఱంగి జనకుగృహంబునకారేయివోయి తనతండ్రివలన ముందటిదినయుద్ధవార్త దెల్లంబుగావిని దుఃఖించి యిట్లనియె॥ 169

ఉ॥ కర్కశసాయకాళి బలగర్వసమన్విత సైన్యయుక్తుమై
యర్కుఁడుజీఁకటింబలె రయంబున శత్రుల గీటడంచఁగాఁ

గోర్కి యెసంగు నాకపుడొకొండును దెల్పక నీవుబోవుటల్
తర్కము జేసిచూడ నుచితంబగునే సురవైరిచంద్రమా॥ 170

ఉ॥ పోరునకీవుబోయితివిపో యొకబాలుని నాజిగెల్చినం
జేరదుకీర్తి యోడినను జెందదులాఘవ మట్టులౌట నీ
వీ రణకేళికింజనుట యెంతయునొప్పదు నన్నుబంపుమా
వైరులజంపి నీముదము వర్ధిలఁజేసెద నెల్లి ప్రేల్మిడిన్॥ 171

— భానుకోపుఁడు తండ్రినూరార్చి యుద్ధప్రయాణము సేయుట. —

శా॥ నేనబ్బాలునికోడి దుర్యశుఁడనై నీచెంతకున్రాను దే
వా నైజంబుగ జేతనై మరలుదున్ బంపించునన్నన్న నా
సూనుంగన్గొని శూరుఁడిట్లను షడాస్యుంబోరిలోఁగూల్పఁగా
నేనుండక్కగ నన్యులోపరుసుమీ నిక్కంబుచర్చింపఁగన్॥ 172

ఉ॥ నీవుదదీయసైన్యముల నీఱుగజేసి మదంతికంబునం
దీవరకున్ మెలంగెదురహిన్ జరియింపుమటంచుబుచ్చి యా
త్మావసథంబునన్ నిదురనందెనిశాచరభర్తయంతఁ జా
రావళి భానుకోపు వినయంబునజేరి నమస్కరించుచున్॥ 173

వ॥ చింతించి పురలుంతనవిధంబెఱింగించిన భానుకోపుండకుంఠక్రోధంబున
రాక్షసశిల్పాచార్యునిచే నన్నగరంబెప్పటియట్టులుండ నొనరింపించి॥ 174

సీ॥ ఆరాత్రి యుత్తరద్వారంబుబాలింపఁ బదివేలరాక్షసబలముతోడ
ఘనుఁడుమహాకాయుడనెడురాత్రించరునియమించితాశయనించియంత
ప్రత్యూషమునలేచి భానుకోపుఁడు నిత్యసత్కృత్యములుదీర్చి జనకుతల్లి
యగుమాయయనుదానినంతరంగంబునఁ దలచుమాత్రనవచ్చినిలువజూచి

తే॥ వినయమునమ్రొక్కి రణమున వీరబాహు
బలసమగ్రతచేఁ బరిభవముగాంచి
దొంగవలెదానువచ్చినభంగి దెలిపి
తెలుపు హితమొందునాకంచు బలుకుటయును॥ 175

మ॥ వెస నమ్మాయ యజాచ్యుతాద్యమరులన్ వేధించుదోషంబుచే
త సుమీ నాశముదోచె గెల్వఁగ నసత్యంబన్న శూరాత్మజుం
డసుహృద్వీరభుజున్ జయించగల దివ్యాస్త్రంబుబోధించి నా
యనుసంరక్షణసేయుమన్న నొక మాయాకాండమిచ్చెంగృపన్॥ 176

ఆ॥ ఇట్టులొసఁగిపలికె నిమ్మహాసాధన మీదినంబుమాత్రి మిచ్చుజయము
ననుచుదెల్పియేగె నమ్మాయస్వేచ్ఛగా నంత భానుకోపుఁడలరి కడఁక॥

సీ॥ బాహుదండమునందు బాణాసనముదాల్చి
కలికుటమ్ములునించు కవదొనలును
బొందళంబుధరించి యైంద్ర యామ్యా గ్నేయ
వారుణ వాయువ్య సూగ చంద్ర
చతురాననాస్త్రముల్ సర్వసంహారణ
పారీణమగు పాశుపతముగొనుచు
నాగ హయ స్యందనంబులు బదివేలు
దోడరా దుర్మదోద్ధురులునయిన

తే॥ దనుజసేనలనేకంబు దళిమినడువ
వైరిభీకర డిండిమ భేరి మురజ
ఝుర్ఝరీ మడ్డు పటహ నిస్వానములును
దశదిశాభాగములనిండి తలుచునెలయ॥ 178

క॥ మదగజములు మొగిళులగల యుదకంబులుగొని పరాగముడిగింప మహా
స్పదమున దురఁగంబులు హరిపద రవిపథ గిరులద్రొక్కి పటుగతినడువన్॥

క॥ నీలతను లరుణనేత్రా భీలులునగు శుక్రశిష్యవీరు లనేకుల్
లీలన్ జతురంగబల శ్రీలొప్పుచు వెంటనడువ జివ్వకువెడలెన్॥ 180

ఉ॥ అప్పుడనేకరత్నమయహారి శుభోదయకాంతి దిక్కులం
గప్పెడు ఛత్రచామరగణంబుల నీడల సంచరించుచున్
రొప్పుచహంకరించిన మరుద్రిపుపాదతలోద్ధతిన్ దిశల్
తెప్పునముంపజాలు జగతీరజమున్ తిమిరంబువర్ధిలన్॥ 181

ఉ॥ దాని కనద్విభూషణవితానమణీగణ సంభవప్రభల్
సానలదీరు ఖడ్గముఖసాధనరోచులడంచుచుండ సే
నానిభటుల్ మహిఁబడ నణంచిన సాలపుద్వారమందునన్
దానవసేనతో నిలిచె దానవుఁడంతట భానుకోపుఁడున్॥ 182

వ॥ తత్ప్రకార దుస్థితింజూచి వగచి యినుమడించిన యీరసంబున గరు పాటి తురఁగాస్యనామక గూఢచారునితో నీవేగి వీరబాహునిఁగని జన్యంబునకై భానుకోపుండు నిన్నుఁజీరె రయమ్మునరమ్మని నావాక్యమ్ములుగా దెలుపుపొమ్మన వాఁడు వడినరిగి శూరునికొడుకు నుడివిన వడువున నడప నొడఁబడి జడిమవిడి దడములిరుగడల నడువ మృదుని సుతునికడకునడిచి కడుబలుండగు వీరబాహుఁడంజలిఘటించి నిలిచినన్ జూచి కుమారుఁడానందంబున నిట్లనియె॥ 183

— ♦ కుమారుఁడు వీరబాహుని యుద్ధమునకు బంపుట. ♦ —

సీ॥ భానుకోపుఁడు నేఁడు బవరంబునకు జలం
బొదవ సైన్యంబుతోఁగదిసినాఁడు
దశశతవాహినీతతులతో నీవును
లక్షవీరులు బలదక్షులయిన
నీతమ్ములనుగొల్వ నెటినేగి పెనఁగుము
దనుజుఁడు మాయాస్త్రమును బ్రయోగ
మొనరించెనేని యత్యుద్ధతి నదిమిమ్ము
నందఱ మూర్ఛలనొందఁజేయు

ఆ॥ నట్టిచెట్ట శక్తియనెడి నాసాధనమునుమాన్ను మీరుజనుఁడటన్న
వేడ్కమీఱ మ్రొక్కి వీరబాహుండాది యయినవారు గదలి రనికినపుడు॥

క॥ అత్తఱిని వీరబాహుఁడు జిత్తావాసమున శరజుఁజేర్చి సమస్తో
యత్తమగు నరదమెక్కి వియత్తలమద్రువంగ నార్చి యాటోపమునన్॥

క॥ భేరీ కాహళ పటహా ద్యారావము భూతసైనికారావములుం
దారాపథంబుముట్టఁగ దారుణసంగ్రామభూమి దఱిసినయంతన్॥ 186

క॥ దితిభూ భూతబలంబులు శితమార్గణపంక్తి దురముసేయుతఱి మహో
ద్ధతిమీఱ నాఱ్బ నతుఃప్రతతులు దేజిత కలంబపాళిఁ బ్రేయఁగా॥ 187

తే॥ అంఘ్రి కర కర్ణ నేత్ర ముఖ్యావయవ వి
భిన్నులై భూతబలములు బృథివిగూల
నపుడు శేషించు భూతబలౌఘమడరి
గుంపులై యున్న రాక్షసకోటిదాఁకి॥ 188

ఉ॥ నెత్తులుప్రీలమోదుచును నింగికిఁజిమ్ముచుఁ బిండిగా మెయిఁగా
మొత్తుచు గంధిమధ్యమునముగ్గఁగ గిర్గిర ద్రిప్పివైచుచుఁగా
జిత్తజవైరి ముఁగా బురనిశీధినిచారులఁబోలె మాయయఁగా
బత్తనదైత్యులఁగా గుహునిభాతి సురారుల నుక్కడంచుచుఁగా॥ 189

ఉ॥ తోయజపత్రనేత్రములు దోయదవిగ్రహముల్ మహోగ్ర పం
చాయుధహస్తముల్ దనరి యచ్యుతులట్లు జయాంకశంఖముల్
మ్రోయఁగఁజేసి కూల్చుచు సముద్ధతిగొందఱు శీతశైలజా
నాయకుఁడాదిఘోణిరదనక్రియ నేగ్గులపండ్లు డుల్చుచుఁగా॥ 190

వ॥ మఱియు గొందఱు భూతవీరులుదలపడి గజాననంబులఁ బర్వతాకారం
బుల నురువడించిన మాంసాశనుల విశాఖునిపగిది హింసించుచు సమ
రాంగణమం దతిలాఘవంబున నెల్లచో జలివీడితిరుగుచు మున్ను దేవతా
పీడనకారి జలంధరు నభవుచక్రంబుగమనిక చక్రాహతిందూల్చుచు
భైరవుండంధకక్రవ్యాదుబోలె శూలములగ్రుచ్చుచు బహురీతుల నరా
తుల వీతాసులనుజేయుడు మిగిలినదోషాటు లిషువృష్టి ముంచుచున్న
యెడ దిలకించి భానుకోపుఁడు రథారోహియై నడతేర వీరబాహుఁడ
ట్లన తారసిల్లె నిట్లుభయ వీరోత్తములు మచ్చరంబున సజ్యధానుష్కులై
పరస్పరవిజయాపేక్షల శరవృష్టి గురియుచున్న కాలంబున॥ 191

—♦ వీరబాహు భానుకోపుల ద్వంద్వయుద్ధము. ♦—

శా॥ వీరావేశముతోడ వారిరువురుద్వృత్తిం బ్రయోగించెదుఁగా
నారాచంబులు నంతరిక్షమున రాణఁగా శార్ఙ్గగానొప్పుచుం

క్రూరవ్యాళములట్లు బోరి యడఁగఁ గ్రోధంబు రెట్టింపఁగా
నారాత్రించర వీరబాహులు దిదృక్షాశ్చర్యసంపాదులై ॥ 192

సీ॥ చలమునబోరుచో సత్వర రథములతో నింద్రభువనంబు దూటిమగలి
కదనరంగము జేరి గర్జించుచు విధాతృజగమున కేగి యచ్చట బెనంగి
నగధరులోకంబునకు బోయి విశిఖ ప్రయోగంబు సేయుచు నొకరికొకరు
లోఁగక తూర్ణంబ సాగరద్వీప లోకాలోక గిరి నగర్యటనులగుచు

తే॥ నెందుజూచిన దారయై సందులేక
దారుణంబైన సింహనాదము లజాండ
పిఠరనిర్భేదమొనరించి పెంపుజెంద
సదృశబలమునఁ గలహించు సమయమునను॥ 193

మ॥ దితిజాధీశ్వరనందనాగ్రణి కనద్దివ్యాస్త్రముల్ గ్రోధియై
శతసంఖ్యల్ శతమన్మణిప్రభవు వక్షంబందునాటింపఁగా
నతఁడా సేఁతకుమండి వేములుకు లయ్యాదిత్యవిద్వేషిపై
ధృతిమై వైచి హరించె సూతుహయముల్ దేరుల్ సురల్ మేలనన్॥ 194

చ॥ అసురుఁడు వీరుఁడిట్టుల మహాస్త్రములొండొరుమీఁదనేయుచుం
గసియెసఁగంగి వాని దునకల్ గనులాగునడంచుచున్ వియ
ద్వసుధలునిండఁ గేసరి రవంబుల జేయుచుఁబోరి లోక సా
ధ్వసకరలీల బాశుపతభల్లయుగంబును వైచిరిద్దఱున్॥ 195

శా॥ ఆశస్త్రంబులు రెండునుం బెనఁగ ధూమ్యాకాశముల్ మ్రోసె తా
రేశబ్రధ్నులు సంచలించి రుడులీ పృథ్వీస్థలిన్ రాలె లో
కేశాదుల్ భయమొంది రంబునిధులయ్యేడున్ గడున్ మ్రోసె స
ర్వాశల్ బ్రద్దలువాఱె గల్పరవమట్లార్చెన్ బయోదంబులున్॥ 196

తే॥ ఇట్టి యుత్పాతములుగాంచి యెడదజడిసి
శూరు పురమునగల రాక్షసులుదపింప
నసురనాయకుఁడిదియేమి యద్భుతంబొ
యెఱిఁగిరమ్మని చారుల దఱుముటయును॥ 197

చ॥ జవమునవారలేగికని శత్రువిరోధినిజేరి సర్వముఁ
వివరముగాఁగఁజెప్పవిని వీరభుజుండును నాతనూజుఁడుఁ
భవునిశరంబులఁ విడువ బంధురశక్తి దదస్త్రయుగ్మముఁ
బవరముసేయనిట్టుల నుపద్రవమయ్యెను నేనెఱుంగుదుఁ॥ 198

ఉ॥ నాసుతువిక్రమంబును గనందుమనంబున వీరబాహుఁడుం
బోసరమింతెకాకయని పొంగుచుఁబల్కెనెడం దదస్త్రముల్
భాసురలీలఁబోరి పిదపఁ భువనక్షయకారణంబులై
డాసిన వాని శాంతమువడంగనొనర్చిరి వారలిర్వురుఁ॥ 199

క॥ అప్పుడు పాశుపతంబుల ముప్పుతొలంగుటయు వేల్పుమూఁకలు మోదం
బొప్పారిచెలఁగిరసురుఁడు దప్పకయనిగూలుతనదుదళములజూచెఁ॥200

తే॥ చూచి భయమునవింగినగోచరుఁడయియుండ నదిగాంచినిర్జరమండలంబు
శత్రుభీమంబుగా ద్విపశత్రునాద మూర్జితంబుగఁగావించియుల్లసిలిరి॥201

వ॥ అంత భానుకోపుండు గగనగతుండగుటయు దిగులొంది పగతుఁడుగాన
నభోమణి గళితభానుండై చరమగిరిగుహాభ్యంతరవాసియయ్యెనప్పుడు॥

చ॥ ఇనుఁడపరాచలంబునకు నేగుటగన్గొని భూతసైనికా
గ్రణులును లక్షవీరనికరంబును నీనిశిపోయి వేఁగినఁ
రణమునకై శిఖావలతురంగు ననుజ్ఞనుదాల్చి యేగుదెం
చిన శుభమంచు డెందమున జింతనసేయుచునున్నయత్తఱిఁ॥ 203

తే॥ భానుకోపుఁడు దివినిల్చి పగనుబెంచి వీరివేధింపఁదలపోసి యూరికేను
నూరకేపోవన్యాయమా చేరియిచట నున్నరక్కసు లెగతాళి బన్నినగరె॥

—♦ భానుకోపుఁడు మాయాస్త్రముచే వీరబాహ్వాది భూతసేనల మూర్ఛిల్లఁజేయుట. ♦—

క॥ నావిమలకీర్తిచెడు నటుగావున బోవంగదగదు కడువడివైరుల్
చావఁగ మాయాస్త్రంబునగావించెదనంచుఁ బెల్లుగా మదినెంచెఁ॥ 205

తే॥ ఇటులనెంచి మాయాస్త్రమునేయ నదియు
జటుల ధారాధరాశుగసంఘ నినద

భీమమై భూతబలముల బృధివిగూల్చి
యంతఁబోవక కోపమత్యంతమగుడు॥ 206

వ॥ నిజమాయాబలంబున వీరబాహ్వాది సేనాప్రాతంబులగట్టి కడలినడుమ బడవైవ నద్దానింజూచి భానుకోపుండు మోదించి తండ్రికడకువచ్చి యావద్వృత్తాంతమువిన్నవించి నిర్ణయంబుగా రేపటిదినం బాయోధనంబున డింభకునివధించి మద్బాహుబలాతిరేకంబున జతుర్ముఖప్రముఖవిబుధనికరంబుల బంధనాలయమున నుండజేసెదననుటయు॥ 207

తే॥ శూరపద్ముఁడు దనయగ్రసుతునిపలుకు
లాలకించియు గౌగిటనలమి శిరము
మూర్కొని హితోక్తులాడి యమూల్యమకుట
మిచ్చి వీడ్కొల్ప నాతండు నేగెఁబురికి॥ 208

మ॥ అటబృందారకులందఱద్దితిజు మాయాస్త్రప్రయోగంబుచేఁ
బటుసత్వంబులుదూలి భూతబలముల్ పాథోధిలోఁజొచ్చి సం
కటముల్ వొందుచు గార్తికేయునకు నిక్కార్యంబుసర్వంబు నొ
క్కటవిన్పింపఁగ గుంపులై చనిరి దుఃఖంబాత్మలఁదార్కొనన్॥ 209

ఉ॥ అంతకుమున్న నారదమహర్షి విశాఖునిజేరి సర్వవృ
త్తాంతముదెల్ప హస్తమునదాల్చినశక్తినిజూచి నీవు న
త్యంతరయంబునంజని వియచ్చర వీరభుజాదిసేనలం
జింతలబాపి తోడుకొని చేరుముమమ్మని వీడుకొల్పినన్॥ 210

సీ॥ అగణితార్కద్యుతు లష్టదిక్కులనించి చటులాంధకార భంజనపటిష్ఠ
గంభీర కల్పాంతకాల కీలాభీల కృష్ణవర్త్మాభమై విష్ణుపాద
భరిత ధూమంబయి ధరనగ్నికణములు దట్టమైమెఱయ శతారనినద
మునను గర్జిల్లుచు బురుహూత శిఖి పాశి యనిలాబ్జజార్క నారాయణాది

తే॥ భూరిశస్త్రంబు లభినుతిపూర్వకముగ
వెంటనేతేర తీవ్రమౌ వేగమునను

శక్తి మాయాస్త్రసంహరణంబుసలుప రాగ
వార్ధి భయమొంది వడఁకుచువచ్చి మ్రొక్కె॥ 211

—♦ గుహుఁడు శక్తిప్రయోగమున వీరబాహ్వాదుల మూర్ఛబాపుట. ♦—

క॥ ఏవంవిధ దుష్కృత్యముగావింపఁ గటాక్షదృష్టిగను నన్నను పా
రావారమునకు నభయంబావేళనొసంగి తత్ప్రయస్సులనడుమన్॥ 212

తే॥ దుమికి మాయాస్త్రమును బసదూల్చుటయును
వీరబాహుండుమొదలుగా వీరులైన
సకలసైన్యాధినాథులు సరగఁదెలిసి
శక్తినిట్లనిపొగడి రాసక్తితోడ॥ 213

మత్తకోకిల.

శర్మదాయిని నీవుబూర్వము సర్వలోకభయంకరున్
దుర్మదాంధుని దారకాసురు ద్రుంచిమాకు శుభంబులం
బేర్మిగూర్చితివంచుమ్రొక్కి వివేకబుద్ధినుతించుచున్
నిర్మలాశయులై సముద్రము నిర్గమించి మహోన్నతిన్॥ 214

వ॥ తీరంబాశ్రయించుటయు వారలఁగని శక్త్యాయుధంబు మహానురాగం
బున శరజన్ముండీక్షణంబున మిమ్ముంజూచుటకై రమ్మనియె వేనమ్మ
హాత్మునెంతకేగెద మీరలు సత్వరంబున రండనిచెప్పి చనియెనంత॥215

చ॥ ఉదధితటంబునన్నిలిచి యుజ్జ్వలతేజుఁడు వీరబాహుఁడా
ప్పిదముచెలంగ భూతగణవీరులగన్గొని క్రోశమాత్రము
న్నది కనుఁడల్లదేపురి రణంబున నిందఱు శాంబరీ శిత
ప్రదరముచేనలంచిన సురద్విషుఁడచ్చట నున్నవాఁడుసూ॥ 216

తే॥ కనుక మనసేనదోకొని మనముపోయి పట్టణముగొల్లవెట్టి పావకునకర్ప
ణంబుసేయుద మవల దానవుఁడునికివచ్చెనేని వధించెదఁ బెచ్చుపెరిగి॥

క॥ అటుసేయనయితినేనిన్ దిటమున విలుచివరబడి గతించెదనంచున్
జటులప్రతిజ్ఞసేసిన బటుమతి దద్భ్రాతలెల్ల బలికిరిప్రతినల్॥ 218

శా॥ ఈరీతిఁ శపథంబులాడి వయిరంబేపారఁ బూర్వశ్చిమ
ద్వారస్థంబగుగోట మీటుతమిచేతఁ బెల్లుగర్జించుచుఁ
వీరవ్రాతముఃశీఘ్రయానమున నవ్వీడుంబ్రవేశించి ప్రా
కారంబుద్ధతితోడజుట్టుకొని చీకాకొందఁగాఁ జేయఁగఁ॥ 219

వ॥ తద్ద్వార గోపురస్థానంబునం దనుదినంబును మాయాసుతుఁడగు వ్యాఘ్రవక్త్రుండు నక్కోటఁగాచుపనికై వేయిదివిటీలడాలు దెసలనిగుడ జతురంగబలోపేతుఁడై రత్నాసనంబున శౌర్యధైర్యరాశియై నిలిచియుండుగావున నతండు భూతబలముల కోలాహలమాలకించి సేనావారముతో నడరిన రాక్షసభూతసైనికాద్వయంబు గలిసి యపరిమిత శిలీముఖ వృక్ష గిరి పాషాణ ప్రకరంబులను బాణి పాద తాడనంబులను వైరుల మారణంబుసేయుచు నుభయవాహినులు దలపడిన నధికబాహుబలులైన భూతవీరు లసురవిసరంబుల రుధిరసిక్తావయవుల గావింప శ్రమనొంది దెసలకు బఱచినంజూచి వ్యాఘ్రవక్త్రుండు గలుషించి భండనోద్యోగియై కలకలధ్వనితో శూలాయుధపాణియయిభూతబలప్రయోగ మహీరుహ పర్వత హననంబొనర్చుచు గలహంబున భూతగణంబుల గలతనొందించుచుండెనప్పుడు॥ 220

తే॥ సింహుఁడనుభూతపతి యనిసేయనడర
బులిమొగమురక్కసుఁడు శూలమునను వ్రేయ
సింహుఁడాత్మీయశూలంబు జెలఁగివైవ
బోరి రెండును దునుకలై భూమిబడియె॥ 221

సీ॥ కనుఁగొనిసింహుడు గనలియార్చుచు మల్ల
యుద్ధంబులో దైత్యునుసురుగొనిన
సురకోటిముదమంది కురిసెప్రసవవృష్టి
దత్కాలమున భూతతతిగడంగి
ధురచుచు నప్పురికరయభూషణమైన

కోటను నేలపై గూలద్రోసి
యారేయి వీధులయందుజొచ్చి నిజేచ్ఛ
మచ్చరమునుగాల్చి యచ్చటచట
తే॥ గల విమానంబుల శతాంగములను గోపు
రముల ప్రాసాదములను జూర్ణంబుసేసి
విశిఖపాతంబుల నిశాటవిసరములను
జదిపి లీలావిహారంబు సల్పునపుడు॥ 222

—♦ వీర మాహేంద్రపుర దహనము. ♦—

చ॥ చలమున వీరబాహుఁడు గృశానుసమీర శరంబులప్పురిఁ
జ్వలితముసేయవైవఁగ నుపద్రుదుఁడంతట నీనిశాచరో
జ్వలనగరంబుగాల్చినను వంతలబెట్టును శూరుఁడంచెదం
దలఁచి మహాభయంబున వితర్కముసేసి దిటంబుబూనుచుఁ॥ 223
ఉ॥ ఇప్పనిమేలుగీడులువహించెడువాఁడు బ్రియోక్తగాక నా
కెప్పగిదిఁఘటించునని యెన్నుచు ధైర్యముతో మహోగ్రుడై
యప్పురిగాల్పగాదొడఁగె నాసమయంబునఁ దచ్ఛిఖాతతిం
దప్పకదగ్ధమౌ దనుజధామములఁగని దైత్యులార్తిమై॥ 224
చ॥ తడబడి శూరపద్మగని తావకసూనునకోడి వార్ధిలోఁ
బడి వెతనొందువీరులు గపాలితనూభవుశక్తిదేటి వా
రడరినఁగిన్క నీపురమునంతయు దగ్ధముజేసి వ్యాఘ్రివ
క్త్రుఁడు మొదలైన రాక్షసులద్రుంచి ప్రమోదయుతాంతరంగులై॥225
ఆ॥ ఉన్నవారు నయుతయోజనంబులమేర తావకీనపురము దగ్ధమయ్యె
ననుచుజెప్ప శూరుఁడాగ్రహంబున వేగరులనుబొమ్మటంచు సెలవొసంగె॥
వ॥ పదంపడి శూరపద్ముండు గనుల విస్ఫులింగంబులుసెదర జలదంబుల
నాహ్వానించి గృహదహనోద్యోగవహ హుతవహు జల్లార్పుఁడన విని
యితండిప్పనికొప్పకున్నఁ దప్పక జెఱుమంచగలం డెదిరించితిమేని

వధించుగావున నిర్దుష్టునికష్టంబులబడుటకంటె జెప్పినట్లాలించి శిష్టారాధితుఁడగు వీరబాహునిచేఁ దనువువిడిచిన గడుంబొడవనితలంచి మేఘసమూహంబు లంబువులనించి యగ్నిని శమింపఁజేయుటయు వీరబాహుండుదిలకించి మాయయో కల్పకాలజలధరవ్రజమో యని యూహించుచుండ నారదుండరుదెంచి యిది మాయయని తలంచకుమయ్యాసురవరు నామంత్రణమున నేతెంచు సంవర్తసమయ వారివాహావారంబుగా నెఱుంగుము బడబానలాస్త్రప్రయోగమున దీనిమాన్పుమని బోధించియరుగ వీరుండట్లుగావించి మబ్బులనుబ్బడఁచిన నవిమహిందొరగిసాష్టాంగ తురధ్యానమాహాత్మ్యంబున సాగరుంగలిసెనంత 227

క॥ శూరాసురుఁడివార్తను చారులచేఁదెలిసి విలయసమయజ్వలనా
కారమునమండి పలికెందేరుందెమ్మనుచు రిపులద్రెంపఁ బయనమై॥ 228

వ॥ అప్పుడధికమాయావియు బలశాలియు ద్రిశీర్షుండును నీతిమంతుండును నైన శూరపద్మునిసుతుండు హిరణ్యుండనువాఁడు జనకునుపకంఠంబు నాశ్రయించి హితవచనంబుల బోధింపఁగడంగిసవినయంబుగానిట్లనియె॥

—♦ హిరణ్యుఁడు శూరపద్మునకు హితోపదేశము సేయుట. ♦—

సీ॥ జగతినెవ్వరికైన దగదు దేవద్రోహమాయువు సంపద హతముసేయు
ద్రుహిణ జనార్దనాదుల బాధలనెట్టింగి హరుఁడంప దేవసైన్యప్రభుఁడయి
సేనాని సురలరక్షింప నీక్రియవచ్చె సత్యమిమ్మాటలా స్కందునిపుడు
దైవపరాయత్త భావునిగానెంచు మమరులబోదోలునట్టి బలము

తే॥ మనకునిచ్చుమహేను భావునకుమరలదత్త్వ భావముగొను టెంతధరణినెవ్వఁ
డాత్మహితకాంక్షియగునాతడభవునాజ్ఞ గడువరాదట్లు సేయదుర్గతినిబొందు

తే॥ అంధక ద్విపఖండ జలంధర త్రి
పురనిశాట ఖగ వ్యాఘ్ర సురవిరోధు
లెట్లుమడిసిరో యెఱుఁగవే హ్యాదిజ శమను
లేమియయ్యిరో తెలియదే యీశుమహిమ॥ 231

క॥ వనజాక్షుని దశరూపములను మొదలిటియైదు నెట్టులం బొందినవో
వినమె శివాజ్ఞకువెలియై మును దక్షుఁడు ఘోరమరణముఁ గనలేదే॥

సీ॥ సురదీర్ఘికా గర్వహరణంబు విషభుక్తి పాకశాసను బాహుభంజనంబు
గనకగర్భుని శిరఃఖండనంబు గపాలధారణంబు ఫణీంద్రతల్పు రక్త
పానంబు మొదలైన భర్గునికృత్యంబు లీవెఱుంగనివి కా వెంచిచూడ
నట్టి శంకరపుత్రుఁ డావిశాఖునితోడ నాజికుద్యోగించు టనుచితంబు

తే॥ దలప సాక్షాచ్ఛివుండును నలువ బంధనాలయము జేర్చి తానెలోకాళిసృష్టి
సేయు విశ్వాత్మకుండని చిత్తమందు దెలియలేవైతివిబ్బాలు దేవ నీవు॥

వ॥ మఱియు నిమ్మహానుభావుని నాదిఘోణి శృంగోత్పాటనంబుగావించి
ధూర్జటికొసంగినబలవంతుఁగా నూహింపుము. భవత్సోదరుఁదారకుం
గ్రౌంచుని రణంబున నంతమొందించిన మహావీరుఁడితండుగాదే కావున
నితని బాలుఁడనితిరస్కరింపకుము చంద్రశేఖరుఁడు హాసమాత్ర పాలిత
సమస్తభువనుండయు కార్తికేయ గాంగేయాది నామంబుల నుద్భవించె
నని మునిప్రవరులుగ్గడింతురు వివేకశూన్యులీశ్వరునకన్యునిఁగానెంతు
రివ్విక్రమరాశి కడలిపైవిడిచినశక్తి పునఃప్రయోగంబయినచో రక్కసుం
డొక్కరుండేని ప్రాణములుదక్కి మనగలుఁగునే మఱియునువినుము॥

ఉ॥ దూతయటంచు నత్యధికదోర్బలధుర్యుఁడు వీరబాహునిం
జేతమునం దలంపుగొనఁజెల్లదు మృత్యుభయంబు దివ్యమౌ
హేతిభయంబునాతనికి నెట్టులుగల్గుపోరిలో సురా
రాతులబెక్కుసేనల నిరంకుశవిక్రముఁడై వధింపఁడే॥ 235

ఆ॥ మఱియు భానుకోపుదఱిమె నవ్వీరునికతన నిప్పురంబు గాలుచున్న
దిప్పటికిని నితనినెదిరించిపోరంగ నెవ్వఁడోపు గుహునినెవ్వఁడాపు॥ 236

చ॥ అలుకను మున్ను నీకుఁ జెఱయందుగలట్టి నిలింపకోటులఁ
వెలువడఁజేయుమం చధికవిక్రమశాలి గుహుండుదెల్పఁడే
తెలియఁగజాలవైతి విటుదీనతచేకుఱ నిప్పుడైన నీ
వల పనినాచరించి వినయంబున మ్రొక్కిన నాతఁడొప్పఁడే॥ 237

ఆ॥ కనుక నీవు నట్లు గావింపఁగరుణించి గుహుఁడు గోరినట్టి కోర్కు లిచ్చి
తనబలములతోడఁదరలిపోవును నాఁగ బలికెగనలిశూరపద్ముఁడపుడు 238

—♦ శూరపద్ముఁడు హిరణ్యుని గోపించి దూషించి పలుకుట. ♦—

శా॥ దుష్పాండిత్యముదోపనాకధికశత్రుల్ డింభకుల్ మిక్కిలిన్
నిష్పాపుండని పెద్దజేసిపొగడన్ నీకెట్లునోరాడెరా
దుష్పంథానచరుండ యీవికటబుద్దుల్ నేర్పు దుష్టాత్ములన్
నిష్పన్నంబుగఁద్రుంతు మాన్పఁగలవే నిర్ణిద్రశాత్రవేతరా॥ 239

క॥ నావైభవ బలదర్ప మహావీర్యము లెఱుఁగవయితివాహో కమలా
జీవిత నాయకుచక్రము బోవదె నాతమ్మునెదుట పొంగాఱి వెసన్॥240

సీ॥ దినదినంబును బ్రహ్మ తనయులతోఁగూడి తప్పకదినశుద్ధి జెప్పుచుండు
హరిహయాదినిలింపులందఱు వైసారిణౌఘంబు మోయుదునున్నవారు
తెలివిహీనుండవై దితిజధర్మంబులనెఱుఁగక ప్రేలితి వింతదాఁక
నిలుపుముకానిచోనినుద్రుంతు నిజమనవినిహిరణ్యుఁడువిన్నదనముతోడఁ

తే॥ జెడుగుకాలంబు డాయుటచే మదీయ
విహితవాక్యంబులెంతయో వెగటుదోచె
దానవేంద్రునకుచితమై తనరునట్లు
మాటలాడుదునని తనమదిఁ దలంచి॥ 241

శా॥ అయ్యా! మీహృదయంబెఱుంగుటకు నిట్లంటిన్ క్షమింపన్దగుం
గయ్యానన్ రిపుసైన్యయుక్తముగ ముక్కల్ చేసి నీచెంతకే
నొయ్యన్వచ్చెద నాజ్ఞయిమ్మను హిరణ్యుంజూచి శూరాసురుం
డయ్యారేయనిమెచ్చి వీడ్కొలుప సంయత్కాంక్ష వాఁడుద్ధతిన్॥ 242

వ॥ అనేకానేకప స్యందనాశ్వ వాహినీసహితంబుగా దనుజబలంబులు దన్ను
గొలువ భేరీప్రముఖనినదంబులు వనధిరావంబడంచి దిక్కులునిండం
గదలి కళాశూన్యమై యగ్నికీలలమాడుచున్న వీడుంగాంచి సూడుబెంచి
నిజసేనావ్రాతంబుల భాగచతుష్కముంజేసి యొక్కొక్కదిక్కునకు

సహస్రవాహినీ పరిమితంబుగా ననిచి శేషించినసైనికులఁగూడి వీరబా
హునిడాసి శూరనందనుండు గలహంబునకుద్యమించు సమయంబున॥

ఉ॥ వీరభుజుండువాని పృథువీర్యముగన్గొని యీతఁడెవ్వఁడో
ఘోరచరిత్రువైఖరిని గోచరుఁడయ్యెడునంచు నెంచునా
లో రణభోజి యయ్యెడఁ గలుంగుతెలుంగు నెఱుంగ జెప్ప నా
తీరున సర్వసైన్యములఁదీరిచి దిక్కులనుంచెవీరుఁడున్॥ 244

క॥ మగుడ నిజసేనగొని తానగణితశౌర్యమున వానీ ననిఁదాకంగన్
దెగువ నుభయసైన్యంబులు నొగిఁబోరుచు నొకరికొకరు నుద్ధతిమీఱన్॥

చ॥ పరశు గదా శతఘ్ని కరవాల శరాసన భిండివాల ము
ద్గర ముసలాసి చక్ర శితఖడ్గ శిలా తరుపంక్తి మోఁదుచున్
గరచరణాంగుళీ రదన కర్ణశిరఃకటి కంఠనాళికో
దరములు భగ్నమై రుధిరధారలుగ్రమ్మఁ బెనంగుచుండగాన్॥ 246

ఉ॥ అప్పుడు భూతసైనికులు నాజిదొలంగియు మూర్ఛనొందియున్
నొప్పినిదాల్చియున్ వెఱపునూల్కొనియుండుట వీరబాహుఁడుం
దప్పకచూచి దానవవితానముతోఁ గలహింపగోరినే
ర్పొప్పఁగ సింహనాదము సముద్ధతిజేసి గుణంబుదీటుచున్॥ 247

చ॥ అతిరభసంబుతో బవరమందు ననేకశిలీముఖంబులన్
దితిజబలంబుపై బఱపి దీర్ఘసుషుప్తిని నొందఁజేయఁగా
క్షితితలమం దసృగ్జ్వదులశేషముబాఱెఁ గబంధనర్తనం
బతిశయమై చెలంగె నిటులాత్మబలంబులు దల్లడిల్లఁగన్॥ 248

క॥ కనుఁగొని హిరణ్యుఁడంతం దనరథమాలంబుదరియఁ దఱిమి యనేకా
శనితులిత బాణజాలములను ధాత్రిని భూతబలములం బడనేసెన్॥ 249

— ♦ నీలుఁడను భూతపతి హిరణ్యునితోఁబోరి మూర్ఛిల్లుట. ♦ —

ఉ॥ అద్దశజూచి భూతపతియైతగునీలుఁడు విక్రమంబుచేఁ
బెద్దగనార్చుచున్ గదనభీకరుఁడై నహిరణ్యుదాఁకి పె

న్నుద్ధులభంగి నిద్దఱు మహోద్ధతిబోరెడు వేళ దైత్యుఁడుం
గ్రద్దన శక్తి నీలుమెయిగాఁడగవైవ నతండుమూర్ఛిలెన్॥ 250

సీ॥ మగుడమూర్ఛనుదేఱిమగటిమితోనీలుఁడహితు పైసాలభూరుహమువైచి
తద్రథాశ్వంబుల దళియించియార్చిన నరదమొండెక్కి దురాగ్రహమున
నీలునురంబందు నిశితాస్త్రములజొన్పనాతఁడొండొకకొండనసురునేయ
నదిమూఁడుములుకులజిద్రుపలుసేయుఁడునంతటభూతనాయకుఁడుదైత్యు

ఆ॥ దేరితోడగూడ దివికెగజిమ్మినసెగసి మరలివచ్చి యీసుబెంచి
యన్యరథముసెక్కి నరుగుచో నీలుండు నలుకముష్టిఘాత నడచెనతని॥

క॥ ఆళరుఁడప్పుడు గోపావేశంబున నీలుబట్టి వేల్పులదర నా
కాశమున కెగురువైచిన నాశువుగా మగుడివచ్చి యాగ్రహమొదవన్॥

వ॥ నీలుండు రక్కసునొక్కుకునఁ జరణతాడనంబుచే జుక్కలవీదికెగుర
జిమ్మ నూర్ధ్వగామియయి మహికి డిగివచ్చుతటి భూతపతి యతిలాఘ
వంబున వానిపయిందుమికిన నసురుండు రక్తంబుఁగక్కి వివశుఁడై
యంతనతెప్పిఱి నీలునిదూలింపనెంచి మాయందలంప నది మాయాహి
రణ్యుండై పెక్కుగతుల నతని గగ్గోలుగావించి పెనంగుచుండ హిర
ణ్యాసురుం డహంకరించి యన్యశాతాంగారూఢుండయి యాగ్నేయా
స్త్రంబతనిమీఁద బ్రయోగింప నాభీషణసాయకం బురంబుగాఁడ గ్రొన్నె
త్తుటందోఁగి నేలంగూలెనప్పుడు॥ 253

—♦ వీరబాహునితోఁబోరి హిరణ్యుఁడు సముద్రములో డాగుట. ♦—

మ॥ అమితక్రోధముతోడ వీరభుజుఁ డభ్యామర్దకేళిన్ హిర
ణ్యమనుష్యాళనకల్పితంబయిన మాయందూల్చి విజ్ఞాన శ
స్త్రముచే బిమ్మటవాఁడు సెక్కటిజరించన్ వీరబాహుండు గ్రా
గముతో భల్లసహస్రకంబతనిగాత్రంబందు నాటింపఁగన్॥ 254

ఆ॥ కలుకురక్కసుండు గాలుసేయాడక చేష్టలుడిగి తెలిసి శీఘ్రముగను
వేఱుతేరునెక్కి వీరుండు ఖండించె ధ్వజ శరాస కవచ దండములను॥

ఆ॥ అసురుఁడొండువిల్లు వెసబూనఁగా దానిస్యందనంబు నూతుజదియ మోఁది
ఖర్మపుంఖబాణభరిత వతునిజేయ నన్యరథముమీఁది కతఁడువోవ॥ 256

శా॥ దానిం బ్రద్దలుసేసెవీరుఁడు మఱిం దైత్యుండు నింకొక్కతే
రై వ్రనిం జేరిన ఘోరబాణహతిచే ఖంజించి పార్శ్వద్వయ
స్థానంబందుగలట్టి దివ్యరథసంతానంబు నిర్జింపఁగా
నా నక్తంచరుఁడబ్రమొంది విరథుండై శస్త్రహీనుండునై॥ 257

చ॥ విగతబలుండునై రిపునివిక్రమమోర్వక దైన్యమొంది యీ
జగడమునందు సైన్యబలశస్త్రవిహీనుఁడనై తినేను నిం
క గుహుఁడు శూరపద్మముఖ కర్కశదైత్యులఁద్రుంచు మత్పిత్రం
డగణితపుత్రవంతుఁడుగదా మదిలోఁ దలపోసిచూచినం॥ 258

ఉ॥ అందటిలోన నేనయిన నయ్యకుపిండమువెట్ట బ్రాణముల్
బొందిదినిల్పియుండెదను బోలఁగనేబ్రతుకంగ వంశముం
డిందకనిల్చెనంచనియెడిం ఘనకీర్తియు నేనుజావఁగా
డిందెనటన్న దుర్యశము డెక్కొనుగాన శరీరమో మెదం॥ 259

ఆ॥ అనుచునిశ్చయించి యంబురాశిజలంబులందు జొచ్చి మాయనాశ్రయించి
చేఁపమేనుచే వసించియుండెను దక్క రక్కనులు గనిరి పరాజయంబు॥

ఉ॥ అంతట భూతసేనల జయార్భటులెచ్చె సమస్తవీరులుం
స్వాంతములందు సంతసిలి శంఖములూదిరి పుష్పవృష్టి న
త్యంతము దేవతల్ గురిసి రాత్మల హర్షముబూని సర్వవృ
త్తాంతము చారులప్డు విబుధద్విషభర్తకుదెల్ప నాతఁడుం॥ 261

క॥ విని మనమునదుఃఖించుచు దనయుహిరణ్యునిఁదలంచితహాతహాపడుచుం
ఘనరోషమూని శాత్రవహననక్రియ కెడసిచసియె నాసమయమునం॥

—♦ అగ్నివక్త్రుఁడు శూరునను మతంబున యుద్ధమునకు వెడలుట. ♦—

వ॥ శూరపద్మని తనూజాతుం డధికవిక్రమోపార్జిత సద్యశఃప్రకాశుండును
దుష్టమానసుండును నగు నగ్నిముఖుండనువాఁడు దండ్రిచెంగటికే తెంచి
ప్రాంజలియై యిట్లనియె॥ 263

క॥ అనిమిష కేశవ చతురాననముఖ్యుల గెలుచునీవు న్రముఁడవగుచుఁ
మనమునజింతులునంతటి ఘన్యకార్యంబెదియోనాకు గరుణంజెపుమా॥
క॥ అని వేఁడ శూరపద్ముఁడు దనయునితో గరళకంఠతనయునిదూతుం
డనివార్యబలుఁడు వీరుఁడు దన ఘాతబలాన్వితముగ దర్పోద్ధతుడై ॥265
ఆ॥ తారసించి ఘోరతర శిలీముఖవహ్ని నీపురంబుగాల్చి యెల్లపౌరు
లార్తినొందజేయ నరసి దానిహరింప వనదములనుబనుప వానిఁదఱిమి॥
క॥ నీసోదరుఁడు హిరణ్యుండీసున భండనముసేయనేగిన ధీయుం
డై సంత్రాసకరంబుగ డాసి యనిఁ బెనఁగ వాఁడు డయ్యుచుభీతిఁ॥
చ॥ కడలినిమీనమై మఱుఁగుగాంచెను నయ్యెడ ఘోరరాక్షసుల్
మడిసిరిపెక్కుమంది యవమానమునెంచక కాందిశీకులై
నడిచిరికొందఱంచును వినంబలుకఁ విని యగ్నివక్త్రుఁడె
క్కుడుమదమేర్పడంగ జనకుంగని యిట్లనియెఁ మహోగ్రుఁడై॥ 268
శా॥ నన్నుంబంపుము వారినెల్ల ననిలోనంజంపి యేతెంతునో
కన్నయ్యా? యన శూరుఁడట్టులె పొసంగంజేసి శీఘ్రంబ ర
మ్మన్నఁ సత్వర నగ్నివక్త్రుఁడు మహాహ్లాదంబుతో నింటికిఁ
జెన్నొందంజని మాయయిచ్చుధనువుం జేఁదాల్చి సంరంభియై॥ 269
సీ॥ ఆజిప్రశస్తాఖిలాస్త్రముల్ ధరియించి వేయిగజంబులు వేయిహరులు
వేయిరథంబులు వీరదైత్యులనేక వాహినుల్ బిరుదులువలికికొనుచు
వేపడంబులనెక్కి వెంటనేతేరంగ సోముండు మేఘుఁడు సోమకంట
కుండును సూర్యజిత్తుండు బింగళుఁడును మొదలుగా సైన్యేశులధికసంఖ్య
తే॥ లరుగుదేరంగ గేతన వ్యజన ఛత్ర చిత్రపరికరములుగొని షేవకాళి
గొలువభేరీనినాదముల్ చెలగమరుసునాఁడుసూర్యోదయంబుననడిచెననికి
వ॥ ఇట్లేగిన నుభయవాహినులు దలపడి శైలవృక్షసాయకాది వివిధసాధనం
బులఁ బోరుచున్నయెడ శత్రుభీకరులగు లక్షవీరులు దనుజానీకంబుల
విశిఖవృష్టిగప్పి నొంచుటయు వారలు వెఱచఱచినంజూచి సోమకంటక
మేఘసంజ్ఞిక సోమకనామక దోషాచరత్రయంబు విజృంభించి॥ 271

చ॥ అరులగు రక్షవీరులనునాఁగి మృగేంద్రరవంబుసేయుచుఁ
దరమున భూతసైనికులు దత్తఱమందఁ గలంబవృష్టి భీ
కరముగగప్పి నొంచుటలుగన్గొని వీరపురందరుండు ని
ష్ఠురమగువిల్లుదాల్చి యిషుప్రకరంబులనేసి యంతటన్॥ 272

—♦ వీరపురందరాది సప్తవీరులగ్నిముఖునిచేఁ గూలుట ♦—

మ॥ తెలగంల్లెన్నఁగ సోమకంటకునిఁ ధాత్రింగూల్చి శేషించు ని
ద్ధఱతేరుల్ మడియింప నన్యరథముల్ దర్పంబుతోనెక్కి యా
కలకుఁ గక్కసు లుగ్రరోపములుదాఁకన్ వైవఁగాఁజూచి క
న్నెఱనై వీరపురందరుండడఁచె హాయిన్ దద్రథేష్వాసముల్॥ 273

క॥ పిమ్మట వక్షస్కంధములు మ్మొగములు వగుల ములుకులుం బఱపిజయాం
కమ్మొగ గర్జిలు నాసమయమ్మున మేఘాఖ్యదైత్యుఁ డతికలుషితుఁడై॥

తే॥ సూనుని నమోఘదండంబుచేత గూల్చ
నంత వీరపురందరుం డధికరోష
భీషణుండయి తదిషు విశేషముడిపి
శక్తియను నాయుధముబూని చలముమించి॥ 275

క॥ వక్షము లక్ష్యముగా నారాక్షసువైవంగ సత్వరంబున నదియుఁ
రూక్షముగఁ గాడి పాటిన నీక్షితిపైనొలి మేఘుఁడీలిగె ననిలోన్॥ 276

శా॥ అక్కాలంబున యామినీచరులు శౌర్యాటోపముల్ వీడుచున్
దిక్కుల్ సూచుచు భీతిచేనుఱికినన్ దృష్టించి హృద్రోషమున్
నిక్కంజేయుచు నగ్నివక్త్రుఁడధికోన్నిద్ర ప్రతాపంబు బెం
పెక్కన్ వీరపురందరుందవిలి మాయించెన్ జమూవీర్యమున్॥ 277

వ॥ దానింగని వీరపురందరుండు దుస్సహాతర మార్గణపంక్తులనేసి యార్చిన సహింప కగ్నిముఖుండు వజ్రసదృశవిశిఖంబులఁ గోదండస్యందన నిషంగంబుల రూపుమాపి శక్త్యాయుధంబు బ్రయోగించి జయధ్వనిసేయ నతండు వివశుండయి తోడన తెలివొందెనయ్యెడ॥ 278

ఉ॥ వీరసప్తకంబు విస్ఫులింగంబులు గనులరాల శౌర్యగరిమ నెఱపి
యగ్నివక్త్రుఁడాసి యాశుగవృష్టిని మునుఁగజేసి వేయిములుకులూని॥

మ॥ కరమూలంబుల మూఁపులందు నుదుటన్ గాఢంబుగాఁ గ్రుచ్చియున్
విరథుం జేసిన దైత్యుఁడన్యరథియై వీరోక్తులన్ మిమ్ము ని
ర్దరపైఁగూలిచి వీరబాహునివెసన్ దండింతునన్నన్ విని
ర్భరకోపంబుననాలకించి బలవీర్యప్రాభలోపేతుఁడై॥ 280

ఉ॥ వీరపురందరుండహితు వీతి శతాంగ నియంతృభగ్నమున్
దారుణభంగిజేసి యెడదం బలుతూపులు నాటనేయఁగా
శూరునిపట్టి రోషవివశుండయి పావకసన్నిభద్యుతి
స్ఫారమునైన పాశుపతశస్త్రమువైచె సమంత్రకంబుగన్॥ 281

క॥ అయ్యస్త్రమనలరుచితో నెయ్యెడ మండుచునురాగ నీక్షించి యహో
యియ్యదియనలాస్త్రంబనియయ్యనఘులుదలఁచిదాని హరియించుటకై॥

తే॥ వారుణాస్త్రంబువఱపిన వడినిమ్రింగి
జవముమీఱఁగ నేతెంచి సప్తవీర
నిహతిగావింప దైత్యుండు నిజ జయమున
కుబ్బిగర్జించి మిక్కిలి యుదుటుసూపె॥ 283

క॥ భూతబలంబులు మిన్కిలి భీతిం బరువిడఁగఁజూచి పృథువీర్యబలో
పేతుండువీరబాహుఁడుమాతంగముగదియుమృగరమణుకిరియనార్వన్॥

— ♦ వీరబాహుఁడగ్నివక్త్రునితోఁ బెనఁగుట. ♦ —

వ॥ అగ్నిముఖుండు డెందంబునఁగనలుచు ముందఱ గొందఱ దితినందనుల
మ్రందించితి విక్రమదనంబున నిన్ను జిత్రుపలుసేయుదు నియ్యాది తుది
గాంచనిచో ముదితాభోగాది సుఖముల వదలెదననిపలికి యభిముఖుడై
యున్న దానవునాలోకించి వీరబాహుండిట్లనియె॥ 285

సీ॥ భవదనుజన్ముఁడై పరగుహిరణ్యుండు గదనంబులోనోడి కాతరుఁడయి
యెచ్చోటుడాగెనో మ్రుఁచ్చువిధంబున నదిగాక నక్తంచరాగ్రణియగు

భానుకోపుఁడు దిగ్మభానునిదర్శించు పెనుగూబగతిడాగెఁబిటికియగుచు
నిన్నిరణంబున నిర్జింతుదృణముగా ననియార్చి విలు గుణధ్వనినిజేయ
తే॥ రక్కసుండట్టులే దిశల్ పిక్కటిల్ల నల్లియనుదీడ నయ్యుభయాశుగాస
భీషణధ్వనులకు మరుద్ద్వేషి ఘాతవితతిభీతిల్ల రణముగావించుచున్న॥ 286
తే॥ అగ్నివక్త్రాసురుండాత్మ నడఁపరాని కోపమూని చతుర్దశరోపములను
వీరబాహునిపై నేయ విక్రమించి యాతఁడన్నింటిచే వాని హతముసేసి॥
తే॥ కమలజాండంబుభేదిల్ల గర్జసేయ గఱకురాకాసి పరుషవాక్యములనాడి
వింశతిశరంబులేసిన వీరబాహుఁడడఁచె నిరువదితూపుల నాశుగంబ॥ 288
క॥ ఆశరుఁడుద్భట రోషావేశంబున గర్కశంపు విశిఖసహస్రం
బాశువుగబఱపి గర్జనతో శంఖంబొత్తె విజయధూర్వహబుద్ధిన్॥ 289
చ॥ దిటమునవీరబాహుఁడు దదీయమహాశుగవిద్ధదేహుఁడై
చటులతరక్రుధన్ దనుజు చాప శతాంగ తురంగమంబులం
త్రుటితముసేయవాఁడు ధృతితో మఱియొందురధంబునెక్కి దోః
పటిమచెలంగ దండమునవైచె నభశ్చరులద్భుతంపడన్॥ 290
ఉ॥ వీరభుజుండువానిగని విస్ఫురితాధరుఁడై మహోగ్రమౌ
నారసముల్ వడింబఱపి నాశముసేయఁగ నగ్నివక్త్రుఁడున్
భైరవకార్ముకంబుగొని భాస్కర యామ్య సమీరణాస్త్రముల్
క్రూరతనేయ వీరుఁడిలగూల్చెనువానిఁ దదస్త్రము క్తిచేన్॥ 291
క॥ వెండియు వాఁడిమిమీఱిన కాండంబుల ఱొమ్ముజింపఁగాయమెఱుఁగకన్
బెండువడిసోలి నంజుడుదిండీశాశుణమతేటి తెలిసమదితోన్॥ 292
వ॥ స్వకీయేష్టదైవమగు కాళికాదేవినిస్మరించుటయు నాభగవతి శూలధనుః
పరశు ప్రముఖాయుధపాణియు నసంఖ్యాతప్రేతగణసమావృతయు
నానావిధవాద్యనినాదపూరిత సకలదిశాభాగయు సింహవాహనయు
నై సాక్షాత్కరించిన నగ్నివక్త్రుండు సంభ్రమంబున నద్దేవికెఱఁగి
యంజలిబద్ధుండయి॥ 293

ఉ॥ అమ్మ మహాపురాణివిగదమ్మ శుభంబులపేటివమ్మ స
త్యమ్ముగ నీసమానులెవరమ్మ జగంబులతల్లివమ్మ మా
యమ్మ భవంబులం జిదుమవమ్మ దయాంబుధివమ్మ బంగరుఁ
బొమ్మ పురారికొమ్మ నతపోషణశీలినివమ్మ కాళికా॥ 294

—♦ అగ్నిముఖ ప్రేరితయై కాళికాదేవి వీరబాహునిమీఁదఁ గవియుట. ♦—

ఆ॥ అనుచుఁబొగడి విక్రమాధికుఁడగు వీరబాహుద్రుంచి జయముపదిలపరచు
మనిన నట్లకాకయనిపల్కి యచ్చోటుగదలి లోకభయదగతిని గదిసి॥ 295

క॥ శూలమువైచిన వీరుండాలంబున బదియునాలుగమ్ముల దానిఁ
దూలింప భద్రకాళి కరాళాననయగుచు నుగ్రరావంబడరన్॥ 296

క॥ పరుషములగువాక్యంబుల నెరపుచు దుర్బుద్ధియగుచు నిర్భరశక్తిం
గరమందు నన్యశూలముధరియించి ప్రయోగవిధము దప్పకపఱపెన్॥

క॥ ఆవీరబాహుఁడప్పుడు వేవేగ సహస్రశాతవిశిఖంబులచేఁ
జేవచెడ దానినడచిన దేవియు నత్యంత కోపదీపితయగుచున్॥ 298

ఉ॥ కేసరివాహనంబుడిగి కేలనుఖడ్గమువట్టి వీరని
ర్వాసమునన్ఘటింపఁగ జవంబుమెయిం గదియంగరా రణో
ల్లాసుఁడు వీరబాహుఁ డబలావధ దోషమటంచుద్రోసి పె
ల్లీసునఁ గాళికాకరములెన్మిదిపట్టెను కేలనొక్కటన్॥ 299

తే॥ అన్యహస్తంబుచే వక్షమందుబొడువ
వమదసృగ్వక్త్రియైసోలి వసుధగూలి
గోడుగుడుచుచు మఱిలేచి ఘోరబలుఁడు
వీరబాహునిగాంచి నిర్వేలనుబలికె॥ 300

తే॥ నీబలంబాత్మ నెఱుఁగక నిశ్చయముగ
నగ్నిముఖుఁడాచరించిన యర్భకతన
రావలసివచ్చితి బలాంబురాశివీవు
నగ్నిముఖ భానుకోపుల హతమొనర్చి॥ 301

క॥ మఱియును దానవతతి రూ
పఱఁజేసి విశాఖుదయకుఁ బాత్రుఁడవగుచున్
మెఱయుమని విహితవాక్కుల
నెఱినాతనిబొగడిచనియె నిజగృహమునకున్॥ 302

ఉ॥ అంతట నగ్నివక్త్రుఁడదియంతయెఱింగియు గాలికాబలం
బెంతయొ చూడగౌరి స్మరియించితిగాక జగంబులందు దు
ర్దాంతమహాప్రతాప బలరాశినినే నసహాయశక్తిచేఁ
ద్రుంతు నరాతిసంఘముల దుస్సహతేజిత మార్గణాహతిన్॥ 303

తే॥ అట్లుగావింపకురక మాయయ్య శూరపద్మ చెంతకుఁబోనని ప్రతిన సేసి
సింహనాదంబొనర్చుచు రంహలీల బాణశతమేసె నవ్వీరబాహుమీద॥

—♦ వీరబాహుండగ్నివక్త్రుని జంపుట. ♦—

మ॥ అమితక్రోధముతోడ వీరభుజుఁ డయ్యాస్త్రంబులన్ నూఱుశ
స్త్రములన్వైచి శమింపఁజేసి మగుడన్ శౌర్యంబుతో నైకబా
ణములద్దుష్టునిపైనిగప్ప నతఁడంతన్ వానినూఱింటిచే
విమతుండద్భుతమందఁ ద్రుంచి సమరోర్విన్ గంబుబూరించినన్॥ 305

క॥ ఆలించి వీరబాహుఁడు గాలుండోయన మహోగ్రకాయుండయి ప
ద్నాలుగుకోలల ధనువుం దూలించిన దానవుండు దోర్బలమొప్పన్॥

వ॥ దృఢముష్టినలవరించి దురాగ్రహాకలితుండై బ్రహ్మాస్త్రంబుప్రయోగిం
చిన నది యనేక విరించనాకృతుల నతిశయించి సమీమింప వీరబా
హుండు రౌద్రాకారుఁడై వీరభద్రాస్త్రంబడరించుటయు నమ్మహనీయ
సాధనంబు బ్రహ్మాస్త్రకబళనంబుగావించి సమరతలంబున నగ్నివక్త్రుతల
ద్రొల్లంజేసెనంత॥ 307

తే॥ అగ్నిముఖుఁడిట్లు మృతుఁడైన నతనిసహచ
రులు జతుర్వింశతిసహస్రపలలభోక్త
వాహినీపతులాత్మలవగచి కుపిత
చిత్తులై యొక్కపెట్ట యుద్వృత్తి మిగిలి॥ 308

శా॥ ప్రాసాద్యాయుధపాళి గ్రీష్మసమయార్కాభంబట్లు వర్షింపఁగా
రోసం బెచ్చిటి భూతసేనలధికక్రూరాస్త్రముల్ దద్విధిన్
గాసిల్లన్ మెయిఁజొన్పుచున్ దఱుముచున్ ఖండించుచున్ దైత్యసే
నా సంరంభముమాన్ప వారు మదిలోనన్ భీతివాటిల్లఁగన్॥ 309

చ॥ కరయుగళంబు మోడ్చి యొడికంబుగ మ్రొక్కిన భూతసైనికో
త్కరములు వారలన్ వదలి తక్కినసోఁకులజంపిరప్డు సం
గరమునగూలియున్న పలభాదులపైఁబడి కొందఱాశరుల్
మరణమునొందిరాజి విపులాస్థలి భీషణమయ్యె నీక్రియన్॥ 310

వ॥ మఱియు నయ్యుద్ధభూమి పరాభూతనిశాటంబుగావున సూర్యప్రభం
బును నపారధ్వనిప్రకటంబుగావున సుకవిప్రబంధంబును గబంధసంచా
రంబుగావునబంచవటిని శివావిహారశృంగారంబుగావున గైలాసంబును
నపరిమితవాహినీనిలయంబుగావునబారావారంబును వినష్టకర్ణశల్యాసైం
ధవంబుగావున గురుక్షేత్రంబును భీష్మద్రోణయోగ్యంబుగావున హస్తి
నాపురంబును బోలి మెఱసె నప్పుడు॥ 311

-♦ వీరబాహుఁడు మృతులైన తనతమ్ములను యమునిచే దెప్పించి మరల బ్రతికించుకొనుట. ♦-

సీ॥ ఉగ్రనామంబుచే నొప్పుభూతవిభుండు బరితపించుచు వీరబాహుఁజేరి
మనమవియంగ నీయనుజులౌవీరులు నరివీర పాశుపతాస్త్రనిహతిఁ
జావుసంప్రాప్తమై శతయోజనంబులదూరంబులో వటద్రుమముక్రింద
బడియుండ వారలప్రాణముల్ గొని జముండరిగెనోడక తనపురమునకన

తే॥ వనటనొందుచు దత్‌స్థానమునకునేగి
ప్రాణమెడలినతమ్ముల బాఱజూచి
మోహమునసట్టె పయిఁబడి మూర్ఛమునిఁగి
కొంతవడికిని దెలిసి బల్ చింతననియె॥ 312

క॥ ఆహవమున శైవాస్త్రముచే హతులగునట్టివారి జీవానిలముల్
దా హరియించెను శమనుండాహో లక్ష్యంబొకింతయైనను లేకన్॥ 313

ఉ॥ మున్నొకపూవు శీతకరమూర్ధునకర్పణజేసి భక్తితోఁ
పన్నగభూషణా యనినవాని నతివ్యధసేయఁ బట్టబో
వన్నగకార్ముకుం డమరవంద్యుఁడు గోపముతోఁ బదంబునన్
దన్నినయట్టిలోకువ కృతాంతునకున్ మఱపెట్లుపచ్చెనో॥ 314

సీ॥ అంతకునకు లేఖనం పెదననిపల్కి భస్మరుద్రాక్ష సంభరితతనుల
తెరువెట్టిదో కాని తెలియనినీకిట్టి సరిగానివృత్తి యేకరణిబుట్టె
నతిమదోన్మత్తుఁడవైనట్లు దలఁచెద నని లిఖితంబస్త్రమునను వ్రాశి
విడిచిన నదిపోయి కడువేగజముమ్రోల వ్రాలఁగా శమనుఁడవ్వాలునెత్తి

ఆ॥ చూచి తత్త్రమున చోద్యమందుచు వేత్త యగుట నాత్మదృష్టినరసిరజత
కుధరమందు వారలధికసౌఖ్యంబున నుంట కెడదనలరి యుత్సుకమున॥

ఉ॥ కాలుఁడు దున్ననెక్కి భటకాండముతో రజతాద్రికేగి య
న్నేలనుహృద్యమౌ యుపవనిన్ సురవేశ్యలనృత్యగానవి
ద్యాలలితోక్తులన్ ముదమునందుచు దివ్యవిభూషితాంగులై
క్రాలెడునష్టవీరులనుగాంచి ప్రణామముసేసి యిట్లనున్॥ 316

శా॥ అప్పా మీరు మదీయలోకగతులై నట్లెంచి మీయన్న నా
తప్పొప్పుల్ పరికించకూరకయె క్రోధంబూనెనాయందు మీ
రిప్పట్లుం గరుణించిరావలయుజుండీ యంచుప్రార్థింపఁగా
నప్పుణ్యుల్ జము వేడికోల్ విని మహాహ్లాదంబుతోఁ జెచ్చెరన్॥ 317

తే॥ వచ్చి తమతమ పూర్వపు వపువులందు జొచ్చి నిద్దురలేచినచొప్పుదోప
లేచినిలిచిన తమ్ములజూచి వీరబాహుఁడాలింగనముసేసి ప్రమదమొందె॥

ఉ॥ ఆక్షణమందుదండి వినయంబునవచ్చి నమస్కరించి రు
ద్రాక్షవిభూతిధారణుల దగ్గఱకేగెడువాఁడనే లలా
టాక్షునికొండ నీయవరజాష్టకముండిన తోడితెచ్చితిన్
రక్షణసేయజూడుము శరాసముడించి యటంచువేడినన్॥ 319

క॥ ఆవీరబాహుఁడప్పుడు నీవు శివప్రియుఁడవగుట నిట్టియకృత్యం
బేవెంటజేతు వనుజుల్ జీవములెడబాయుకతనఁ జిత్తభ్రమచేన్॥ 320

క॥ వారల ప్రాణము లీవేయూరికిగొని చనితివనుచు నూహించితినో
సూరసుత యింక నీపురిజేరి సుఖింపుమన నట్లుజేసె నతండుౘ॥ 321

వ॥ అంత ననిమిష కుసుమవర్షంబులును దేవదుందుభిస్వనంబులును నిఖిల
సేనామండలకలకలంబులును మేరమీఱె నిట్లు వీరబాహుండనుజులను
సమస్తసైనికులను గలిసి పొలివోనిచలముచేఁ గలహరంగంబున నిలిచి
యుండె॥ 322

తే॥ అనుచు సూతుఁడువిన్పింప హర్షమొంది
శౌనకాదులు విస్మయస్వాంతులగుచు
గథకుఁగనుఁగొని యవ్వలికథను మాకు
నుడువుమీయని కోర్కిమై యడుగుటయును॥ 323

—♦ ఆ శ్వా సాం త ము. ♦—

పుష్పమాలికాబంధము.

చ॥ జనకనరేనజాస్య జలజన్మజగద్ద్రుశ కాశభేశచం
దనవనఫేనకీర్తి నగనన్దనసేవ్యపదాపదాపహా
వినయనదీనతుల్య విలువిద్యవిభాసిత పాతకాంతకా
బ్జనయన దానశౌండ పరిపన్థిపలాశన కాననానలా॥ 324

మే ది నీ వృ త్త ము.

జలరుహలోచనా దివిజ సన్నుతాంఘ్రిపద్మా
ఖలరజనీచరప్రకర ఖండనప్రతాపా
కలితగుణాకరా దురిత కాననాశ్రయాశా
కులగిరిసామ్యధైర్య మునికోటిచిత్త సద్మా॥ 325

వ న మ యూ ర వృ త్త ము.

భానుకులవారినిధి పర్వహరిణాంకా
దీనజనపోషణ సుధీనుతజయాంకా
వానరసమూహా పరివార యకలంకా
హీనకృపదారిత మునీంద్ర పృథుశంకా॥ 326

## గ ద్య ము.

ఇది శ్రీరఘునందన చరణారవిందవందన మరున్నందన నిరతిశయకరుణా కటాక్ష వీక్షాసంభావిత చతుర్విధానూన కవితాప్రహర్షిత వసుంధరా రమణ సభాప్రకాశిత విద్వన్నికాయ రుక్మాంద నలచరిత్రాభిధ యక్ష గానద్వయ మనఃప్రబోధ రామచంద్రప్రభు ధీనిధీనానుక శతగ్రంధ త్రయ మదాలసాభిధానైకనాటక పుష్పగిరిపీఠాధిపత్య జగద్గురు శ్రీమదభినవోద్దండ విద్యాశంకర భారతీస్వామి చాతుర్మాస్యదీక్షా గద్వాలసంస్థానాధీశ్వర వంశవృక్షవర్ణన ప్రబంధనిర్మాణ చాతురీవిరాజిత భారద్వాజసగోత్ర పవిత్ర భట్టరాజవంశ క్షీరసాగర రాకానిశాకళత్ర రామదాసపౌత్ర సంజీవరాజసత్పుత్ర కొండవలూరి రామచంద్రరాజ నామధేయకవివర్య ప్రణీతంబయిన శ్రీస్కాందపురాణాంతర్గత శంకర సంహితాభినివేశ మహాసేనోదయంబను మహాప్రబంధమునందు షష్ఠా శ్వాసము॥ 327



శ్రీ ర స్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

# మ హా సే నో ద య ము.

(పద్యకావ్యము.)

## —• స ప్త మా శ్వా స ము. •—


మద్విమలోరు యశో
ధామా! గాధేయసవన దస్యునరాద
గ్రామణి శార్వర లోహిత
ధామా! సుగుణాభిరామ! దశరథరామా॥ 1

తే॥ అవధరింపుము శుకశౌనకాది తాప
సులకు సర్వకథా రథసూతుఁడయిన
సూతుఁడనియెను మందాకినీతరంగ
ప్రబలఘోషానుకారి వాక్పటిమతోడ॥ 2

వ॥ మునీంద్రులారా! యిట్లు వీఁ బాహులం డాహవోద్యోగియై యుండెడు వా ర్త చారులముఖంబునఁ దెలిసి తనసుతుండగు నగ్నివక్త్రుండు బంచత నొందుట కంతఃపురస్త్రీ పౌరయుతంబుగా ననేకరీతుల దుఃఖించుచున్న శూరపద్మునిసమీపంబునకు దత్పుత్రసహస్రత్రయం బేతెంచి తారును వగచి జనకునిశోకంబపనయించుచు నిట్లనిరి॥ 3

—• శూరపద్మసుతసహస్రత్రయము తండ్రికనూరార్చి యుద్ధమునకు వెడలుట. •—

సీ॥ ధృతివంతులగు నవాధికలక్షవీరుల
ద్రుంపనొక్కఁ తనూజు నంపఁదగునె
మృతుఁడైనపిమ్మట వెతనొందఫలమేమి?
బలియురమగు మేము భానుకోపుఁ
డును హిరణ్యుండును మనియుండ రపుసైన్య
సంతయంబున కాత్మ శంకవలదు

కనకాద్రినైనను గదలించెదము బాడ
బానలంబయిన జల్లార్పఁగలము
తే॥ భూతసేనలవీరులఁ బోడవడంచి బాలకునిప్రాణములుగొని లీలతోడ
వచ్చెదము మమ్ము నాజికిఁబుచ్చుమనిన శూరుఁడారీతిసెలవిచ్చిపారిననిపె॥
॥ అంతట శూరునిసుతుల త్యంతము ద్రోణప్రసూనదామము లఱుతన్
సంతసమునదాల్చి మణీసంతానాభరణులగుచు సమరాపేతున్॥ 5
॥ కలహంతమంబులగు మదకలములఁ బృషదశ్వవేగ కలితాశ్వములన్
విలసద్రథములనెక్కియు వెలిగొడుగులుకెక్కియములువింజామరముల్॥
॥ మెఱలగు జిహ్వాంబులు వెలయ దళంబులు భీమనినద పాతసాగరులై
పదిలముగఁగొలువ భీకరకదనంబునకేగునట్టి కాలమునందున్॥ 7
॥ శూరునినందనుల్ రణమునొచ్చి బలంబులతోడగూడి సం
హారమునొందుటల్ నిజము మానునుసుమ్మిక భారమంచెదన్
వారని భూరిసంతసమువర్థిలి నాట్యముసేసెనోయనన్
ధారుణి దిర్దిరందిరిగె దక్కక నక్కలుగూసెదిక్కులన్॥ 8
। మఱియు ననేక కాక కంక గృధ్రంబులు నభంబునఁ జెరలాడె నుల్కా
పాతంబు లుత్పన్నంబులయ్యెఁ గేతనచ్ఛత్రంబులఁ గరట శశాద
నంబులు నివసించె నిట్టి దుశ్శకునంబులఁగాంచియు సరకుగొనక యహం
కృతితో దోషాటులాయోధనంబులకు నడిచిరయ్యెడ॥ 9
॥ ఇరువాగున్ దృషదద్రివృతుతతితో నీర్ష్యాభిమానంబులన్
సరిబోరాడెడివేళలోఁ దరసభుక్సంఘంబు భూతాధిపా
త్కర దర్పంబునకోడి విచ్చుటయు సందర్శించి శూరాత్మజుల్
గురుశౌర్యంబున శింజినీరవము దిక్కుల్నిండఁగాఁజేయుచున్॥ 10
॥ కలహోజ్జృంభితులై నిశాతశర సంఘాతంబుచే భూతసే
నల దైన్యంబువహింపఁజేయుటయు జన్యంబందునిల్వంగలే
కలఘుప్రీడఁ దొలంగిపాఱినఁ దదీయాధ్యక్షు లత్యంతమౌ
యలుకన్ గద్దిలి భూమిరుడ్ద్రుపదహార్యవ్రాతముల్ వైచుచున్॥ 11

౹॥ అసదృశాయస దండచండముసలాద్యాపూర్తిచే సూతునిం
లసదస్త్రంబులఁ దేరుమొత్తముల నేలంగూల్చి తన్మార్గముల్
కసితోఁ బ్రీలఁగమోఁది కొన్నిరథముల్ కంధింబడన్నాకి సా
ధ్వసదక్రూర పరశ్వధాదుల సముద్యత్రోక్కధ తామ్రాంతులై॥ 12

॥ కర్బురశ్రేణి కార్ముక కంధరాది
ఖండనముసేసి ప్రాణముల్ కడకుడఁబుమఁ
గాంచి తత్ప్రతులెంతయు గనలుమించి
వహ్ని బాణంబువైచిరి వారిమీఁద॥ 13

॥ అబ్బాణవేదనలకుం నిబ్బరమున భూతసేననిల్చి నిజబలం
బుబ్బుచెడియున్నఁ గనుఁగొని యబ్బరమున నతువీరులందుఁ గడంకం॥

—♦ విజయాది సహస్ర వీరులు రాక్షస సేనందాఁకి పెనంగుట. ♦—

॥ విజయుండును జయుండును మణిఘోషుండును గరవీరుఁడును వృష
భుండు ననంతుఁడును మధుండు ననంతవరుణుండు నర్వాకుండు నకళం
కుఁడు నతిగుణకుండును మానుకుఁడును శశికంటకుఁడును శతబలియును
మొదలు వీరసహస్రము నిర్గమించి యాశరనాశంబు సేయుటకై వీర
బాహుముదలవడసి శత్రుసేనఁదాఁకి॥ 15

॥ చండతరాగ్రహాంబునను సాయకవృష్టినిముంప నోఁకుడుం
బిండులు దద్విధింబెనఁగ భీకరులై యల రెండుమూఁకలం
దండుదొరల్ గడంగుతఱి దానవభర్తతనూభవుల్ మహో
ద్దండత వేయివీరులరథంబులు నుగ్గగునట్లు మోఁదినం॥ 16

॥ ఆసమయంబునం దమరవీరులు వారిరథ గజ తురఁగ సారథుల ధనువు
మొదలైన సాధనంబుల గుప్తరథముల నిరవశేషంబుగా నిహతిసేయ
వీరదైత్యులు బాదచారులై ధైర్యంబు బాయక గిరి శిలా పాదపాది
యుపకరణంబుల నొగిఁదాల్చిగర్జింప నోర్వక సురవీరు లుగ్రులగుచు
॥ శస్త్రములు సహస్రసంఖ్యనేసి తదీయ సాధనములఁద్రుంచి సరగ నంద
ఱొక్కకాలమందు నురువిక్రమంబొప్పఁ గీలిమార్గణముల గెరలియేయ॥

సీ॥ అశరజ్వాలల నాశరుల్ గొందఱు
వివశత్వమొంద నవ్విధముచూచి
మఱిఁగొందఱసురులు మాఱుముల్కులఁబోరఁ
గొందఱవ్వీరుల గురుశతాంగ
యుతముగా వార్ధిలో నొఱఁగునట్లుప్వర
వీధిఁజిమ్ముచుఁ గ్రమ్మ వీరులొకట
ధరఁగూలి ముంగల దనరుతేరులనెక్కి
యారాత్రుసుల శరాసారములను

తే॥ ముంచుచును బోరునష్టునక్తంచరులు మహాభయంకరవిశిఖంబులడరిపఱపి
వీరుల శరాసనాదిక వివిధ సాధనములఁ దునియలుఁగాఁ జేసిరమితశక్తి॥

వ॥ ఇట్లుభయసేనా సమూహంబులు సంకులసంగ్రామము సేయుసమయం
బున దేవతాబలంబులు నరాదవరూధినులచే బరాజితులయి పఱచిరప్పుడు
వీరశ్రేష్ఠుండగు విజయుండురువడంచి॥ 19

సీ॥ శంకరదత్త కార్ముక నిషంగ శరప్రకరంబుదాల్చి ని
శ్శంక నిశాటసైన్యముల సారెయదల్చుచుఁ దేరుదోలుచుణ్
బింకముమీఱ గర్జిలుచు భీషణరోష కషాయితాక్షుఁడై
పంకరుహప్రియాంశు ఖరభాగిషువృష్టి మునుంగనేసినణ్॥ 20

తే॥ అశిలీముఖంబు లసురులశీర్షముల్ తునుమ నబ్ధిమధ్యమునను నీవ
లావలందుఁబ్రవాల సంతలో వారల శిరములంకురించె జిత్రముగను॥ 21

క॥ తమపరి శూరునిపుత్రులు రొద సేయుచు నధిక కఠినరోపంబులచేఁ
బొదివినవిజయుండాగ్రహమొదవియనేకాస్త్రములసముజ్వలుడగుచుణ్॥

క॥ పఱపి శిరః కర పదముల
నఱికిన నవి మరలమొలువ నక్తంచరులుణ్
గఱకుటలుఁగు గమిసేసిన
వెఱగందుచు శ్రమనుబొంది విజయుఁడుదనలోణ్॥ 23

క॥ చింతాక్రాంతుండయి దనుజాంతకుఁడగు శంభుసుతుని నర్చించి విభో!
వింతయయితోఁచె నధ్వరహంతకులగు దైత్యకర శిరోంఘ్రుల భవముల్॥
వ॥ ప్రథితబలంబుతో రిపుల పాణిశిరోంఘ్రుల బెక్కుమాఱ్లు నే
మథనముసేయఁగా దొలిటిమాడ్కి జనించె నిఁకేమిసేయుదుః
బ్రథనమునం గఠోర శరపాళుల నొవ్వఁగనేయసాగి రె
వ్విధమునఁజావఁగాఁగలరొ వీరలనుగ్రహమూనితెల్పవే॥ 25
చ॥ అని విజయుండు వేడికొన నాతనిమానసమందుఁదోఁచి శం
భునిసుతుఁడిట్టులం దెలిపె బూర్వము కంజభవుండు వీరికి
చ్చిన వరశక్తిచేత మొలిచెం గర పాద శిరంబు లట్లుగా
వునఁ ద్రిసహస్రదానవుల నొక్క శరంబునఁగూల్ప లగ్గగుః॥ 26
తే॥ అందు నొక్కఁడు మిగిలిన నవలివారు
మృతినినొందరు తెలియక యితరతూపు
లడరఁజేసిన నిష్ఫలమగును భైర
వాస్త్రమీ శూరసుతులను హతముసేయు॥ 27
వ॥ అని యయ్యస్త్రంబు సంప్రయోగోపసంహార మంత్రయుక్తంబుగా
బోధించి బాహులేయుండు దిరోధానుఁడయ్యె నప్పుడు విజయుండమ్మ
హనీయ సాధనంబడరించిన మత్తుండను దైత్యుండు దత్తరించుచు దనుజ
సంరక్షణార్థంబు మాయాస్త్రప్రయోగంబుసేయ దానిఁద్రిమింగి సరభ
సంబున భైరవాస్త్రంబు బటుతెంచి శూరపద్మునితనూభవుల మూడు
వేలమందితలలొక్కపరి నుక్కడంచిన విజయుండు విజయోత్సాహ
సంపన్నుఁడై మహాసేను నతిభక్తి నారాధించెనంత॥ 28
ఉ॥ దూతలువోయి తద్విధము దుఃఖముతో విసిసింప శూరుఁడుం
జేతముతత్తఱిల్లి వగజెంది కృశించుచునున్నఁజూచి వి
ఖ్యాతబలుం డమాత్యమణి యాత్మజసూతియు దుర్ణయుండు దు
ష్పాతకియుః శకుఁడు గులపాంసనుఁడైతగు ధర్మగోప్తుఁడుః॥ 29

—♦ పుత్రమరణ దుఃఖితుఁడగు శూరపద్మునసూరార్చి, తత్పౌత్రుఁడు ధర్మగోపుఁడు యుద్ధమునకు వెడలుట. ♦—

శూరపద్మునింజూచి॥ 30

వినయమెనయఁ బితామహా ఘనబలుఁడవు
సార్వభౌముఁడవగునీవు సకలబంధు
మరణమున కెల్ల కాలంబు బరితపింప
నర్హుఁడవుగావు యోచింపుమాత్మయందు॥ 31

అరయ సకలజీవహారణంబునకుఁ గాలుఁ డఖిలభూతసృష్టి కబ్జభవుఁడు సర్వకాలములను సర్వజీవివ్రాతములకు గలిగియుంద్రు వలదువగవ॥ 32

అఖిలైశ్వర్యము శౌర్యము మఖవాసువిమాన మహితమర్ధనదీక్షా
ప్రఖరధ్వజనీసంతతు లఖర్వముగఁగలుఁగునీకహా కొఱగలదే॥ 33

అనిసాంత్వన వచనంబులఁ గొనకొనియూరార్చు ధర్మగోపునిపలుకుల్ విని ధైర్యమూని కనలుచు సనికేఁజని రిపులద్రుంతునని లేచుటయుఁ॥

ధర్మగోపుండు వలికె మత్సదృశ సేవకవ్రజంబులనేకంబు గలిగియుండ జగడమునకిప్డు మీరేగఁదగదుగాన నన్నుబనిచిన మార్తుర నలిచివత్తు॥35

అనినవిని సంతసించి వీడుకొలిపిన ధర్మగోపుఁడు దివ్యాస్త్రములు ధరించి యాగ్నేయదిగ్గజంబగు పుండరీకంబునెక్కి చతురంగబలాన్వితుఁడై పతాక ఛత్ర ధ్వజాదులలరార నిఖిలవాద్యరావంబు లంబుధిధ్వానములతో మైత్రివాటింపఁ గదలి సంగరరంగంబునొచ్చిన॥ 36

భూతబలంబులెల్లను సముద్రనినాదసమంబుగా ద్విపా
రాతిరవంబుసేయుచుఁ బరాక్రమముంగనఁజేయ నిర్జరా
రాతి విచార్యుఁడయ్యును దురంతమహాగ్రహసక్తచిత్తుఁడై
శాతశిలీముఖంబులు విశంకటవృత్తిని వింటగూర్చుచుఁ॥ 37

రిపుసేనఁ నొగిలింప రెండుదళముల్ రెట్టించుకోపంబుచే
విపులాస్త్రంబుల సంగరస్థలిని దోర్వీర్యంబుతో బోరువోఁ

గుపితంబూనుచు లతుపీరు లసుహ్మ్యాత్కోటిఁ వడిందాకి రు
గ్ర పటుత్వంబులుదోప నిట్లుభయులుఁ గ్రౌర్యోద్ధతింబోరఁగఁ॥ 38

॥ వారువారివారి పేరులనొడువుచు మాఱుకొని శితాస్త్రమండలములఁ
బఱపి పెనఁగుచున్న తఱి భూతబలములు లతుపీరులును జలంబు మెఱసి॥ 39

॥ పటుబలవిక్రమంబుల నభంగురులై కదనంబు సేయఁగా
దిటమఱి దైత్యవాహినులు దిక్కులబాఱఁగ వీరులుగ్రులై
చటులశిలీముఖంబులు నసంఖ్యముగప్పుచు గాలకింకర
చ్ఛటలనుబోలి ఘోరముగ శాత్రవజీవము లూడ్చుచుండఁగఁ॥ 40

॥ కనుఁగొని ధర్మగోపుఁడధికక్రుధ శాతశరంబులేయఁగాఁ
దనదిగిభంబునుంగడఁగి దర్పముతోఁగర పాద ఘాతలఁ
హననము సేసె భూతనివహంబుల నంతయుఁజూచి వీరులు
క్కునఁదదనేకపంబు మెయిఁగ్రుచ్చిరి నెత్తురులుర్ల ముల్కులఁ॥ 41

॥ తత్కాలంబున బుండరీకము మహౌద్ధత్యంబుతోఁ దుండమం
దుత్కంఠఁ ధరియించు దండమునఁ గ్రొవ్వుఁమాన్ప భూతావళుల్
హృత్కోపంబులుడించి పాఱుటయుఁ దానీక్షించి పెల్లార్చి రా
జత్కోదండము వీరబాహుఁడు స్వహస్తస్థంబు గావించుచుఁ॥ 42

—♦ వీరబాహుఁడు ధర్మగోపుని సంహరించుట. ♦—

॥ విశిఖాసారమునించి వీరరసముఁ విస్పష్టముం జేయఁద
ద్విశిఖస్తోమము ఘాతలఁజడిసి దిగ్వేదండముం డెఁ పమి
త్కశలుండైన పలాశి దానిఁగని దిక్కుంభిఁ ధృతిం దేల్చుచుఁ
విశిఖంబుల్ కడువైవ వీరభుజుఁడుద్విగ్నుండునై మ్రాన్పడెఁ॥ 43

॥ తత్సమయంబున ధర్మగోపుఁడుగర్జించుచు విపక్షశిక్షాదక్షంబగు శక్తిని ప్రయోగించినఁ జూచి చెచ్చెరఁదేఱి వీరబాహుండు సరోషుఁడయి పరుషశర విసరంబులఁ దచ్ఛక్తినిలదొఱఁగించి దనుజునుదరంబు వ్రయ్య వాఁడి తూపులడరించుటయు వాఁడు జేవచెడి దిగ్గజకంఠాశ్లేషణుఁడై యొఱగె నప్పుడు॥ 44

క॥ హారిదిభము మండుచుం దనకరదండముచేత భూతకాంతునిసూతుం
గరముబలహీనుజేయఁగ నురుశౌర్యుఁడు వీరబాహుఁడోర్వక వెలుచన్॥

చ॥ అరదముడిగ్గికోపమున నగ్గజగండయుగంబుఁ ద్రేసి దు
ర్ధరబలమొప్ప మిన్నునకుఁదాఁకఁగ నేసినఁ దొల్లి శూలిచేఁ
గరివదనాసురుం డడఁగుకై వడిఁ గూలినఁజూచి దండమున్
సరభసవృత్తివై వఁగ వెసన్ మడియించెనుదాని వీరుఁడున్॥ 48

క॥ మగుడదనుజుండు గులిశము బగఁగొనియేయంగ దానిబట్టి దెసల్ ప్రీ
లఁగనార్చి వీరబాహుఁడు దెగువన్ రొమ్మువియఁగుమ్మె దితితనుజాతున్॥

క॥ ఆవ్రేటున దైత్యుండిలపై వ్రాలిన వానిరొమ్ము పాదవిఘాతం
బై వ్రస్సి వమదసృఙ్ముఖుఁడై వ్రేల్మిడి ముక్తజీవుఁడయ్యె నతండున్॥

సీ॥ అదిచూచి రక్కసు లదరునబఱచిరి పిమ్మట పుండరీకమ్ము కొంత
వడికి మూర్ఛనుబాసి కడువినయమ్మున వీరబాహునిజేరి వినిచెనిట్లు
యీదుర్మమఁడునాదుపాదముల్ గొలుసులగట్టి నన్నెక్కిదిద్భాగములను
దిరుగువీనినినీవుద్రెంచుటమేలయ్యె ముదమునొందితినంచుమ్రొక్కులిడుచు

తే॥ దప్పునయిరించి వీడ్కొల్ప దరలిపోదు
నానెలవు సేరననుచు విన్నపము సేయ
నెనరుతో నాతఁడమ్మాట కనుమతించి
పనుప స్వస్థానమున దిశాపద్మినిలిచె॥ 49

ఆ॥ అవల విరులసోన సమరులుగురసిరి
భూతబలము వీరజాతమలరి
యార్చిరపుడు చారు లడలొంది శూరుని
జేరి వార్తలెల్లఁ జెప్పుటయును॥ 50

క॥ పొలదిండి యేడ్చి యమపురిగల నిజదైత్యులను గనుటకై చారులకున్
సెలవిచ్చి ఘనగృహంబున కలఘువ్యథ నేగుదెంచు నాసమయమునన్॥ 51

—♦ భానుకోపుఁడు దనతండ్రియగు శూరపద్మునకు హితోక్తులఁదెల్పుట. ♦—

తే॥ భానుకోపుఁడు మున్నాజి భంగమొంది
వచ్చునదియాదిగా యుద్ధవార్త నుఱచి
గృహమునందుండి నగరంబు దహనమైన
తెఱఁగు ధర్మగోపునిమృతియెఱిఁగి కనలి॥ 52

చ॥ పితృసదనంబు జేరఁజని పెక్కుజొహారులనాచరించి న
మ్రతయడరన్ సురారివర మార్తురుగండునమించువారు ని
ర్జితులనుజేతునంచనుటచెల్లదు నిర్భరశౌర్యమందు న
ప్రతిముఁడవీవు బోరునఁబరాజయముంగని వీడుసొచ్చవే॥ 53

చ॥ తదుపరి దైత్యకోటులను దర్పముమాన్చిరి శత్రులాఁగి నీ
మది శరజన్ముదోర్బల మమానుషమంచుఁదలంపు మాజికిన్
బెదరి భవన్మనంబుసరణిన్మరలింపఁగనెంచి యిట్టులా
డెదననియూహసేయక కడిందివిచారముతోడఁజూడుమీ॥ 54

క॥ హతశేషులయిన దితిజులు బతవడినీవింకనైన సౌఖ్యముతోడన్
బ్రతుకంగగోరిచెప్పితి శితికంఠతనూజు శరణుజేరుముతండ్రీ॥ 55

తే॥ తొల్లిటట్టుల వేల్పులదొసఁగులిడక
వినయమునజేరి మ్రొక్కిన గనికరమునఁ
గాచునపరాధమెంచక క్రౌంచభేది
యనుఁడు శూరుండువలికె దురాగ్రహమున॥ 56

వ॥ పితామహోచ్యుత శతక్రతుముఖ్య గీర్వాణగణ ప్రస్తూయమానుండనగు
నేనల్పసుఖాపేక్ష నరాతుల నాశ్రయింతుననుటకల్ల. దేహపతనపర్యం
తంబు పంతంబువిడువ వైరులతేజో బలవిశేషంబులకీవు భీతుండవైతివి
కాఁబోలు నేన యుదయంబునంజని విజయోపేతుండనయి యేతెంతు
నాయోధనశ్రమంబుదీర నీవునిదురింపు మిట్లు మత్సన్నిధిని చింతించ
వలదనినఁ గలఁకనొంది భానుకోపుండిట్లనియె॥ 57

శార్దూలవిక్రీడితము.

అయ్యా! నానుడులకు నీయాత్మఁ జైచు మరులనిర్జింతుం
గయ్యంబంద నుమతియీగా నొప్పుం దగదుపరాకన్నఁ
వెయ్యుండై యటులె చనన్ జైనెఁ శూరనిశిచరుండప్డుఁ
జయ్యంబీరిపులనుచుం జండక్రోధసహితుఁడై వాఁడుఁ॥ 58

మ॥ నిజగేహంబున కేగి దివ్యశరపజ్క్తిందాల్చి తేరుల్ మతం
గజముల్ నిష్ఠురసేనలత్యధికసంఖ్యల్ తోడరా నుల్లస
ద్ధ్వజ, ఛత్ర, వ్యజనోత్కర ప్రవహ దైత్యవ్రాతముల్ గొల్వఁగా
విజయధ్వానములొప్ప నందనవధావిర్భూత శుక్యుక్తుఁడై॥ 59

—♦ భా ను కో పు ని యు ద్ధ ప్ర యా ణ ము. ♦—

మ॥ రణసన్నాహసమేతమౌరథము శీఘ్రుంబెక్కి శూరాత్మజా
గ్రణి పూర్విధులుదాటి సంగరముజేరంబోయి యచ్చోట మా
రణమైయుండెడి దమ్ములోలి ద్రిసహస్రంబుల్ మటిఁ మాంసభు
గ్గణముంగాంచి తపించి కిన్కను మహోగ్రాకారుఁడై వైరులఁ॥ 60

చ॥ కనుఁగొని వీరినెల్లరను గాలునిజేర్చక నేనుమళ్ళినఁ
జనములునింద సేయుట నిజమ్మని మారునికోడి వారనా
రినిగవయంగ నెంచెడు దరిద్రునిపోలిక నాత్మగుందుచుఁ
ఘనజవమొప్ప శాత్రవనికాయము ముంగలికేగు దేరఁగఁ॥ 61

తే॥ కాంచి భూతగణంబు లిక్కఱకురక్క
సుండెవండొ మహాభీకరుండు ఖలుఁడు
పాపకర్ముండు దుష్టుండు బలువ కూళ
వచ్చుచున్నాఁడు నిటకునై పెచ్చుపెరిగి॥ 62

మ॥ అనియోచించెడుగాఁ అమందుభయసైన్యంబుల్ రణోద్యోగులై
ఘణపాషాణ శిలోచ్చయద్రుమగదా ఖడ్గాది దివ్యోగ్ర సా
ధనపాళిఁ వెఱఁగొగతింబెనఁగునంతఁ సైనికాద్వంద్వమం
దునబోట్లాడెడు శూరులక్కజముగాఁ ద్రుళ్లారినేలంబడఁ॥ 63

వ॥ తాండవత్ర్పతిభయకబంధంబును దరసగ్రసనవ్యసనాయాత సమాగత కాక జంబుకకంకగృధ్ర సంకులంబును నై సమరతలంబు భీభత్సరసాధిష్ఠితంబయి యుండెనయ్యవసరంబున॥ 64

చ॥ దనుజులవిక్రమంబునకుఁ దాళఁగనోపక భూతసైనికుల్
కనుకనివీఁగినం దదధికాంతులు జండతరాగ్రహంబుచే
సునిశితబాణజాలముల సోఁకులమర్మములుచ్చిపాఱ వై
చిన దితినందనుల్ వెఱపుచేకుఱి పాఱిరినాల్గుదిక్కులన్॥ 65

ఉ॥ శూరసుతాగ్రజుండపుడుజూచి యనేకశితాస్త్రపంక్తిచే
వారలువైచినట్టి తరువర్గశిలాదుల నుగ్గుసేసి దు
ర్వారమహోట్టహాసమున వాఁడిమిమీఱినకీలిబాణముల్
ఘోరముగానసంఖ్యములు గుప్పినఁదచ్ఛరవహ్నికీలలన్॥ 66

క॥ వ్యధనొందిభూతబలములు రుధిరప్లుతులగుచుఁదెరల రూక్షేక్షణుఁడై
రథమెక్కివీరబాహుఁడు బృధుశరముల నఱకెనసురు బెడిదవుఁదూపుల్॥

తే॥ ఉడుగకంతట వీరబాహుండు మఱియు
బతితదోషాటతనువులపారముగను
దద్రణాంగణమునుగప్పు దారిజూచి
భానుకోపుఁడు రోషియై పలికెనతని॥ 58

—♦ భానుకోపుఁడు వీరబాహునితోఁబోరి చచ్చుట. ♦—

శా॥ దూతా! మున్నొకపారి రాత్రిచరులన్ దున్మాడి యెందేనియున్
భీతింబోయితివిప్డు చిక్కితివి యబ్ధిందాటినన్ మానినా
కాతాళంబుశమింప నిన్ను రణరంగంబందు బీనుంగుగాఁ
జేతున్నిల్వుమటన్న వీరుఁడువచించెన్ సింధునిమ్నధ్వనిన్॥ 69

క॥ నీచా! వాచాగర్వ ప్రాచుర్యముదగదు విడువు బలధృతిశౌర్య
ప్రాచుర్యముగనఁజేసిన మోచనమగుదుర్యశంబు మూఢస్వాంతా॥ 70

చ॥ అరినెదిరించిపోరునెడ నాత్మదలంతురె యోధుగెల్పులన్
స్మరణకుఁదెచ్చినంతనె పొసంగునెయట్టుల మాటలేల ని

ల్పరయన భానుకోపుఁడు గలంబసహస్రము వీరురొమ్మునన్
జొరఁబడనేయ నాతఁడెద శూరతమించి లయాంతకాకృతిన్॥ 71

శా॥ జ్యానాదంబొనరించి వేయిములుకుల్ శక్రారిబాహుద్వయిన్
వేనాటించిననొచ్చి దైత్యుఁడు మహావీర్యంబవార్యంబుగా
గా నూఱమ్ములవీరబాహుధనువున్ ఖండింపఁగా నాతఁడెం
తేనిన్ గర్జిలి శక్తిచే దనుజుగోధిన్ వ్రయ్యఁగా నేసినన్॥ 72

వ॥ వాఁడు మైమఱచె నంతటఁ బెల్లార్చుచు వీరబాహుండు గరువలిములికిఁ దొడిగి విడువ భానుకోపుండు తత్క్షణంబ తెలిసి సమీరకాండంబున దానివారించినఁ గని వీరుండనలాశుగమువఱప దైత్యుండద్దాననమార్చె నిట్లిరువురు గుపితులై సౌర బ్రహ్మ నారాయణాస్త్రంబులు బ్రయోగంబు సేయుచుఁ దదస్త్రంబులువైచి వానినుడిగించుచుఁ గలహించు నెడ నసురుండసదృశప్రజ్ఞ నస్త్రరాజంబగు పాశుపతముసంధింప నెంచి యసమానబలశాలియగు వీరుండిద్దియు యడరించునని వితర్కించి మాయ గైకొని యదృశ్యుండయ్యె నంత॥ 73

సీ॥ మనుజాశనుండిట్లు మాయదాల్చి రయంబ నభమునకరిగి కానంగబడక
సుడిగాలివలెఁజుట్టి చుట్టిభ్రమించుచు నెందునుదానయై యీను వెంచి
ఘోరబాణంబుల వీరబాహునిమేను రుధిరపూరితమగు విధము సేయ
వీరుఁడప్పాపాత్మువిహ్వృతిగన్గొనరామి యెయ్యెడనుండునో యెఱుగరాదు

ఆ॥ కలకుటంపచాళ్లు గన్పట్టెడునటంచు నన్నిదిశలఁదాన యరయసురలు
భూతబలముభీతిబొందెనప్పుడువీరుఁడదియు దైత్యమాయయనుచు దెలిసి॥

వ॥ దర్పంబునఁ దన్మాయనడఁగింప విజ్ఞానశస్త్రంబు బ్రయోగించుటయు॥ 75

ఉ॥ అమ్మహనీయసాధన మహామహిమంబున భానుకోపుఁడ
భ్రమ్మునఁ దేరునెక్కి కనుపట్టిన వీరుఁడు సూచి కోపముం
గ్రమ్మి రథంబుతో నెగసి ఖస్థలమందున దైత్యుదాఁక ను
గ్రమ్ముగ వారలొండొరు లఖండబలంబున బోరుచున్నెడన్॥ 76

ఆ॥ భానుకోపుఁడపుడు బటుశరంబొక్కటి వీరువయువ దానివిఱిచియతఁడు
గడురయంబతసదు ఖడ్గధారాహతి దనుజుబాహుదళనమును ఘటించె॥
ఆ॥ అసురుఁడంత వామహస్తాగ్రమున ఖడ్గమలుకఁజాల్పఁబూను నంతలోన
దక్షిణంబకడఁగి దాపలికేల్ ద్రుంప శూరపద్మునగ్రసుతుఁడు గినిసి॥ 78
క॥ మాయాంబకంబువైవను యాయెడమతిసంస్మరింప నవసరమీకే
పాయనికడిమినివీరుం డాయధముని శిరమునఱికె నశ్రమలీలన్॥ 79
చ॥ రణమున భానుకోపునిశిరంబును మూర్తియు శోణితప్లుతా
రుణిమ చెలంగియుండెడి గిరుల్వలె ధాత్రినిద్రావాలె నిట్లు భీ
షణుఁడగు దైత్యుఁడీల్గుటకు సర్వసుపర్వులు పుష్పవృష్టిఁ దో
షణముననించి రక్కుఁడు నిజద్విషుచావునకాత్మరంజిలెన్॥ 80
ఆ॥ వీరగణము భూతవారంబు లాహ్లాదమొందిగర్జసేసి రూర్జితముగ
వీరబాహుఁడప్డు విన్నువీడ్కొనివచ్చి సోదరులనుజూచి యాదరించె॥ 81
క॥ వీరులను భూతబలముల గూరిమి గౌఁగిటనుజేర్చుకొని యీదుష్టా
చారుండుదెగుటప్రతినం బూరించితి మిందుమౌళిపుత్రుని దయతోన్॥82

— వీరబాహ్వాది భూతబలతులు కుమారస్వామి సన్మానము పడయుట. —

ఉ॥ నిన్నటినుండి శంభుసుతునింగని మ్రొక్కనివారమైతి మిం
కన్నదువంగనొప్పునని గ్రక్కున రాజిత హేమకూటమం
దున్నమహాత్ము బర్హిణహయున్ మణిమందిరవాసుగాంచి భ
క్త్యున్నతి వందనంబులిడి యుబ్బినుతింపఁ గుమారుడార్ద్రుఁడై॥ 83
మ॥ తనహస్తంబుల వీరబాహుని సముద్యత్ప్రీతితోనెత్తి దు
ష్టనరాదున్ బహుళశ్రమంబున వినాశంబొందఁగాజేసితో
ఘనసత్వప్రతిపక్షఖండనమునన్ గష్టంబునీకయ్యె వై
రినశింపన్ముదమయ్యెమాకు నొకకోర్కిన్వేడుమా తీర్తునాన్॥ 84
ఉ॥ అంజలిబట్టి వీరభుజుఁ డవ్యయరూప మహాత్మ మీకృపన్
భంజనజేసినాఁడఁబరిపంథిని హృష్టుఁడవైతివేని నా

కుం జిరకాలముఁ భవదకుంఠ శుభాస్పదపాదపద్మ భ
క్తిం జనియింపఁజేయు మఱ కేశవ దేవపదంబులొల్లనాఁ॥ 85

చ॥ హరసుతుఁడిట్టులక్కు విమలాత్మక దివ్యులకైనగాని దు
ష్కరముమదీయభక్తి యొడికంబుగగల్గుట లేనునీయెడం
గరముప్రసన్నచిత్తుఁడనుగావున నీదుమనోరథంబువై
ఖరి వరమిచ్చినాఁడఁ గుతుకంబువహింపుమ యింకమీదటన్॥ 86

చ॥ తడయక నీదుసైన్యసహితంబుగ నేగుమటంచు నెమ్మినె
క్కుడుబలుదిట్ట వీడ్కొలుపఁ గేవలభక్తిని వారలందఱున్
బడిబడిమ్రొక్కి దైత్యపరిపంధికదంబము భూతవర్గముల్
మృడసుత వీరబాహుల సమిజ్జయమెన్నుచు బోయిరిండ్లకున్॥ 87

భానుకోపుని మరణమునకు శూరపద్ముఁడు దుఃఖించుట.

ఉ॥ అచ్చటఁజారులేగి దనుజాధిపునింగని భానుకోపుఁడుం
జచ్చెనటంచుఁదెల్ప వివశత్వముచే ధరవ్రాలి యంతలోఁ
దెచ్చెరలేచి ధైర్యమెడజేసియు శోకభరంబుబూనుచున్
జెచ్చెగనోసుతా! యనుచుఁ జేర్కొనియేడ్చుచు సారెసారెకున్॥ 88

క॥ దీనాననుఁడయి తనయా! నీనిల్లుటగనినమాత్ర నిర్జరులెల్లన్
మానితసౌఖ్యంబులచే నానందముగాంచి రేమియనఁదగు నకటా॥ 89

క॥ కొడుకా! నీవాలంబున బడుటన్వృద్ధశ్రవుండు బత్నిసుతులం
గడుఁగూర్మిగూడి దివమున కొడయుండయి పాలనంబునొగి జేయుఁగదా॥

ఉ॥ ఈవిపుడన్యలోకమున కేగుట మాధవుఁడిందిరోర్వరా
దేవులఁగూడి పాల్కడలి దేజముతో సుఖనిద్రజెందెఁగా
నావరపుత్రయంచు వదనంబును మోఁదుచు నేడ్చువేళ ద
త్సేవకులార్తిఁ దత్సుతుని శీర్షకరంబులుదెచ్చి ముందటన్॥ 91

క॥ పెట్టినబిట్టులిక్కి వగన్ మట్టునుబోఁదోలి దనుజమండలపతి పెం
దిట్టయగు భానుకోపుని కట్టడిచేతులునుదలయుగని దుఃఖమునన్॥ 92

తే॥ వివశుఁడై యుండ నాతనివెలఁది పద్మ
కోమలయు నాఁపెదాదులు గూడివచ్చి
రపుడు బద్మకోమల దనయాత్మజాతు
గాంచి యిలసోలి తెలివొంది కళవళమునః॥ 93

క॥ రొమ్మడఁచికొనుచు మగుడన్ దుమ్మంతయువిడిననెఱులతోఁగలయంగా
నిమ్మహిబడి పొరలాడుచు ముమ్మరముగవగచి లేచి మునుగన్నసుతుఁ॥

తే॥ అవయవంబులుదడవి ముద్దాడి శిరము
మూరుకొని దుస్తరపు దుఃఖభారమున న
లంగి సుతుశౌర్యధైర్యబలంబులెల్లఁ
దలఁచి మానుపరానట్టి తాపమొంది॥ 95

సీ॥ అక్కటా! యొకనాఁడు మక్కువనేనొండు సరసిలోపలఁబంకజంబుగాంచి
తెచ్చియిమ్మన రిత్తపుచ్చుటలేకను నామాటబాటించి నాయభీష్ట
మొనరించితివికాదె యుల్లంబులోనది పొదలుచునున్నది పుత్రయనుచుఁ
గొడుకకొడుకా! యంచు బడిబడినేడ్చుచుననునిప్పగిదిగర్వమునఁజెలంగి

తే॥ త్రిదశులెల్లను జేసిరికద తదీయభార్యలుం దారు బాధలబడకపోదు
రేయటంచునునందనుమృతికినలసిపెక్కువిధములవగపుచేస్రుక్కియున్న॥

పంచపాది.

తే॥ శూరపద్ముండు మిక్కిలి శోకమంది
యరుణనేత్రుఁడై నేనిప్పుడరిగి వైరి
హతమొనర్చి తద్రక్తధారాహుతులను
ద్రిణయనుని వీరయాగ లక్షణముకలిమి
మెప్పునొందించి తత్కృపామేయముననుః॥ 97

క॥ కలహంబున మృతినొందిన పలలాశనులఁ మదాత్మభవునిపుడె నిర
గ్గళముగ బ్రతికించెదనని యలుకఁ సుతుమెయినిగావ నసురులనుంచెఁ॥

క॥ తనపత్నుల నంతఃపురమునకుఁబు త్తెంచి గూఢపురుషులతో నా
యనుజుఁడగు సింహవక్త్రునిఁగనుఁగొనఁగానేగియుచటికార్యమువరుసఁ॥

చ॥ దురమున భానుకోపముఖ దుర్జయరాక్షస వీరపుంగవుల్
మరణమునొందుటాదిగను మర్మమునుంచక బోధసేసి స
త్వరమునఁదోడితెండని ధ్రువంబుగజెప్పి చనంగఁజేయ వా
రరిగిరి సింహవక్త్రి నసురాఖ్యపురంబున కుజ్జనంబునన్॥ 100

— సింహవక్త్రిఁడగ్రజుండగు శూరపద్మునికడకు వచ్చుట. —

వ॥ ఏగి యందు సింహవక్త్రినింగని చారులు వినమ్రులై నమస్కరించి దేవా! భవదగ్రజుండగు శూరపద్మునిశాసనంబున నేతెంచితి మాలస్యం బునకెడమీయక మీరలుచెచ్చెర విచ్చేయవలయునన వినియతండు నేవచ్చునంతటి బలవత్కార్యమేమి? యనియడిగిన వారలార్తులై భాను కోపునిమరణంబుదెలుపుటయు నులికిపడి బెట్టువాపోయి కుంచితశరీ రుండై సింహముఖుం డధికబలసహిత వాహినులఁగలిసి యగణిత కేత నాతపత్రంబులును నానావిధవాద్యఘోషంబులును హృద్యంబయితనర రథమధిష్ఠించి గగనగతినరిగి పూర్వజుభవనద్వారమునఁ దేరుడిగ్గి సన్నిధి కేగి తత్పదంబులకెఱగిన నారాత్రించరభర్త సాదరంబున సోదరునాలిం గనముసేసి మహానురాగంబునఁ దేలిసంజూచి సింహముఖుండిట్లనియె॥

శా॥ మాంసాదప్రభుచంద్ర నిన్నుఁదిలకింపన్ దుఃఖితుంబోలుచున్
హింసోపేతుఁడవైనయట్లు గననయ్యెం గారణం బేమొకో
సంసిద్ధిన్ వినిపింపుమన్న ననుజున్ శ్లాఘించి రాత్రించర
ధ్వంసంబంతయుదెల్పె శూరుఁడపుడాతండూఁకొనన్ బెల్లుగన్॥ 102

చ॥ ఇటువినిపించి యుద్ధమునకిప్పుడు నిన్ననుషంగ నేనుజె
ప్పుటకయి పిల్పఁబంచితిని పోరునగెల్పుగడింపు పొమ్మునాన్
దటుకున సింహవక్త్రిఁడు హితంబున నన్నను చూచి మున్ను నే
స్ఫుటమతిజెప్పువాక్యములు జూరునజెక్కతివెన్ని యేనియున్॥ 103

క॥ ఆదోషవశముచే నానాదోషాచరులు నాజి నశియించిరిపో
వేదాంతవేద్యుఁబరశివు నాదబ్రహ్మంబుగాఁ గనందగు గుహునిన్॥ 104

ఉ॥ అమ్మహిమాన్వితున్ బృధుకఁడంచుఁ దిరస్కృతిచేసి పల్కు వా
క్యమ్ముల లాభమీదినమకగ్గె నిజంబు విధిప్రతీపుఁడై
పమ్మిన మావ్వనేరికగు బాపురె! నాపలుకుల్ విసంబుగా
నెమ్మదినీకుఁదోఁచెడిని నిక్కముడాపఁగనేల న్రగజా॥ 105

క॥ సంగరమున కేనుంజని పొంగెడి రిపుసేనద్రుంచి పొలుపుమెఱసి నీ
చెంగటికివత్తుఁ గానియెడంగాంచను నిన్నటంచు డాకంబలుకన్॥ 106

క॥ విని శూరపద్ముఁడట్లే చనుమని పయనంబుసేయ సమ్మతిఁదత్ప
త్తన నిర్గమనంబొనరిఁచి చనె సింహాముఖుండు దనదు సదనంబునకున్॥

—♦ సింహవక్త్రుఁడు యుద్ధమునకు వెడలుట. ♦—

వ॥ ఇట్లరిగి యతండు నానావిధశోణితక్రవ్య సప్తసాగర తులితాసవ షౌద్ర
సర్పిఃక్షీర దధ్యైక్షవ సహితాన్నంబులఁదనిసి, సౌరభకలిత చందనపంకం
బలంది పరిమళప్రసూనదామంబులును మణికీలిత దివ్యభూషణము
లలంకరించి కృత్తివాసాసాదిత దండాయుధంబును వజ్ర చక్ర త్రిశూ
లాది వివిధదివ్యసాధనంబులును మాయాపాశంబునుగొని॥ 108

తే॥ తురఁగదశలక్షబద్ధమౌ యరద మెక్కి
సుతుల మంత్రుల వాహినీపతులఁగలిసి
రొదలుసేయుచు గజ హయ మదజలార్ద్ర
మై ధరిత్రి బయోధిని బోధసేయ॥ 109

క॥ చతురంగబలము లతితీవ్రతతో నేతేర వాద్యరావములడరఁ
బ్రతిలేని గొడుగుమొత్తము లతిశయ కేతనసమూహ మలరారంగన్॥

వ॥ నగరద్వారంబు నిర్గమించుసమయంబున దుశ్శకునదర్శనంబగుటయు
శంకించక నిఖిలసైన్యసమేతంబుగా నాయోధనంబు జేరవచ్చుచుండెడి
సింహవక్త్రదనుజునీక్షించి హరిబ్రహ్మేంద్రాది దేవతలుభయంబునొంది
కార్తికేయునిడాసి ప్రణామంబులొనరించి ముకుళీకృతపాణులయి
యిట్లనిరి॥ 111

సీ॥ దేవదేవమహాత్మ యీవచ్చుదనుజుండు
శూరునితమ్ముఁడు దారుణుండు
సింహాముఖుండునాఁ జెలఁగుదురాత్ముండు
సాహస్రశీర్షుండు ద్రోహరతుఁడు
ద్విసహస్రబాహుఁడు ద్వ్యక్షుండును సహస్ర
యోజనవిపులమౌ యురమువాఁడు
వీఁడుదోర్బలమున సూడులబొలియించి
యబ్జజాండ సహస్రమాక్రమించి
తే॥ ప్రభుతగైకొనె మఱియును బర్వతాది
కూర్మదిగ్గజధృతమగు గుతలమెత్తి
తనబలముజూపుచును జతుర్దశ జగత్స
హితమజాండము బొడిసేయ నెంచువాఁడు॥ 112
ఆ॥ ఒక్కొకతఱి మేరు వుక్కునఁ బెకలించి
దండముగ నొనర్చుచుండుఁ బూర్వ
మున్నచోట దొల్లియున్నభంగిని నిల్పు
చుండు వీఁడుమిగుల గండుగలఁడు॥ 113
తే॥ పార్శ్వములురెంటియందున వాఁడియలరి
యభవుఁడిచ్చినశూలంబు నదియుగాక
ననుదినంబు మాయాపాశమును ధరించు
మఱపుచేకుఱెననుటయ మఱపుగాఁగ॥ 114
వ॥ ఈదుశ్శీలురనియన్నయగు శూరపద్ముండు నేకాదశకోటిరుద్రేశాన నారా
యణులఁదక్క తదన్యానిమిషుల బాధించుచు నీచకృత్యంబు లొనర్పం
బంపుచుండు నిట్టి మహాపాపాత్ములును భీమరూపులును నగు నీయాశర
ద్వంద్వంబు నాశంబుజేసి మమ్ముద్ధరింపుమని ప్రార్థించిన సుప్రసన్నుండై
సేనాని యట్లయగుననిచెప్పి యప్పుడు॥ 115



చ॥ అనిలునిజూచి నీవతిరయంబున నంచితపౌరథంబు దె
మ్మనవిని వీరబాహుఁడు మహావినయంబు వినిశ్చలంపుభ
క్తినిగుడఁ గేవలుండును నకిల్బిషుఁడున్ సుఖరూపుఁడౌ షడా
ననునిశుభాంఘ్రియుగ్మనలినంబులకున్ బ్రణమిల్లియుట్లనున్॥ 116

చ॥ అనఘ భవత్సహోదరుఁడనైన ననుంబ్రియమూనిపంచినన్
దునుముదుశత్రుసైన్యముల దుర్భరశౌర్యముమీఱనంచుఁ బ
ల్కినవిని పిన్ననవ్వొలయఁ గేకితురంగుఁడనుజ్ఞ సేయఁగా
మనమునహర్ష మొంది యసమానబలుండగు వీరబాహుఁడున్॥ 117

—♦ వీరబాహుఁడాజికి బ్రయాణమగుట. ♦—

తే॥ లలినవాధిక లక్షవీరులునుభూత
సైన్యములుదన్నుఁగొల్వ నచ్చటఁదొలంగి
గేహమునకేగి యుద్ధసన్నాహుఁడగుచు
రుచిరవస్త్రపరిష్క్రియల్ రూఢిదాల్చి॥ 118

చ॥ అలరుచు ద్రోణపుష్పమయ హారవిలాసిత వక్షుఁడై మహో
జ్వల విశిఖప్రభానుగత చారుశతాంగమునెక్కి రోషసం
కలిత మనస్కుఁడై వెడలి గాఢబలాన్విత భూతజాలముల్
బలసినటింపఁ గేతనవిభల్ గగనస్థలమావరింపఁగన్॥ 119

సీ॥ సకలవాద్యముల ఘోషణములువీతేర ధ్వజినీపదోద్ధూతరజము భాను
మండలంబునుగప్ప ఖండనక్షితిఁజేర నరిగిన నుభయసైన్యములుగలిసి
వారణవాజి ఘంటారవంబులు వానిఘీంకారరవములు గ్రిక్కిరియఁగ
రథరథాంగగణ సంరావముల్ భూతాసురవ్రాత కలకలారావములును
తే॥ సైన్యనాయక సింహగర్జనలుగూడి దిక్కులెల్లఘూర్ణిల్ల నుదీర్ణవృక్ష
శైలశూలాస్త్రముసలాదిసాధనములసంకులారావమిరువాగుసల్పుచుండ॥

శా॥ దైత్యవ్రాతము లాదితేయబల ముక్తగ్రావ భూజంబులన్
ధృత్యోద్యద్గతఁద్రుంచి దండకులిశాదిక్రూర శస్త్రాళి నా

ద్ధత్యంబేర్పడ మోఁద ఘాతబలముల్ దైన్యంబుసంప్రాప్తమై
యత్యంతత్వరతోఁబరాఙ్ముఖులునై యాశాతతింబాఱఁగన్॥ 121

—♦ సింహుఁడను వీరుఁడు దశాస్యుఁడను దనుజుని జంపుట. ♦—

క॥ సింహుఁడను వీరవర్యుఁడు రంహంబున ననికిఁగడఁగి రక్కసితుటుమున్
సింహముమదదంతావళ సంహతిగతి దండమునను సమయించుటయున్॥

ఉ॥ చూచి దశాస్యనామమునశోభిలు దానవుఁడుక్కుమీఱి నా
రాచపరంపరల్ గురిసి బ్రద్దలువాపఁగఁగాంచి సింహుఁడున్
సైఁచక దండఘాత శరసంతతిఁగూల్చుచు వచ్చివచ్చి య
న్నీచునివక్షముంబగుల నిష్ఠురతన్ బ్రహరించె నుగ్రుఁడై॥ 123

శా॥ ఆఘాతంబున వానివర్మమువియం హంకారుఁడై దైత్యుఁడా
లో ఘూర్ణిల్లుచు సింహురొమ్మువియునట్లున్ దండమున్ వైవఁ ద
న్మోఘాతీత పవిప్రతీకనిహతిం నుగ్గై ధరన్ రాలె దై
త్యౌఘంబుల్ వెఱఁగంద నయ్యెడను సింహుంజూచివాఁడుద్ధతిన్॥ 124

క॥ పరశువుబఱపిన సింహుఁడు దొరగించెనుదండహతిని దోషాటుఁడు భీ
కరలీల వక్త్రవయిచిన నురువిక్రముఁడార్చి దానియుదుటుడిగించెన్॥ 125

మ॥ తనశక్త్యాయుధమిట్లు వ్యర్థమయి డిందన్ దానవుండుగ్రకో
పనుఁడై కాలునిఁబోలి దండమునవైవన్ డస్సిసింహుండు మే
నునరక్తంబుస్రవింపఁ దెప్పిఱి కృశానుజ్వాలలన్ మీఱు భీ
షణరోషంబున మోఁదె దండమున వక్షస్థానమందాశరున్॥ 126

వ॥ ఇట్లు మోఁదుటయు॥ 127

తే॥ తడయకప్పుడె వాఁడుర్విబడి మొగంబు
నందు ముక్కుల రక్తమమందగతిని
బయలుదేరుఁడు యామ్యదిక్పాల నగర
గమనమొనరించె దైత్యులు గళవళింప॥ 128

వ॥ అప్పుడు పాలివోనిధైర్యంబున నసురసమూహంబులు గసిమసంగి
సింహుందాఁకి శరవృష్టిముంచిన నతఁడు శ్రమనొంది దెసలుజూడఁ జేరు

వనున్న కనకుఁడనెడి వీరవర్యుఁడవార్యుండయి నిశితప్రదరములఁ బొదివి కదనంబున నుదుటుసూపిన దనుజవాహినులు బలాయనమొనరింపఁగని దుర్ముఖుండను దైత్యుండధికరోష దందహ్యమానుండయి॥ 129

—♦ కనక వీరమార్తాండులనెడి వీరులు దుర్ముఖుఁడను దైత్యునిఁ బాఱఁదోలుట. ♦—

ఉ॥ స్కందునిసేనలందగిలి కర్కశసాయకపాళి నేయుచున్
గుందెదఁగూరునట్లు గనకుండుమొదల్ గలవారిఁ జేయఁగా
డిందనిగండునంగెరలి చెక్కుసవీరులు భూతసైన్యముల్
గ్రందుగ నశ్మపాదప ధరాధరముల్ బరగించిపేర్చినన్॥ 130

తే॥ అలుక నవియన్నితునిమి మాయావిగాన
దుర్ముఖుఁడు సాంపరాయిక కర్మదక్షుఁ
డై నిశాతాస్త్రములఁ గనకాది దివిజ
సంచయంబుల నందంద ముంచుటయును॥ 131

శా॥ కన్నారంగని సింహగర్జనమెసంగన్ వీరమార్తాండుఁడా
సన్నుండై కలహాంగణంబునను విజ్ఞానాస్త్రమున్వైవ తే
జౌన్నత్యంబునఁదత్ప్రకల్పితపుమాయన్ మాయమొందింపఁగా
ఖిన్నుండై దనుజుండు వెండి పృథుశక్తిన్మించి యొక్కుమ్మడిన్॥ 132

చ॥ కనకునివేయిబాణములఁ గాయమునొవ్వఁగనేయ నాతఁడుం
దునిమెనుముల్కులేడిటను దుర్ముఖుచాపము నొండుచే జిరా
పనివడి పెక్కుతూపులన బాధముగానడరించి మర్మభే
దనమొనరింప వాఁడు వసుధంబడి లేచి యదృశ్యుఁడౌటయున్॥ 133

ఆ॥ భీరువెంబడింప బెడిదపుఁగోలయని కనకుఁడూరకుండెఁ గడిమిమాని
యట్టిసమయమందు ననినోడిపాఱెడు దనవరూథినులను గనులఁజూచి॥

వ॥ దానవవిభుండును బృహత్తనుండును ఘోరుండును సత్వసంపన్నుండును సహస్రశీర్షుండును ద్విసహస్రకరుండును నగు సింహవక్త్రుండురు వడించి॥ 135

—♦ సింహవక్త్రుఁడు భూతసేనలతోఁ బెనంగుట. ♦—

సీ॥ సింహాగర్జనములచే నింగినించుచు గఠినశరంబులఁగప్పుటయును
దద్దైత్యుఁడాసి భూతవ్రాతములు దృషత్సాలాద్రిదండాది సాధనముల
మొత్తఁగా రాకాసిసత్తువవలచేత నిలఁబడనేసినఁ దొలఁగకవల
భూతసైన్యంబులా రీతిగానేయంగఁ గ్రవ్యాశి దృఢతనూ ఘట్టనమునఁ
తే॥ జోద్యముగనవ్విధరఁగూలెఁ జూర్ణమగుచు
నపుడు సవిధస్థితాచల విపినవిహృతి
సలుపు నానామృగంబులు జలదరించి
ఘీంకృతు లొనర్చుచనుబాఱెఁ గెలఁకులకును॥ 136

మ॥ అపుడభ్భూతగణంబువీరులును గ్రౌర్యంబాత్మలఁ బెట్టినై
విపులాభృత్తులనట్లువైవ నవికప్వేఁమిన్ను సింహాస్యుఁడుం
గుపితుండై యరదంబుడిగ్గి దివిషత్కోటుల్ ప్రయోగించు తీ
వ్రపుసామగ్రికి నోడకత్యధిక సత్వంబేర్చడఁ వైరులఁ॥ 137

సీ॥ కొందఱి భూమినిగొట్టి కొందఱి వార్ధి వైచియు గొందఱి బీఁచమడచి
కొందఱి దీవులయందున బడనేసి కొందఱి బడబాగ్నిఁ గూలనూకి
కొందఱి దిగమ్రింగి కొందఱి నండభిత్తులఁబార్చి కొందఱిఁ ద్రుళ్లడంచి
కొందఱిఁ బాతాళగుహలనుండఁగఁద్రోసి కొందఱి ఖరదృష్టిమ్రందఁజేసి
తే॥ మఱియు నానావిధంబుల మనుజభోజి
యుగ్రుఁడై ప్రాణములఁ బాపుచున్నఁజూచి
యబ్జనాభాదు లచ్చెట్ట కళుకుగదిరి
కలతనొందుచు మిన్నున దొలఁగిచనిరి॥ 138

క॥ పదపడి సింహవక్త్రుఁడు సుపర్వవిరోధులు సన్నుతింపఁగా
విదితరథంబునెక్కి యెడ వీరవినోదవిహారకాంక్షతోఁ
బొదలఁగ నగ్నికోపుఁడను భూతవిభుండు గఠోరవాక్యముల్
చదువుచు మారుతమ్మునని వెసంబటుమార్గములు బూన్చివైవఁగఁ॥ 138

మ॥ అదిసింహాస్యునిఁజొమ్ముదాఁకుటయు నుగ్గైపోవుటంజూచి భీ
ప్రదుఁడై యార్చుచు నగ్నికోపుఁడు భుజాగ్రంబందు దండంబుదా
ల్చి దనుప్రోద్భవుసారథింజదుపఁగా శీఘ్రంబె యద్దుష్టుఁడుం
గొదతో దండముపైవ భూతవిభుఁడుం గూలెం రణక్షోణిపై॥ 140

వ॥ అంత సింహవక్త్రుఁడాత్మీయ శతాంగమున కన్యనియంత నమర్చునెడ సుమాలియను భూతవిభుండొండొక కొండ నుద్దండుఁడై పఱప దనుజుం డద్దాని నవలీలఁ గరంబునంబట్టి బాలుండు జెండువోలె నెగయవైచుచుఁ బెల్లార్చి సుమాలివక్షంబు లక్షించి మోఁదుటయు నతండు సోలి నేలం బడియెనప్పుడు॥ 141

శా॥ దానింగన్నులఁజూచి దండియను భూతశ్రేష్ఠుఁడుద్వృత్తి నా
లోనం దండముబూన్చివైవఁగ మరుల్లోకారి కాఠిన్యమా
మేనుందాఁకుడుఁ జూర్ణమయ్యెనది యామీఁదం హరిందంతిచం
దానం దండికరంబుచేఁబొడువఁ గ్రోధంబూనిదైత్యుండటం॥ 142

ఆ॥ పాదఘాత నేలఁబడఁగ్రుమ్మి పెడకాల
నెగురఁజిమ్ముటయును గగనమునకు
నేగిభూతవిభుఁడు నిలఁవ్రాలితూర్ణంబ
యుబికి మర్కటంబువోలి మెఱసి॥ 143

వ॥ కడువడి సింహవక్త్రుఘనకాయము నొవ్వఁగ ముష్టిఘాతలం బొడుచుచు భృంగముల్ వ్రతతిపుంజములం దిరుగాడుచుండుకై వడి నతిలాఘవంబునను వర్ష్మము దాడనమాచరించఁగా గడుసరిదైత్యుఁడంతయునుగాంచి దురాగ్రహసక్తచిత్తుఁడై॥ 144

॥ నరుఁడీఁగగుంపుఁజిదిమెడు కరణిం గసిమసఁగి చంపఁగా భూతవిభుం డరుదుగ దవ్వుల విశ్వంభరమీఁదనుదొరఁగె దివిజబలములు బెగడం॥ 145

॥ తిలకించి లక్షవీరులు ఘోరరూపులై కఱకుటంపఱసోన గడిమిముంప నాతండు లెక్కసేయకయున్న వీరులు గండుమీఱి శిలీముఖప్రయోగ

మొనరించుటయు దైత్యుఁడుగ్రాకృతి రథావతరణంబు సేసి మతంగజారి
కరియూథములఁద్రుంచు కైవడి వీరులఁ గాలుసేతుల నవలీలనలిచి
ఆ॥ తినుచుఁ దన్నుఁజుట్టికొనువారి నెట్టన గ్రుక్కఁగొనుచునిట్లు గొదవయుడక
లక్షవీరులను గలంగఁజేయఁగఁ జివ్వకెడసి సురబలంబు జడిసిపఱచె॥ 146
వ॥ ఇట్లు పడరానిపాట్లంబడుచు బరుపిడెడు లక్షవీరులపై జకితహారిణంబుల
బారి సమరనులుకు కంఠీరవంబుతేవ వెనుదవిలి తఱుము సింహవక్త్రునిఁ
జూచి వీరబాహుండు గుపితమానసుఁడై యెడమీక బెడిదపుఁదూపుజడి
మబ్బులయుబ్బునఁగురియుచుఁ ద్రుటికాలంబున నక్కుటిలుని పటలంబుల
నటమటించి యాభీల సంగ్రామఖేలా విలాసంబునఁదేలఁ దచ్ఛరనిహత
రిపుతనుక్షతస్రవద్రక్తధారాప్రవాహంబుల మొండియంబులు దేలియాడ
వంచకాది శవతరసాశనసత్త్వంబు లశనార్థమేతెంచెఁ బిశాచాదుల
తాండవంబఖండమయ్యె నీలీలనప్పాలికలను భీభత్సరసంబునకాలయం
బైక్రాలె నత్తటి సింహవక్త్రునికొడుకులు నూఱ్వురొక్కెత్తున మొత్తమై
వీరోత్తముఁడగు వీరబాహునిందాఁకి॥ 147

— ♦ సింహవక్త్రపుత్రశతమును వీరబాహుఁడు వధించుట. ♦ —

ఉ॥ నైకశరప్రయోగమున నజ్జగఁగొట్టిన భీతినొందక
భీకరలీల వీరుఁడతిభీష్మశరంబుల వారినందఱం
దేఁకువమాననేయుటయు దేఱ్కొని సింహముఖాత్మజుల్ సము
ద్రేకత నాతనిన్ నిశిత తీవ్రతరాంబకకోటిగప్పిరన్॥ 148
వ॥ కనుఁగవ విస్ఫులింగములుగార్చుచు వీరభుజుండు సింహవ
క్త్రుని శతసూనులం గడిమితో రథచాపప్పృషత్కహీనతం
గననొనరించి వెండియును గాఢశిలీముఖభిన్నకాయులై
తనరఁగఁజేసి కల్పజలద స్తనితధ్వనిబొబ్బవెట్టినన్॥ 149
గీ॥ నిర్ణయింపంగరాని యుదీర్ణుఁడితఁడు
ధన్వినై పుణ్యమునఁగెల్వ దరమెయంచు

సింహవక్త్రిజులెంచి నిస్త్రింశములను
బట్టికొని వీరభుజుదాఁక నట్టెచూచి॥ 150

చ॥ అదరకవీరబాహుఁడు ఖరాసిశయుండయి పోరుచుండ న
మ్మదటులు ఖడ్గశిఖల నమందుఁడుగామదిదోచి చేతులం
బొదలెడిమండలాగ్రములు భూమినిజార్చి రణంబులోపలం
గదలకయుండఁబట్టుకొని గండ్రలు సేయఁగ నెంచి ధీరతన్॥ 151

క॥ డాసినవీరుండొకట శితాసిస్ఫుటధార వారినందఱదలలన్
రోసంబుతో మహింబడఁజేసెన్ సురపుష్పవృష్టి చెలఁగెఁదదుపరిన్॥ 152

చ॥ సుతశత కాలధర్మమును జూచివగర్చుచు సింహవక్త్రిఁడు
న్నతగిరితుల్యమౌ రథమునన్ వసియించి కటాకటాయుతం
డతిశయసత్త్వుఁడై కదనమందు మదీయశతాత్మజాతులన్
హతమొనరించెనంచు హృదయంబునసిగ్గరి యంత నీర్ష్యుఁడై॥ 153

తే॥ దర్పమొప్పార వీరినందఱను దీర్ఘనిద్రనొందింతుననుచు నిర్ణిద్రజవత
వీరబాహునిడాయంగ దేరుదోలనతఁడుదగ్ర్క్రియ జేయుడుదితిజుఁడనియె॥

—♦ సింహవక్త్రి వీరబాహుల యుద్ధము. ♦—

సీ॥ ధృతిహీనులగు నవాధికలక్షవీరులలో నొక్కరుండవో కానియెడల
కార్తికేయుండవో కాక దూతవొనీవు వినిపింపుమన్న నద్దనుజుఁజూచి
యుగ్రుఁడై వీరబాహుండు దైత్యాధమా దేవదేవుఁడుదివ్యభావుఁడగుచు
బెంపొందుగుహునకుభృత్యుండమున్న నే దూతభావముబూనిదుష్టదనుజ

తే॥ పటలిఁద్రుంచితి నను వీరబాహుఁడండ్రు
నిక్కముగ నిర్జరులలోన నొక్కరుండ
నేమిపనినన్నుఁదెలియ నీకిప్పుడనుచు
నలుక గంభీరవాక్యంబు లాడుటయును॥ 155

వ॥ భ్రుకుటీకరాళుండై సింహముఖుండిట్లను మిక్కిలిబక్కరక్కసుల నుక్క
డంచుట యెక్కువపౌరుషంబుగాదు బాలురగునాతనయుల నూఱ్వు

రను బరిమార్చితినని గర్వించకుము సత్యంబుగా నిన్నిక్కడనమునఁ
జక్కాడి షాణ్మాతురాది సకలభూతనివహంబులను గీర్వాణగణంబులను
దదితరులై నవీరులను నిర్జింతునని పల్లఱుపులాడుచున్నవిని వీరబాహుండ
మర్షంబు మెఱసి గాఢనిశితనారాచంబుల నాక్రూరుని దోర్మధ్యంబున
నేయ నవి తత్కఠినవక్షఃప్రభేదంబు సేయనోపమిచేఁ బల్లటిల్లి పుడమిం
బడినఁజూచి నిశాచరుఁడు దుర్మదుండై యప్పుడు॥ 156

తే॥ చండదండంబుగొని వీరుఁ జెండివైవనేయ నాతఁడు హాల్గమ్ముఁలేసి నటికి
యధికకోపంబుతో సహస్రాశుగముల నసురుమౌళులగీలింప నవిరయంబ॥

క॥ చని తచ్ఛిరసంఘట్టనమున రజమైనేలఁ్రవాలఁ బుణ్యాజనుండుఁ
గనలుచు శూలమువైచినఁ గనుఁగొనివీరుండు వేయికఱకుటలుగులఁ॥

గీ॥ పఱపిన నాశూలాయుధ మఱవఱలొనరించివాని నరుదేరంగఁ
గుటికొనివీరుఁడు మఱియుం గఱకుందూపులొకవేయి కడువడినేయఁ॥

॥ ఆశూలమకుంఠితమై యాశువుగావీరుడాయ నాతఁడు బటుబా
హాశక్తిఖడ్గధారను నాశముగావించె సురలు నల్లవో! యనఁగఁ॥ 160

॥ మఱియును వీరబాహుఁ డసమానబలంబున సర్వలోకముల్
పఱియలువాపదక్షుమగు పాశుపతాస్త్రమువైవ రక్కసుం
డుఱుముచుఁ దత్కలంబమ ప్రయోగముసేయఁ దదస్త్రయుగ్మముఁ
గిటికొనిపోరి కొంతవడికిఁ శమితంబులునయ్యెనయ్యెడఁ॥ 161

। తనమదివీరబాహుఁడు వితర్కముజేసి మహాబలాఢ్యుఁడి
ద్దనుజుఁడు జావనోపఁడు యథార్థమునావలనఁ షడాస్యుచే
హననమునొందఁగాఁగలఁడఁటైనను యిప్పుడునేఁగడంగి ఖం
డనమొనరింతు వీనిప్రృతనాతతినంచుఁ జతుర్దశాస్త్రముల్॥ 162

॥ వింటంబూన్చి తదీయసూతుదునుమఁ వీక్షించి దైత్యుండు బె
న్మంటల్ గ్రక్కుచుఁ బెన్గదఁబఱపఁగా మట్టాడి యవ్వీరు మే
నంటం దుత్తుమురై ధరంబడిన శౌర్యస్ఫూర్తిఁ దత్సారథిం
గెంటించెఁ వెస వేయిబాణములచే గీర్వాణులగ్గింపఁగఁ॥ 163

వ॥ ఇట్లు సారథిమడిసిన సింహవక్త్రుఁడు సలంబుడించక న(ప్రతిమంబగు మాయాపాశంబును మానసంబునధ్యానించి కరస్థంబుసేసి సమంత్రక ముగావిడువ నమ్మహాసాధనంబు॥ 164

చ॥ జగములనెల్ల సంతమసజాలమునించుచు భీమభీమమై
నిగుడుచు వీరబాహుముఖ నిర్జరసేనలనెల్లనోలిఁ బ్రా
క్షైగ గుహలోనద్రోసిన మృగప్రభువక్త్రుఁడు బొబ్బవెట్టి నా
పగతుఁడు బాలుఁడైన శిఖివాహనుఁడేఁడి యటంచుబల్కినన్॥ 165

తే॥ స్వామి? విను మాతఁడిప్పుడు హేమకూట
నగరమందు సహస్రసేనలును భూత
నిచయములు దన్ను సేవింప నిలిచియున్న
వాఁడటంచును వేగరుల్ వరుసదేలుప॥ 166

ఆ॥ ఆలకించి దనుజుఁడనియె నాతఁడు భీతుఁ
డయినవిడువ నచటికరిగికూల్తుఁ
బ్రబలశౌర్యులయిన పలలాశనుల మున్ను
జనువిధంబుసేయుఁ డనెడుతఱిని॥ 167

—♦ కు మా ర స్వా మి యు ద్ధ ము న కు వె డ లు ట. ♦—

॥ సర్వగతుండగు శ్వసనుండు గాంగేయుగాంచి భక్తి నమస్కరించిపలికె నమరవిరోధి మాయాపాశమునగట్టి వీరబాహ్వాదులఁ దూరుపుమల కోనలఁబడద్రోయు గొడవఁదెల్పినవిని సింహాసనమున వసించిగుహుఁడు గంజజార్పిత పాదుకలుమెట్టి శుద్ధాంత నిర్గమనుండయి నియతితోడ

॥ గాడ్పుగొనితెచ్చు మణిశతాంగంబునెక్కి
కేశవాబ్జజహస్త వికీర్యమాణ
విజయహేతుక సుమసమాన్వితుఁడునగుచు
సకలసురలూడిగంబులు సల్పుచుండ॥ 168

॥ మఱియును రత్నమయాతపత్ర చామరవ్యజనంబులు బ్రకాశింప శంఖ కాహళభేరీప్రముఖ నిఖిలశుభధ్వానముఁబ్రాండమునిండిఘూర్ణిల్ల వంది

మాగధబృందారక • సందోహసంస్తవంబులతిశయింప నిరుపమానవైభ
వాలంకృతుఁడై భూతబలాన్వితంబుగా సంగరంబునకుఁగదలెనప్పుడు॥
ఉ॥ భూతబలంబులున్ దనుజపుంగవు లొండొరుదాఁకి పర్వత
వ్రాతశిలాద్రుమంబుల భరంబుగఁబోరుచునుండువేళలో
యాతువులంబరాజయమునందఁగ భూతగణంబొనర్ప వి
ఖ్యాతబలుండు సింహముఖుఁడందులకోర్వక బిట్టదల్చుచున్॥ 170
క॥ సమరమునకెదురునడువన్ తమవిడి భూతప్రబంబు శైలద్రావ
ద్రుమముల నీర్ష్యంబఱపిన నమరారి చలింపకుండె నచలంబుక్రియన్॥ 171
చ॥ పదఁపడి సింహవక్త్రుఁడు నపారబలంబున భూతసేనలన్
గుదులుగఁబట్టిమ్రింగుటయు గొబ్బునవారలు నాసకర్ణ రం
ధ్రదెసల నిర్గమించి భయతాపములొందుచుఁ జాఱిరెల్లెడన్
మదమఱి కొందరద్దితికుమారుని పొట్టనుజిక్కిరయ్యెడన్॥ 172
క॥ మఱిఁగొందఱన్నిశాచరు నుఱిదికి నిలువంగనోడి యుర్వినడుంగుల్
నెఱినుంచలేక మిక్కిలి వెఱపున నపకీర్తికోర్చి వీఁగిరిపెలుచన్॥ 173
చ॥ అరిబలభంజనప్రబలుఁడై చెలువారెడు బాహులేయుఁడొ
క్కరుఁడును నిల్చియుండెనట గాఢరయంబున గూఢచారులున్
సురకులకంటకుండయిన శూరునిఁగానఁగఁబోయి హృష్టతం
బరగుచు సింహవక్త్రి రణపాండితి నుబ్బుచు విన్నవించినన్॥ 174
ఉ॥ శూరుఁడతిప్రియాన ననుజుంగనువేడుక గోపురంబుపైఁ
జేరిన నప్పుడందుఁగల సేవకుఁడొక్కఁడు శత్రుకోటిలో
ధారుణినిల్చియుండిన బుధస్తుతు షణ్ముఖునొక్కనిన్ ద్విప
ద్వారముమ్రింగుచున్న బలదర్పసముగ్రుని సింహవక్త్రినిన్॥ 175
॥ చూపినఁ గడుసంతసమున నాపాపచరిత్రుఁడుండె నంతనచట గౌ
రీపుత్రుఁడు సింహానను నేపునఁదాఁకంగ దనుజులెల్లను గినుకన్॥ 176
॥ శరజన్ముఁ గదిసి భీకరశరముల బొదువుటయు నతఁడు జలమునవారిన్
హరిముఖుని దోమగుంపుల సరణింగని వింటనారి సంధించివెసన్॥ 177

క॥ నిదురించుఫణినిలేపిన విధమున గోదండగుణము వే మొరయింపన్
విదితంబగునారావము బదులయ్యె నజాండతతి విపాటనరుతికిన్॥ 178

శా॥ తన్నాదంబున దానవేభహయ సంతానంబుగంపించి ధా
త్రిన్నిక్కచ్చిని మ్రొగ్గినంగని మృగాధీశాస్యుఁడాటోపతం
గన్నుంగానక మత్తుఁడై శరజు గానంబోయి యూహించె నీ
కన్నా కేమును తారకాసురుని వక్రాక్రాంచున్ విదారించుటల్॥ 179

— సింహవక్త్రుఁడు కుమారునితో వీరోక్తులాడుట. —

వ॥ అనిస్మరించి మగుడ మాత్సర్యంబు బెంచి ధైర్యంబునఁబార్వతీసూనుని
జూచి యీసంగ్రామమునకీవు రాఁదగదెట్లనిన? నేనువిక్రమంబునమించి
యభియాతిచక్రమర్దనంబుగావించెద వారింపసమర్థుండవే? కావునఁ
దొలఁగిచనుమని తిరస్కరించిపలికిన నాలించిసేవాని మందస్మితాననుఁడై
యిట్లనియె॥ 180

మ॥ కుటిలాత్మా విను శిష్టపీడనము గన్గోజాల దుర్మార్గులన్
విటతాటంబుగఁద్రుంచి శిష్టులను సంవిద్బుద్ధితో రక్షసే
యుటె మాకున్సహజాతమౌగుణము నీయుద్ధంబులో నిన్నుఁగూ
ల్చుటకై వచ్చితి నిక్కమంచుఁబలుకన్ శూరానుజుండుగ్రుఁడై॥ 181

తే॥ బాలకా!నీవువేల్పులబారి యుడుపఁజాలవదిగాక నాజినాచలముబలము
గాంచనెంతటివాఁడవు మించుటలుక నాఁగినిల్చిన గెలువనీయబ్బతరమె॥

క॥ రణమున నాయానతిచే గణియింపక నాదు సైనికాతతి నిన్నుం
దృణముగఁబాఱందోలదె క్షణకాలమునంద తెలిసి చరియింపుమికన్183

తే॥ నీదుసేనలమాయింప నేను కొందఱినిగ్రసించితి మఱిఁగొందఱిని గఠోర
పాశములఁగట్టిచంపితిఁ బట్టినిన్ను హతముగావించుటకునందవై తివపుడు॥

క॥ నేచెఱనుంచినవారలఁ గాచుటకై వచ్చి భూతగణములనెల్లం
జూచుచునె చంపికొంటివి యోచింపకు స్వల్పుగాగ నుల్లమున ననున్॥

చ॥ అమరులునిన్ను నిర్భరబలాఢ్యుఁడవంచు నుతించివేడఁగాఁ
బ్రమదమునొంది మత్పురిని బంధితులైనసుపర్వకోట్ల న

శ్రమమునవీడఁజేతునని సంఖ్యకువచ్చితివింతమాత్రనే
భ్రమపడివారివీడుదునె స్వప్నపువార్త యటంచునెంచుమా॥ 186

క॥ నిజమాడినాఁడసుమ్మని గజరిపువదనుండుబలుకఁగాఁ గాలజ్ఞ
ధ్వజుఁడాగ్రహంబుచే నొకవిజయాస్త్రముగ్రుచ్చె వానివిపులోరమునన్॥

వ॥ అప్పుడశ్శాణశుత వివరమార్గంబునఁ దదురస్థితభూతగణంబులు వెలువడి రిపులపహసింప దెసలకుఁజికిరయ్యెడ సింహవక్త్రిండు గాటంపుఁగాయ పుంగలుఁగు గేలంగప్పి డొక్కనున్నభూతగణంబులరాక నడ్డగించుచు మర్నయంబునఘూర్ణిల్లి వికృతాకృతియయి దండాయుధంబడరించిన॥

— ♦ గుహుఁడు సింహవక్త్రి వివశుఁజేసి యుదయాద్రి గుహలలోనుండు వీరబాహ్వాదుల రావించి దనుజసేనల గగ్గోలు గావించుట. ♦ —

సీ॥ శూలపాణిసుతుండు నాలుగమ్ములవైవ దండంబుఖండించిదనుజునుదురు
నాటఁగా విస్మృతిపాటిల్లి సోలిన మునుశరశుత వపాయనముగప్పు
హస్తంబుదొలగంగ నప్పొట్టలోనున్న భూతసందోహంబు ప్రీతియెసఁగి
వెడలిసుఖంచెను వెండియువానిచే మృతినొందువారలుబ్రతికి గుహుని

తే॥ కెలననిల్చినయంత నబ్బలియుఁడొక్కపాశమోచకశరమేయ బాధకాంతి
దనుజదుష్పాశహాతిఁజేసి తత్క్షణంబ వీరబాహ్వాదులను గుహుఁజేరఁదెచ్చె॥

తే॥ పిదపనయ్యస్త్రరాజంబు వీరబాహుముఖ్యభూతగణంబుల మ్రొక్కులంది
తూణమునవిల్చె నంతనస్తోకభక్తి వారుశరజన్ము బ్రార్థించి వాసిగనిరి॥ 190

ఉ॥ అప్పుడు కార్తికేయుఁడు దయామతివారినిఁజూచి దైత్యుచే
గొప్పదొసంగుఁబొందితిరి కుందకుఁడంచుఁ బ్రియంబులాడఁగా
జెప్పుటకెక్కుడౌ ముదముజెంది మహాత్మ! భవత్కృపారస
మ్మొప్పినవారి నాపదలువొందునెయంచు వచించిరంతయున్॥ 191

ఉ॥ అంతట శంభునందనమహాద్భుతకార్ముకమౌర్వినాదమ
త్యంతము గర్ణరంధ్రములఁదార్కొన విస్మృతినున్నదానవుల్
శ్రాంతినిలేచి పంతమున సాయకపాళినిగుడ్ప షణ్ముఖుం
డంతయుఁజూచి రౌద్రమున నాశుగముల్ బహుళంబుగప్పినన్॥ 192

ఉ॥ అవి దండఖడ్గవజ్రాశి పరశ్వధ శక్తిముఖ్యంబులౌ సాధనముల
వమినొనరించుచు వనజగర్భేందిరావల్లభ పార్వతీవరులకరణి
వైదికధర్మంబు వర్థిల్లఁజేయుచు దివిజపోషణమును దితిజనిహతిఁ
గావించుచు మనోజ్ఞగస్యదంబున మేఘపటలిఁజించుచు నదీపతుల నిముకు

తే॥ నట్లొనర్చుచు బడబాగ్ని నార్చు చుష్ణ
ఘృణిముఖగ్రహారథముల నణచుచును న
జాండ జాంబూనదాచల జ్మాతలముల
నుగ్రరవములఁ బగులఁజేయుచును మఱియు॥ 193

వ॥ దోషాచర శరీర శిరః కర తురగ స్యందన సేనా మండలంబుల వివిధ ఖండంబులుగా ఖండించుచు వేధోండమునిండుచుఁ బ్రథమావరణంబగు పార్థివాండమును భేదించి యుదకావరణంబునకరిగి తజ్జలంబులఁ గలఁక లొందించుచుఁ దక్కుంగల బ్రహ్మాండప్రవేశంబొనరించి యందలి దుర్మదుల నిర్మథనంబు సేయుచు నొక్కటియగు చాపముక్తశరంబందుఁ గోట్లకొలంది యపరిమిత విశిఖములుద్భూతమై జవాతిశయంబున నలువగ్రుడ్డులటిమి ఖలదైత్యనిషూదనమొనర్చుచుండె సుబ్రహ్మణ్యుప్రభావంబు దెలియ నేరికలవియగు నట్టిసమయంబున బ్రహ్మవిష్ణుమహేంద్రాది సుధాంధులు వెఱచి వడఁకుచు నిటలతట ఘటితాంజలులై యిట్లనిరి॥ 194

స ర్వ త ప్రా స స ర్వ ల ఘు సీ స ము.

సీ॥ కమలభవవినుతపద కమలయుగశుభచరిత
ప్రమథపతివరతనయ విమతనిచయ
దమన భవభయహరణ సుమవిశిఖసమరుచిర
హిమకిరణసదృశముఖ విమలవచన
ద్యుమణిశతరుచిమహిత శమితగురుతరకలుష
హిమకుధరధృతిసహిత సమరనిపుణ
నముచిదితిసుతహరణ ప్రముఖసురచయవరద
యమితబలశిఖితురగ సమవిరహిత

ఆ॥ ప్రమదభరిత కుజనసముదయ నిరసన యమలదివిజలహరి సమరభుగహి
రమణ రజిత ద్రుహిణరమణి సదిభరిపు కమలరుడశి ధవళ దమితసుయశ॥

అ క్క లి ప్రా స సీ స ము

సీ॥ రక్షించుము పరాత్పరా దేవదేవా దయాగుణాకర శంకరాత్మజాత
శిక్షించుము కఠోరశిక్షలద్రిజగముల్ శిక్షించుదుష్టుఁడౌ సింహముఖుని
లక్షించుము కరాళలపనులై దైత్యులు బలుమాఱు మమ్మేచుపాటులెల్ల
వీక్షించుమువినమ్రవృత్తి సంతతమును స్మరియించు మముమహాదరణదృష్టి
తే॥ ననుచుఁ బ్రార్థించువేళ షడాస్యబాణ
హతుల రాక్షసనిచయంబు మృతినిఁగాంచె
నంతసింహాననుఁడు దేటి యాజిఁబడిన
తనబలంబులఁగని యద్భుతంబువడిరొ॥ 196

—♦ సింహవక్త్రుఁడు మూర్ఛఁదెలిసి గుహునితోఁ బోరుట. ♦—

తే॥ అవల సింహముఖుండు మాయామయాంగ
మునుదొఱఁగి పూర్వరూపంబు బూనిమిగుల
పెచ్చుపెరిగినపరిపంథి బృందములను
రోషతామ్రేక్షుఁడై చూచి భీషణముగ॥ 197

ఉ॥ ఆహవదీక్షచే నిజసహస్రకరంబుల నన్నిటఁ ధను
ర్వ్యూహమువట్టి తేజిత శరోత్కరముఁ మితిమీఱివైచి నా
గాహితగర్జసేఁగయ భవాత్మజుఁడుక్కునదానిఁద్రుంచి యు
త్సాహముతోడఁ దద్విశిఖసంఖ్య ప్రయోగముచేసె వెండియుఁ॥ 198

మ॥ దశలక్షప్రదరంబులాశరుఁడు దోర్దర్పంబుతోవైచి దు
ర్దశనొందించెఁదదస్త్రరాజి మఱి దుర్వారాశుగవ్రాతముల్
భృశవేగంబునవైవఁ గందుఁడు విదారించెఁ నిమేషఁ సమి
త్కుశలత్వంబున నంత సింహముఖుఁ డుద్రోకోధోజ్జ్వలన్మూర్తియై॥199

చ॥ దశశతసంఖ్యబాణములఁ దృఢరథచోదకునేసినొంపఁగా
శశిధరసూతి విక్రమమెసంగి నరాదునితేరుగూల్చఁ గ

ర్కారుఁడగు డానవుండలుకఁ గ్రమ్మి యనేకశరంబులేసినం
బ్రశమనమందఁజేసె ధృతిశాయక శక్తిధరుండు వేల్మిడిన్॥ 200

చ॥ మఱియును బార్వతేయుఁ డురుమార్గణముల్ పదినూటిలొక్కటం
బఱపి తదీయఘోరదృఢపాణిశరాస సహస్రముద్ధతిన్
నులు మొనరింప రక్తనయనుండయి మార్తురశూలమేసినన్
నఱకె గణింపఁబోక పదునాలుగుముల్కుల బాహులేయుఁడున్॥ 201

తే॥ అసురుఁడంతటఁ గఠినసాయకము లడర
జేయ నన్నిటిఁదునుమాడె శిఖితురఁగుడు
వెండియు మహోగ్రశరము లఖండముగను
వైచుటయు మాన్పెధృతిని దోషాచరుండు॥ 202

మ॥ మగుడన్ రాక్షసుఁడార్పులుం జెలఁగ దుర్మానంబుతో దండముం
దెగువందాలిచిడాసినన్ గుహుఁడరాతిన్ రోషియై చేతులుం
దెగ నేడమ్ములనేయఁ దున్గియు మఱిన్ దీపించెఁదొల్లింటిరీ
తిగ నంతన్ మహిఁబడ్డసాధనము దైతేయుండు గొంచున్ధృతిన్॥ 203

—♦ శరజన్ముఁడు సింహవక్త్రుని కరశిరంబులు నఱుక నవి మరల మరల మొలుచుట. ♦—

సీ॥ కార్తికేయునిమీఁద గవిసినగనుఁగొని దండంబును సహస్రకాండహతిని
ఖండింపఁబోలదిండి పాశమేసినదాని వేయితూపులువైచి విఱిచెగుహుఁడు
వెండియుదేవారి ద్విసహస్రబాహుల శరజన్ముబట్టుట కురువణింప
నాతండురెండువేలమ్ములఁజేతులునఱుకఁగా నవితొంటితెఱఁగుమొలువ

తే॥ నసురుఁడాగ్రహమున భూరుహములబోలి
వసుధ వ్రాలిన యాత్మీయబాహుదండ
మండలంబునుగైకొని మత్తుఁడగుచుఁ
గడిమిమీఱఁగుమారుపై నడరుటయును॥ 204

వ॥ దిదృక్షు విస్మయావహంబుగా సింహముఖు మస్తకహస్తంబు లొక్కు
మ్మడి విధ్వస్తంబుగావించినఁ బ్రశస్తంబుగా నయ్యంగంబులు బూర్వస్థితి
నొందుట కబ్బురపడి మహాసేనుండు దనమనంబున నక్కుటిలుండు

వటద్వీపమునఘటియించు వీరయాగపటిమంబునకుమెచ్చి నిటలాక్షుఁ డిచ్చిన వరప్రభావమని తలపోయుచున్నయవసరంబున రాత్రించరుం డిట్లనియె॥ 205

తే॥ నీకు మద్ఘనవరము లస్తోకబలము
విక్రమంబును సంపద విస్రసాంత్య
రహితములు గృత్తమయిన సర్వావయవము
లిట్లు పునరుద్భవంబౌట యెట్లుదెలియు॥ 206

క॥ విడువను కారాగృహమునబడి బడలుచునున్న దేవపంక్తుల నిన్నుఁ
విడిచెదఁ గరుణామతి నెక్కుడికయిననుబొమ్మటన్న స్కందుండనియె॥

ఉ॥ ప్రేలకురోరిదుర్మదుఁడ బింకముమాను ముహూర్తమాత్రలోఁ
జాలునునిల్పుమాట లిదిసత్యముసుమ్మనిపల్క రాక్షసుం
డాలము సేసిఘోరముగ నార్భటముల్ పచరించి రెండునౌ
వేలకరంబులన్ వరుస ప్రేఁకపుగొండలుదాల్చియొక్కటన్॥ 208

క॥ వడిఁబూన్చివైవ శరజుఁడు బొడిచేసెను శతశితాస్త్రములచేవానిం
దడయకమఱి వేములుక్కల వెడఁగుం గర్బురుని రొమ్ముప్రేలఁగఁగొట్టెన్॥

శా॥ రక్తాంగుండయి శుక్రశిష్యుఁ డచలవ్రాతంబుల న్వైవ ను
ద్యుక్తుండయ్యెడువేళ వానికరపంక్తుల్ శీర్షముల్ ద్రుంచఁగాఁ
దృక్తంబయ్యుఁ బువర్జనింగనిన దైత్యస్వామిసౌభ్రాత్యుఁ డ
వ్యక్తుండై మునువేయనెత్తిన గిరుల్ వైచెన్ జిగీషస్ఫృహన్॥ 210

॥ కుక్కుటధ్వజుండు నకొండలన్నియు బిండిపిండిచేసి రెండువేలు
నమ్ములడర జేసి యామీఁద రెండువేలడిదములను గరములెడలనడచె॥211

॥ కనుఁగొనఁగాఁదదంగములుగన్పడె దొల్లిటియట్లు నూటిపై
నెనిమిదివారముల్ శరజుఁడీక్రియ వానికరంబులున్ దలల్
దునుమఁగఁ బ్రోవులై పడియె దుర్భర తత్పతనప్రభూత ని
స్వనమున దేవతల్ విపినసత్త్వములున్ బెగడెన్ మనంబులన్॥ 212

—♦ కుమారస్వామి శక్త్యాయుధంబున సింహవక్త్రుని జంపుట. ♦—

సీ॥ ఈత్రోవ రాక్షసుచేతులుదలలును మొలుచుట కాత్మలోపల గుహుండు
బ్రతికార మొనరింపభావించి కరములు రెండు నొక్క శిరంబునుండఁ జేసి
తక్కినహస్తముల్ తలలునుగ్గొనరించి మరలమొల్చెడిబల్మి మాటుపరచి
తలలునుగరములు దఱిగెనబడఁపడి మొలుచునంటివి కాదె మూర్ఖచిత్త
తే॥ యిపుడుమన్నియమంబున నెట్టులున్న
వాఁడవో! చూడుమని సింహవక్త్రుతోడ
మందహాసంబొనర్చుచు మందలింప
నాగ్రహంబున గుహునితో ననియెవాఁడు॥ 213

ఉ॥ బాలిశ! నాకునొక్కతల పాణులు రెండును గల్గియుండినం
జాలదె మద్బలంబు గనుజంటనుజూడుమటంచు నుగ్రుఁడై
శైలమునాంబి కేయుపయి సత్వరనేయఁగ నమ్మహాత్ముఁడుౕ
వాలునుబూనివానిఁ జిఱుబ్రవక్కలు సేసిన దేవవైరియుౕ॥ 214

క॥ పృథుదండము చేఁబూనుచు బృథుకా! కరినాస్త్రతతుల భీషణభంగిౕ
బ్రధనము సేయంజాలియు నధికత నీయందు లేనిదగుటౕ నేనుౕ॥ 215

తే॥ దండతాడితుఁ జేయంగఁదలచినాఁడ ననిప్రయోగింపశరజన్ముఁడద్దురాత్ము
బల్లదంబుల కెంత యోయుల్లముడికికనుల జేగురుఱుచాయపిక్కటిలనపుడు॥

వ॥ అసంఖ్యాతభాస్కరనీకాశంబును సమధికదారుణంబును నగు శక్తిని విడిచిన నద్దివ్యసాధనం బద్దనుజుదండమును బ్రద్దలు సేసి వానిరొమ్ము దూఱి ప్రాణాపహరణంబొనర్చి మంటలెగయ గగనవీధినరిగి మందాకినీ సలిలంబుల నవగాహంబొనర్చి విస్మయంబుగా నంబాకుమారు హస్తంబున వ్రాలెనంత॥ 217

తే॥ దనుజుఁడిలఁగూలి తత్తఱమున నెసంగి
వసుదసృగ్వక్త్రుఁడై యంత్యసమయ వేద
నాభరంబునఁ బొరలుచు నాకులలర
సమరమునఁదన్నుకొనుచుఁ బంచతనుగాంచె॥ 218

మ॥ దివిజుల్ గొసుమవృష్టినించిరి మహాతేజోధికుల్ భూతవీ
రవిజృంభంబులుమీఱ నత్తఱిఁదుషారగ్రావపౌత్రుండు వై
భవమొప్పార సమస్తదేవబలముల్ ప్రార్థించి సేవింపఁగా
జవతం జేరెను హేమకూటనగరస్థానంబు దివ్యప్రభన్॥ 219

ఆ॥ ఇట్లు జేరి దేవపృతనలఁ దమతమ యిండ్లనుండ ముదలయిచ్చిపనిచి
యంతిపురముసొచ్చియాంబికేయుడుభద్రపీఠమునవసించెప్రియముచెలగి॥

— శూరపద్ముఁడు సింహవక్త్రుని మరణమునకు దుఃఖించి యన్య బ్రహ్మాండములనున్న రాక్షసులను బిలిపించుట. —

ఉ॥ అంతట శూరపద్ముఁడు రణాంగణమందున దమ్ముఁడీల్గువృ
త్తాంతము వేగరుల్ దెలుపఁ దల్లడమందుచు నేలవ్రాలి యు
త్యంతముదుఃఖమొంది కమలాక్షముఖత్రిదశాళి మత్పురా
భ్యంతరకృత్యముల్ వదలి స్వస్థత సౌఖ్యముగాంచిరేకదా॥ 221

మ॥ అనుఁగుందమ్ముఁడ! ముమ్మరంబయిన యాయాసంబుతోనీవుగూ
లిన నాకెయ్యెదిదిక్కటంచుఁ గడుజాలింబొంది యంతన్ మనం
బున ధైర్యంబువహించి యాగ్రహముపెంపుంజెంది నిట్టూర్చుచుం
దనకొల్వున్ దఱియంగ నేగి మణిభద్రప్రస్ఫురత్పీఠిపై॥ 222

చ॥ తనరఁగనెక్కి యోఁదలఁచెఁ దమ్ముఁడుసింహముఖుండు వోయినం
తనె కొఱయేమియుంగలదె నన్నను సింహముఖున్ దురంబులోఁ
దునిఁగినపోఁకుమూఁకలను ద్రోయఁగఁజాలిన సత్త్వశాలులౌ
దనుజు లజాండపంక్తుల నుదగ్రతనుండరె తండతండముల్॥ 223

క॥ వారలఁ బరివారంబులతో రానొనరించి వారితోఁగూడి సమి
ద్దారుణికేజని బాలుని మారణముం జేసి పురికిమరలెద ననుచున్॥ 224

ఆ॥ ప్రతినవట్టి వసదుప్రభుతకులోనైన వేయునెన్నిదయిన తోయజాస
నాండములనుగల్గు నసురులఁబిలువ వేగరులనంప వారు కదలిపోయి॥ 225

వ॥ శూరపద్మునాహ్వానంబు వినిపించిన సంతసించి తత్తద్బ్రహ్మాండవాసు
లయిన రాక్షసులు మున్ను మహేశ్వర పదంబువలన నమరాసురమర్త్యం

బగుభాతి మహాదేవ జటాతటంబువలన ననిమిషనదీప్రవాహాంబుకరణి బ్రహ్మాండ భాండనిర్భేదనంబుగావించుచు దదీయసుషిరవర్త్మంబులవెలు వడి మహాభయంకరులు స్వసంహననతిమిరచ్ఛన్న మార్తాండఘృణులునై యధికజవంబునఁ జరణోద్ధూతపాంసుపటలంబుల నుదన్వంబులశోషింపఁ జేయుచుఁ బాదప్రఘట్టిత విశ్వంభరాంబర బలిసద్మలయి యేతేర హిరణ్యగర్భాద్యనిమిషులు భయంబునఁ దొలఁగిచన ననువుపడక శ్రమనొందిరిక్రమంబున॥ 226

తే॥ అఖిలదనుజులు నేతెంచినట్టివార్తవిని మహాహ్లాదమునశూరదనుజవిభుఁడు గొలువుసాలించివేగలోపలికిబోయి ప్రియముతోడుతమజ్జనక్రియఘటించి॥

—♦ శూ ర ప ద్మ ని యు ద్ధ ప్ర యా ణ ము. ♦—

వ॥ భస్మత్రిపుండ్రాంకితదేహుఁడై రుద్రాక్షమాలాలంకృతుండగుచు సౌగంధ్యబంధురశ్రీగంధంబలంది మృష్టాన్నకలనఁదుష్టినొంది నూత్నాంశుకములుగట్టి మనోహరామోదభరిత కుసుమమాల్యంబులు శిరంబునఁదిరముకొలిపి నానావిధరత్నమండల మండితమండనములుగై సేసి జగత్సంహారకారణసమర్థంబగు పాశుపతాస్త్రంబును బ్రహ్మశాండప్రముఖ నిఖిల మహనీయశస్త్రంబులును వలయునితరాయుధంబులును సంభృతముసేసి కోటిసహస్రసంఖ్యగల గుప్తరథములు దోనడువ సింహవాహనమునధిష్ఠించి భండనంబునకు గదలునప్పుడు॥ 228

సీ॥ సప్తిభూతమృగేంద్ర సాహస్రసహితంబు బంచాననధ్వజ భాసురంబు
మానసపవమాన మహితవేగంబును జ్వలితతేజశ్చక్ర సన్నిభంబు
వీరయాగోద్భవవిలసితంబును గల్పవేళావినాశన విరహితంబు
సకలశాతాయుధసంభరితంబును సురుచిమాణిక్యసంశోభితంబు

తే॥ మఱియు నిజతీవ్రతర యానమాత్ర గోత్ర
శైలపంక్తికిఁజలనంబు జండఘృణికి
శైత్యమును బాడబమునకు శమమునిచ్చు
నట్టిరథమొండు సమ్ముఖమందు నిలుప॥ 229

శా॥ ఆదివ్యద్రథమెక్కి హృద్యమగు తూర్యారావముల్ మ్రోయ వృ
ద్ధాదిప్రాజ్ఞులుదీవనంబులిడఁ బౌరాళుల్ పురీవీధులం
దౌదార్యంబునఁబూలుజల్లఁ గనకాహార్యస్థనీలాద్రినా
దేదీప్యంబుగనొప్పి శత్రువుల మర్దించుప్రయత్నంబుతోన్॥ 230

చ॥ కదలి జయాంకచిహ్నము లగణ్యమువర్తిల దానవార్భటుల్
పొదలఁ బురంబువాసి రథముల్వడిఁదోలుమటంచు సూతులం
బదరుచు శూరపద్ముఁడు సపారధృతింజతురంగవాహినుల్
ముదమునగొల్వవచ్చి రణభూమిసమీపమునొందె నత్తఱిన్॥ 231

తే॥ కొందఱాశరు లాహేమకూటపురిని వీఁకనరికట్టి బెట్టుగా గేకలిడఁగఁ
ద్రిదశగణములు భీతివిస్మృతినిగనిరి వీరభూతగణంబును విహ్వలించె॥ 232

చ॥ అపుడుచతుర్ముఖుండు గిరిజాత్మజుజేరి నమస్కరించి తో
రపుభయభక్తులుప్పతిల రాక్షసరాజుప్రచండుఁడై సమి
ద్విపులకువచ్చుటందెలిపి వేగమెవానివధించి మమ్ములం
గృపఁగనుమన్న వల్లెయని కేకిహయుండు సముత్సుకంబునన్॥ 233

—♦ కుమారస్వామి శూరపద్మునిమీఁద యుద్ధమునకు వెడలుట ♦—

క॥ మారుతుఁగని చెచ్చెర నాతేరాయత్తంబుసేసితెమ్మన నతఁడున్
భూరిముదంబునఁగొనిరానారోహణుఁడయ్యేదానియందునగుహుఁడున్॥

వ॥ ఇట్లుశరజన్ముండు రథారోహణంబుసేసి యుద్ధసన్నద్ధుఁడై వజ్రగదాఖడ్గ
కుఠారఖేటశూలశక్తిముసల చక్రదండతోమర భిండివాలశర కోదండాది
వివిధసాధనోపేతుండయి సుధాశనప్రకరంబు వినుతిపూర్వకముగా మం
దారప్రసూనవృష్టి నర్పించుచుండ ననర్గళభంగి పంగరంబునకువెడలె
నప్పుడు॥ 235

చ॥ అమితపరాక్రమంబుమెఱయంగ నవాధికలక్షవీరసం
ఘములు రథంబులెక్కి వడిగానడువన్ ద్విసహస్రవాహినుల్
క్రమమున భూతసైన్యము: లక్షర్వబలుల్ దదధీశులెల్ల మో
దమునభజింపఁ గల్పజలదధ్వనిమీఱెను దూర్యఘోషముల్॥ 236

క॥ కెలఁకుల ముత్తెపుగొడుగులు జలజాప్తునినీడమాప జయవాదములం
బలుమాఱువందిగణములుసలలితముగఁబొగడుచుండఁజనియెడునపుడున్॥

క॥ భూతబలంబులు దనుజవ్రాతంబులఁజూచి యబ్బురంపడి మిగులం
జేతోవీధినలంగిరి యాతతబల శౌర్యధుర్యులయ్యును వెఱతోన్॥ 238

—♦ అవ్యాజాండదైత్యులఁజూచి వీరభూతగణములు దమలో భాషించుట. ♦—

వ॥ తమలోఁదామిట్లని సంభాషించిరి॥ 239

సీ॥ అసురనాథుని సేన లష్టోత్తరసహస్ర విధ్యండవాసులు వీరలెల్ల
బహుళశిరఃకరపదులుమహామాయికులు నొక్కఁడొకఁడుభ్రమింగునుజగంబు
లధికబలాఢ్యులు నబ్జజాండచ్ఛిన్న మొనరింపదక్షులు నవలనేత్రు
లర్ణవోపమవక్త్రు లర్కేందునక్షత్ర మార్గానుగతశిరుల్ మదసహితులు

ఆ॥ భానుకోప సింహవక్త్రాగ్నిముఖ తారకాది దనుజసములు నధికతరులు
సుందుఁడునుమధుఁడుపసుందుఁడు మహిషజలంధరాద్యసురులచందమునను

క॥ భువనేశవజ్రిదిగ్గవ వివిధాస్త్రవ్రాతంబుసేసి వెలసినవారల్
వివరించిలెక్కపెట్టుట కవశంబగుగోట్లసంఖ్య లమరిరివీరల్॥ 241

మ॥ ఒకబ్రహ్మాండమునందునున్నకవిశిష్యుల్ గూడుటన్లోకముల్
వికలంబయ్యెను యిప్పుడిప్పగిదిగా వేధోండసంఘుంబునం
దకలంకస్థితినున్నదానవులు గుంపైయున్న జీవించుచెం
ట్లొక్కొ యద్దైత్యులలోననొక్కరుఁడెగెల్చున్ బ్రహ్మవిష్ణ్వాదులన్॥ 242

క॥ ఇఁక నిద్దఱయిన నతిశయ మకటా! యిందఱజయింపనలవియె వీరుల్
బ్రకటులొకలక్ష వీరలనికటంబుననిల్చి గెలువనేర్చునెయనిలోన్॥ 243

చ॥ మనమననెంతవారముసుమా! చతురంగబలంబులైన మా
ర్కొనకతొలంగు వీరులువరూధినినాథులు గాలిదూలెడుం
దృణములభంగి వీరభుజుతేరుసు బ్రాపుగజేసికొంచు నొ
య్యనఁజెరలాడఁజొచ్చిరిఁక నాతఁడుగెల్చుటరిత్తతోఁచెడిన్॥ 244

తే॥ నిఖిలదానవసందోహనిధనుఁడైన నీలకంఠతురంగుఁడు నిలుచుఁగాక
తొలఁగిపోవుదమనియెంచిపలలభోక్తరహితమగుకోటుకానంగరామినపుడు

క॥ భుజబలముకొలఁదిబెనఁగుచుఁద్యజియింతముతనువులిదియొదగుపనిమనకుఁ
నిజమని భూతసుపర్వ వ్రజములు సమకట్టిరాహవంబొనరింపఁ॥ 246

మ॥ బలదర్పంబుల లక్షవీరులు జమూభర్తల్ రణంబందు ముం
గలయైపోరుచునున్నయప్పుడు దివౌకస్స్వామిముఖ్యామరుల్
నలినాక్షుంగని క్రొంచభేది దితిభూనాశంబుగావింపకఁ
దొలంగించెఁబహునాళ్లుమిన్నక యరాతుల్ మీఱిరత్యుద్ధతిఁ॥ 247

శా॥ శూరుండెప్పుడుజచ్చు దేవతలు నస్తోకప్రమోదావహ
స్వైరోద్వర్తనులెప్పుడయ్యెదరు మత్స్వాంతప్రవర్తివ్యధా
భారంబెన్నఁడుడిందు స్వస్థలములంబ్రాపించుటేనాఁటికో
యౌరా! మాకిటు ప్రాణముండువఱకుఁ బ్రాప్తించదేమో! హరీ॥

వ॥ అనిదైన్యంబునఁబలికిన శతమన్యునకుఁ బాంచజన్యధరుండిట్లనియె॥ 249

—♦ విష్ణుండింద్రునకు సుబ్రహ్మణ్య మహిమముదెల్పుట ♦—

సీ॥ సురనాధ! ప్రత్యక్షపరశివుఁడును మాకు
గర్తయు భర్త సుఖప్రదుండు
నగు నీఘనుం డాఱుమొగములరూపుతో
సురలబ్రోచుటకునై యరుగుదెంచె
మునుపు లీలామాత్రమున సర్వలోకముల్
బ్రహ్మాండములు బెక్కుమహిమనితఁడు
దనరోమకూపంబులను జూపుటెఱుఁగరే!
పంచకృత్యపరుండు బావనుండు

తే॥ నఖిలశాస్త్రవసంహారుఁడైన నితని
కమరపరిపంధి హరణకార్యంబదెంత
సర్వవేదోఁడపతియగు శరజుమహిమ
తెలియకను బాలుఁడనిమీరు దలఁపఁదగునె॥ 250

మ॥ మనయందేరి తపోమహత్వముననో మారారి యీశవ్యమౌ
తనువుందాలిచివచ్చెనంచెఱుఁగనౌ తథ్యంబుగా నేవిధం

బునసైనఁ దృణమాత్రలోఁ బలలభుక్పుంజంబులంగూల్చు నీ
తనిసత్త్వంబుగనంగలేరెవరు సిద్ధంబింతయుఁ వాసవా॥ 251

ఉ॥ ఆయుధపాళిచాల్చి ప్రళయార్కునిపోలిక భూతసేనలుం
బాయక వెంబడింగొలువ భండనభూమినిఁజొచ్చెనింక దై
తేయయుతంబు శూరునివధించుటనిక్కము నమ్ముమంచు నా
రాయణుఁడంతయుందెలుప హర్షముబొంది నిలింపనాధుఁడుఁ॥ 252

మ॥ శరజన్ముంగొనియాడుచుఁ సరసిజాక్షుబ్రహ్మముఖ్యామరో
త్కరయుక్తంబు విశాఖుఁజేరఁజన నాతండంతరంగంబునఁ
బరితోషంపడె నిట్టులొండొరులు శుంభత్ప్రౌఢితోఁగూడి సం
గరముంజేరిరి వీరబాహుఁడు బురోగామిత్వముఁ బూనఁగఁ॥ 253

ఆ॥ అపుడు భూతసేన కసురవాహినులకు శైలభూరుహాశ్మ సాధనముల
నద్భుతంపుగయ్యమయ్యెనందున వీర సైనికాధినాధ సహితముగను॥254

క॥ భూతప్రకరంబులు బరిభూతములై తనమఱుంగు బొందుటయును వి
ఖ్యాతుండు వీరబాహుండాతతశరపాళి దనుజహతమొనరించెఁ॥ 255

చ॥ అలబలవన్నిశాచర మహాహవమందుఁ బరాజితుండునై
యలయుచు వీరబాహుఁడు బురాంతకసూతి పిఱుందజేరినం
బెలుచ సురారివీరు లరిభీకరు షణ్ముఖుజుట్టి బాలుఁడై
యలరెదు నీతనింగెలుచు టబ్బురమేయని విక్రమంబునఁ॥ 256

ఆ॥ బహుళశస్త్రశూల పరశుచక్రాద్యాయు ధములుబఱపి గర్జనములొనర్ప
దేవదేవుఁడైన భావజారిసుతుండు మేరమీఱినట్టి యీరసమున॥ 257

—♦ కుమారస్వామిరాక్షససేనమీఁదిగవిసినుఱుమాడుట ♦—

ఆ॥ చాపమునను మౌర్వీసంధించి సంవర్తకాల వారివాహ గర్జదెగడ
మ్రోయఁజేయసోఁకుమూఁకలుదద్రవ శ్రవణమాత్రవెఱచి వివశులయిరి॥

క॥ పదఁపడి నానానిశిత ప్రదరాహతి వజ్రిగిరులభాతి నమేయ
స్యదమున దక్కగకంధర పదాద్యవయవముల వెల్ల భగ్నముసేసెఁ॥ 259

సీ॥ వెండియునమ్మహా విజయప్రతాపుని చాపనిర్ముక్తమౌ రోపవితతి
వారణవ్రజదంత హాలకంధరహస్తములను హయవ్రాత మూర్ధచరణ
వాలమూలంబుల ధ్వజచక్రరథదండ మాణిక్యభూషణ మకుటఛత్ర
చామరభంగంబు సల్పుచునచ్చోట నిలువక యెల్లదిక్కులఁజరించి
తే॥ దివినిగమనించి వైకుంఠదివిజలోక సత్యలోకంబులందున జన్నిగట్టు
గుడ్డులందచ్చటచ్చటఁగూడియుండురక్కసులబిల్కుమాఱ్చుచునుక్కుమీఱ॥
తే॥ మరలభీషంబుగా దైత్యమర్దనుండు
రాహుతలద్రుంచుకైవడి రాక్షసాళి
తలలఁదఱుఁగుచు బాఱినఁదఱిమితఱిమి
పదమదముసేసె నెఱసి యాసమయమందు॥ 261

వ॥ నారాయణ వాణీనాథాది సుపర్వాణులును వీరసేనానేతలును బ్రథమ
సమాగతానేకమాంసాశనసంఖ్యలో హింసభాల్పడిశేషించిన మొత్తము
మిక్కిలి తక్కువయగుటకానిందించి బహువిధంబుల గుహుని మహా
త్ముఁడని పొగడుచుండిరయ్యెడ నపరిమితదైతేయులు మృతింగనుటఁ
బుడమి తమకవకాశంబగుడు దక్షిణంబున నన్యబ్రహ్మాండస్థిత కర్బురుల
సంఖ్యాకులేతేరఁ బూర్వదేవతలు యథావిధినొంది యెల్లెడలఁ బూర్ణిభ
వించిగర్వాతిశయంబున॥ 262

చ॥ మునుకదనోర్విపైఁబడిన మొండెములుం బొలతున్కప్రోవు మూ
ర్ఛనెనసి ధాత్రిగూలిన నిశాచరులంబడఁద్రొక్కుచుజ్ జయ
ధ్వనులొనరించుచుజ్ దనుజవల్లభుతో హిమశైలపౌత్రునిజ్
దునిమెదమంచుబల్కుచును దుర్ధరులైచని కాంచిరాగుహుజ్॥ 263

చ॥ కనుఁగొని యొక్కబాలకుఁడఖండబలంబున దైత్యవర్గముం
దునిమె నిభంబులశ్వములు దోఁచవుచూడ్కికిఁ జిత్రమంచు నె
మ్మనమునవెంచుచుజ్ ధృతిసమగ్రత షణ్ముఖు నిగ్రహించుచుజ్
ఘనభుజదర్పమొప్ప రణకార్యమొనర్చిరి సంకులంబుగాజ్॥ 264

క॥ అప్పుడు భూతబలంబులు దప్పినధృతి మిగులజింతదాల్చుట గుహుఁడుఁ
దప్పకనుజూచి చిఱునగవొప్పుచుఁ బవమానుతో దృఢోక్తులననియెఁ॥

శా॥ తేరుఁ మిన్నున దిక్కులందు వెనుకఁ దీవ్రంబ పార్శ్వంబులం
దారూఢిఁ నడిపింపుమన్న నతఁడత్యంత స్యదస్ఫూర్తిమై
ధారుణ్యాంబరచక్రవాళగిరిసప్త ప్రోదినీనాథ ది
గ్వారద్వీపములం దటిత్ప్రభలెసంగఁ దోలుచున్నంతటఁ॥ 266

చ॥ అటనటనున్న దైత్యనివహంబులు దేజితశస్త్రఘాతలం
త్రుటితముసేయ నేలపయిఁద్రుంగిన పీనుఁగుపిండు నల్గఁగాఁ
బటుతరభంగిద్రొక్కుచు నపారముబోరుచునుండునప్డు ధూ
ర్జటిసుతుఁడద్దురాత్మకుల జంపెను గుట్టలుగుట్టలై పడఁ॥ 268

తే॥ అపుడు దనుజులు బోరున నాజిబడఁగ
భారమెక్కువయై భూమిభయమునొంది
తిరిగెదిర్దిరఁ గుర్కుర కరట ఫేరు
కంకగృధ్రంబు నాహారకాంక్ష మసలె॥ 268

చ॥ సితకర చండభానుల గ్రసించు విధుంతుదుబోలి ఖేటకీ
లితకరభీషణంబయిన లేఖవిపక్ష కబంధపంక్తి యా
తతముగమింటికిన్నెగసె దత్సమయంబున స్కందచాప ము
క్తతఁగనుశస్త్రపాళి బలగర్వనిశాచరమాయ దూల్చుచుఁ॥ 269

తే॥ కమలజాండంబు నిండెదుకాలమందు గాడ్పునడపెడు నరదమఖర్వజవత
మీటినల్దిశలఁ బరిభ్రమించుచున్న గాంచివిస్మయమందె లేఖవ్రజంబు॥270

వ॥ ఇట్లు కుమారుండు రాక్షసక్షయంబుగావింపఁ దదీయక్షతజ ప్రవాహంబు
లిలనెల్లచోటులం బ్రవహించి రసాతలాది లోకవ్యాపనంబయ్యె ఘోరక
బంధంబులువర్తించె నంతట నన్యాజాండనివాసులయిన రాత్రించరుల
గణ్యంబుగా నరుదేర శరజుండువారలహరించి మరలమరలఁ గ్రుద్ధులయి
యుద్ధస్పర్ధనేతెంచు రక్కసులఁజక్కాడ నశక్యంబై విశాఖుండు భయం

కరనారాచంబుల బ్రింహ్మాండద్వార నిరోధంబు సేయఁ దదాగతక్రియ
నివర్తించెనప్పుడు॥ 271

చ॥ శరజునిబాణజాలములజచ్చిన రాక్షసకోటిగాత్రముల్
ధరములభంగి సాంద్రముగ ధారుణినింగియునిండెఁ దత్క్షణే
బరరుధిరంబు సింధుక్రియఁజాఱె గుహుండటుమీఁదఁగోపియై
సరగున సైన్యపద్దహనచక్షులఁజూడఁగఁ దత్క్షణంబునన్॥ 272

ఉ॥ ఆకుణపాద్రులున్ భసితమయ్యెఁ బదంపడి విష్ణుఁడాదియౌ
నాకులు శంభునందన మహామహిమంబున కాత్మహృష్టులై
యాక్రియ దుర్మదాసురుల హింసయొనర్చిన తారకారికిన్
లోకువగాదె శూరుననిలోవధియించెదునట్టికర్జమున్॥ 273

క॥ అనివినుతించుచునున్నం గనుఁగొనిశూరుఁడు గనలుగడలుకొన షడా
స్యునకభిముఖముగ దనరథమునుదోలి కఠోరవచనముల నిట్లనియెన్॥

—♦ శూరపద్మఁడు గుహుని తిరస్కరించి పలుకుట. ♦—

క॥ ఆ కాశశిఖునివరమున నాకున్మృతికలుఁగఁబోదు ననుమాఱ్కొనఁగా
లేక నినుఁబొగడినంతనె నాకులవాక్యములకుబ్బి నాపైనిపుడున్॥ 275

తే॥ కారణములేనిపగబూని కదనమునకు బాల్యచాపల్యమునవచ్చిపలలభోక్త
సంఘములఁగూల్చితమరపక్షంబుదాల్చి యింకనీవెందుజొచ్చిన నేనువిడువ॥

చ॥ నిలువుమటంచు భీమగతినింబలుకన్ శిఖివాహుఁడిట్లనున్
ఖలుఁడవు దుర్మదాంధుఁడవు గష్టుఁడవౌనినుఁ బాటిసేసి మా
టలఁజరుపంగరాదిదె దృఢంబగుమచ్ఛరకోటి నిన్ను ని
క్కలనున బ్రాణముల్గొనును గన్గొనుమింక మదీయశౌర్యమున్॥ 277

చ॥ అనునెడ శూరపద్మఁడు రయంబునవిల్గొని నారిదీడి యీ
సున శరవృష్టి భూతబలశుష్మముమాన్పఁగడంగ వారలున్
ఘనతరబాణజాలములఁగప్పిన శూరుఁడు వానినన్నిఁటిం
దునుముచు వీరసైన్యములదూల్చెను గర్కశమార్గణావళిన్॥ 278

సీ॥ ఇట్లు భంగి దనుజేశుఁడిషువృష్టిముంచిన భూతవీరవ్రాతములు వెఱపునఁ
గొందఱుబాఱిరి కొందఱువిస్మృతినొందిరి కొందఱుమ్రందిరపుడు
వీరబాహుండాది శూరులుబలమున బటుతర కాండముల్ బఱపుటయును
సరభసంబునవానియురముదాఁకినయంత మొక్కబోవుటచూచిరక్కసిదొర

ఆ॥ వాఁడిముఖుకుగమిని వడిమీఱి యవ్వీరవరులరథశరాసశర విపాట
నంబుజేసి మస్తకంబు చేతులుఱొమ్ము దఱుఁగ వారు రక్తధారఁదోగి॥

మ॥ అనిలో వెల్వెలబాఱినిల్వక గతాహంకారులై విచ్చినన్
ఘనశూరుండగువీరబాహుఁడు గనత్ఖడ్గంబుచేఁబూని త
ద్దనువుందేరుసుగూల్ప శూరదనుజాధ్యక్షుఁడు ఘోరాకృతిం
దనసామీప్యమునొందు వీరభుజు దోర్దర్పంబుసైరింపకన్॥ 280

మ॥ శయఘాతంబొనరింపఁగానతఁడు మూర్ఛన్వ్రాలినంజూచి దు
ర్నయుఁడై యంఘ్రులబట్టిత్రిప్పి నిజమెన్నన్ దూతవీవాటచే
లయమొందింపఁగరాదటంచు నవలీలన్ మింటికిన్వైవ దు
ర్జయుఁడవ్వీరభుజుండు దేటి గుహుపజ్జంజేరె దవ్వేగియున్॥ 281

వ॥ అయ్యవసరంబున శూరపద్ముఁడుచ్ఛ్రితంబును గ్రౌంచాచలతుల్యంబు నగు కార్ముకపాణియై ప్రతిపక్షసాధ్వస ప్రదంబుగా గుణంబలవరించి యాకర్ణాంతముదివిచి మొరయించిన దివిజసంరక్షణవ్రతుండగు నాంబికేయుండు రత్నసానుసారంబై చతుర్ముఖ చతుర్భుజ ప్రళయసమయంబుల నేధమానంబగు మహారజతగ్రావసదృశ కోదండంబుగొని యల్లియ నెక్కిడి యశేషప్రాణిసముదయంబులు బధిరత్వ్యులై గర్జించునట్లు గుణష్టంకరణముసేయుటయుఁ దన్నాదంబాలించి శూరుండు దురాగ్రహంబున॥ 282

## —♦ కు మా ర స్వా మి శూ ర ప ద్ము ల యు ద్ధ ము. ♦—

సీ॥ శతముసహస్రంబు శతసహస్రము సహస్రసహస్రకోటులసంఖ్యలొప్పు
విశిఖముల్వైవఁ దద్విశిఖజాలము సర్వజగములనిండి ప్రచండదహన

విలయసత్వర కృత్యములవహ్ని సమవర్తి యనిలులమించి బ్రహ్మాండమవియఁ
బ్రవహించు గరళశైవలినీప్రవాహంబుపోలికఁ జెన్నొందు నీలలోహి
తే॥ తంబులై మేరుముఖపర్వతములదూలఁజేయఁజాలుచురాఁగ జేజేలువెఱచి
పద్మనాభునిగన్గొని బ్రతుకగల్గుతావుజూపుముమాకంచుఁ దలిమిఁయడుగ॥
చ॥ తగినసదుత్తరంబు సుమధన్విగురుండు వచించునంతలో
గగనశిఖాత్మజుండు సురకష్టహృతంబుగ విక్రమించి తా
నగణితఘోరకాండముల నంతమొనర్చిన దివ్యులాత్మలన్
మిగులముదంబునొందిరి యమేయబలుండగు స్కందునెన్నుచున్॥ 284
తే॥ అపుడుభీషణుఁడైనశూరాసురుండుఘోరనారాచములునూఱ్లకోలదిగప్ప
వానిమడియించిమితిలేనివాడితూపులడరఁజేయంగనసురుండుహతముసేసె
క॥ శిఖితురఁగుఁడేడుమూఱులు బ్రఖరాంబకముల్ నిగుడ్చ రాక్షసుఁడంతన్
శిఖక్రియమండుచు భీమవిశిఖములుబరగించి వాని జిద్రుపలుసేసెన్॥ 286
సీ॥ మఱియునుద్వీసహస్రమార్గణంబులువైవ గుహుఁడవియన్నింటిఁగూలనేసి
విక్రమంబున రెండువేలుతూపుల దైత్యు నింప నాతఁడు వానినీలునేసి
కాశ్యపిశేషుతోఁ గంపించునట్లుగా హర్యక్షునాదంబు నాచరించి
యమితకోటిశరంబు లడరించుటయు శరజన్ముఁడత్యూర్జితశక్తిమెఱసి
తే॥ తచ్ఛరంబులదునుమాడెఁదలపనిట్టు లుభయులునునిజసైన్యంబులభినుతింప
విజయతర్షమనీషులై వివిధగతుల ఖండనక్రీడ గావించుచుండునపుడు॥
వ॥ పరస్పరాశుగఘట్టనంబునఁబుట్టు దహనంబు సరభసంబున నభముముట్టి
యందలిగంగాసలిలంబుల నింకించె మృత్యుంజయాపత్య దైత్యుల శౌర్య
ధైర్యంబులీక్షించి వీరలక్ష్మి యాశ్చర్యంబున నిందెవ్వనివరంతుననితదంశి
కంబున నిల్చియుండెనప్పుడు॥ 288
శా॥ శూరుండీశ్వరనందనధ్వజము రోషుండై ధరంగూల్చి సిం
హారావంబొనరించి పెక్కులగు దివ్యాస్త్రంబులన్వైవఁగా
ధీరుండై గుహుఁడక్కలంబముల శక్తిన్మాపి దివ్యోత్కరం
బౌరాయంచునుతింప సప్తవిశిఖవ్యాఘాతఁజిత్రంబుగన్॥ 289

తే॥ అసురు గేతనమబ్ధిలోనడఁగవైవ భానుకంపాఖ్యుఁడగుభూతపతి యొకండు
దనమొగమ్ములవేయిన్నదనుజులదరళంఖసాహస్రకమునొక్కసమయమునను

సీ॥ అఖిలనాదంబుల నడఁగఁద్రొక్కెడునట్లు బూరించుటయుదదీయారవంబు
బహుయుగంబులువినంబడియెదద్రవమునబ్రహ్మాండకుడ్యంబుపటిలయెయ్యె
బద్ధాత్ముఁడప్పుడు పాంచజన్యంబొత్తియానతిచ్చుటయువైశ్వానరుండు
గాలజ్ఞరూపంబు గైకొనికేతనంబైనిల్చి ప్రళయకాలాభ్రమట్లు

తే॥ గర్జలొనరింప నింతయుగాంచి భార్గవీప్రియుండబ్జుండాది విబుధవరులు
ఘనముదంబునగలకలధ్వనులొనర్చిరపుడుదుష్టాత్ముఁడగుశూరుఁడాలకించి॥

క॥ అవురా! మత్కృషికార్యప్రవర్తకులగువీరు మత్పురస్తాద్భూమిన్
నివసించి నిర్భయంబున వివిధజయధ్వనులు సేసి వెలసిరికడఁకన్॥ 292

ఆ॥ మొదలవీరిఁద్రుంచి పిదపబాలునిగూల్తుననుచుఁ బౌరుషోక్తులాడి రథము
తోడమింటికెగసి వాఁడియమ్ములసోనమునుఁగఁజేసె వేల్పుమూఁకనంత

శా॥ సర్వాత్ముండతిధార్మికుండునగు నాస్కందుండు దత్కాండముల్
నిర్వీర్యంబొనరించి దేవవరులన్ నిర్భీతులంజేసి దూ
రోర్వీన్వారలనిల్పి యంత రథసంయుక్తంబుగా మింటికిన్
దుర్వారత్వరతోడుతన్నెగయ దైత్యుండాత్మఁగ్రోధించుచున్॥ 294

వ॥ సుమనఃకాండంబులస్మదీయాశుగంబులఁ గాసిల్లిరిబ్బాలకుండొక్కరుండు
శేషించియున్నవాఁడు వియత్పథంబున మద్బలంబతివేలంబుగానఁ బెనం
గెదనని శూరుండంబకవర్షంబునించిన సేనాని తత్ప్రహరణనిర్మూలంబు
గావించె నీక్రియ నయ్యిరువురళతాంగంబులంబరంబున జ్యోతిశ్చక్రంబుల
వడువున సుదర్శనాయుధంబులభాతిఁ గులాలచక్రంబులవిధంబున వియ
చ్చరులచ్చెరువడ మేరమీఱిపరిభ్రమించె వెండియుఁ దద్రథంబులు మనోజ
వంబున బ్రహ్మాండంబులం దంతటందిరుగుసమయంబున॥ 295

శా॥ సర్వప్రాణులుసంచలించిరి ధరాచక్రంబు నీశానతూ
ణోర్వీధ్రంబులు పేవడంకె భువనవ్యూహంబుగాసిన్గనెన్

గీర్వామారమణాండమెల్లనవినెఱ గ్రిందంబడెందారకల్
పూర్వామర్త్యవిభుండు నప్పుడనలుంబోలెఱ జ్వలన్నేత్రుఁడై॥ 296

మ॥ నిశితాస్త్రంబులనేకముల్ పఱపుచుఱ నిస్త్రింశవజ్రాంకుగాం
కుశ నారాచగదాదిసాధనము లక్షుద్రంబువై వంగ వా
యుశరంబుఱ గుహుఁడేసి వానివిశిఖవ్యూహంబుమర్దించియున్
భృశశక్తిన్ మఱిఁ దద్రథాశ్వములజంపెన్ సప్తసంఖ్యాద్వయిన్॥ 297

క॥ దోషాచరుఁడిలఁ వాలుచు భీషణకార్ముకముఁదాల్చి పృథుతరశౌర్యా
శ్లేషణుఁడై శరరాజి విశేషమునసంధింపమాన్పి శివసూతిమఱిఁ॥ 298

సీ॥ భూరిమార్గణములఁ బొదువుచు నద్దైత్యు దోర్యుగంబున వేయిదొడ్డతూపు
లడరించుటయు నవియద్రిశృంగములపై గురియువర్ష మురీతినురుతరాశ్మ
సత్త్వపూర్ణములౌ భుజములునాటఁగలేక పదునుడింది ధరిత్రిబడియెనంత
దేవాహితుండాత్మలో వహ్నిపోల్కిని మండుచు గుహునిబంగ్రెండుచేతు

ఆ॥ లిరువేల ముల్కులేయ నబ్బాణముల్ దవిలిచూర్ణమగుచు ధరణిఁ వ్రాలె
దానిఁజూచి దైత్యధవుఁడమర్షంబున వీరభూతసైన్యవిభులమీఁద॥ 299

వ॥ కవిసి యపరిమితశరంబులేసిన సుబ్రహ్మణ్యుండు వానిందునుముచు సహ
స్రాంబకముల నద్దురాత్మకుని శరాసనంబునఱికిన నతండునొండువిల్గొని
లెక్కడరాని బెడిదంపుటడిదంబులడరించుచు శాంబరినిగైకొని మంట
లుమియుచు మింటికింబాఱి మరల మంటికిందిగినఁ గార్తికేయుండు
వెన్నంటిరా వాఁడధోలోక యాదోనాథ చక్రవాళ రత్నసానువైకుంఠ
దిగ్గమణాది భువనంబులకుఁబోవ గుహుండు దత్తత్స్థలంబులకరిగి శర
ప్రయోగముచేనాజిసేయ రాక్షసుండు బ్రహ్మాండభిత్తులఁ బ్రాపుసేసికొని
బాణవర్షంబుగురిసిన హరసుతుండచ్చోటికేగి చటులాస్త్రంబులవాని

—♦ శూరపద్మండింద్రలోకరథము నెక్కి కుమారస్వామితోఁబోరుట. ♦—

శతాంగంబు హతంబుజేసినఁ దత్క్షణంబున శూరపద్ముండింద్రలోక రథం
బునుదలంచుటయు నది సత్వరంబునఁ బొడసూప నధిరోహించి మున్ను

ఖాహులేయుం డాశుగవిసరంబుల నన్యవేధోండ్ర యాతుధానమండల నిర్గమన నిరోధంబుగా దద్ద్వారంబాక్రమించుటతెలిపి యసురుండు సాయకపరంపరల దానినుడిగింప నందుండెడిరక్కసులుక్కుమీటి కోలాహలధ్వనులును భుజాస్ఫాలనములు నొనర్చుచు భయంకరంబుగా నేతెంచుచున్నసమయంబున॥ 300

—• పం చ పా ది. •—

తే॥ విష్ణుఁడంభోజగర్భాది విబుధపాళి
వీరబాహుప్రముఖ భూతవిభులుసూచి
తమమనంబులు నత్యంతదారుణమగు
క్ష్వేళమో! పవిసంఘాతమో! లయాగ్ని
ధూమమో! యనుతలపోఁతతో నెసంగి॥ 301

మ॥ అపుడద్దానవులేగుదెంచి సురసైన్యాధీశునింజుట్టి తో
రపుహేతుల్ జడిగాఁబయింబఱప నీర్ష్యంబూని క్రౌంచాచల
ద్విపహార్యతుఁడు నీశుఁడానలముచే వేమారులుంగాల్చి శౌ
ర్యపరిక్రాంతివహింప కత్యధిక తీవ్రత్వంబుసొంపారుచున్॥ 302

ఉ॥ ఆయెడదండచక్ర ముసలాసికుఠారములందలంచి దై
తేయుల నన్యకాండవసతింగనువారలరాక నాఁపివీ
తాయులఁజేయ నంచితమహాయుధపంచకమాశురీతి గాం
గేయుననుజ్ఞ రాక్షసులఁ గీటడఁగించి యత్నప్తియౌటచే॥ 303

వ॥ అచ్చోటువాసి యినకోటిభాసమానంబై తేజరిల్లుచు బ్రహ్మాండాంతరాళవిహారంబుసల్పి యందందుగల నిశాటబృందంబులఁ బంచతనొందించె నప్పుడసురుండు॥ 304

తే॥ వివిధచక్రాధిరాజంబు వివిధలోక
సంహృతిసమర్థమైయొప్పు చక్రమొకటి
గుహునిపై నేయ నది భయావహమునగుచు
రా నిరీక్షించి యాతండు బ్రతియొనర్చె॥ 305

తే॥ కారణముగామి దానినిగరమునందు
బట్టుటయు శూరుఁడీక్షించి పరితపించి
మాయలొంది యనేకంబు కాయములను
గైకొని విజృంభణముసేయుకాలమునను॥ 306

క॥ శరజుఁడు నవ్వుమొగంబున వెరవొప్పఁగ వానిమీఁద విజ్ఞానాస్త్రం
బురువడినేసిన నది యాశరమాయలనడఁచి రాక్షసప్రభునొకని॥ 307

క॥ కాన్పింపఁజేయనప్పుడు మ్రాన్పడకున్నట్టి దేవమండలి విరులన్
దన్పుగఁగురసెను పదఁపడి పెన్పగుధైర్యంబు వీటివెట్టి దనుజుఁడున్॥308

— శూరపద్ముఁడు వేయునెనిమిది బ్రహ్మాండములందు దిరుగుచు బోరుట —

శా॥ అన్యాజాండములందుఁజేరఁజనఁగా నాలోచనంజేసి స
న్మాన్యున్ షణ్ముఖుజీరుచున్ బ్రుటిని తత్స్థానంబుబోవీడుచున్
దైన్యంబేర్పడఁబాఱుచున్నఁ బటుశస్త్రంబుల్ ప్రయోగించుచున్
జన్యాపేక్షయెసంగి శూలిసుతుఁడీర్ష్యన్ వానివెన్నంటుచున్॥ 309

వ॥ చని వాఁడెచ్చటెచ్చట జెనంగ మాఱుకొనునో యచ్చోట ఘోరంబుగాఁ
బోరుచుఁ దమిచరుండు స్థలత్యాగంబుచేసినఁ దానునుంజేయుచు
నెందేగిననందేగుచు మరలనప్పాపాత్ముఁడన్యబ్రహ్మాండములకుఁబోవుచు
రా రమ్మనఁ గ్రమ్మి వెనుదవిలి యాలంబుసేయుచుబాధించిన రెట్టించు
మత్సరంబున శూరపద్ముఁడష్టోత్తర సహస్రాజాండంబులఁదిరుగ నపరిమిత
శరంబులు వరగించుచు దానును వానితోడన పర్యటనంబుసేసె
నాసమయంబున॥ 310

॥ బ్రహ్మాదిదేవతల్ భయమొందిహరిఁగాంచి
క్రూరుండు నతివంచకుండు మాయి
యాహవదుర్జయుండగు శూరపద్ముండు
బవరంబునకుఁబిల్వ బార్వతేయుఁ
డితరకాండంబులకేగెను వానిని
గాంచెనో! కాంచఁడో కదనమందు

జయమునసంధిల్లునో! సంధిల్లదో! యని
మామనంబులను సంశయము భయము

తే॥ జననమొందెను తీర్పవే! యని యడిగిన
నచ్యుతుండిట్లువల్కు శివాత్మకుఁడగు
స్వామియుపమానరహితుండు జాపధరుల
యందు బ్రతిలేనివాఁడు మహాబలుండు॥ 311

క॥ ఏవారికైనఁదెలియంగా వశమె! తదీయమహిమ ఖలదైత్యులచే
నేవిధిబరాజితుండగు గ్రావంబునకోడఁగలదె ఘనకులిశంబుల॥ 312

క॥ మీరాఘను మహిమలఁ గన్నారఁ దర్శనము సేసినట్టిడులయ్యుం
గూరితిరిసందియంబున గోరంతభయంబునొందకుఁడు డెందములఁ॥ 313

చ॥ ఎనయు బితామహాండముల నెంతచరించిన గాసిజెందకఁ
మనలను జేరుసత్యము కుమారుఁడటంచు మురారిజెప్పఁగా
ననిమిషవర్గముల్ ముదమునందిరి యంతట దేవదానవుల్
ఘనబలదర్పవీర్యములుగన్పడఁ బోరిరి విస్మయంబుగఁ॥ 314

వ॥ ఇవ్విధంబునఁబెనంగుచు నజాండవిహారముసల్పునప్పుడు శూరపద్ముండు గాసివడి యధికరయంబున నిజపట్టణమగు వీరమాహేంద్రపురంబు సొచ్చిన జెల్లుకానుపు పశ్చాద్గామియైనడువఁ దత్పురస్థితాసురవీరులు శూరపద్మప్రేరితులయి సేనానింజుట్టుముట్టి కట్టలుకగట్టి తూపులంగొట్టిన నతండు॥ 315

క॥ నయనానలకీలావళి నయ వినయ విహీనులయిన నక్తంచరులఁ
రయమున దహింప సురసంచయములు మోదించి రలరుజడిపెంపెసగఁ॥

ఉ॥ అట్టియెడఁ సురారివిభుఁడాత్మబలంబుల సైన్యనాథులఁ
గట్టులజేనిమన్మని యఖండదృగానలకీలి కాతతుల్
కట్టెదుటఁదహించుటయుగన్గొని కోపపరీతచిత్తుఁడై
దిట్టరులైనరక్కసులు దీఱుటకాత్మను దుఃఖమొందుచుఁ॥ 317

—♦ శూరపద్ముఁడు తనతల్లియగు మాయాంగనవలన నిజాభీష్టమును వడయుట —♦

మ॥ తనకుఁ మాతయు సత్తపోన్విత జగత్ప్రఖ్యాతయైమించు మా
యను ధ్యానింపఁగఁ దత్క్షణంబయది దివ్యాకారయై వచ్చినం
గని శూరుండు నమస్కరించి జననీ కారుణ్యముంజూపి చ
చ్చిననాతమ్ముల బిడ్డలఁ బలములఁ జీవింపంగా జేయవే॥ 318

సీ॥ అని వేడనమ్మాయ తనయునిగన్గొని శక్తిధరుండ సాక్షాచ్ఛివుండు
నజ్ఞానమున నిగ్రహము సేయరాదంచు మునుబోధసేసిన వినకనీవు
నిందగావించితి వందుచే నీవిపద్దశనొందనాయెను దత్తటిలకు
మల్పకాలంబున నభవాత్మజునిశక్తి నిర్జింపఁగలదిద్ది నిజముసుమ్ము

ఆ॥ యయిననీకొమారు లనుజులు మనుమలు
జుట్టములును జెలులు సుఖముగాను
బ్రతుకుకొఱకుగా నుపాయమేనొక్కటి
తెలిపిపోవుదాన తెలియువినుము॥ 319

॥ వసుంధరయందు సుధామందరంబను శైలంబు శరనిధి పరిసరంబున నున్న
యది దానింగొని తెచ్చిన నది పునర్జీవితులనుగాఁ జేయునని కఱపి
యమ్మాయాసతి స్వేచ్ఛయాత్ర నధిగమించె నప్పుడు॥ 320

॥ శూరుఁడ వార్యధైర్యమున శోభిలి వేగమయింద్రలోకపుం
దేరునుడిగ్గి తద్గిరిని దెమ్ము రయమ్మునబొమ్మటన్న నా
తీరునఁబోయి యగ్గిరిని దెచ్చెను తెచ్చుటయుం దదీయమౌ
మారుతమంగకంబులలమఁ స్మృతినొందినవారలెల్లరుఁ॥ 321

॥ అనుజుఁడగు సింహవక్త్రుండు నాత్మజుఁడగు
భానుకోపుఁడు మొదలుగా సూనులును హి
తుల్ బలంబులు సకలబంధువులు నిద్ర
లేచుగతి లేచువిధమును జూచియులరి॥ 322

దానవవల్లభుండు ద్విరదద్విష వాహనమెక్కి చేవ గ
య్యానకురాఁ దదీయ తనయానుజముఖ్య నిశాటసైనిక

శ్రేణులు భీకరధ్వనుల జేయుచుఁ దేజితసాధనంబులం
బూని రణంబునం దమరపుంగవులన్ నిరసించుచుండగన్॥ 323

చ॥ అనిమిషులార్తిచేఁ బ్రతిభయాకులరాక్షససైన్యకోటులం
గనుఁగొని సంపదల్ వలదు కాయమునిల్చినఁజాలదే యటం
చు నలఁగుచున్ మనోవికలతుష్కృతఁ గీర కపోత కోక బ
ర్హిణ బక మానసౌకస సకృత్ప్రజముఖ్య విహంగరూపులై॥ 324

చ॥ తమతమసాధనంబుల వృథా దిగవీడి తొలంగి ప్రాణముల్
దెమలనిమన్కినొందితిమి దేవునిసత్కృపనంచు స్వేచ్ఛగా
గమనమొనర్చి రగ్నిభువు గాతరులై చనుచున్న దేవసం
ఘముల హసన్ముఖుండగుచు గన్గొనుచుండెడునంతలోపలన్॥ 325

వ॥ పునర్జీవితులై సింహవక్త్రాదియామినీచరులు శూరానుమతి నగ్నింబడు శలభంబులక్రియ నాలంబునకుఁ బోటొగ్గిన బారకై దిట్టం జుట్టుముట్టి మట్టుమీఱు పొగరున నధికశరాసారంబులన్ ముంచిన భూతవీరబలం బులుజలియించుటయు శిఖతురఁగుండు భీషణుండై యాశుగతి బాశు పతాస్త్రంబునుసంధించి యేయ నద్దానియందు వజ్ర ఫణి విశిఖ సము ద్రంబులును గిలికాండంబు ననంతంబులుద్భూతమై శూరపద్మావశేషం బుగాఁ దద్దోషాటుల నగ్గిరితోఁగూడ భస్మంబు సేసిన బ్రహ్మాదినిలింపులా నందించిరంత॥ 326

—♦ శూ ర ప ద్మఁ డు గు హు ని తోఁ బో రు ట ♦—

త రు వో జ.

శూరపద్ముండు శుశుషుణితేవ శుంభత్ప్రతాపుఁడై సురలోకరథము
సారెగనుంగొని సత్వరనీవు జనినవాధికలక్షసంఖ్యావీరుల న
వారణ భూతనివహములఁగొంచు బ్రహ్మాండగోళ నివాసంబుసొచ్చి
వారిఁగాచుకొనుము వడినేగుమనుచు వచియించనదియునవ్వడువున జేసె॥

శా॥ దానింగాంచి సురవ్రజంబు మదిఁజింతంజెందె రాత్రించరుం
డానందాన్వితుఁడయ్యె నయ్యెడగుహుం డత్యాగ్రహాగ్రస్తుఁడై

నానాదివ్యశరంబులన్ విడువఁ దూర్ణంబేగి యాతేరిపై
మేనం దెల్విదొలంగియుండెడు సుధామృష్టాన్న సేనాపతిన్॥ 328

॥ తద్రథసహితముగాగన్ రుద్రజుఁ జేరం దదీయ రోపచయంబుల్
భద్రముగఁ దోడి తెచ్చిన తుద్రాపస్మృతినిఁ దేలుకొని వీరాదుల్॥ 329

॥ రథములడిగ్గి నిడ్వి భుధరప్రియసూతినిడాసి మ్రొక్కుచుం
బృథులనుతుల్ ఘటింప నతఁడెల్లర మన్ననవాదరించి దు
ష్పృథమతియైన రాక్షసునిపక్షమునచ్చిన యింద్రలోకపున్
రథమునుజూచి నీవిటఁ దిరంబుగ నుండుమటంచు జెప్పుచున్॥ 330

। దనుజుని గోపదృష్టిఁగన దర్పముమీఱఁగవాఁడు క్రూరమై
తనరు ననేక బాణము లుదగ్రతనేయ విశాఖుఁడన్నిఁటిం
దునకలు సేయఁగాఁ గనలుతో దితిపుత్రుఁడు వాఁడిములుకులం
బనివడి సూతుమేనుజొరఁ జాఱఁగవైచి మదించియార్చినన్॥ 331

క్రతువైరిసూనుండు రక్తధారాప్లుత గాత్రుఁడై పవమాగాంచి యధిక
కోపంబుచే శూరుగూల్చుటకై వేయియమ్ములవిలుద్రుంప నసురవరుఁడు
జలమున దనదు కేసరివాహనముడిగ్గి సర్వసంహారబీజమగు శూల
మురువడిఁగైకొని సరసకేతేర నక్కంఠీరవము మేఘగర్జవోలె
నార్భటించుచు షణ్ముఖస్యందనాశ్వ
హాతము సేయుచు నదియంగ దితిజవిభుఁడు
ప్రళయకాలహుతాశన భయదమైన
శూలమునువైవఁగా నది చోద్యముగను॥ 332

ఖడ్గ, వజ్ర, దండ, శక్తి, గదాది, వివిధప్రహరణంబులను బావకని
చయంబులను గాలకూటంబులను గ్రక్కుచు భూతబలంబుల నధికంబుగా
భంజించుచు ద్వాదశకరధనుర్ముక్తశరకోటిగిటడంచుచుఁ జేరువకుడాసినం
జూచి సేనాని యాఱసికోపంబున॥ 333

కులిశమునువైవఁగా నదిఘోరరూపమున నెదిర్చితనదువక్త్రిమునఁ దదీయ
ాలమునుబట్టిగాంగేయు గేలశూలసహితముగనిల్చెదివిజులాశ్చర్యమొంద॥

చ॥ తదుపరిదేవజాలములు దారకవైరినిసన్నుతించి దు
ర్మదుఁడగురాక్షసుండునిమి మమ్ముగ్రపఁగనుమంచువేడు న
య్యదనునఁ బైజఘోటపరిహర్త యుకూరవచోనుకూలియై
పొదలు మృగేంద్రవాహనముబోల్పఁ జేయఁదలంచిస్కందుఁడుఁ॥335

— ♦ కూరపద్మదుఁడు చక్రవాకపక్షిరూపముదాల్చి కలహించుట. ♦ —

క॥ నిశితాస్త్రసహస్రద్వయి దిశలద్రువఁగవైచి దానిఁదెగటార్పంగన్
నిశిచరుఁడు మేదినీధ్ర సదృశకోకఖగాంగమున్ ధరించి మదమునన్॥336

ఆ॥ జంతుజాలములను జంపుచుఁ బెల్పనఁ బుడమిమీఁదఁద్రవాలి భూతవీర
విసరములను బక్షవిక్షేపఘోషలఁ జెదరఁజేసివేగ జదలుజేరె॥ 337

మ॥ మఱియుం జిత్రపతత్రముల్ విసరి భీమస్ఫూర్తిఁ జేజేలు ను
క్కఱి మూర్ఛిల్లఁగఁ జేయుచుంగసరునిక్కన్ గొందఱన్ ముక్కుతో
నెఱిఖండించుచుఁ గొందఱన్ మెసవుచున్ నింగిన్ వెసన్ దాఁకఁ గొం
దఱినింజిమ్ముచు గొందఱిన్ జగణఘాతన్ బాధనొందించుచున్॥ 338

క॥ అకోకకముద్ధతిన్ వినుచక్కటికిన్నెగసి పక్షజాతధ్వనులుం
గ్రిక్కఱియఁబుడమికిన్ దిగి గ్రక్కున శరజన్మసూతురథమునలంచెన్॥

వ॥ మరల నారథాంగంబు నభంబునకెగసి త్వరితమున మహికేతెంచి వాడి
తాడనంబొనర్చుచు మహావేగంబున భూతవీరప్రచయ ప్రయోగ శర
ధ్వంసముగావించు సుడిదిరుగు కరువలివిధంబున నెల్లెడభ్రమించుచున్నఁ
గుమారుండుగాంచి సరభసంబున ననేకవిశిఖంబులడరింప ఖండఖండము
లుగా ఖండించి విక్రమవిహారంబున నచ్చక్రవాకంబు॥ 340

తే॥ చక్రవాళాచలద్వీప సాగరోర్వి సురజగత్పర్వతాదులఁ దిరిగితిరిగి
త్వరితమునభూతసేనలదఱుముచున్నశరజుఁడంతయునీక్షించిచలముబెంచి॥

చ॥ విహంగములెందు మున్నిటుల విక్రమవంతముతోట జూడలే
దహహా యటంచు విస్మయమునంది కురంగటనిల్పియున్న వృ
త్రహుఁగనఁగా నతండు గిరిధన్విసుతుండు రథస్థుఁడౌటయున్
మహితజవంబుతో దివిజమార్గచరిష్ణుత జక్రముంటయున్॥ 342

చ॥ కని శిఖిరూపధారియయి స్కందునిముందటికేగుదెంచి భ
క్తినిబ్రణమిల్లి దేవ! భవదీయకృపాణనునుంజూచి నాపయిన్
మనమలరంగనెక్కి పరిమార్చుముపైరినటంచుబల్కఁగా
విని యతఁడాత్మనుబ్బి శిఖివిగ్రహుఁడా బలభేదినెక్కఁగన్॥ 343

క॥ అక్కేకిచక్రవాకము ప్రుక్కించినఁజేవచెడక సూడునదానిన్
ఱెక్కలుగొట్టుచుముక్కునదక్కక మొట్టుచునుగాళ్లదట్టుచుమఱియున్॥

తే॥ ప్రకటబలమున నట్టిటు బాఱజేయు హింసవడికేకి యాకోక మేకొలదికి
దెచ్చునోయనికడునొచ్చివెచ్చనూర్చగాంచిభ్రుకుటీకరాళుడై క్రౌంచభేది॥

ఆ॥ అలరథాంగవక్షు మంత్రిచ్ఛదంబులు బాణతతులఁజెంప బలముచెడక
ఱెక్కలును దొడలును మిక్కిలిగొప్పలై తనర నెల్లచోట్ల ధరణిదిరిగి॥

క॥ కఱకంఠసుతుఁడు శరముల బఱపుచు వెనుదగులనెదురుబఱచియువిల్లున్
విఱువఁదలంపఁ గుమారుఁడునఱకెన్ వ్రయ్యలుగ నిశితనారాచమునన్॥

ఆ॥ అపుడుగోకగాత్ర మపహృతంబగుటకు బరితపించి శూరపద్ముఁడలుక
ఘోరవసుధరూపధారియై గుహునకు బెదరుపుట్టునట్లు బెరిగిపెరిగి॥ 348

—♦ శూరపద్ముఁడు భూసముద్రవాయు ముఖ్య నానారూపములతోఁ బెనంగుట ♦—

చ॥ అరుణశశిప్రభంజన విహారములెల్లను మాన్ప భోగిభు
క్తురఁగుఁడు నేడు బాణములగొబ్బునసేయఁ దదస్త్రసప్తకం
బరుదుగ సప్తవార్ధులయి యాశరగ్ర్యత్రిమధాత్రిరూపమున్
హరణముసేయ వాఁడు వరుణాలయరూపమునొందియుగ్రతన్॥ 349

క॥ వీచీమాయాజాలము వోచన్దారసిలఁజూచి ధూర్జటితనయుం
డేచి శతసంఖ్య దృఢ నారాచంబులువైవ నవియు బ్రళయాగ్నిగతిన్॥

క॥ జ్వాలావళులాసంద్రము దూలింపఁగ దైత్యభర్త మర్భరకోపో
ద్వేలుఁడయి వహ్నిరూపముదాలిచి జాజ్వల్యహేతితతి పెల్లెగయన్॥ 351

వ॥ అగ్నికణంబులనఱుమ మహాసేనుండు సహస్రాంబకములనేయ నవి
వాతూలాకృతినశిశంల్లి తదుపశమనంబుసేయు దనుజుఁడాతుణంబ గంధ

వహతనువునవిజృంభింపవిశాఖుండు లక్షశిలీముఖంబులఁ బ్రయోగింపఁగా దదస్త్రంబులు దందశూకంబులై తత్ప్రవనునడంచి శివసూతిసన్నిధికరిగె నివ్విధంబున రాత్రించర త్రినేత్రపుత్రులు నాలుగహోరాత్రంబులు భీమంబుగా బోరిన నాశూరపద్ముండు వెండియు॥ 352

సీ॥ మూర్తిత్రయాంగ విస్ఫూర్తినిగాన్పించి
పదఁపడి దైత్యరూపములఁదోఁచి
మఱియు నింద్రుఁడుమొదల్ వెఱగంట్లమేనున
జరియించి పిదప పిశాచభూత
ప్రేతాంగములదృశ్యమై తిరుగఁ భీష
ణానలతనువున గానిపించి
క్రమ్మఱ వాయుపరాగ చక్రాసార
వారవాహాంబుధి వజ్రతిమిర

తే॥ శైల దిక్కరిహరిణకేసరి విహంగ తనువులనుగోచరుండయి వెనుకదైత్య
సైనికాధిప సింహాస్యభానుకోపతారకాసురదేహముల్ దాల్చికదియ॥

చ॥ దివిజులునిల్వనోడి నలుదిక్కులఁబాఱినఁ జూచినవ్వుచుఁ
భవతనయుండు వానిపయి బాధశరంబులు మిక్కుటంబుగా
జవమునసేయుచుఁ మరల శాతశిలీముఖమొండు నుగ్రుఁడై
భువనములద్భుతంపడఁగ బోరనవైచె సురల్నుతింపఁగఁ॥ 354

తే॥ శక్తిభృచ్చాపనిర్ముక్త సాయకంబు తేజరిల్లుచు నగణిత తీక్ష్ణశరము
లయినరాదునివివిధమాయాస్వరూపములనుమాయించితూణీరమునను జేర॥

మ॥ దనుజాధీశ్వరుఁడంత శ్రాంతుఁడయి చిత్తంబందుజింతించుచుం
దనమాయాకృతులన్నియుఁ విడిచి చిత్రంబట్లునిశ్చేష్టుఁడై
కనిపింపఁ శరజన్ముఁడోరిఖలుఁడా గర్వాంధ నీశాంబరీ
తనువుల్ పెక్కులుసూపినాఁడవికఁ సందర్శించుముగ్రరూపమున్॥ 356

వ॥ అనిపలికిసుబ్రహ్మణ్యేశ్వరుం డధికతరంబును నవాఙ్మానసగోచరంబునైన విశ్వరూపంబుధరియించినంజూచి త్రిదశులు భయకంపితులును లలాటస్థిత

హస్తయుగ్మలునై ప్రస్తుతించుచున్నంగని యభయంబొసంగి సుధా మధురవాక్యంబుల నాదరించిన వారలు బరమానందంబుచే నభినందించిరి శూరపద్మ్ముండు ననంతతేజోవిరాజమానంబగు నద్దివ్యరూపంబుఁగాంచి భగవదనుగ్రహంబునఁ బార్వతీనందనుండు సాక్షాత్పరబ్రహ్మమనియెడి విజ్ఞానంబుత్పన్నమయి తనమనంబున॥ 357

—♦ శూరపద్ముఁడు విజ్ఞానంబుచే గుమారుని శివునిగా భావించుట ♦—

శా॥ ఈతండన్నదనీకినీగణములఁ హింసించి నాతో ననిం
బ్రీతిం జేసి బిడౌజలోకరథముఁ స్వీయస్థలిఁ జేర్చి మా
యాతంత్రస్వవశీకృతుండయి మదీయంబైన మాయాక్రియా
తీతుండై కనిపింపఁజేసె నిపుడెంతే విశ్వరూపంబునున్॥ 358

ఉ॥ ఈపరమేశు బాలుఁడని యెంచితి మూఢుఁడనై నిశాటసే
నాపతులున్ సుహృత్తులును నాయనుజుండగుసింహవక్త్రుఁడున్
డాపకబోధ జేసిన మదంబుమెయిన్ గనఁజాలనైతి నా
హా! పదరోమకూపముల నస్మదజాండములెల్లఁగన్పడెన్॥ 359

వ॥ ఇమ్మహాత్మ్ము ననిర్వాచ్యంబగురూపం బాపాదమస్తకంబు నాకుఁజూడఁ గలిఁగె నగణితాకార తరంగితంబును నవనవోన్మేషంబగుసౌందర్యంబు గన్నుదనియఁజూచినను దృప్తిజనింపకున్నయది మత్పూర్వాచరణాతపో మహత్త్వంబున వీక్షించితి మఱియును॥ 360

సీ॥ నాయందుఁగల కరుణాపరత్వంబున నిద్దేవుఁడాహవ హేతుకమున నిచ్చోటికిసివచ్చె నిప్పుడీఘనుఁజూడ నామనంబున భక్తినాటుకొనియె గణుతింపఁగాఁ బ్రదక్షిణవందనస్తుతులొనరించుకోరిక యుద్భవించె దక్షిణబాహునేత్రములు గంపమునొందె వైరులకుందోడువచ్చెనను చుఁ

తే॥ గలుషితంబగునామదిఁ గలిఁగె శాంతినన్నువదియింపఁదలపెట్టియున్ననిట్టి వేలుపునకెంతకార్యంబు వేదక్కకొలకు నల్పె నిన్నివిధంబుల సంగరంబు॥

గ॥ అసురులఁబట్టినేను జెఱయందునమంచుటఁ జేసి యిట్టిరూ
పముఁగనఁగల్గె నాహితులు బంధములూడ్చుము దేవపంక్తికం

చమితవివేకశూన్యులయి యాడిరిపూర్వము దద్విధంబ కా
ర్యముముగియింప నీశుభతశాంగము గన్నులఁజూడఁగల్గునే॥ 362

క॥ ఇఁకనైనను గీర్వాణప్రకరంబులవిడిచి భక్తిఁబ్రణమిల్లిన నా
కొకవెఱపు గలుఁగదనుచుం బ్రకటమతిౘ శూరుఁడాత్మభావించునెడ౯॥

ఆ॥ విశ్వరూపముడిగివిశ్వాత్ముఁడగు షడాననుఁడుదనదు పూర్వతనువుఁదాల్చి
శూరపద్మమదినిజొచ్చిన విజ్ఞానమపహరింప వాఁడు నజ్ఞుఁడగుచు॥ 364

—♦ కుమారుఁడు శూరపద్ముని విజ్ఞానముడిగించి పెనంగుట. ♦—

మ॥ అమితక్రోధవశాత్ముఁడై యితఁడు మాయారూపముందాల్చెఁబో
సమరక్ష్మాతలమందు నీతనిఁ దిరస్కారంబుగావించురూ
పముచే ముందుసురాళిఁద్రుంచి పిదప౯ భంజింతునిక్ష్వాలునం
చు మది౯ నిశ్చయమూని శూరదనుజేశుండు౯ విధిప్రేరణ౯॥ 365

క॥ అలుకమెయిం దనమాయా బలమునఁ బెల్లిఱులఁగప్పి బహుళముగాఁగ౯
దలలును గరములు బదములు గల విక్రృతాకారమూని కడుశీఘ్రముగ౯॥

ఆ॥ అంతరిక్షమునకునరిగి బృందారక విసరములనుబట్టి మెసవనెంచి
హస్తములనుజాప నధికచింతాక్రాంతులగుచు భీతి వారలార్తినొందిః॥367

వ॥ అంజలిబద్ధులయి షణ్ముఖునుద్దేశించి మాటిమాటికి మహానుభావా! పోషింపుము పోషింపుము భక్తలోకావనదక్షా కాపాడుము కాపాడుము దుర్మదుండును నిర్జరబాధకుండును నగు వీని సంహరింపుము సంహరింపు మనుచు మయూరాకృతినున్న మహేంద్రుఁడాది సకలదివౌకసులుఁ బ్రార్థింపఁ గరుణానిధియగు మహాసేనుండు శక్త్యాయుధంబునుజూచి శూరపద్ముని దేహంబిప్పుడఖండవిక్రమంబున శకలద్వయంబుగాఁజీలిచి రమ్మని యనుజ్ఞాపించుటయు॥ 368

చ॥ అరికులభంజనంబు ప్రళయావసరార్యమ సన్నిభంబునై
పరగెడుశక్తి వేగఁజని పావకకీలలుగ్రక్కుచు౯ నిశా
చరపతిశాంబరీ తిమిరజాలమడంచుచు వంచనాతనూ
హరణము సేయడాయుటయు నాశరనాథుఁడుసూచి మత్తుఁడై॥

క॥ మరణములేనినన్ను దునుమాడు నెయ్యాశరమంచు నెంచి లోఁ
బరిగణియింపక_ భయముబాసి దురాగ్రహ శౌర్యగర్వ సం
భరితమనంబుతో వసధిమధ్యము సొచ్చి జయాంకుఁడై జగ
ద్ధరణము సేసి క్రమ్మఱఁగ నర్భకుఁద్రుంచెదనంచు నెంచుచున్॥ 370

—♦ రసాలవృక్షరూపమున నున్న శూరపద్ముని గుహుఁడు జంపుట, ♦—

॥ అదలిఁచి పెల్చనం బ్రతిభయావహమైన రసాలవృక్షమై
పొదలెను బ్రజ్వలజ్వలనుబొందినకీలలువోలు పల్లవా
స్పదమును ధూమమేచకవిభా ప్రకటచ్ఛద బంధురంబునున్
విదితకృశానుతప్త తపనీయరుచి ప్రసవాభిరామమున్॥ 371

మఱియు నీలకర్కశ శలాటుకంబును గోకనదాభ ఫలపూరితంబును జలదశాఖోపశాఖాసమూహంబును నజాండభిత్తిసంసర్గమూలశోభితంబై యోజనలక్షపైశాల్యంబై వనమాలి బ్రహ్మ సూర్యేందు హరిద్వదృష్టులు సాధ్వసస్థానంబులగుచుండ వికారరూపంబున బ్రహ్మాండోర్ధ్వకర్పరంబు ముట్టి సాగరసప్తకము గలఁతనొంది నీటివెల్లువలుబాఱ గళితతారకంబై చలితమేదినియై గిరివిసరంబులు గ్రుంగ నవగ్రహంబులు నిరస్తవైజస్థానులై పలాయనంబొనర్ప వెండియు నధోవిష్టపంబులుగష్టంబు సెంద నాద్యకమఠ దిగ్గజాష్టకము గ్రుంగ్గ ననంత తక్షక వాసుకి కర్కోటకాశ్వతర ధార్తరాష్ట్రాది పన్నగంబులు వన్నెదొఱఁగ బహ్మాండాధఃకుడ్యంబు వీల భూతజాలంబులు భయోద్వేగంబున గైలాసంబు జేర నిట్టి యద్భుతాకారంబున నమ్మాతవృక్షంబు విజృంభించిన॥ 372

రజవిముక్తశక్తి మదసంయుత దానవమాయఁగాంచి భీ
రతరరుద్రమూర్తియయి కాలగళాద్రివినా సమస్తమౌ
హరిదుదధుల్ గలంచుచు నిశాటరసాలమహీరుహాంగముం
గొరిగొనిన_ బలాశనవిభుం డధికక్రుధ ఘూర్ణమానుఁడై॥ 373

రగున నిజరూపముఁగొని కరవాలముబూని శక్తిఁగదిసిననది యా
రవిభు వక్షచ్ఛేదం బనుదుగఁగావించి మరలి యమునాపగలోన్॥ 374

మ॥ అవగాహం బొనరించి షణ్ముఖుని హస్తాగ్రంబు ప్రాపించె దే
వవరుల్ ప్రస్తుతి జేసిర వ్వెనుక గ్రవ్యాద్భర్త భి త్తంబులం
దవిలంబంబున గేకికుక్కుటము లత్యంతాద్భుతాంగంబులన్
భవమై స్కందునిపాలి కేగి వినయవ్యాపారతన్ నిల్చెనన్॥ 375

తే॥ ఆతఁడవసంబు సేయఁగా నాత్మఁదలఁచి
కనికరంబునఁజూడ నజ్ఞానముడిగి
ప్రాజ్ఞత సమస్కృతులొనర్చి ప్రస్తుతింప
నతులితానందమునుబొంది యాదరమున॥ 376

క॥ తారకజిత్కృకవాకున్ నారథమం దెపుడుఁ గేతనమ్మై యుండం
గోరితినన సమ్మతిచే నారీతివసించెఁ దోయదార్భటిచెలఁగన్॥ 377

ఉ॥ అత్తటి నెమ్మిరూపుఁడగు నాకపతిన్ డిగి శూరు మేనను
త్పత్తినిగాంచు కేకిని ముదంబున నెక్కిచరింపఁ జేయ ను
ద్వృత్తినిఁదచ్ఛిఖావలము దిక్కుల నెల్ల మనోజవంబు రే
కెత్తమెలంగఁదర్గమనకృత్యమహోద్ధతికిం గ్రమంబునన్॥ 378

సీ॥ అభ్రముల్ భీతిల్లె నచలముల్ గ్రుంగెను బృధివీతలం బెల్ల బీఁటగిల్లె
జ్వలనానిలంబులు జలియించె బ్రహ్మాండమదరెను గ్రమ్మఱ నాశిఖండి
ఘనపక్షవిక్షేపకలన గేకారావములను లోకంబులకళుకుఁగూర్చి
సకలదిగంతర సంచార మొనరించి శేషాహి వాసుకి సింహికసుత

తే॥ కేతు మొదలగువారికి భీతిగొల్పి యమరపతిబర్హియైతాల్చు నట్లుగాను
నగజసుతు మోచి తత్త్వరణంబువలన దిరిగిసురలున్న సంగరోర్వకుఁ జేరె॥

ఉ॥ వాసవుఁడగ్నియున్ బ్రమథవల్లభపుత్రునునుజ్జ్వల గుండలి
గ్రాసపదాయుధాకృతుల గ్రక్కునవీడి నిజస్వరూపముల్
భాసురలీలఁదాల్చి భయభక్తుల మ్రొక్కి యమేయసన్నుతుల్
జేసిరనంతరంబు సుర సేనలు వీరులుభూతసంఘముల్॥ 380

ఆ॥ గుహునిజుట్టివచ్చి కోలాహలధ్వను లాచరించిరప్పు డజ ముకుందు
లమ్మహాత్ము నుతుల నలరించిమొక్కిన సదయదృష్టి వారి సత్కరించె॥

ఉ॥ అర్యొడ శూరపద్ముఁ డభవాత్మజుచే మృతుఁడౌయుదంతమున్
జయ్యన వేగరుల్ దెలుప సంకటమొంది తదగ్రభార్యయౌ
తొయ్యలి పద్మకోమల విధూతకళేబరయయ్యె నంతలో
నయ్యసురేంద్రు నన్యసుతులందఱుఁ జిచ్చునఁజొచ్చిరార్తులై॥ 382

సీ॥ పడఁపడి యాశూరపద్మునినందనుండగు హిరణ్యుఁడు దనయయ్యచావు
నసురసేనలమృతి నాలించిదుఃఖించి మునుపునేనెన్ని జెప్పినను వినక
సంగరంబునఁగూలిచరణాయుధాహిభుగ్గాత్రముల్ ధరియించిశాత్రవులకు
ధ్వజవాహనంబులై వర్తించుటుచితమై తోఁచెనే నేనేమియాచరింతు

ఆ॥ చూచిరాఁదలంప స్రుక్కింతురరులని భయముగలిఁగెననుచుఁ బరితపించి
నిజగురుండు శుక్రునింజేరి శూరాది దితిసుతాంత్యమెల్లఁ దెలిపియపుడు॥

ఆ॥ అలహిరణ్యుఁడాత్మ నఖిలభోగంబులు నధ్రువంబులనుచు నాసయుడక
శాశ్వతాపవర్గసంధాతయౌ శివస్మరణుఁడగుచు నియతమతినినుండె॥384

క॥ అనిసూతుండెఱిఁగించిన విని శౌనకుఁడాదిమునులు విస్మితచేతో
వనజులయియవలిగాథను ననురాగముతోడఁ జెప్పుమనియడుగుటయున్

—• ఆశ్వాసాంతము. •—

శా॥ శుండాలత్వణదాచరోరు మదహృచ్ఛుంభద్ధనుర్భంజితా
ఖండప్రస్ఫుటదోఃప్రతాప ఖరరుక్సంభూతబాధవ్యధో
ద్దండాంభోనిధిమేఖలాధర మరుత్కాంతోపమ ప్రోదినీ
కాండేంద్రోత్కట గర్వనాశన కనత్కాండా హరీశాన్వయా॥ 386

—• వర్గపంచకరహితకందము. •—

క॥ సరసీరుహాశర హర వర శరాస విలయాసహాయ శౌర్యవహ హరీ
శ్వర హరిహయహయ సింహ స్వరు సురలహరీ సురర్షి శశి శర్వయశా॥

లయగ్రాహి.

సూరకులవారినిధి వారిజవిరోధి మునివారవిమలాశయ విహార ఘననీలా
కార తపనీయగిరిధీర దశకంధరముఖారి నిచయాచల శతార జనకక్షో
ణీరమణజాతవర ఘోరభవదుష్కృతవిదార తటినీశ్వరగభీర సుయశోవి
స్తారపృథులాహవవిశారదనతానిమిషభూరుహజగచ్ఛుభదకారణదయాబ్ధి

గద్యము.

ఇది శ్రీరఘునందనచరణారవింద వందన మరున్నందన నిరతిశయకరుణా కటాక్షవీక్షా సంభావిత చతుర్విధామూన కవితాప్రహర్షిత వసుంధరా రసుణ సభాప్రకాశిత విద్వన్నికాయ రుక్మాంగద నలచరిత్రాభిద యక్ష గానద్వయ మనఃప్రబోధ రామచంద్రప్రభు ధీనిధీనామక శతగ్రంథత్రయ మదాలసాభిధానైకనాటక పుష్పగిరిపీఠాధిపత్య జగద్గురు శ్రీమదభిన వోద్దండ విద్యాశంకర భారతీస్వామి చాతుర్మాస్యదీక్షా గద్వాలసంస్థా నాధీశ్వర వంశవృక్షవర్ణన ప్రబంధనిర్మాణ చాతురీవిరాజిత భారద్వాజస గోత్ర పవిత్ర భట్టురాజవంశ క్షీరసాగర రాకానిశాకళత్ర రామదాస పౌత్ర సంజీవరాజసత్పుత్ర కొడవలూరి రామచంద్రరాజ నామధేయ కవివర్యప్రణీతంబయిన శ్రీస్కాందపురాణాంతర్గత శంకరసంహితాభిని వేశ మహాసేనోదయంబను మహాప్రబంధమునందు సప్తమాశ్వాసము॥389



శ్రీ ర స్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయనమః

# మ హా సే నో ద య ము.

(పద్యకావ్యము.)

## —• అ ష్ట మా శ్వా స ము. •—

కంధరకార్ముక భం

గీకృత కార్యోపలబ్ధ కీర్తి విశేషా

శాకీర్ణ సవితృవంశ సు

ధాకర పార్థివలలామ దశరథరామా॥ 1

తే॥ అవధరింపుము శుకశౌనకాది తాప

సులకు సర్వకథారథసూతుఁడయిన

సూతుఁడనియెను మందాకినీతరంగ

ప్రబలఘోషానుకారి వాక్ప్రటిమతోడ॥ 2

వ॥ మునీంద్రులారా! తదనంతరంబునఁ గుమారుండు గారాగారంబునబడి వగచుచున్నజయంతాది సురసమూహంబులను దోడ్కొనిరా వీరబాహు నియోగింప నతండు దదాజ్ఞకుహర్షించుచు రయంబునబోయి వారలం గొనితెచ్చి గుహునిమ్రోలనిలిపిన దేవబృందంబు లమందానందంబున స్కందునిచరణారవిందములకు సాష్టాంగవందనంబులొనర్చి పలుచందం బులబొగడ శుభాశీర్వచనంబులచే వారినాదరించి మహానురాగంబున నతండిట్లనియె॥ 3

క॥ దుష్టుండగుశూరునిచేఁ గష్టంబులఁబడితిరదియుగడచె నిఁకఁ మీ

రష్టసుఖంబులనొందుచుఁ దుష్టినిగనుఁడాత్మ భయముదొఁపఁగనీక॥ 4

—• యుద్ధమునకుపోవ దేవతలందఱు బువర్జీవితులగుట. •—

క॥ మీమీగృహములకేగుఁడు నామఘవత్సుతుఁడు దీవనలు గీర్వాణ

స్తోమముచే గొనఁటకఁమదినా మోదమునొంది తండ్రియగునింద్రునకుఁ॥5

ఆ॥ మ్రొక్కి నిలువ నింద్రుఁడెక్కుడు ప్రేమచే
లేఖవితతిఁ గౌఁగిలించుకొనుచు
సమరభూమిఁబడిన సకలవీరుల భూత
గణము బ్రతుకఁజేయుఁ డనుచుబలికె॥ 6

ఆ॥ అంత సురలు గుహునియానతిగైకొని సమరనిహత దివిజచయము నెల్ల
నమృతమహిమ బ్రతుకునట్టులుగా జేసి రఖిలలోకములకు హర్ష మెసఁగ॥7

వ॥ అట్టియెడఁ గొండరామాలిపట్టి సరిత్పతింగని కృపణ నక్తంచరపాలితంబగు
నీవీరమాహేంద్రపురంబును బెల్లుబ్బి మునుంగం జేయుమనిన నతండగు
గాక యని యవ్విధంబత్యాశ్చర్యంబుగా నొనరించెనంత॥ 8

సీ॥ అకలంకమతి నవాధికలక్షవీరులు భూతవర్గము బోరిపోరినిగొల్వ
నిఖిలవాద్యధ్వనుల్ సెగడ మాగధవంది వినుతులుసెలఁగంగ విబుధకోటి
తో నడువంగ నెంతోవేడ్క శ్రీసంధిపురిఁ జేరి యవ్విభావరిని నంద
సంతోషమునసుండిజమునయ్యాపాడసూపశిఖివాహుఁడచ్చటశివునిగొలిచి

తే॥ ముదముతో నపరాచలంబునకుఁబోవ
దలఁచి యజకేశవులఁబిల్వ దక్షణంబ
వారు సురకోటితోఁ దమ వాహనముల
పయినిగూర్చుండి యధికవైభవము మెఱసి॥ 9

మ॥ పయనంబై చనుదేరఁ గేకిపయి సుబ్రహ్మణ్యుఁడారోహియై
ప్రియత గిన్నరగానముల్ వినుచు హారిస్తోత్రముల్ దేవతా
చయముల్ సేసెడుబంధురధ్వని విశేషంబై తనర్ప ప్రమో
ద యుతస్వాంతముచెంగలింపఁజనె నస్త్రగ్రావముం జేరఁగ॥ 10

## —♦ కు మా రుఁ డ స్త్రా ద్రి యం దు ని వ సిం చు ట. ♦—

తే॥ అందులఁ బరాశరాత్మజులైన షణ్ము
నులును గంజగర్భుండు మొదలు సురలును
దన్ను నిలుపంగఁ గాంక్షించి విన్నవింప
సమ్మతముబూని వేడ్క నచ్చటవసించి॥ 11

వ॥ శరజన్ముండు దేవతాశిల్పాచార్యురావించి పురంబొండు గల్పింపుమని నిర్దేశింప నతండు వల్లెయని యప్పర్వతాగ్రంబునందు నానావిధభూరుహ ప్రకర మంజులారామకలితంబును దీర్ఘికాకూపపద్మాకరరాజితంబును నగణితమణిప్రభాపూరప్రకాశిత గోపురవరణ సౌధవీధీరంజితంబును బహువిధాలంకరణ సంశోభితంబును సమధికాద్భుతప్రదంబును నై తనరారునట్లు నగరంబు సృజించినంగనుంగొని॥ 12

తే॥ వీరులను భూతబలములవిధిపట్ల నుచితమగుచోట్లనిలిపిమయూరవాహయము డిగ్గి నిజమందిరముఁజేరికేవియమర సారమణిసింహపీఠిపైఁగూరుచుండి॥ 13

తే॥ నలినగర్భాదులను బార్శ్వములనునిలిపి
వీరనవకోపచారుఁడై వివిధగతులఁ
దన్నుఁబూజించు షట్సంఖ్యతాపసులకు
జ్ఞానబోధంబుగావించు గౌతుకమున॥ 14

క॥ జలజాసనాదులను నిజ నిలయంబునకనిచి మిగులనెనరున నమ్మౌ
నులబోధించి తదీయస్థలమున శరజన్ముఁడున్న సమయమునందున్॥ 15

తరువోజ.

బలసూదనుఁడు రమాపతి సరోజాతభవుల చెంగటికిని బనిపూనిచేరి
యెలమినాకూఁతునీ యీశ్వరీసుతున కిచ్చి పెండిలి సేయ నెంచితిననుచుఁ
బలుకవాగలుమది బహుమోదమంది పరమార్థమరయ నిప్పు నిజమంచుఁ
దెలుపంగఁబొంగి యేతెంచె సమస్తదివిజులతోడ మందిరమునకప్పుడు॥ 16

మందాక్రాంతావృత్తము.

అంతన్ శక్రుం డమరసభయందు వర్తించుపుత్రిన్
గాంతన్ గౌశికమును బిలువంగా భటశ్రేణిసంపన్
సంతోషంబొప్పఁ జని పసన్ సర్వమున్ వారు చెప్పన్
జింతన్ బాసెన్ గనని యెంచెన్ శచీదేవియాత్మన్॥ 17

శా॥ ఈరీతిన్ మదిలోఁ దలంచి వెసతో నింద్రాణి యేతెంచి గో
త్రారాతిస్థలమాత్మజా ధవళమాతంగప్రయుక్తంబుగాఁ

తేరఁగ రాక్షసబాధలందగిలి శుష్కిభూతులౌ దేవతా
నారుల్ సూనుఁడువచ్చిమ్రొక్కఁగ ననూనంబైనచింతావ్యథన్॥ 18

క॥ వగచి జయంతుని గౌఁగిటఁదిగిచి మరుత్సతులనెగులుదీర్చుడు వారల్
పొగడొంద దేవసేనా నగపౌత్రులపెండ్లికథను నయముగఁదెలుపన్॥19

— మహేంద్రుడు దనపుత్రి దేవసేనను వరింప గుహుని బ్రార్థించుట. —

వ॥ పౌలోమియుసంతసిల్లి కుమారియగుదేవసేనయు గుమారుఁడగుజయం
తుఁడును మఱియు సకల నిర్జరులును గొలువ నత్యంతసౌఖ్యమున దన
మనోవల్లభుఁడగు మహేంద్రుని సన్నిధానమునుండెఁ బదంపడి సుత్రా
ముఁడధికభక్తితో దివ్యాలంగూడుకొని షడానను గ్రహంబునకుఁబోయి
యమ్మహాత్మునకుఁ బ్రణమిల్లి వినమ్రుఁడై యిట్లనియె॥ 20

చ॥ దురమున శూరపద్మముఖ దుష్టనిశాచరకోటిఁగూల్చి ని
ర్జరులకుమోదమున్సుఖము సంధిలఁజేసినపుణ్యమూర్తివై
పరగెడుమీకు మేమెదియు బ్రత్యుపకారము సేయనోపమో
పరమదయాసముద్ర తమపాదనమస్కృతియొండుదక్కఁగన్॥ 21

తే॥ అయిన నోదేవ సురపోషణార్థముగను నూలిపోగునుశశికిచ్చులీల మీకు
నాతనూభవనిచ్చెదఁ బ్రీతిచేఁ బరిగ్రహింపుడటంచు బ్రార్థించుటయును॥

ఉ॥ తారకవైరి సత్కృప శతక్రతుగన్గొని జాగిఁకేల నీ
కూరిమిపట్టినిం గొనుటకున్ శుభవారము రేప కాన నీ
వారసి తత్ప్రయత్నమతివై మెలఁగన్వలె సుమ్ము పొమ్మనన్
గోరినకోర్కెపండెనని గొబ్బుననింద్రుఁడు నింటికేగియున్॥ 23

క॥ వైవాహికోత్సవమునకు రావలయునటంచు దిగధిరమణాదులునౌ
దేవతలను ముచుకుంద ముఖావనివల్లభులఁ బిలువనంపెను భటులన్॥ 24

వ॥ తదనంతరమున బిడౌజుండు విశ్వకర్మచే నగాధతటాక వాపీసరఃకూప
విలసితంబును మంటపప్రాసాద గోపుర ప్రాకారసంయుతంబును నానా
రత్నరచితంబును లోచనానందకరంబును నత్యంతసౌందర్యంబునుగా

కల్యాణమందిరంబు నిర్మింపం జేసి ప్రమోదావహచేతస్కుండయి పరిణయ ప్రయత్నంబుతోనుండె నయ్యవసరంబున॥ 25

స్ర గ్ధ ర.

పౌలోమీనాధునాజ్ఞం బనివడి భటులుం బాఢవేగంబుతో ది
క్పాలాళింజేరి వాస్తోష్పతి పిలుపవుడొప్పం బ్రబోధించి యంత
మ్మాలోకంబేగి మర్త్యేంద్రుఁడయిన ముచికున్దుం మహాసత్త్వులౌ భూ
పాలస్తోమంబులం రాఁబలికిరి వినయత్వంబు గాన్పించునట్లుం॥ 26

తే॥ ఇప్పగిది హూయమానులై యెల్లకడల
దొరలు మొదలగు వేల్పులు దుటుముగూడి
శీతకరమౌళిసుత దేవసేనలకును
గాఁగల వివాహమీక్షింపఁ గదలిరొకట॥ 27

— దేవసేనామహాసేనుల వివాహమునకు సురలు ముచుకుందాదిరాజులువచ్చుట —

మ॥ ముచికుందుండు మహేంద్రచారులకు సమ్మోదంబుగా భూషణ
ప్రచయంబుల్ రుచిరాంబరంబులిడి సారప్రజ్ఞ బుత్తెంచి తా
నచలారాతివచోభియుక్తి హితభార్యాపుత్ర సద్బాంధవా
నుచరవ్రాతముతోడ నేగె శివసూనుండున్న యస్త్రాద్రికిం॥ 28

వ॥ మెండియు దిగ్భాగంబులఁ బ్రసిద్ధినొందిన భూభుజులును మునిశ్రేష్ఠులును రవిశశాంకప్రముఖులును నిజదారసఖీపరిజన సమేతులై ఘోటకస్యంద నాందోళికాది యానంబులనారోహించి చతురంగబలంబులతో నానా వాద్యనినదంబులు మ్రోయఁ బరతెంచి చరమశైలజహిత్రప్రదేశ వన సర స్తటాక పుష్పారామంబు లాదియగుచోట్ల నెడమీక నిలిచియుండిరంత॥

తే॥ పరగ ముచికుందుఁడాదియౌ పార్థివులును
మునులు వాసవుమందిరమునకు నేగి
యుచితరీతిసిగాంచి హితోక్తికలన
మెలఁగుచుండిరి యానందకలితులగుచు॥ 30

సీ॥ రాజపత్నులు దేవరామలు నింద్రాణిగాంచి వందనములర్పించి పెండ్లి
కూఁతు సమస్తసద్గుణ దేవసేనను గనుఁగొని తారుదెచ్చినవి మాత్న
రత్నభూషణ వస్త్రరాజి యక్కన్యకు ధరియింపఁజేసిరి తగినభంగి
నావెన్క దాపసు లబ్జజనిర్దిష్ట కల్యాణలగ్నంబు గదిసెననుచు
తే॥ నింద్రునకుజెప్ప నాతఁడు పేంద్రజలజసంభవులతోడఁగూడి విశాఖుచెంతఁ
జేరి ప్రణమిల్లిమత్సుతాస్వీకృతికయి యాలసింపకరండు మీరనుచుబలుక॥
సీ॥ చిఱునవ్వుతో మహాసేనుండు నెమ్మిపై నెక్కి వీరులుగొల్వఁ బెక్కుమంది
జేజేలుబొగడుచు లాజాక్షతలు బుష్పములుసల్ల వెన్నుండు నలువ దోడు
నడువసూర్యేందులుగొడుగులువరుణుండువాయువుజామరవ్యజనములును
నినజుండు గరవాలమునుబట్టి యేతేరశుభవాద్యనినదముల్ శ్రుతిరవములు
తే॥ మౌనివినుతులు గంధర్వగానములును నచ్చరలయాట లఖిల మహర్షిపాణి
ధృత సుధాపూర్ణఘటములు దేజరిల్ల నగరివీథులఁజని వచ్చినగరుసొచ్చె॥32
శా॥ తత్పూర్వంబ హరిప్రియా ద్రుహిణకాంతల్ మంగళశ్లోకముల్
సత్పాండిత్యతఁబాడి హారతులు గాంక్షుం జేసిరంతన్ మహీ
భృత్పుత్రుండు వివాహమంటపమునర్థింజుట్టి ముమ్మాఱు రా
జత్పుత్రంబునుడిగ్గి శోభనపువేశ్మద్వారముం జేరఁగన్॥ 33
క॥ బలవైరిదేవి యచ్చర పాలఁతులజతగూడి నెయ్యమున గోదుగ్ధం
బులఁ బాదప్రక్షాళన మలరుచుఁగావించి కల్పకాగమసుమముల్॥ 34
క॥ కోరి సమర్పించియు శుభ నీరాజనములనొసంగి నిశ్చలత నమ
స్కారములిడి కల్యాణాగారంబున కరిగినంత గౌరిసుతుఁడున్॥ 35
తే॥ భర్మమణిమయపాదుకల్ పాదములను
మెట్టి యుద్వాహసదనంబు నెట్టుకొని య
మేయరత్నాసనంబున శ్రీయెసంగ
స్థిరతరానందమతిని నాసీనుఁడయిన॥ 36
వ॥ అంతముకుంద శతానందాదిబృందారకులును మహర్షిసందోహంబులును
ముచికుందాదిరాజబృందంబులును స్కందునాజ్ఞ నానందకందళితమాన

సులయి సింధురారిపీఠంబులంబొందిరి. వీరబాహ్వాది లక్షయుందొమ్మం
డగువీరులు నానావిధోపచారకృత్యంబుల బాహులేయునలరింపుచుం
గొలిచియుండిరిట్టి జగదద్భుతకల్యాణోత్సవప్రారంభసమయంబున॥ 37

శా॥ ఫాలాక్షుండు దయాసముద్రుఁడు శివాప్రాణేశుఁడార్తావనో
ద్వేలుం డద్రిశరాసనుండు త్రిపురద్వేషుండు దర్వీకర
ప్రాలంబుండు మృకండునందనశుభప్రాప్తుండు నానామణీ
జాలస్ఫీతవిమానమధ్యమున సాక్షాత్కారుఁడయ్యెన్‌దివిన్॥ 38

—♦ దేవసేనా సుబ్రహ్మణ్యుల వివాహమహోత్సవము. ♦—

చ॥ అపుడు శివుంగనుంగొని గుహాదులు లేచినమస్కరించి భ
క్తిపరత సన్నుతుల్ సలిపి కేల్గవమోడ్చి ధరిత్రినిల్వఁగా
నపరిమితానురాగమొలయన్ గిరినందనతో విమానముం
త్రిపురవిభేదనుండుడిగె దివ్యులకున్ నయనోత్సవంబుగన్॥ 39

ఉ॥ అయ్యెడఁ బార్వతేయుఁడు మహావినయంబున నొద్దకేగి క
న్నయ్యకునమ్మకున్ శిరములంఘ్రులమోపి నమస్కరించఁగాఁ
జయ్యన బుత్రునెత్తి పురశాసనుఁడక్కునఁజేర్చి నెత్తిపైఁ
జెయ్యిడిదువ్వి ముద్దుగొనెఁజెక్కుల బుత్రవిమోహమేర్పడన్॥ 40

మ హా స్ర గ్ధ ర

ముచికుందాదుల్ సురల్ నమ్రులగుచు గరముల్ మోడ్చి జేజేలొనర్పం
బ్రచురస్నేహంబుతో వారల బహువిధమర్యాదలందన్ని శంభుం
డుచితోక్తుల్ వల్కుచుం జానొగి సకలసురవ్యూహముంగూడి కల్యా
ణచతుశ్శాలస్థలిన్ మానసమున మహదానందముప్పొంగఁజొచ్చెన్॥ 41

క॥ ఈగతిఁజొచ్చి నిజానతి నాగతమయియచటనుండు నాసనముపయిన్
రాగిలి యుత్సంగమునందా గుహునిడి కూరుచున్న యవసరమందున్॥42

క॥ బృందారకులు భవానీ స్కందయుతుండైన శివునిగని మ్రొక్కుల నా
నందింపఁజేసి నిలువం బొందుగ భాషామనోవిభుండిట్లనియెన్॥ 43

చ॥ అథవ మహానుభావ భవదాజ్ఞ భవత్సుతుఁడాహవోర్విలోఁ
త్రిభువనకంటకుండగు నుదీర్ణపరాక్రమశాలి శూరుఁడౌ
ఋభురిపుఁజంపి దివ్యులఁ దరింపఁగఁజేయుటచేఁ బురందరుం
డభినుతిఁజేసి యీఘనునకాత్మజనీయదలంచెఁ బత్నిగాన్॥ 44

చ॥ అనితెలుపం గపాలి ముదమందుచు మమ్మిపుడీవివాహముం
గనుఁగొనువేడ్క వచ్చుటలుగాఁ దలపోయుమటంచు సమ్మతం
బునవినిపింపఁగా సురవిభుంగనిశౌరి ముహూర్తవేళడా
సెను దగదాలసింప సుతఁజెచ్చెరఁదోడ్కొనిరమ్ము పొమ్మనన్॥ 45

సీ॥ తత్క్షణంబున రమాతన్వీ సరస్వతుల్ దేవసేనను దోడితెచ్చి గౌరి
నీలకంఠులముందలనిలుప నక్కన్నియయత్తమామల కెచ్చుభక్తిమ్రొక్క
ననురాగమున వారలాదరించిరి వెండి పార్వతి నిజపుత్రు భద్రపీఠి
నివసింపఁజేసిన నిర్జరులా దేవసేనను గుహుని నీక్షించియెఱఁగి

తే॥ మోదమందిరనంతరంబున నగారి
పౌలతితోఁగూడి హేమంపుఁబూర్ణకలశ
జలముతో శంభుసుతుపాదములనుగడిగి
తచ్చరణతీర్థముగ్రహించదలచియుంచి॥ 46

తే॥ సుగుడ గంధాక్షతలఁ గుసుమములఁ ధూప
దీపముల గార్తికేయుని దివ్యపాద
ములనుపూజించి పౌలోమి యెలమిదెచ్చి
నట్టి మధుపర్క మతనిచేయందుసునిచి॥ 47

క॥ వాసిగఁదత్ప్రాశనముం జేసినఁ గల్లోలకలిత సింధు రవ పరి
హాసక్రియఁ దూర్యధ్వనులాసన్నగుహల్ ధ్వనించునట్లుగమ్రోసెన్॥ 48

క॥ గాంగేయగర్భకల్పితమాంగల్యము గల్పకుసుమమాలాతతులున్
మంగళకరముగఁగట్టెను గాంగేయుఁడు దేవసేనకంఠమునందున్॥ 49

వ॥ తత్సమయంబున వయోవృద్ధులగు నార్యజనుల వాత్సల్యోపేత
శుభాశీఃప్రవచనంబులెసంగుచుండెనంత॥ 50

సీ॥ అబ్జజుండగ్ని కార్యము సేసి సమిధాజ్యచరులాజహోమముల్ జరిపి దంప
తుల నుపర్బుదునకు వలగొననొనరించి సనెకలుద్రొక్కించి శాస్త్రయుక్తి
గా వశిష్ఠుని భార్యగనులకుఁజూపింప నావెన్క షణ్ముఖుండధిక భక్తి
దలిదంద్రులయిన కాత్యాయనీశివులకు ద్రిప్రదక్షిణ నమస్కృతులు సేయ
తే॥ వారలతి ప్రేమదీవించి గారవించి కొడుకుగోడలి గౌఁగిటనిడి ముదంబు
వడిరెసురవర్గమయ్యుత్సవంబుగనులపండువుగజూచియానందభరితమయ్యె॥
చ॥ అపుడు గుమారునాజ్ఞ వెలియావు సమస్తనిలింపకోటికిం
దపసులకుఁ నృపాలులకు దక్కటివారికి వారువారు గో
రు పగిది దివ్యభోజనము రూఢిగ బెట్టిన నారగించి లో
నపరిమితప్రియంబువడిరందఱు బెండిలిచుట్టపక్కముల్॥ 52

వ॥ అంత సురసమూహంబులవీడుకొని పార్వతీపరమేశ్వరు లంతర్హితులగు
టంయు మరున్నికరంబులు విస్మయంబునబొగడుచుండఁ బత్నీయుతం
బుగా మంగళగీతవాద్యనినద మహర్షిస్తవాకర్ణనుండయియరిగి నిజనికే
తనప్రతీహారదేశంబున నిలిచి సుధాంధుల స్వకీయగేహంబులకుబుత్తెంచి
షడాననుండు శుద్ధాంతముసొచ్చి పరమసమ్మదంబుననుండె నాపిమ్మట
మరుద్వంతుడు ముచుకుందాది ధరాధీశులను నైలింపులను యథావిధి
సత్కరించి కల్పద్రుమసంజాతంబులును దోషరాహిత్యములునునగు
నానావిధమణిపరిష్కార వస్త్రమాల్యంబులనిచ్చి వారివారినివాసస్థలం
బులకనిచి తాను శచీసమేతుఁడై యాత్మీయమందిరంబున నుండిన
వాడయ్యె॥ 54

—♦ షణ్ముఖుండింద్రుని స్వర్గపట్టాభిషిక్తుని జేయుట. ♦—

ఆ॥ అంతఁ గొన్నిదినములరిగినతరువాత బలవిరోధి నాకపట్టభద్రు
జేయఁదలఁచి కార్తికేయుండు జాయతో విబుధవరులతోడ వేగఁగదలి॥
క॥ సురలోకమునకుఁజని యప్పురమగ్నిదహించువిధము బొడగని కరుణన్
సురశిల్పిఁబిలిచి తొల్లిఁటికరణిఁగావింపఁజేసె గమనీయముగన్॥ 55

ఆ॥ అందుఁ దనకు నుచితమవుమందిరంబున విడిసియున్నతఱిని పడమటిమల
కెడసి దివ్యయానమెక్కి వేలుపుజెలుల్ గొలువళచియునచటి కెలమివచ్చె॥

ఉ॥ అట్టితఱిఁ గుహుండు వనజాసనుతోఁ ద్రిదివంబువ్రజికిం
బట్టముగట్టిరమ్మనుచుబంచిన నాతఁడు బూజ్యవస్తువుల్
దిట్టముసేసికొంచుజని దివ్యనదీసలిలాభిషిక్తుఁగా
గట్టులసూడుజేసి యొడికంబుగనర్చనలన్ గ్రహించియున్॥   57

మ॥ గుహుశేరం బఱతెంచెనంత దివిషత్కోటుల్ నుతింపన్ మహా
మహులౌ మౌనులదీవనల్ గొనుచు రంభాద్యప్సరోలాస్యముల్
స్పృహతంగాంచుచు సర్వవైభవములన్ సింహాసనాసీనుఁడై
మహిమన్ స్వర్గమునేలుచుండె బలజంభధ్వంసి పూర్వక్రియన్॥   58

ఉ॥ అవ్వలఁ గొన్నిఘస్రములకల్లునిజూచుటకై మహేంద్రుఁడున్
నెవ్వడినేగిమ్రొక్కిన ద్రినేత్రసుతుండు సగౌరవంబుతో
నెవ్వరిబాధలేక రహియించెడినాకము నెప్పటట్టులన్
మవ్వమెలర్పనేలుకొనుమా యని బోధయొనర్చి క్రమ్మఱన్॥   59

సీ॥ అచ్యుతేంద్ర సరోరుహాసనాద్యమరుల వారివారిండ్లకు వరుసననిచి
భూతగణంబులఁబుచ్చి భార్యాసమేతముగాగ బహుళమోదంబువూని
వీరబాహుతుత్తయౌ రథారోహియై మున్నుగా గైలాసమునకుఁజేరి
గౌరీమహేశులఁగనిమ్రొక్కి స్కందాద్రికరుగ వారలచేత నాజ్ఞవడసి

తే॥ వేడ్క లఱయు నెనమంద్రువీరవరులు
దన్ను సేవించుచుండఁగా దరలియందు
శరజుఁడతిసౌఖ్యముననుండె సకలసురలు
దమతమగృహంబులందుండి రమితభూతి॥   60

వ॥ అంతఁగొంత కాలంబున కాఖండలుండఖండబలుండగు శూరపద్మకృత
పరిభవములత్యంతముస్మరించి వ్యసనాక్రాంతుండై వైరాగ్యమువహించి
సంసృతిభ్రమకోపాటించి వరారోహాలయేకాంతము నిస్సారమనితలపోసి

మౌనితెఱంగునఁ బార్వతీనందనస్మరణాతిరేకుండగుచు వివ్రమత్వంబుతో
నుండె నయ్యవసరంబున॥ 61

— ఇంద్రుడు బృహస్పతివలన మదనకంచుకవిద్యనభ్యసించి
కామవ్యామోహితుఁడై తనలోఁదాఁదలంచుట —

ఆ॥ పగుదెంచిగురుఁడు నింద్రుమనళ్ళించ లంబడంగ మంతనంబునందు
మహితకరుణదోప మదనకంచుకవిద్య దెలుప నతఁడు దొంటితెలివిసెందె॥

క॥ ఇవ్విధమున వైరాగ్యము నవ్వలఁబోఁదోర్చి పువ్వుటమ్ములదొరచే
నివ్వటిలుసేఁగికోర్వక జవ్వనులంగలిసి సంతసంబునదనలోఁ॥ 63

క॥ ఎవఁడేని జన్మమొంది తెలివి సంపద్బలములును గలిగి యన్నిపనుల్
దవులక యౌవనయువతుల గవగూడిరమించువాఁడు గడుధన్యుఁడగుఁ॥

మ॥ సుమగుచ్ఛంబులమీఱుఁజాలుకుచముల్ నీమ్ముంద్భృణప్రాయు జే
యుమొగంబుం గనకంబుగెల్చుమెయి పీయూషంబుబోఁదోలువా
క్యము లజ్జోపమనేత్రముల్ సహజశృంగారంబులై యొప్పెడుం
బ్రమదారత్నరతోత్సవంబులెకదా భాగ్యంబులన్నఁమహిఁ॥ 65

చ॥ అరుణగభస్తి పావకుఁడు నంబుజవైరియు దీపముండియుఁ
హరిణవిశాలనేత్రయయినట్టి కులాంగనలేకయున్నచో
నరయఁగలోకమంధమగు నంతటిదీప్తికిముఖ్యహేతువై
పరగు వధూమణిఁ మమతజాయ రమించినఁగాదె భాగ్యముల్॥ 66

తే॥ రతిసుఖానందవశత నేత్రములమూయు
యౌవనంబునరంజిల్లు నాలుమగల
కదియపో కామరూపమై యతిశయించు
చుండు పురుషార్థమింక వేఱొండుగాదు॥ 67

తే॥ ఎంచగా నిహభోగములెన్నియయిన
దీనిసరిరావు కొందఱజ్ఞానులనిరి
స్త్రీలఁదొలఁగుటమేలంచు దేవవంచి
తులుగ తనలోభులుగవారిఁ దెలిసవలయు॥ 68

వ॥ అని బిడౌజుండిట్లు నిశ్చయించుకొని వాచస్పతిని విధేయుఁడై వీడుకొలిపి పుత్రుండగుజయంతుని స్వర్గపరిపాలనంబునకు నియమించి తాను కామక్రీడాలాలసత్వంబున దివానిశలత్యధిక మోహావేశితుఁడై నిజపత్ని పులోమజనుగలిసి క్రీడించుచుఁ గంధర్వవేదనలనుభవించుచు దదేకధ్యానుండయియుండెనంత॥ 69

-◆ జయంతుఁడు బృహస్పతిని శూరపద్ముఁడు దక్షాధ్వరంబొనరించిన బాధలకు గారణమడుగుట. ◆-

ఉ॥ ఇంద్రునిపట్టి దేవతలకెల్లను మెప్పుజనింప స్వర్గముఁ
సాంద్రవిభూతినేలుచొకనాఁడు గురుంగనిపల్కెభక్తిమె
రుంద్రబలుండుశూరుఁడు సరోరుహనాభు విరించనుఁ మముఁ
గుందఁగ నీచకృత్యములకుఁ నియమించుటకేమి హేతువో॥ 70

క॥ అకటా! వాఁడొనరించిన వికటపుజెయ్యులఁదలంప వెఱపవునిపు దే
రికినయినఁ బూర్వకృత మూరకవిడువదనంగవిందు ప్రాప్తముగాకఁ॥71

క॥ ఎందుల నేపాపంబునఁ జెందెనొమాకిట్టిపాట్లు చెప్పుమనుచుఁ బౌ
రందరి ప్రార్థించినవిని సందేహమువాయఁగా ధిషణుఁడిట్లనియెఁ॥ 72

క॥ పూర్వంబున దక్షుండతిగర్వితుఁడై లెక్కయిడక క్రతునాయకుఁడౌ
శర్వునిదూషణమొనరిచి సర్వామర్త్యులనుబిలిచి జన్నముసేయఁ॥ 73

క॥ చతురాస్య హరి ముఖామరవితతులు సమ్మతముచే హవిర్భాగము లం
చితముగఁగొని శర్వాణీపతికివ్వనిదోషమపుడె పాయకతోడ్తోఁ॥ 74

ఆ॥ రౌద్రమూర్తి వీరభద్రకృతోపద్రవమునగంటి రంతట మిముబాసి
చనకనిల్చుదోషమనుగతంబయి శూరుఁడనెడు పేరిట మొదలంట సమసె॥

వ॥ అనినవిని జయంతుఁడు దక్షాధ్వరధ్వంస విధానంబెఱింగింపుమనుటయు సురాచార్యుండామూలంబుగా దానిందెలుప వెఱగుపడి నిశ్చలభక్తిచే శివపదధ్యానతత్పరుండయి శంకరాపరాధకులఁదొలంగి ధర్మవర్తనంబున శిష్టరక్షణంబును దుష్టశిక్షణంబునుగావించుచు సుఖముగానుండెనన నాకర్ణించి శౌనకాదిమహర్షులు సూతుంజూచి॥ 76

తే॥ స్కందగిరిమీదమండ యా స్కందుఁడేమి
పనులనొనరించె దెల్పుమంచనిన సూతుఁ
డుల్లమలరార సౌందర్యవల్లి లవలి
యయిజనించిన వరియించె ననుడువారు॥ 77

క॥ ఆమెకులవలీనామం బేమాడ్కినిగలిగెఁ దనయ యెవ్వనికయ్యెన్
బ్రేమనుగుహుఁడెచ్చట గులభామినిగానేలెఁ దెలియఁబలుకుముమాకున్॥

వ॥ అని వల్లీకల్యాణ సమాకర్ణన కుతూహలులై యడిగిన రౌమహర్షణి
యిట్లని చెప్పందొడంగె॥ 79

—• లవలీదేవిజన్మవృత్తాంతము. •—

సీ॥ మునికులోత్తములార వినుఁడు జగత్సారమైనట్టి కాంచీపురాంతికమునఁ
బూర్ణాఖ్య నగరమొప్పును దానిచెంగట లవలీ లతా మంజులంబునగుచు
నొకకొండగలదందునొకపుళిందవిభుండుభాగ్యశాలియుననపత్యుఁడగుచు
నుండి పుత్రార్థియై యుత్తలపడుచుండె నప్పుడగ్గిరికాననయందు నొక్క

తే॥ ఋషి శివాఖ్యుండు దపమొనరించుచుండి
యతఁడు దనచెంతదిరిగెడు హరిణినొండు
కామవశమునఁగనువిచ్చి కాంచుమాత్ర
చోద్యముగ దానకవ్వెంట చూలునిల్చె॥ 80

ఆ॥ అంతినక్కురంగి యట లవలీకుండమునకు నీరుఁద్రావఁబోయి యొక్క
యాఁడుబిడ్డనీని యరసి విజాతీయయగుటచేత భయమునంది యుఱికె॥

ఉ॥ అచ్చటికప్పుళిందవిభుఁడప్పుడు నిచ్చరిపల్లనారయన్
వచ్చి జలప్రతీరమున వారక యేడ్చుచునున్న బాలికన్
ముచ్చటతోడ నెత్తుకొనిపోయి యపుత్రకుఁడౌటఁబెంపఁగా
నిచ్చదలంచి పెండ్లమునకిచ్చి సుతోత్సవమాచరించియున్॥ 82

మ॥ అనురాగంబునబెంచుచుండ నల కన్యారత్నమున్ శాల్య ఖే
లనముల్ సేయుచు ద్వాదశాబ్దములుదొల్గన్ బ్రౌఢయైనట్టులా

త్మనుభావించి పుళిందుఁడుఁ నివరి కేదారంబులం బిట్టలఁ
జనఁ జేయఁ నియమించినిల్చి నొకమంచఁ గట్టి యద్దాని పై॥ 88

తే॥ అప్పుఁడతిమంచె పైనుండిగొప్పయెలుఁగుతోడబిట్టలదవ్వుగాదోలుకొంచు
జేలకాపరియైయుండులీల తెలిసి క్రౌంచమదభేది దాని నీక్షించఁగోరి॥

వ॥ ప్రేమాతిశయంబునఁ బూర్ణాఖ్యనగరంబునకువచ్చుచుండె నంతకుమున్న
నారదుండా శబరముదిగకబరిం గని గాంగేయునకర్ధాంగియగుట దెలిసి
పలితెంచుచు మార్గమధ్యంబునఁ బార్వతేయునకెదురయి నమస్కరించి
సర్వాంగసుందరియగు లవలీకన్యకోదంతంబంతయును జెప్పి నిజేచ్ఛం
జనియెనంత॥ 85

— కుమారుఁడు బోయవేషమున వల్లితో సంభాషించుట. —

క॥ మనసిజగర్వవిభంజనతనయుండు బుళిందవేషధరుఁడై యల జ
వ్వనియుండెడు గేదారంబునకుంజని లవలిజేరి పొలుపుగననియెఁ॥ 86

ఉ॥ ఇందునిభాస్య నీవెవతె వెవ్వనిపుత్రివి నీదునామమై
చెందు శుభాక్షరంబులెవి చేలనుగాచుచు వేనియాజ్ఞచే
నిందులనున్నదానవొకయించుకడాపక తెల్పుమన్న నా
సుందరి యేమియుం బలుకుసూపక మౌనతనుండె సిబ్బితిఁ॥ 87

మ॥ అపుడబ్బోయయెయారి షణ్ముఖుఁడుడాయం గాయజుండమ్ములఁ
వపువుం గాడగనేయ నివ్వరికి నవ్వామాక్షి గాపుంచిన
ట్టి పుళిందుండటలేమి సమ్మదముఱెట్టింపం బువ్వుఁదేనెతో
నుపమింపందగుపల్కులంబలికె ముఖోద్దేశబాహ్యంబుగఁ॥ 88

సీ॥ వికచాబ్జనేత్రి యీవిపినంబు నిర్జనంబై యున్నయది సందియంబికేల
నన్నుమన్ననజేసి పిన్ననవ్వోలయంగ దయతోడఁజూని సుధారసంబు
జిలుకుపల్కులమాటుపలుకుచుఁ గౌఁగిటనలమి వాతెఱనొక్కనెలవొసంగి
యలిలేనిమమత చేకులుసట్లు మనసిచ్చి మోము మోమునఁ జేర్చిముద్దుబెట్టి

తే॥ వలపుతనివార రతికేళివన్నెగులుక నలరఁగాఁ జేసి మరుసేగియడఁపకున్న
బాపమగునని మిక్కిలిబాళితోడ సారెసారెకుఁబలిమాలుసమయమునను

—♦ పుళిందపతి కిరాతులతో వేటకేగుచు పుత్రియగు వల్లికడకు వచ్చుట. ♦—

వ॥ అట లవలీకన్యాజనకుఁడగు భిల్లనాథుండు మృగయావిహారౌత్సుక్యమున నిజశాసనబద్ధులగు వేఁటరులకుఁ బయనంబు దెలుప వారలునుమహోత్కంఠులై వెన్నడుముల నీలి కాసెలను బిగియించి సందిళులనినుపకడియంబులం బెట్టి జుంజుఱుఁదలలఁ జినింగిన పాగలఁజుట్టి నొసళ్లఁ గావిబొట్టులనిడి చేతుల సెలసువిండ్లుదాల్చి మోటకత్తుల మొలలనిఱికి వేఁటకుదగు నమ్ములు నురులు వలలు దిట్టపరచి కండబలిసినకప్పుమేనులతో హాలామదంబున నరుణంబులగు నయనగోళంబులనుండి వెడలు చుఱుకుఁ జూపులతోఁ జెలరేగి మృగయాకేళిసమర్థంబులగు సాళువంబులఁగైకొని యెందేనిదవ్వుల మెకములపసివాఱిన నిలువక పిరువీఁకులాడి కట్టు త్రాళ్లం ద్రెంచుకొని పరువిడు జాగిలములసేకరించుకొని నడుచుచు వేఁటాడుమేటిపాటవమున నాకుదీటులేరని పౌరుషపుమాటకారితనమున నొండొరుల మెచ్చక వాదాడి పంతంబులకుఁజొచ్చి కఱకుమీసలు నులిగొల్పుచు హుంకారరవంబులతోఁ గోదమసింగమున కెదురునడిచి యదలించి పొదివి పిడికిళ్లనె మదమడంతుమనువారును దబ్బిబ్బునొందక నిబ్బరమున గబ్బిశెబ్బులి నొక్కవింటిదెబ్బచే మబ్బుణచి దబ్బున నేల ద్రొబ్బుదుమనువారును బ్రచండమండలాగ్రనిహతి నఖండదానధారాసిక్త గండస్థలమండిత శుండాలమండలంబుల ఖండింతుమనువారును బోసరమున నీసడించి వాసికెక్కు కాసరములడాసి వీసమంతయు త్రాసంబుగొనక చేసురియబొడిచి నాశంబు సేయుదుమనువారును గన్నుమిన్ను తెలియక క్రొవ్వెత్తినకాఱుదున్నలను గాలితన్నుల మన్నిగొందుమనువారును నవియువియన నేల మాఱారిబడిన యెంతటికౄరమృగంబులనైనను జారసాచి చౌఱబాఱి యీడిచికొనితెత్తుమనువారును నై యట్టహాసధ్వను లంబరంబువగులనార్చుచు వేనవేలు వేఁటకాండ్రు దనవెంట వచ్చుచుండ వారిసందఱ ప్రశంసావాక్యముల నలరించుచు నాఖేటోచిత వివిధపరిష్కార సాధనోపేతుఁడై నిజగృహంబు

వెలువడి వ్యాధనాథుండువోవుచు మున్నుగాఁ బుత్రియగు లవలింజూడఁ
గోరి శాలికేదారస్థలంబునకు వచ్చుచుండెనప్పుడు॥ 90

—♦ బిమారుఁడు వటవృక్షాకారమునగప్పుట. ♦—

శా॥ అక్కోలాహలమాలకించి యురగాహారాఖ్యుఁడబ్రంబుగా
నక్కేదారతటిన్ విశాలవటవృక్షాకారముందాల్చి యే
ప్రక్కంజూచిన వేదశాఖలుపమింపన్ శాఖలై సాగియున్
నిక్కంగాంచిననీడచే నిలిచియుండెన్ గుప్తపూర్వాంగుఁడై॥ 91

ఉ॥ అయ్యెడ నక్కిరాతుఁడు బలాన్వితుఁడై చనుదెంచి బాలికన్
నెయ్యములాడి తేనియల నేతుల మేటిలుమోదకంబులున్
దియ్యనిపండ్లు పిష్టమునుదెచ్చి ముదంబుననిచ్చె నప్పుడా
తొయ్యలిదాపునంగలుఁగు దోరపుమ్రాఁకునుజూచిసైనికుల్॥ 92

తే॥ పూర్వమెన్నఁడుగానమిభూజమిందు విపులశాఖలతోనెట్లు వృద్ధిగనెనొ
చోద్యముగనున్నదనిత్రుంపనుద్యమింపవారివారించిలుబ్ధకవర్యుఁడనియె॥

క॥ నిండిననీడనొసంగుచు నుండెదునిప్పాదపంబు నూరకమీరల్
ఖండింపనేమిఫలమని వెండియు సుతజూచి వృషవిధమడుగుటయున్॥94

మ॥ జనకా యెన్నఁడు మున్నునేఁగనినభూజంబిద్దిగాఁదీడ మిం
చిననీడన్ వెదచల్లుచున్నయది యీచెట్టెట్టులంబుట్టి వ
ర్ధనముంగాంచినదో యెఱుంగను నను౦బ్రశ్నించితే జెప్పనో
పను మాయామయమేమొయంచు నిజమౌవాక్యంబులందెల్పినన్॥ 95

క॥ విని బోయఱేడు గూఁతుంగని భీతినిమానుమిది యకారణముగ బా
యనిసుఖమిడ నీయెడఁబొడమెనునీకిటుఁదోడుగాగ మెలఁగుమనియనెన్॥

—♦ గుహుండు లవలికి మోహనాంగుఁడై కాన్పించుట ♦—

శా॥ ఈరీతిన్ సెలవిచ్చి లుబ్ధకవిభుండేగన్ గుహుండున్ ద్రుమా
కారంబున్ విడి కోడెకానిక్రియ శృంగారాంగుఁడై సంతసం
బారామామణికింజనింపఁ జనవొయ్యం జేయుచున్ జాపమున్
నారాచంబొకకేలబట్టికొని చెంతన్ నిల్చి లేనవ్వుతోన్॥ 97

క॥ ఆలింగనాభిలాషాలీలలు గాన్పింపఁజేయ లేమ భయమునఁ
బ్రాలి తలవంచికులుకుచు లాలితమగు సుస్వరంబెలర్పఁగ ననియెఁ॥98

మధుర్వాక్కర.

మనుజనాయక హీనవంశంబులోపలను నేను
జననమై నీచవృత్తిచే శాలిచేలఁగల పిట్ట
ల నదలించుచు గాచి మెలంగుచుండెడుదాన నౌ
నను ఘనుఁడవైన నీవిట్లు నాయమే డాయఁగోర॥ 99

సీ॥ గోలనై యున్న నాప్రోలకూడనిచెయ్వులొనరించుకోరిక యుడిగికొనుము
వాసికెక్కిన రాజవరుఁడవై యేహ్యంపు నడవడికొడబడనగ రెయొరులు
నావాక్యములుద్రోచి నీవట్లుదలఁచిన గలుకుబోయలబాధ కలుఁగగలదు
పోపొమ్ము నిలువంగబోలదిచ్చటనని యదలించునంతలో వ్యాధబలము

ఆ॥ లేగుదేర నచోటునీఁగి కందుఁడు వృద్ధవసుమతీసురుఁడయి వడఁకుతోడ
దండమొండుబట్టి తడబాటుతోఁ గ్రిందబడెడురీతి బోయబలగమునకు॥

వ॥ ఎదురువోయి పుల్కసాధ్యక్షునిసందర్శించి యాశీర్వాదయుతంబుగా
భస్మంబొసంగిన నతండు నీవెవ్వండుదు విందులకేమివాంఛించియేతెంచి
తివో తెల్పుమిచ్చెదనన నాబ్రముచ్చుముసలి నేనెద్దియుగాంక్షింప నిన్నదీ
తోయ నిమజ్జనాభిలాషినై వచ్చితిననుటయుఁ జెంచులతేడాలించి
తాను నిజకాంతారభూముల జూడంబోవనెంచి కుమారిని మధుమధుర
ఫలశాలి పిష్టంబులఁదనిపి॥ 101

క॥ ముదుసలిపాలునిగని యిన్నదీజలంబులమునింగి నాసుతయొద్దం
బదమూనుము తోడుగనని ముదలియిడి యతండరణ్యముల కేగంగ॥

తే॥ అతివఁగని వృద్ధవిప్రకుఁడన్నమనుచు
వడుగఁ దనతండ్రిచేఁ దాసువడసినట్టి
పిష్టఫలమాతికంబులఁ బెట్టుటయును
గడుపుదనియంగదిని దూఁపయుదవి పుగుడ॥ 103

—♦ కుమారుఁడు వృద్ధవిప్రరూపమునఁనుండి తనకోరిక వల్లికి దెల్పుట. ♦—

ఉ త్సా హ.

వనజనేత్ర దప్పిఁ బొడమె వారినాకొసంగుమా
యనుడు నిచటిసప్తగిరుల కనతిదూరమందునన్
ఘన తటాకమున్నదచటఁ గలవునీళ్లు ద్రావి ర
మ్మనుచు లవలి దెలియఁబలుక నగ్రజన్ముఁడిట్లనెన్॥ 104

ఉ॥ త్రోవయెఱుంగనచ్చటికి దోయరుహానన నాకుఁదోడుగా
నీవునురాక తక్కితివయేని నిజంబుగఁబోవజాల నే
నేవిధి దూపసైతునన నింతి కృపన్ గపటాగ్రజన్ముతోఁ
బోవుడు జెల్వొజేరి దగబో జలమాతఁడు గ్రోలివేడుకన్॥ 105

ఉ॥ తత్తటమందునున్నవనితంగని దప్పియడంగెగాని నా
చిత్తము నిన్నుఁ గౌఁగిటను జేర్చి సుఖించెడుతృష్ణపాయకం
దత్తఱమొందుచున్న యదితథ్యము నీయధరామృతంబు నే
నిత్తఱిఁగ్రోలకున్న స్మరహేతిమహాగ్ని శమింపదేమిటన్॥ 106

చ॥ మరుఁడనుదొంగ నాదయిన మానధనంబుహరింపనెంచి తా
దురుసులు సేయబూనె దయతోడుత నీకుచదుర్గమాటునం
దిరవుగనిల్పి యేలినను యెన్నఁగరానిఫలంబు జేకురున్
మరగినవాఁడనిక్కమనుమానముమాని సమాదరింపవే॥ 107

—♦ లాటానుప్రాస చంపకమాల ♦—

చ॥ వెలదిరో నీదుపల్కు వినుపీనులుపీనులు నీపయోధరం
బులపయినుంచునట్టికరముల్ కరముల్ నిను గ్రుచ్చి కౌఁగిటన్
నిలిపెడుమేనుమేను తమి నీనునుమోవినిజప్పరించఁగా
గలిగినవాల్కనాల్క నినుగన్గొనుకన్నులుకన్నులో సతీ॥ 108

చ॥ జిలిబిలిమాటలాడి నునుఁజెక్కిలిఁగొట్టి విరాళిమించి చ
క్కిలిగిలిగింతవెట్టి యురుగేలుల నిండిగియంగబట్టి నీ

కులుకు కుచద్వయంబెదను గ్రుమ్మి రదంబుల మోవినొక్కుచుఁ
గళరవమొప్పఁజై కొని యనంగుని కేళి బెనంగు మన్నడో॥ 109

క॥ కాయజునిబారిఁ బోయక నీయెడనేఁగోరుకోర్కె నెనయింపుము నా
తీ యని యడుఁగుల కెరఁగిన రోయుచుద్విజుఁజూచి లవలిరోషాళయయై॥

చ॥ ముదుసలిబాఁపనయ్యవు ప్రబుద్ధుఁడవంచుఁదలంపుగొంటి నీ
మదినవివేకమూని చెడుమాటలువల్కి యయోగ్యవృత్తి మ
త్పదములనంటి త్రొక్కెదవు బాపురె యీచెయిదంబుగన్న దు
ర్మదుఁడని మాపుళిందు లదరంగలవారిదె నేనుబోయెదన్॥ 111

ఆ॥ మంచివాఁడవంచు మదినమ్మినీతోడవచ్చుకతన గొడవ వచ్చెనాకు
క్షణమునిలువనిచట జనియెదననుచు బోనుద్యమింపగనిగుహాండువలికె॥

ద్విప్రాస సింహావలోకన కందము.

క॥ రమణీయవాణి హిమకరరమణీకరరుహ పురందరమణీకచవా
ర మణీమయభూష సురుచిరమణీఘటకుచ వధూత్కరమణీ రమణీ॥ 113

చ॥ స్మరుఁడురుకోపుఁడై కుసుమసాయకముల్ మదురంబుదూఱిపో
గురుభుజశక్తి నేయ నిదిగో! వ్రణమయ్యెఁ దదీయశాంతికో
తరుణి భవత్కుచస్థలినిదార్చినచందనమంటునట్లు బి
గ్గరగఁ గవుంగలించి నును గెంపగు నీయధరంబొసంగవే॥ 114

వ॥ అని కామశరసంపీడ్యమాన మానసుఁడయిపలికిన విని యక్కలికి
యులుకున దొలఁగిపోవనున్నంత॥ 115

ఉ॥ అలుమొగాలవేళ్లుపస్పు డావెనకయ్యెఁదలంప నాతఁడుం
దేటి భయంకరంబగు సుదీర్ఘగజాకృతి నవ్వేలందుకన్
మీటియెదురొక్కనన్ వెఱపుమేకొని వెన్కకుబోయి వృద్ధుఁడా
పాఱునిజూచి మేన్ వడకుపాటునుబొంది మహార్తితోననున్॥ 116

క॥ మునునీవునన్ను వేఁడిన పని గడపెదనిక్కువముగ భయదాకృతితో
హానన మొనర్పఁగవచ్చెడు వనకరనిమరల్చి జడుపువాపుమటంచున్॥ 117

ఆ॥ త్వరితముగను గాఢపరిరంభణంబున సంభ్రమంబొనర్ప జన్నిగట్టు
భిల్లవనితఁ దల్లడిల్లకుమనిపల్కి మదమదావళమున కెదురువడిచి॥ 118

వ॥ నమస్కారపూర్వముగాఁ బ్రణుతించిన నగ్రజుండగువినాయకుండంతర్హి
తుండయ్యె నయ్యెడ॥ 119

—• కుమారస్వామి లవలీదేవిని గూడుట. •—

సీ॥ నిరుపమానంద సంభరితాంతరంగుఁడై పుట్టకాఁపరిమేఁతపులుఁగురౌతు
శబరవరారోహకబరినిదువ్వుచు నునుమోవియానుచు మాత్నవికచ
సుమనోవితాన సంశోభికుంజమునందు మరుకేళిగూడి యాతరుణినవుడు
నాత్మరూపంబుదృశ్యముజేయుటయుజూచినమ్మోదభయవినయమ్ములెసగ

తే॥ మాటిమాటికి పాదపద్మములకెఱఁగి
యనఘ నీరూపమాదియందగుపరుపక
మోసగించితివనిపల్కి ముగుదమరల
బెక్కుభంగులగుహునెన్ని ప్రియముసెందె॥ 120

క॥ ఆ లవలింగని దరహా సాలంకృతుఁడగుచు నీవు నసురారికిముఁ
జాలికవయి ననుగూర్చి సుశీలతవెలయంగ దపముసేసితివబలా॥ 121

ఆ॥ అందువలనబుట్టినట్టి ప్రేమనునిన్ను గూడినాఁడగాన కొఱతవీడి
యరుగుమింతటఁ బ్రియంగుస్థలమునకు విదపనేనువత్తు వదలఁబోను॥ 122

చ॥ అని శరజన్ముఁడంచిన రయంబుననెప్పటి నివ్వరిస్థలం
బునకరుగంగ సస్యములపోషణకై యటనున్న యొక్క ప
ద్మనయన దీనిఁగానక నెదఁ దిగులొంది వనంబులోన శో
ధనమునుజేయునప్డు లవలం జనుదెంచినఁ జూచి యిట్లనెఁ॥ 123

చ॥ అవునెమిటారి నీవిపుడహో యెటువోయితి విట్లు తామసం
బవుటకుహేతువేమియన నల్ల తటాకమునీటిలో మునిం
గి వడిగనేగుదెంచితి మృగీనయనాయని బొంకుదెల్పి ని
క్కువమును గప్పిపుచ్చుటయు గోమలి వల్లినిజూచి వెండియుఁ॥ 124

మ॥ నెఱులుఁ బిడె మొగంబు వాడెఁ దొవరుల్ నిండారెఁ గెందోయి వా
తెఱయుల్ మిక్కిలి గాడిపాఱెను బొలంతీ నీళ్లు వాడంగ న
క్కట తోఁ బోయితివంట విప్పలుకు నిక్కంబని నీమేన నీ
గుఱుతుల్ గన్పడు నేయనన్ లవలి దక్కుం బెట్టి తేనవ్వుతోన్॥ 125

కం॥ ఏమేమీ నాపయి నీవేమే మోనింద మోవ నెంచితివౌనా
యేమాఱెం బొమ్మని యిటులామదవతు లొకరి నొకరు నాడుచునుండన్॥

చ॥ శరజుఁడు చేతులన్ ధనువు సాయకముల్ ధరియించి కాననాం
తర మృగసంకులంబుల వధం బొనరించుచు వ్రేటువడ్డకుం
జరమును గానవట్టి నెఱసాహసుఁడౌ నరనాథుమాడ్కి నా
తరుణులు నిల్చుచోటునకు దాపున జేరవచించె నీక్రియన్॥ 127

— ♦ లవలీ సుబ్రహ్మణ్యుల పునస్సమాగమము. ♦ —

ఉ॥ ఓసఖులార యియ్యడవి నొక్కగజంబును బెక్కుతూపులచే
వేసిన ద్రెళ్లకం బఱచి యెగిన దానిని రోయుచున్ మిముం
డాసితి దద్విధం బెఱిఁగినన్ వినిపింపుడటన్న నవ్వి సే
శాసని గేలిపల్కి పిదపన్ లవలీసతి చేటి నీటునన్॥ 128

చ॥ సరిసరి మంచి బంటవు ప్రశంసకుఁ జాలుదు కాననంబులోఁ
గరులమ వేఁటలాడు పలుకాంద్రు మృగంబుల జాడగాన నీ
క్కరణిని మమ్ము వంటి తెఱగంటుల వేఁడఁగవత్తురే ధరా
వరులిది విన్న నవ్వుదురవశ్యము పొమ్ము తొలంగి చెచ్చెరన్॥ 129

వ॥ అని పలికె నప్పుడు ధన్వితన్వుల యన్యోన్య స్నేహసూచనావలోకనంబుల
దనమనంబున దెలిసి వల్లి చెలికత్తియ కనలుగదిరి కాపట్యమున దొలంగి
చనుటయు నృపాలవేషుండగు పార్వతీసూనుండు దోడనయేగి తన
మనోభిప్రాయంబు యచ్చేటి కెఱిఁగింప నదివిని యతనిం జూచి నీవు మహా
రాజశేఖరుండవయి బోయపడుచు నిట్లు ప్రార్థించుట తగదనివవిని
యతఁడిట్లనియె॥ 130

